# భారతి

సాహిత్య మాసపత్రిక





సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

జనవరి 1963

సంపుటము 40 : : సంచిక 1

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జనవరి 1963

# స్వవిషయము

కొత్తసంవత్సరము "భారతి"కి నిజముగా కొత్తసంవత్సరము. భారతికి ఇప్పుడు నలుబదవ సంవత్సరము ఆరంభమైనది. ఇన్ని సంవత్సరములు ఎట్టి వడిదుడుకులు లేక యథాశక్తిని సాహిత్యసేవ చేయగలిగినందుకు, ఇకముందుకూడ మరింతగా సేవ చేయగలుగునట్లు శక్తిని పొందుటకు "భారతి" భారతికి ప్రణమిల్లుచున్నది.

ఆంధ్రసాహిత్యము దినదినము ప్రవర్ధిల్లుచున్నది. ముఖ్యముగా కల్పనా సాహిత్యము అసాధారణరీతిని అభివృద్ధి చెందుచున్నది. ప్రతిభగల యువరచయితలు అనేకమంది ముందుకు వచ్చుచున్నారు. ఇది ఆనందింపవలసిన విషయము.

కల్పనా సాహిత్యము పెరిగినంతగా ఇతర సాహిత్యము పెరుగుటలేదు. ముఖ్యముగా రాజకీయ, ఆర్థిక, తదితర శాస్త్రములకు సంబంధించిన వ్యాసములు, గ్రంథములు అపరూపమేఅన వచ్చును. ప్రభుత్వము అనేకరకములైన శాసనములు చేయుచున్నది. దేశీయ, అంతర్జాతీయ సమస్యలలో అనేక విధానములు అవలంబించుచున్నది. వీటి ఆంతర్యమును, వీటివల్ల రాగల ఫలితములను సామాన్యులకు తెలియపరచు రచనలు కూడ వాస్తవమునకు పూజ్యములేనని చెప్ప వచ్చును. ఇవిలేనిలోటు మామూలు సాహిత్యములోకూడ వెల్లడిఅవుచున్నది. నవలను, కథను, ఒక సాంఘికసిద్ధాంతమును ఒక రాజకీయ సిద్ధాంతమును, ఒక ఆర్థికసిద్ధాంతమును వ్యాప్తి చేయుటకుగాని, ఖండించుటకుగాని సాధనముగా ఉపయోగించుట జరుగుచున్నది. ఇలా ఉపయోగింప ప్రయత్నించునప్పుడు, ఈ సిద్ధాంతముల విజ్ఞానము రచయితలకు ఎంతయో అవసరము. అదిలేనిలోటు అగ్రశ్రేణికి చెందినవారి రచనలలోనూ వెల్లడి అవుచున్నది. చారిత్రకనవలలలో అసలు అప్పటిచరిత్రకు సంబంధించిన వాతావరణము, ఉదంతములు కనపడనే కనపడవు. ఆయా కాలములో, ఆయా ప్రాంతములో మానవప్రవర్తన ఏవిధముగానున్నదీ, ఏ సంఘటనలు అందుకు కారణములైనవి అన్నది విశదపరచుటే చరిత్రయొక్క లక్షణము. చారిత్రకనవలలు ఈ విషయము తెలుపుటకు కొంతవరకు తోడ్పడవలెను. అది తెలిపినప్పుడే, అది చారిత్రకనవల కాగలదు.

సాంఘిక నవలలందుకూడ సాంఘిక వాతావరణమునకు చెందిన ఇదే విధమైన లోపము కనబడగలదు. సాంఘిక సంఘటనలు, ఆర్థిక సంఘటనలు వ్యక్తులమీదను, సంఘముమీదను ఏ విధమైన ప్రభావము చూపెట్టినవో, ఏవిధమైన పరివర్తనను తెచ్చిపెట్టినవో సుబోధకము కావలెను. అవి తెలియజెప్పు రచనలుకూడ తెలుగులో లేనేలేవు. కాబట్టి యువరచయితలు శాస్త్ర రచనలయందుకూడ ఆసక్తి చూపవలెనని కోరుచున్నాము. అట్టి వ్యాసములకు "భారతి" స్వాగత మివ్వగలదు.

సాహిత్యముతోపాటు సాహిత్య విమర్శకూడా పెరుగవలసివున్నది. విమర్శను

సాహిత్యములో ఒక భాగముని అంగీకరించి ఆదరించవలసి వున్నది. కాని నేను ఆంధ్ర సాహిత్య రంగములో విమర్శకట్ల వున్న అసమానభావము విపరీతమనే చెప్పవచ్చును. విమర్శకట్ల రాజకీయ నాయకులు ప్రదర్శించుచున్న అసమానభావమునే సాహిత్య రంగంలో పెద్దలైన వారుకూడ చూపించుచున్నారు. విమర్శను వ్యక్తిగతమైన విరోధముగా ఎంచుకొనుట జరుగుచున్నది. రాజకీయ రంగములో వున్నట్లే సాహిత్య రంగములోకూడ వ్యక్తి బద్ధమైన కక్షలు ఏర్పడుచున్నవేగాని, సిద్ధాంతముల రీత్యా ఏర్పడుటలేదు. ఇది సాహిత్య వికాసమునకు ఎంతమాత్రము శుభ సూచకము కాదు. రాజకీయములలో నాయకుల ఆరాధన ఎంతగా హానికరమో, సాహిత్యంలోకూడ అంతగా హానికరమని చెప్పవలసివున్నది. ప్రభుత్వ పరమైన సంస్థల సభ్యత్వము, ఆ సంస్థలద్వారా బహుమతులు శాసన మండలి ప్రాతినిధ్యాలు లభ్య పడడంతో రాజకీయ నాయకుల అనుసరవర్గములే సాహిత్య రంగములోకూడ తయారు అవుచున్నవి. ఇది రచయితల వ్యక్తిత్వాన్ని భంగపరచుచున్నది. దీనివల్ల సాహిత్య రూపమును తీర్చి దిద్దవలసిన అధికారము రచయితలనుంచి పోయి, రాజకీయ నాయకుల పరము అవుచున్నది. ఫలితము నిర్దుష్టమైన సాహిత్యము రాకపోవుటయే.

పైన చెప్పినట్లు కాల్పనికసాహిత్యము విశేషముగా వచ్చుచున్నది. కొన్నిరచనలు ప్రతిభతోకూడినవనుటకు సందేహము లేదు కాని కథమాత్రము మనప్రాంతములో, మన మధ్య జరిగినట్లు వుండక; ఎక్కడనో జరిగినట్లు ఉండును. దీనికి కారణము ఆదినుంచి స్వీయసాహిత్య సంస్కృతులతో పరిచయము లేక, కేవలము విదేశ సాహిత్యము ద్వారా పొందిన ఉత్సాహమేనని చెప్పవచ్చును. దీనికితోడు రాజకీయముగా తలపెట్టిన సాంఘికసంస్కరణలు ప్రోత్సహించే దృక్పథమునకు, ఇన్నిసంవత్సరములుగా అవలంబించుచూ వచ్చిన ఆచార సంప్రదాయములతో ఒక్కసారిగా తెగత్రెంపులు చేసుకొనుటకూడ కారణము కావచ్చును. పూర్వసంప్రదాయములనుండి ప్రస్తుత ఆశయములు రావలసిన పరిణామమార్గములో రాక, పాశ్చాత్యవిధానములను యథాతథముగా మనమధ్యను ప్రతిష్ఠించుకొని పూజింప ప్రయత్నించుచున్నాము. అందుకనే జనసామాన్యములోవున్న మనోభావములకు, కల్పనాసాహిత్యమునకు సాన్నిహిత్యము తక్కువగావుంటున్నది. ఇదికూడ తాత్కాలికమే కావచ్చును కాని గమనించి సవరించుకొనుట అవసరము.

ఇంత కాలముగా తమ రచనలను "భారతి"కి అందజేయుచూ సహకరించిన రచయితలకు మా వందనములు. ముందుకూడ ఇదే విధముగ వారి సహకారము లభించగలదని ఆశించుచున్నాము. నూతన సంవత్సరము "భారతి" అభిమానులకు శుభప్రదమగుగాక !

# అమర భారతి

శ్రీ దాశరథి

నలుబదియేండ్లదాన వయినావని వింటినిగాని, భారతీ!
తెలతెల వారినప్పు డగుదెంచిన బాల పయోజ బాంధవో
జ్జ్వల తరుణారుణాంశుల స్పర్శకే గిలిగింతగొన్న ని
ర్మల జలజాత కుట్మలము మాదిరి నీ ముఖమందగించెడిన్.

వయసది యెంతవచ్చినను వాడని నీ నవయౌవనమ్ము మా
కయితకు రామరక్షయగుగాక! భవత్ కరవల్లకీ శుకీ
ప్రియ వచనమ్ములీ వ్యథిత విశ్వమనోధరణీ తలాన ఆ
వ్యయ రసవర్షముల్ కురిసి హాయిని చేకుర జేయుగావుతన్.

వల్లకి నీవు మీటునెడ వార్ధక భార వినమ్ర భూజముల్
పల్లవ మాలికాయుతములై, నవపుష్ప కిరీట ధారులై
డుల్లిన పాతకాలపు కఠోరకుఠారపు దాడి తప్పి, సం
ఫుల్లములై కనంబడును, పోయిన యౌవన మాగమింపగా.

ముసలితనము లేని నవమోహిని! భారతి! నీవు మాకు మా
నిసి వయి కానుపించెదవు నిక్కము కాని సురాయతమ్ము స
న్న్యసనము చేసివచ్చిన సనాతని ఊర్వశివోలె మాదు మా
నసముల తాండవించెద వసంతముగా సుఖశాంతు లొప్పగా.

తల్లివో! నాకు సోదరివో! తండ్రివో! అన్నవో! ఆత్మబంధువో!
ఉల్లములో జనించిన రసోర్మికవో! శశిపాత్ర తొన్కగా
చిల్లి రసజ్ఞపై బడిన చిన్ని సుధారస విప్రుషంబవో!
పిల్లవో! పెద్దదానవో! కవిత్వాల తామ్ర లతాంతలక్ష్మివో!
తెలుగు గృహాలలో పసిడిదీపమువై గహనాంధకార దే
హాళులను వెల్గు ముగ్గులిడినట్టి సుమంగళి! నీ దృగంచలో
జ్జ్వలరుచి ప్రాకినట్టి ప్రతిపందిరిసుందరనందనావనీ
స్థలనవపారిజాతలత చాడ్పున పువ్వులు నవ్వనవ్వెడిన్.

కాశీనాథ జటాటవీ పరిలసద్గంగా తరంగంబవో!
శ్రీశ శ్రీరమణీమణి ప్రణయరాశి క్షీర వారాశివో!

# భారతి

నాశావిర్భవనాదిభీతి రహిత జ్ఞానాంబవేమో! చిదా
కాశోద్భాసిత పూర్ణశీత సితరుక్ఛంభుప్రపాందబవో!

పదవులు మాకు కావలెనె? భారతీ! నీ రసనన్ వసించు ప్రా
జదువులు మాకు దక్కినచు చాలును; భారతజాతి భీతి జెం
దదు నరరాక్షసావళికి; దానవ ఖడ్గము మొక్కవోవలెదే
చదువులరాణి! నీవ యొకసారి విపంచిక గోటమీటినన్?

ఆరతి కప్పూరమ్మువలె స్వాంత మురమ్మున జ్వాలలెత్తెవే
భారతి! నీ పదాలకడ భక్తిని ప్రొక్కులు ప్రొక్కినాడవే,
నీ రమణీయమూర్తి పావణింపగనిమ్ము మదీయ మానసా
గార సువర్ణ పీఠమున కాంతులు నించుచు శాంతి పంచుచున్.

మెత్తని ఓష్ఠమందు కుసుమించెడి పంచమ సుస్వరాలతో
మిత్తిని గెల్వ జాలగలమేటి సిపాయిదనమ్ము నిమ్ముగా
నిత్తువు గాయకోత్తములం; కెంతటి వింతబలమ్ము గల్గనే
త్వత్తరుణారుణాంగుళులు తాకిన కిన్నెర తీగ రాగముల్.

నలుబదియేండ్లు కాదుసుమీ! నల్బదివందల యేండ్లు కాదు సూ-
ఇల శశితారకా నికర మెన్నియుగాలు మొగాలు సూపునో,
తెలుగుల నాల్కచిల్క కడుతీయని పల్కులు నెన్నినాళ్లు ము
ద్దుల గురియంగ పల్కగలదో మరి అప్పటిదాక నిల్తులే.

నీవు రాకున్నచో నిద్రాణ నరజాతి
వేయి యేండ్లకు కన్ను విప్పబోదు,
నిను గొల్వకున్నచో మనిషి నాలుక చిల్క
పదివేల యేండ్లకు పల్కలేదు,
నీవు లేకున్నచో ఈ విశ్వముచ్ఛ్వాస
నిశ్వాసములు మాని నిల్చిపోవు,
నిను మెచ్చకున్నచో కనకగర్భుడు కూడ
గర్భదరిద్రుడై గంగ గలియు—

మానవులకెల్ల ఆరవప్రాణమీవు
కరకుగుండెల కరగించు గానమీవు
కదలి, కదలించి పలికించు పెదవివీవు
భారతీ! మాకు ఆనంద పదవి వీవు.



# భారతి!

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

వీర మాహేశ్వరుండైన 'విశ్వదాత'
తీర్చిదిద్దిన 'భారతి' దేవి వయసు
నలువదేండ్లని తెలిసిన తెలుఁగుజాతి
కిదియు నొక పర్వమై మది కింపు నింపు!

సారస్వతోద్యాన జవసత్త్వముల సౌరు
మధుమయ ఫణితిలో మలఁచి పొలిచి
అధునాతనాంధ్ర వాఙ్మధురతా ముద్రకుఁ
గ్రొంగ్రొత్త హావణింపు గుస్తరించి
నవ్య శాస్త్రజ్ఞాన నానా విధానూన
సంపద కున్నత స్థానమిచ్చి
రాజ్య తంత్రోద్వాప రంగభూమికి భవ్య
సన్నివేశము ప్రశస్తముగఁ జూపి

ఇన్ని యేండ్లుగ భారతీ! వన్నె చిన్నె
లెన్నొ కూర్చితివమ్మ నీ కివ్వరీడు
జోడు కాఁగలవార లెచ్చోటఁ గలరు
వయసులో వైభవ ప్రాభవములలోన?

---

# విజయసాధనకు దృఢ సంకల్పం...




హిమాలయ ప్రాంతములో, అమానుషంగా దండయాత్ర చేసిన శత్రువులతో పోరాటం జరిపిన మన సైనిక దళ వీరులు అనేక ధైర్యసాహసోపేతమైన ఘన కార్యములు జరిపియున్నారు....

"ఆంధ్రప్రదేశ్" నందు ప్రతి నెలా, మన సైనికుల ఉత్తేజపరిచే వీరోచిత సాహస కృత్యాలువివరింపబడుచున్నవి. ప్రజల దృఢ సంకల్పం కూడా యెట్లు కార్యరూపం దాల్చవలెనో యీ మాసపత్రిక తెలియపర్చుచున్నది....

ప్రఖ్యాత రచయితలందరు, మన దేశరక్షణ ప్రధాన సమస్యలను విపులీకరిస్తూ, యీ పత్రికలో ఇంగ్లీషు, తెలుగు, ఉర్దూ, హిందీ భాషలలో రచిస్తున్నారు.

మీ వార్షిక చందా రు. 3/- చెల్లించి, మీ కాపీని డైరెక్టర్ ఆఫ్ ఇన్‌ఫర్మేషన్ అండ్ పబ్లిక్ రిలేషన్స్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్ వారినుండి పొందండి. ఈ చందా ప్రతి జిల్లాలోని డిస్ట్రిక్టు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరునకు కూడా చెల్లించవచ్చును.

సమాచార పౌరసంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్

# దువ్వూరి - పాటలూ - బసవరాజూ

డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

## 3

దువ్వూరి రామిరెడ్డిగారు కవికోకిల. ఆయన పద్యశైలి 'బాలురుస్మైత మొక్కరిని పద్యగతార్థమువేడ' నక్కర కల్పించని శ్రుతి సుఖమైన సుధామయోక్తి. ఆయన రచన చదువరికి మది భారముతోచనీని ప్రసంగము. వారితొలికృతులు రసిక జనానందము, అహల్యానురాగము, శ్రీకృష్ణుని రాయబారము అన్నవి పూర్వప్రబంధములవలెనే అతిశయోక్తులూ శబ్దాలం కారములూ కూర్చుకున్న ప్రబంధములు. అక్కడక్కడ ఆధునిక పరిస్థితులూ ఊహలూ హెచ్చరిస్తాయి చదువరిని. ఋతు సంహారమూ, పుష్పభాణ విలాసమూ, ఆంధ్రీకరణములు బంభర శుకకీట సంవాదమూ, జలజమూ, సంక్రాంతిపండుగ, సింహ ప్రబోధము అనేవి పంచరత్నాలూ నవరత్నాలూవంటి ప్రకీర్ణక పద్యమంజరులు. 'విమర్శకుడు', ఏదైనా కావ్యము వచ్చునా దానిని ముక్కలుగా కొట్టినామన్న కీర్తిని పొందు దామా అనిచూచే పండితవ్యాథుని నిరసనము—మాతృశతకము భారతదేశ పూర్వస్థితీ ప్రస్తుతస్థితీపోల్చి కవిపొందే దైన్యము— వీటన్నిటిలోనూ రచనాపద్ధతిదే పెత్తనము: వీటిసామగ్రి కవి గారి యిష్టానిష్టములూ మెప్పూ దిగదీతానూ. పరిసరము లకు కవిపైన ఏ ప్రభావమూ ఉండదు. కవియే, ప్రబంధ కవులవలె ఆ అందము ఇట్లున్నది, ఈ చందము అట్లున్నది అని చమత్కారమునే సాధనముగా నడుపుకుపోతాడు చివర దాకా. వీరిశైలి ప్రవాహశీలి, నాతికఠినమేకాదు మృదువు కూడాను.

వెనకటి కొకమారు రాధాకృష్ణ పండితు లడిగిరట కొంపెల్ల జనార్దనరావును "నవ్యకవిత్వమని దేనినంటున్నారూ?" అని. జనార్దనరావుగారు నన్నూ అడిగేరు ఆ ప్రశ్ననే. "వర్ణ్య వస్తు సౌందర్యాన్ని చదువరికి స్ఫురింపజేసే రచన నవ్యము వర్ణనా చమత్కారాన్ని స్ఫురింపజేసేది ప్రాచీనము" అంటిని. ఇప్పటికీ ఆ అభిప్రాయముతోనే ఉన్నాను. రామిరెడ్డిగారి "ప్రథమ కవిత్వము" (1916—1918) ప్రాచీన పద్ధతిలో వర్ణనా చమత్కారముమీద ఆధారపడి సాగినట్టిదే. పైవాటిలో నన్నిటా ప్రకృతి సౌందర్యము కవిభావనాసుందరిని మోచి తిరిగినది. 'వనకుమారిలో' ప్రకృతి సౌందర్యము కవిభావనను వదలి నిలచినది. కనుక ఈ కావ్యముతోనే (1918) రామిరెడ్డి గారు నవ్య కవిత్వములోనికి అడుగు పెట్టినా రంటాను. విజయరామ గజపతి మహారాజు 'ఎవ్వరేమన్న నీ కృతి నవ్య మైన యభినవాశయ సంపత్తి నలరుచుండు' నన్నారట. చల్లని మాట ! 'రసప్రవాహ బాంధవ పదజాల బద్ధ కవితా నవభావ మనోహరత్వము' ఈ కావ్యములో నిక్షిప్తమైనదని కవిగారి విశ్వాసము. ఇది—గురజాడా రాయప్రోలూ అబ్బూరీ కవుల కావ్యాల వలెనే—ఉపోద్ఘాతాలతో కాక కథతో ప్రారంభిస్తుంది. మొదలుపెట్టగానే చదువరి అపేక్షను పట్టడానికి కథ సిద్ధ మవుతుంది. (రామిరెడ్డిగారి యితఃపూర్వ కావ్యాలు మురాంతక విఘ్నేశ సరస్వత్యాది పౌరాణిక దేవతల ప్రార్థనతో ప్రారంభిం చాయి.) దీని ఇతివృత్తము పైకావ్యములకు వలెనే సిరి మంతుల విలాసము కాక వనములలో పెరిగి వనకుమారిగా తిరుగుతూండిన కన్య చరిత్ర, కనుక కొత్తదనము కలిగి నట్టిది. (షేక్స్పియరు 'టెంపెస్టు' నాటకములోని మిరాం డాను వెలికిదీసి చూపుతూన్నది ఈ కావ్యము) ఈమె కథను చెపుతూ కవిగారు ప్రకృతి సౌందర్యాన్ని విరివిగా వర్ణించారు. ప్రబంధాలలోని ప్రకృతి కవియొక్క భావనా బలానికి వాహ నమై ఆ భావన ఎటు నడిపితే అటు నడిచింది. ఈ నవ్య కావ్యాలలోని ప్రకృతి సౌందర్యసైరంధ్రియై కవికి సౌంద ర్యాన్ని చూపిస్తుంది. కవి భావన ఈ నవ కావ్యాలలో సౌందర్య చిత్రణమే చేస్తుంది. భావనారంగవల్లులు తీర్చదు. ప్రబంధ కవి సంస్కృత పండితుడు. సంస్కృత కావ్యాలలోని పురాణ దృశ్యాలు—అతని అనుభవములోనివి కాకపోవుటవల ఓజో గుణాన్ని పెంచుకొని—మేఘమండలానికి పైన విలసిల్లు తూన్నట్లు ఆతని ఊహకు గోచరించాయి. అశేష ఫణిఫణా రత్న రుచులవంటి అతిలోక దృశ్యాల్ని దింపి తెచ్చుకుని ప్రకృతి దృశ్యాలతో జోడించి వర్ణించాడు ప్రబంధకవి.

పెద్దనగారి వెన్నెల వచనమూ, తిమ్మనగారి వెన్నెల 'బువ్వపు బంతి' పింగళి సూరన్నగారి '(ప్రభావతీ తిలకము' ధూర్జటి 'ఉదయ(గావపు పావవట్టము' ఇలాంటి (ప్రకృష్ట పాధనలే. (ప్రబంధాలలోని (ప్రకృతి కవియొక్క భావనా భాండారము లోని ఒక పార్శ్వము. అవసరమైనప్పుడు దానిని మలచుకొని ఉపయోగించాడు ఆ కవి. కవి సమయాలు ఈ రచనా శిల్ప ములో కవికి ధారాళంగా ఉపయోగించాయి. నవకవికి మాన వుని అనుభవముతోపాటు (ప్రకృతి సౌందర్యము కూడా దర్శ నీయమూ, ఉపాదేయమూను. ఆతని తూకములో చిన్ని మాన వుని అభిమానాలు, ఆశయాలూ కంటె బృహ(త్ప్రకృతి సౌందర్య సంపద బరువు హెచ్చు. అతనికి సర్వ (ప్రకృతీ (ప్రసన్నముఖి యైన తల్లి. తల్లి చేష్టలన్నీ బిడ్డకు ఆనందదాయకములే. మాన వుని కథలూ, భావాలూ సుఖదు:ఖాలూ నవకవికి ఆకర్షణము లైతే కావచ్చును కాక, సృష్టి సౌందర్య మొక్కటే దొరికినా అతనికి కించలేదు. (ప్రబంధకవి రచనకు మానవుడే కేం(ద్రము, రాజో, భక్తుడో ఎవరో. ఆతని చరి(త్రలో సౌందర్యము లేక పోవచ్చును, ఫరవాలేదు. తన కల్పనలను గుప్పి మొత్తపు రచ నను—కథను కాదు—ఆకర్షవంతంగా చేసుకుంటాడు (ప్రబంధ కవి. కేవలము (ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించి ఆనందింప జేస్తాడు నవకవి. కావ్యము చదవడము పూర్తిచేసేసరికి (ప్రబం ధమువల్ల కలిగేది కవి సామర్థ్యానికి మెప్పు, నవకవిత్వమువల్ల కలిగేది (ప్రకృతి సౌందర్యానుభవమువల్ల—ఏ కొంత అయితేనేం —కలిగే ఆనందము.

రామిరెడ్డిగారు వనకుమారి కథను వనసౌందర్యము నర్ణించుటకే స్వీకరించినారు. 'లలిత రసా(ర్ద్ర వేణు రవలాలిత లైన కురంగకాంతలుజ్వల కిసలంబుల నెమ్మెనసాగక వీనులు నిక్కబెట్టుట'నూ, 'లలితపు సంజ కెంజిగి విలాసములెల్ల శమింప జీకటుల్, బలసి (క్రమ(క్రమంబుగ నిలం గబళించెడి' రీతినీ 'కొండ నెత్తమ్ముల గోరాడు మబ్బుల గమన సౌందర్యా'న్నీ 'కిలకిల కావుకావు కిలకిచని' 'వీడ సీమలన్ జలిబిలి కమ్మగానములు సేయు' పక్షులనూ, 'దొనికి బండల జారి తుంపర ముత్యాలు వెదజల్లు సెలయేటి రొద' లనూ, 'జలదము జీల్చికొంచు' 'చంచ దుదారకాంతి దిక్తటముల (వేలు సంతమసకాండములం దొలగించు' చంచలనూ వర్ణిస్తూ (ప్రకృతి సౌందర్యాన్ని ఉన్న దున్నట్టుగా వర్ణించినా వ్యుత్పత్తి బలమువల్ల ఈయన రచనకు ఉత్ప్రేక్షాలంకార భారములు తప్పలేదు. మొగ్గు మా(త్రము అను భవమును వర్ణించి చదువరి కనుభవము కలిగించే నైసర్గిక భావ సంపూర్ణమైన పద్ధతివైపే. ''కలరవ కోమలంబగు వికస్వర సుస్వర మెత్తి నీ హృదింగల నరసానురాగ మెసకమ్మగ బాడెద విట్టి విద్య నెందుల మును నభ్యసించితివి'' అని యారంభించిన వనకుమారి పరిదేవన భాగము చక్కని భావ కవిత్వము! (ప్రకృ తిని తన భావనకు చేటిని చేసే రాజసమును కాక (ప్రకృతి సౌందర్యానికి ముగ్ధురాలయే చైతన్యమును చూపిస్తున్నది రచన, నూటికి నూరుపాళ్లూ నవ్యకవిత!

ఈయనదే కృషీవలుడు ఇంకొక మార్గము తొక్కి నది. 'వనకుమారిలో' రామిరెడ్డిగారు పట్టినది వనసీమను, కృషీవలుడులో ఆయన పట్టినది పల్లెసీమను. కాళిదాసు ఋతు సంహార కావ్యసరళి దీనిలో లీలగా కనబడుతున్నది. కవి పల్లె సీమలో తిరుగుతూ, సూర్యోదయావసరము నుండి (గామ ములో వినబడు కలకలమూ, పాలుదీయు వేళల కదలికలూ, పొలములకేగు సంరంభమూ, సోమరి యువకుల బద్ధకమూ, గనిమ (పొలముగట్టు)ల పాడూగునా పలకరించే అందాలూ, ఇంటిలో కష్టించే కాపునడుచు (శమా, జొన్నచేల పిట్టల దోలబోయెడి బాలిక చెయ్దములూ, మిట్టమధ్యాహ్నపు వి(శాంతీ, దుత్తకూటి భోజనమూ, కృషి (ప్రాముఖ్యమూ, సస్య సౌంద ర్యమూ, వానకారు శోభ, కర్షకుని కడగండ్లు, సాయంశోభ, గృహోపాగమనమూ, వి(శాంతి, వర్ణించినట్లుగా ఉన్నది కావ్యము. చిరకాలగత కావ్య నియమాల ననుసరించక సామాన్య కర్షకుని ఏకాహానుభవములను వర్ణించినందుకు (ప్రాచీన సం(ప దాయాభిమానులైన విమర్శకు లేమైనా అందురని కాబోలు 'కాల మనంతము, ఇల విశాలము' అన్న భవభూతి శాపాన్ని విసరినా రీయన. ఈ కావ్యము పల్లెపట్టును తలచినప్పుడు కవికి కలిగే భావాలనూ, ఆలోచనలనూ కలిపి పేనినట్టిది. ఒక నాటి సూర్యోదయము నుండి మర్నాటి ఉదయము వరకూ పల్లెలో కానవచ్చే దృశ్యములను కూర్చిన కారణముచేత కవి ఆలోచనలకు కథకు సమకూడే ఐక్య గుణము సమకూడు చున్నది. దానివలన ఈ కావ్యమును '(గామలక్ష్మి దినచర్య' అని వర్ణించవచ్చును. ఇందులోని భావాలు ఆయా సన్నివేశాలలో కవికి కలిగిన భావాలు. వీటిని దండ గుచ్చేది (గామలక్ష్మియే అయినను కవిగారి సానుభూతీ, ఉపాలంభమూ, (ప్రబోధమూ భావమయకోశాన్ని దాటి విజ్ఞానమయకోశములోనికి (ప్రయా ణించి ఆయన వ్యాఖ్యానాల్నీ ఆయన్నీ చూపిస్తూ భావైక్యతన్న అక్కడక్కడ తెంపిన వనిపిస్తున్నది నాకు. వీరి వ్యాఖ్యానములు రేపిన ఆలోచనలవల్లనే కట్టమంచి రామలింగారెడ్డిగారు పట్టణవాసా లను వెనుక వేసుకొని సమర్థిస్తూ పీఠికలో నాలుగు వాక్యా లుగా (వాశారు చూడమంటున్నాను. కనుక ఐక్యత తగ్గడముతో ఈ 'కృషీవలుడు' 'పల్లెపట్టు'ను వర్ణించే కావ్య మవుతున్నది. రాజూ అతని వేటా, అతని వివాహమూ (ప్రబంధకవులూ, సంపన్న

రసికుడూ, ఆతని విలాస విహారమూ, దక్షిణాంధ్ర కవులూ, వేశ్యాలోలుపత్వమూ, పతనమూ సంధియుగ కవులూ చిత్రిస్తే గ్రామసీమ సౌందర్యమును సామగ్రిగా గ్రహించిన ఈ కావ్యము ఆ గుణములో కొత్తదే. ఇందుగల ప్రకృతి కవి భావనా సైరంధ్రి కైసేతతో చెలికత్తె అలంకరించిన సుగాత్రి వంటిది కాదు. సహజసుందరియే. ఉత్ప్రేక్షల గొణగొణలు మాత్రము తప్పలేదు.

వీరి జలదాంగన చిత్రకావ్యము. "తత్త్వవేత్తకు నేది సత్యముగ దోచు నదియె సౌందర్యరూపమై యలరు గవికి" అన్నారు జనమంచి వెంకట్రామయ్యగారు. 'జలదాంగన' సొగసు గుర్తించుకోవాలంటే 'కొండ నెత్తమ్ముల గోరాడు మబ్బుల గమన సౌందర్యము' ద్వారా మేఘాల పుట్టుపూర్వోత్తరాల ఆలోచనలోకి వెళ్ళా రాయన. వైజ్ఞానిక వస్తువు కవిత్వానికి వైచిత్రి సాధించడానికి పనికి వస్తుందేమో కాని సౌందర్యము సాధించడానికీ, ఆనంద మివ్వడానికీ పనికిరాదు. వీరి 'యువక స్వప్నము' మృత్యువున కవ్వలి దేశ దృశ్యము. మళ్ళీ "కడపటి వీడుకోలు" లోనే వీరు కవితా రచనకు మరలివచ్చుట. ఈ కావ్యములో—రాయప్రోలువారి 'కష్టకమల' లో వలె—కడపటి వీడుకోలు పొందే యువతీ యువకులు హఠాత్తుగా నీటబడి ఇద్దరూ కూడా—అనుకోని —బలవన్మరణము నందినారు. కవిగారి ఆశయము దురవగాహము. కథలో వారి నిద్దరినీ విడదీసి ఎక్కడనో చంపుట కంటె, ఇద్దరినీ స్రవంతిలో పడేసి 'ఎంత పుణ్యంబు చేసెనో ఈ స్రవంతి ప్రేమవాంఛల రెంటి జీర్ణించికొనగ' అని ముగించారు. "గౌతముని ప్రకృతి ప్రేమనూ, ఋషి కన్య మోహమునూ ప్రకృతియే జీర్ణించుకొన్నది" అని ప్రకృతినే ప్రేమ వాహినీ గమ్యముగా సూచించడము ఆయన అభిలాష కాబోలు. నాకు మాత్రము నాయకీ నాయకులు పడపాటుతో ఈ వ్యూహ ఛిన్నాభిన్న మయిందేమో ననిపిస్తున్నది.

రామిరెడ్డిగారి రచనలలో ప్రకృతియొక్క సహజ సౌందర్య వర్ణనా, శ్రమజీవి జీవితసౌందర్యమూ కొత్తలు. వారి ఖండకావ్యాలలో 'కవి మనోరథము' జలాధరార్భకుని 'సాంధ్య కిమ్మీరవర్ణ వస్త్రముల'నూ 'గిరితట విహార శృంగారకేళి'నీ ఆనందించడముతో ప్రారంభించి, చుక్కపూవుల పందిరినీ, మంచు తుంపరలతోడ విచ్చు పన్నీటి పూవునూ, జిలిబిలి కమ్మగానములు చేసెడి సెలయేరునూ చూపి మన హృదయాలను జల్లుమనిపిస్తున్నది. ఇది నవ కవిత్వము. కవి భావములే కావ్య సామగ్రిగా వెలసిన కవన మిది. ఆ భావములు తాకి చదువరి హృదయము కూడ రంజితమగును. ఈ కవిత్వము చదివినప్పుడు మనకు కలిగేది కవి రచన యెడ మెప్పుకాదు. మరి ఆతని భావములే మనకు కలుగుటవల్ల జనించే ఆనందమూ కవితాకళ కలిగించవలసిన దిదీ.

రామిరెడ్డిగారు కాకలుతీరిన వేదాంతి కాదు. వీరి తాత్త్వికచింతనలో నిరంజనత్వము కంటె వేదనయే ఎక్కువ. వీరి స్వభావము కుసుమకోమలమైనా, అనుభవము కష్టకంటకిత మైనది. జీవితాసవము ఈయనకు తృప్తిదీరునట్లు అందలేదు. ఉమర్ ఖయ్యాము వలెనే రామిరెడ్డిగారు విజ్ఞాన మందున్నూ, సౌందర్యమునందున్నూ మమత గలవారు. ఉమర్ ఖయ్యాము సుందర భావములు ఆతని మేధాతర్కమువల్ల వాడివై చదువరుల హృదయాలకు చుర్రుమని తాకుతాయి. జీవిత క్రకచపు పలుగాటులు ఖయ్యామును వలెనే రామిరెడ్డిగారినీ హింసపెట్టినవి. ఆయన గొంతు కోయిల గొంతు. పారసి కన్న శ్రావ్యమయి పల్లవకోమలమై సుధారసం బూరెడు తెనుంగు నుడిలో ఖయ్యాము భావములను వీరి పానశాలగా కూర్చినారు. ఎందరేనా వ్రాశారు రుబాయీలను తెలుగులో. రామిరెడ్డిగారి రచనా మాధుర్యము మాత్రము తక్కిన రచనలలో లేదు. కారణము రామిరెడ్డిగారు స్వంతముగా పలికినట్లే వ్రాయడమూ, వారి కవితా కన్య నిసర్గ గానముతో అలంకారాల నినాదాలు పాడవై వినబడక పోవడమూను. రామిరెడ్డిగారి ప్రకృతి సౌందర్యదాహమునకు ఖయ్యాము రసవాహిని సంపూర్ణ సంజీవని యైనది. వారి పానశాల తెలుగు రసికుల పానశాల.

పాటలు ఆధునికాంధ్ర కవిత్వములో భూకంపమువలె ప్రవేశించినవి. నండూరి వంటి కవులు కావ్యభాషా సంప్రదాయాన్ని ముక్కలుగా కొట్టి కళతో జానపదుల వాడుక భాషను పాటలకు వాడేటంతవరకూ ఆంధ్ర పాఠకుల దృష్టి పాటల మీద పడలేదు. వాస్తవానికి పాటలు చిరకాలమునుంచీ ఉన్నాయీ, తెలుగు కవులు నన్నెచోడుడూ పాల్కురికీ పాటలను పేర్కొన్నారు. గార్లపాటి లక్ష్మయ్య వందలాదిగానూ, అన్నమాచార్యులు వేలాదిగానూ రచించారు పదాలు. ఈ పదాలలో సంగీతానికి కంటె సాహిత్యానికే ప్రాధాన్యము. కనుకనే అన్నమయ్యను పదకవితా పితామహు డన్నారు. పాటలది మాత్రాచ్ఛందస్సు, పాటలలోని అడుగులు సమకాలాల్లో పడతాయి. పద్యాలది గణ ఛందస్సూ, గణాలన్నీ ఒకే పొడుగువి కావు. పొడుగూ, పొట్టీ చేరిఉంటాయి. పాటలలోని ఆవృత్తాలు పాటల్ని సమ లయలో నడుపుతాయి. పద్యాలలోని గణాలు పొడవు మారుతూ పాదాలలోని అక్షరాలను ప్రత్యేకపు వరుసలో బిగిస్తాయి. సమకాల లయతో సాగిపోయే పాటలలో అక్షరము

లయలోని వైవిధ్యము ఎక్కువగా ఉండడానికి వీలులేదూ, ఒకే ఆవృతములో ఉన్న కొద్ది భేదమూ ఆవృతము యొక్క పాద వుని సమముచేసి తాను లోపించిపోతుంది. గణముల పాదవులు మారుతూండడము చేతనూ, గణములోని అక్షరముల వరుస నిర్ణీతమైపోయి ఉండడమువల్లనూ ప్రతీ పద్య పాదానికీ నడ కలో వైలక్షణ్యత స్ఫురిస్తూనే ఉంటుంది. ఈ ఆధిక్యాన్ని పెద్దచేసి, కవులు పాటలను రచించడము కంటె పద్యాల్ని రచించడమే శ్రేష్ఠమైన పనినిగా పరిగణించి పద కవితలను ఈసడించారు. అన్నమయ్య వేలాదిగా పదములు రచించినా ఆయనకు కూడా ఏ కొద్దో అవహేళన జరిగినదేమోనని—ఆయన కుమారుడు పదములనే కాక పద్య ఛందస్సులోని కంద, వృత్త, సీస పద్యములలోనూ, చివరికి వచనములో కూడాను రచించడమును గుర్తిస్తే— నా కనిపిస్తుంది. అయితే అన్నమయ్య రచనా సౌందర్యాన్ని అందుకోగలిగినవారు, వంద లాదిగా ఉన్న పద్య కవులలో ఎంతమంది ? పాటల రచనలో కట్లు తక్కువ కనుక కవి భావాలు చైతన్యవంతంగా రావ డానికి అడ్డంకులు తక్కువ. ఈ సౌకర్యానికి వ్యాకరణ నియ మాల్ని సడలించిన భాషను ఉపయోగించి కూడా పదకవులు సౌలభ్యాన్నీ, శక్తినీ కలుపుకున్నారు. అయినప్పటికీ పలుకు బడిలోని నేర్పునే కవిత్వ పీఠముమీద ప్రతిష్ఠించి అర్చించుకున్న మధ్యయుగాల రసికులు పాటలను పరిగణించుకోనే లేదు! క్షేత్రయ చేతిలో పదములు సంగీతమును పెంచుకొని, కవి త్వముతోనే పెరిగిన సమస్యాపూరణ ప్రక్రియలతోపాటు సంగీతకళలో చేరిపోయినవి. చిరు తిరుమలయ్య తన 'నా మొరాలింపవే' అన్న పదానికి నిర్మించిన ధాతువు (స్వర రచన) ఈ సత్యాన్ని చక్కగా నిరూపిస్తుంది. అప్పటినుంచి పదమునూ, పాటనూ సాహిత్య రచనగా పరిగణించడము మాను కున్నారు తెలుగువారు. నాటికి నేడు మళ్లీ గురజాడవారు పాటలనూ, పాటలవంటి రచనలనూ వెలయించేవరకూ పాటల లోని భావాల కొరకు గాని, పలుకుబడి నేర్పు కొరకు గాని ఎవరూ ఆశించినట్లు కానరాదు.

గురజాడ అప్పారావుగారు త్రిశ్ర, చతురశ్ర, ఖండ గతులలో నీలగిరి పాటలు రచించారూ. పాటకూ, పద్యానికీ నడిమి రచనగా ముత్యాల సరాలూ, చతురశ్రగతి రచన 'పూర్ణమ్మా' రచించారు. "గ్రాంధిక భాషకీ, మాట్లాడే భాషకీ మధ్యగా ఉండే సులభమైన భాషను సృష్టించుకొండి" అన్న ఆయనగారి సందేశాన్ని ఛందస్సు మీదికి చాచితే "పద్య ఛందస్సుకీ వచనానికి నడిమిగా ఉండే మాత్రా చ్ఛందస్సుని నిర్మించుకొండి" అని వారి సందేశమేమో ననిపిస్తుంది. వారి రచనలు అలాటి ఛందస్సులోనివే. అయితే వారి వ్యావహారిక వాదమును వలెనే వారి ఛందో సంస్కారమును కూడా ఎవరూ అనుసరించినట్లు కనబడదు. అబ్బూరి రామకృష్ణారావుగారు వంగ కవిత్వములోనివో, స్వంతములేనో కొన్ని కొత్త మాత్రా చ్ఛందాలు ప్రవేశపెట్టారు. అవి కూడా రచయితలకు ఆకర్షక ములు కాలేదు. అధికార్ల సూర్యనారాయణరావుగారు "ఉత్తుత్తి పండు ఉత్తరేణిపండు దానిమ్మాపండు దబ్బాపండు" వంటివి కొన్ని వ్రాశారు. అయితే ఈ పాటలోని 'సొగసుసీతానీదు చెల్లు పేరేమె' అన్న చివరి ప్రశ్నకు జవాబుగా వచ్చిన "పాల్ల సంద్రమ్మిది బాలకృష్ణుండు' అన్నంతపాటి అద్భుతమైన భావాలు తక్కినవాటిలో లేకపోవడముచేతనే కాబోలు వారి రచనలు రసికుల మనస్సు కెక్కలేదూ, వారి పద్ధతిలో ఇత రులు రచించనూ లేదు.

బసవరాజు అప్పారావుగారు పాటలు చాలా వ్రాశారు. అయితే వారు తమ పాటలను గొప్పగా పాడే వినిపించేవారట్లు, కృష్ణశాస్త్రిగారు పలుచోట్ల వ్రాశారు. పాడితేనే గాని రంజిం చని పాట కవితారాజ్యములోనిది కాజాలదు. కవిత్వము మాటల రచనయే కాని స్వరాల రచన కాదు. మాటల రచనకు భావాలూ ఆలోచనలూ ఇవీ అని అందరికీ తెలుస్తాయి. స్వరాల రచన—అనగా రాగము—మాటలకు అందని మాటలతో సంబంధము లేని—వ్యక్తీకరణము. రాగానికి ఇదీ అర్థము అని ఎవరూ నమ్మ కంగా చెప్పలేరు. మాటల రచన మానవులకు నైసర్గికములైన రసానుభవమును ఉత్పాదిస్తుంది. స్వరాల రచన సముద్రమంత విశాలము, దానిని తొమ్మిది—లేదా పది—రసాలకు పరిమితము చేయడము తప్పు. స్వరాలు మానవుల ఆలోచనలకీ, భావాలకీ కాదు. జీవుల చైతన్యానికి చిహ్నములు (వాటిని 'పశు వెరు గును పామెరుగును శిశువెరుగును'). జీవుల చైతన్యపు భాష అయిన సంగీతానికి మానవుల ఆలోచనల భాష అయిన మాటల భాష కాళ్లలో కర్ర. మాటల భాషకి సంగీతాన్ని చేర్చి ఇవ్వడము ఎద్దుకి హంసను జోడుగా పూన్చడమే. ఆ బండి గాని ఎగిరిందంటే హంసది గొప్ప. పాటలను అమోఘముగా పాడేసి 'నా కవిత్వము ఎంత బాగుందో!' అంటే, 'నీ కవిత్వము కాదయ్యా బాగున్నదీ, నీ పాట బాగుంది' అనాలి మనము. "పద్యాల్ని మాత్రము కవులు పాడడములేదా, ఇతరులచేత వేది కలమీద పాడించుకోవడము లేదా ?" అని అడిగితే, "ఆ కవి త్వాలకు ఆపాతమధురమైన సంగీతాన్ని కూడా అదనంగా కలిపి ఇస్తేనేగాని అవి రంజించవన్న జంకుచేత వాటి కవులు తాము పాడియో, ఇతరులచేత పాడించియో సంగీతపు మాధు ర్యాన్ని కూడ కావ్య సౌందర్యానికి చేర్చి, మొత్తపు సౌంద

# దువ్వూరి - పాటలూ - బసవరాజూ

ర్యాన్ని కవిత్వానికే హాయిగా జమ కట్టుకుంటున్నారు" అని జవాబు. పాట ఏమీ రాని కవులు, చక్కని కవిత్వము వ్రాశే వారు చాలామంది ఉన్నారు. కవిత్వపు వాసనే లేనివారు—పుట్టంధులు—చక్కగా పాడగలవారూ ఉన్నారు. కవిత్వమూ సంగీతమూ అసహాయ కళలు. కాబట్టి పాటల సాహిత్యపు విలువను గుర్తించుకొనేటప్పుడు వాటి సంగీతాన్ని విస్మరించియే తర్కించుకోవలెను.

బసవరాజు అప్పారావుగారి గీతాల సంపుటానికి ముందు మాటలు వ్రాస్తూ కృష్ణశాస్త్రిగారు "పూరికే మాట్లాడే వాడు Wordsworth అనీ Watrsdunton అనీ, పండితరాయలనీ, భవభూతి అనీ, తిక్కన్న అనీ, పోతన్న అనీ! ...... అతని కావ్యాల్లో కంటె అతని జీవితంలోనే కవిత్వం ఎక్కువ దొరుకుతుందనీ మరికొంద రంటారు .... అతనికి అనుభూతి రావడ మేమిటి, పాటలోనో, పద్యంలోనో అనెయ్యడ మేమిటి ? .... అంత నగ్నంగానూ .... విసిరివేసినప్పుడు కల్పనకు అవకాశ ముండదు .... అతని పాటదే పైచెయ్యి. దాని బలం ఎక్కువైపొయ్యేదేమో కూడా .... అందుకనే అతనెప్పుడోగాని మామూలు శబ్దాలను దాటి వెళ్లలేదు.... దీనివల్ల ఒక్కొక్కప్పుడు .... పేలవమైన మాటలూ కాళ్లు చాపేసి చతికిలపడే పంక్తులూ రావచ్చు. అయినా జీవద్భాషకు ఇంత దగ్గిరగా కావ్యభాషను తీసుకువచ్చే ప్రయత్నం గొప్పది కదూ ?" అని. బసవరాజు వారికి ఆవేశం లావు. ఆ ఆవేశంలో వారు చెప్పిన పాటలు వారి కళేములనే తెంపుకు పోయాయి.

గురజాడవారి కావ్యరచనోద్యమములోని మాత్రాచ్ఛందో రచనా, జీవద్భాషా ప్రయోగమూ, ఖండకావ్య నిర్మాణమూ బసవరాజువా రవలంబించినట్లు కానవస్తుంది. గురజాడవారు త్రిపుట, చతురస్ర వరుసలనే కావ్యరచన కుపయోగించగా వీరు త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్రజాతి వరుసలలో తమ గేయాల్ని రచించారూ, వాటిని పాడి వినిపించారు. ఈ గేయాల్ని రేడియోవారు లలితసంగీత కార్యక్రమాలలో చక్కగా పాడించి వినిపిస్తున్నారు, యుక్తమే. వీటిలో 'వాయింపుమా మురళి', 'రాబోకు రాబోకు', 'నల్లవాడే గొల్లపిల్లవాడే' మొదలైనవాటిలో సంగీతానిదే పైచేయి.

బసవరాజువారి గేయాలు ప్రేమ తత్త్వమూ, భక్తీ, ప్రకృతి చిత్రములూ, చరిత్రా, కవిజీవిత చర్యా అన్న అయిదు విభాగాలుగా కన్పిస్తాయి. రాయప్రోలు పూరించిన ప్రేమ శంఖారావము ఈయనకు అందడములో వింత లేదు. అయితే ఈయన వర్ణించినది లౌకిక ప్రేమనే. 'వలపెరుంగక బ్రతికి కులికి మురిసేకన్న వలచి విఫలమ్మొంది విలపింప మేలురా' అన్నా రీయన. యశోధర, లైల, గోపిక, వియోగి చేసే ప్రేమవిలాపాలకు ఈయన స్వంత పరిదేవనమును కూడా వెఱ్ఱిపిల్ల, పలవరింతలు, వరుస వావి వంటి పాటలలో వినిపించారు. తానే గోపికయై పోయినట్టుగా 'ఒంటిగా ఉయ్యాల లూగితివా నా ముద్దు కృష్ణా జంటగా నను బిల్వదగదోయీ!' అని వ్రాసిన పాట రెండే చరణాలదైనా సద్యః పర నిర్వృతి కలిగించే గేయము. "కంటికంతా జలమయమై, మింటిదాకా యేకరాశై, జంటదొరకని మహా ప్రళయపు టింటిలో వటపత్ర డోలిక నొంటిగా యుయ్యాల లూగితివా" అని చదవగానే మనము చదువరుల మన్నమాట మరచిపోతాము. సముద్రయానము చేయనివారికి కూడా కంటికంతా జలమయమైన మహా ప్రళయపుటిల్లు కన్నులకు కట్టుతుంది. అలాంటి సముద్రముమీద మర్రి ఆకుమీద తేలినాడట ప్రభువు. 'జగములన్నీ కాలయోనిలో మొగము లెరుగక నిదురబోవగ' నగు మొగముతో తనలో తానే జోలలు పాడుకుంటున్నాడట ప్రభువు. అప్పారావుగారి తపనీయ సులోచనా లెంత ఎత్తుకైనా చూశాయి. ఈ గేయ దృశ్యమును మన కందించడానికి, వీరి భక్తి గేయాల్లో శక్తివంతములైన భావాలు మెరపుల్లాగ తళుక్కుమంటూ ఉంటాయి. 'సొగ కన్నుల ప్రేమరాగ మొలుకంగ నీ లోకమును మరపించు' నట శ్రీకృష్ణుడు. 'రావాలంటే త్రోవే .... లేదా దేవదేవు డా నాధునకు ?' 'తలపై నీ పాదధూళి తాల్చుటకైనను తగనా', 'నట్టనడి సంద్రాన నావలో నున్నాను', 'వాడిన పూవున కేటికి మరలను పరిమళ మొసగెదు దేవా', 'వేద్రాది శిఖరాన వెలిగేటి జ్యోతి' ఉదాత్తమైన భావాలు, పట్టి జవజవ లాడిస్తాయి చదువరుల్ని.

బసవరాజు వారు చూపే ప్రకృతి దృశ్యాలు కొన్ని మనము చూచినవే. మనము వాటి నిసర్గ సౌందర్యాన్ని దాటి పోతామూ, ఆయన గుర్తించి చెప్పేరు.

'ఈ మావిపై నుంచి ఈవు కూ కూ అంచు, నామావిపై నుండి ఆపె కూకూ యంచు ఏమి బాసల జేతురే' అని అడుగుతా రీయన. కోయిల కూతలలో బాస లుండునని నాకు స్ఫురించలేదు! 'వార్ధినుండి ప్రచండవాయువు' వస్తుందట. నిజమే! కాని వార్ధి నుంచి వస్తుందని ఎంతమందిమి గుర్తించామూ ? "పగలెల్లను ధాత్రీరమ పచ్చని పుట్టమ్ము గట్టి" ఉంటుందట. రాత్రి పచ్చదనము తెలియదుకాదా మరి? 'కడలి శాంతముగ నున్న యప్పుడే కడు భయమిడు' నట. ఎంత సత్యము! నిప్పు రవ్వయందున ప్రళయేశ్వరుని నిటలాగ్ని అణగి యుండినట్లు, నిశ్చల భక్తుల హృదయ పీఠములలో స్వామి అధివసించి యుండునట! 'ఎండ చొరని నికుంజ గృహముల' నుండుట సుఖమట. నికుంజ సుఖము ఎండ చొరకుండుటే కదా! 'మెరుపుదీగె మొగిలుతోడ మేలమాడు' తుందట! ఇంకెవరితో మేలమాడ గలదూ ? 'జలజలని బారు సేలయేటి చెంత నిభృత నికుంజములో నిశ్శబ్ద' ముండునట. 'ఆడవిమల్లె చెట్టు మిన్ను చీల్చుకు' పోతుందట.

ఈయన చారిత్రక గాథలు 'తాజ్ మహల్', 'యశోధరా విలాపము', 'లైలామజ్నూ', 'జేబున్నిసా' అన్నీ ప్రేమ విప్లవముల గాథలే .... కవిజీవిత చర్యలు జరిగినవి జరిగి,

వట్టుగా—నగ్నంగా—వ్రాసినట్టు కానవస్తాయి. బిడ్డ మరణించిన దుఃఖాన్ని "కత్తిబెట్టీ పొడిచినావోయ్ దేవా! గాయమింకా మానలేదోయి దేవా! నిలువూన యిల్లు దోచేశావ్" అనీ, "వెనక జన్మలో యేమి పెట్టి పుట్టితిమొ? బంగారు పండంటి పసిబాల కలిగె! పెట్టి యెవరిని యేమి తిట్టుకున్నామొ? ఇచ్చిన దైవమూ మర్చిపోడాయె" ననీ చెప్పుకున్నారు. ఈ పరివేదన ప్రకృతిలో చేరిపోతుంది. ఇది కళ కాదు, ప్రకృతే. ఇవి అనుభవాలు, అనుభవము కలిగించడానికి వ్రాసిన భవాలు కావు. సహజ ప్రకృతికి ప్రతికృతి చెయ్యడము విద్య అవునేమో కాని కళ కాదు. బిడ్డలు పోయిన జననీ జనకుల దుఃఖము ప్రకృతే, కళకాదు. బిచ్చగాళ్ల అరపులూ మేకపిల్లల నృత్యమూ సూర్యాస్తమయపు రంగుల ఫోటో, కోయిల కూతా, తేనెటీగల గూటి శిల్పమూ, బంగారు పిచికల గృహనిర్మాణమూ నూటికి నూరుపాళ్ళూ ప్రకృతే, కళ కాదు. "కవితలో నైసర్గిక భావాల్నే ఇస్తే మాత్రమేమి, నీ అనుభవ దృష్టిలో ఏది ప్రకృతో ఏది కళో తెలియ రాకుండా ఉన్నప్పుడు నేను ఏది యిస్తే మట్టుకు నీకేమి?" అని కవి తిరుగబడి ప్రశ్నించవచ్చును. నాటకంలోని పాత్రధారి ఏడువవలసి వచ్చినప్పుడు, మరణించిన ప్రేయసిని తలుచుకుని ఏడ్చితేమట్టు కేమి? అన్న ప్రశ్న వంటిదే పై ప్రశ్న. ఏడుపు నటనకాక నీ స్వంతమే అయితే దానితోపాటు నీ స్వంత గుణాలు—నీవు ధరించిన పాత్ర స్వభావంతో సంబంధము లేనివి—కొన్ని బయట పడతాయి. ఆచోట నీ 'నటన' బయట పడి పోతుంది. అట్లే కవితలోని నైసర్గిక భావాలున్నూ. "కత్తిబెట్టీ పొడిచినావోయి దేవా" అన్నది నాకు సమంజసముగా కానరాదు. భగవంతుడే పొడిచినాడని ఎందుకనాలి? నీ కర్మ ఫలము ఎందుకు కాగూడదూ? కాబట్టి ప్రకృతిసిద్ధ భావాలను కవితలో ఉన్నవి ఉన్నట్లు ఇచ్చేయడము—నేర్పుకాదు అన్న సంగతిని అలాగ ఉంచి—కర్తవ్యము కూడా కాదు.

గురజాడవారి "విరిగి పెరిగితి" వంటి ఖండ కావ్యాలు మొదటినుంచీ చివరిదాకా చదువరి అపేక్షని లాగి చివరికి చదువరిని భావావేశములోనికి విసరి తన్మయత కలిగించే ఖండ కావ్యాలు కొన్ని—నాగులచవితి, ప్రళయాగ్ని, వటపత్రశాయి, నాట్యసుందరి వంటివి—బసవరాజు వారు రచించారు. కొన్నిట్లో వీరి స్వంత ఘోషలు 'ఈ మహా గహనాంతర సీమలోన నీవు శ్రీ గిరి భ్రమరాంబ నేను మల్లికార్జునుడ', "నీవే నెగ్గింపుమీ యాత్ర .... పైన లేడే", "నీకే వదలితి దేవా" "వన్నెవ్వ రాపలే రీవేళా", "ప్రణయాబ్ధిలో బడే పిల్లకాలువను నా ప్రేమ లెఖ్ఖా, జమా", "చిట్టినీ జ్ఞాపకం చెయ్యబోకే" వంటివి ప్రవేశించి కావ్యము కలిగించే ఏ మార్పును చెడగొట్టుతున్నాయి. కొన్ని వింత రచనలు—వీరే ప్రారంభించా లనాలి వాటిని—గాజుల వరుసలాగ ఒకేరకపు భావాలతో సాగిపోయి సప్పటికీ ఆఖరి చరణములు అడ్డు కమ్మిల్లాగ వీటిని అతికి మొత్తపు రచనకు కావ్యత్వసిద్ధి నిస్తున్నవి. దొంగ కృష్ణుడు కాంచలేను, వీరుడు, గొంతెమ కోరికలు, నిరాశ, అధోగతి అన్న కావ్యాల లాటివి. నాలుగు చరణాలూ నాలుగు దళాలులాగ వికసిస్తే ఆఖరి చరణము ఈ దళాల్ని అతికే పూపీఠమవుతున్నది. ఈ రకపు ఖండకావ్యము తెలుగులో ఈయన నిర్మాణమే ననిపిస్తున్నది. భావాలు మాత్రమే చదువరిని పట్టి పూపగల వనుకో నక్కరలేదు. నాలుగు ముఖాలా జరిగే నాలుగు అనుభవాల్ని వర్ణించి, చదువరికి అభిప్రాయాలు కలిగించి, ఆఖరి చరణమనే నిట్టూర్పుతో ఆ అభిప్రాయాల్ని భావస్థాయికి మీటడము ఖండకావ్య నిర్మాణములో చక్కని తంత్రము. బసవరాజు అప్పారావుగారే ఈ తంత్రాన్ని తొలుదొల్త చక్కబరచినారని నా కనిపిస్తుంది.

కావ్యభాషను వాడుక భాషకు చేరువగా తెచ్చినది బసవరాజు కాదు, గురజాడ అంటాను నేను. "యెక్కడనో వొక చెట్టు మాటున వొక్క కోకిల పలుకసాగెను', 'పట్టమేలే రాజు వయితే పట్టు నన్నిపుడు', 'విద్యలందలి మాయ మర్మం దిద్ది చెప్పెందబల యొక్కతె', 'నలుగురు కూచుని నవ్వే వేళల నాపే రొకపరి తలవండి' అన్నమాటలలోని అందచందాలు, ఆవేశంలాగానే అనేశే బసవరాజు భాషకు లేవు. ఎంతో కొంత గురజాడ అడుగుజాడలు బసవరాజులోనే కానవస్తాయి. "ఆకసమంట నాలుకలు చాపే జ్వాలలూ, పాటలాధరపు పాటలూ, ఉసురులకు విసికించే జగతీ" గురజాడను అనుసరించి ఈయన చేసినట్టవే. అయితే గురజాడది చక్కని తీర్పు. బసవరాజు భావావేశము నైసర్గిక నిర్ఝరమునలె రావడను. ఆయన శక్తి వల్లనా, తీర్పుదిద్దలేని మైమరపు వల్లనా? అని ప్రశ్నవేస్తే రెండు జవాబులూ వస్తాయి. రెండోది ఆయనకు గౌరవాసదకము కాదు.

---

# తుమ్మలవారి కవితాప్రపంచము

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

## 1

"ప్రచలిత స్వాతంత్ర్య రణవీరకాహళీ
రుతిరాణ్మహార్మహా ర్ముఖరితంబు
జాతీయ విద్యా ప్రచార సంతోషిత
బ్రాహ్మీ చిరంతన భర్మపీఠి
సాబర్మతీ యోగి సమ్రాణ్మహాశీఃప
రంపరాదాన పాత్ర ప్రవృత్తి
సేవాతపః క్రియా జీవాతుమండలీ
విశ్రుత వినయాశ్ర మాశ్రయంబు
మధురతర శీల సంవర్ధమాన తరుణ
వృద్ధవారీ నరచ్ఛటా వేష్టితంబు
మఱపునకురాదు 'కావూరు' మామకీన
గాఢతరపుణ్య రుక్సాచి కాణయాచి."
(పఱిగపంట. పుట 66)

ఇది సీతారామమూర్తిగారి పుట్టినయూరి వర్ణనము. ఈ పద్యమును వ్యాసారంభమునం దుదాహరించుటకొక హేతువు కలదు. ఒకనాటి "యభినవతిక్కన", యీ నాటి "తెనుఁగు లెంక"యగు సీతారామమూర్తిగారి కవితా వ్యవసాయమును బరిశీలించి, వారు పండించిన యంబారమునకు వెలకట్టవలయు నన్నచో, నేఁబది యేండ్ల తెనుఁగు మాగాణపుఁ దీరుతెన్నులను, అర్ధ శతాబ్దముపాటు భారతజాతి పోయిన పోకడలను దెలిసికొనవలసియున్నది. అట్లు తెలిసికొనుటకీ పై సీసపద్యము తోడ్పడును. అంతేకాదు. సీతారామమూర్తిగారు—

"దేవుఁడన మాతృదేశము,
దేవతలనఁ బ్రజల, యజ్ఞదీక్ష యనంగా
సేవావ్రత నిష్ఠయు, యివి
జీవన సూత్రములుగాఁ బ్రసిద్ధిం గనుమా !"

యని తెలుఁగు వానికిఁ గఱదలు నేర్పిరి. అట్టిచో సీతారామమూర్తిగారి కవితా వైదుష్యమును దర్శించుటకుముందు వారు పుట్టి పెరిగిన చోటులు, తరతరములనుండి వారియింట పాదుకొన్న యెఱుకకలిమి, సమకాలీన దేశచరిత్ర ప్రబల సాధనములయి సాయముచేయును. ఇట్టి విమర్శను చారిత్రక విమర్శ యందురు. ఈ విమర్శవలనఁ గొన్నిమేళ్ళు, కొన్నికీళ్ళు కలవు. చారిత్రక విమర్శనుగూర్చి మహర్షి యరవిందుఁడు మనోహరముగా చెప్పినాఁడు. ఆ మహర్షి వాక్యములనుదాహరింతుము. "మానవుని మానసము పనిచేయుపద్ధతులను గూర్చిన పరిజ్ఞానమీ విధానముచే నభివృద్ధియగును. అంతేగాని సవిమర్శక కవితావగాహనమునకుమాత్ర మిది సాహాయ్యపడదు. కవియొక్కయు, నాతని కావ్యముల యొక్కయు ప్రాపంచిక ధర్మములను గ్రహించుట కీ విమర్శనముపకరించును. కాని కావ్యప్రభా గౌరవముల గ్రహించుపట్ల నిది యవరోధమనక తప్పదు........ ఒక కావ్యమును ముందు మనము మథించి, దానికవితా వైశిష్ట్యము నవగాహనము గావించికొని, యనంతరము బాహ్యప్రకృతితోడను కావ్యలక్షణములతోడను దానికిఁ గల సంబంధమును, ఆంతరంగిక సాక్ష్యములను బురస్కరించికొని కవి ఆత్మీయతను నిర్ణయించుకొన వలయును. ప్రతి సహృదయ పాఠకుఁడు సహజముగ నిట్లే గావించును. ఇట్లు నిర్ణయించుకొనఁబడిన కవి యాత్మీయతయే మన కత్యంతోపయోగము". (కాళిదాస కవిత. పుటలు 57. 58) కావునఁ జారిత్రక విమర్శవిధానము చేపట్టినవారు పదపదముననేమఱుపాటు వహింపరాదు. సీతారామమూర్తిగారి యాత్మీయతను నిర్ణయించుకొనుటకు, వారి యొక్కయు, వారి కావ్యములయొక్కయు ప్రాపంచిక ధర్మములను గ్రహింపవలె. పిదప నీ పద్ధతికి భరతవాక్యము పాడి వారి కావ్యవైభవమును సమీక్షింపవలె.

సీతారామమూర్తిగారు తలయెగఁగట్టు నాఁటికి భారతదేశ మట్టుడికినట్లుడికి పోవుచున్నది. పరాధీనమగు భారతదేశము దిక్కులు పిక్కటిల్లు నట్లుగా వీరశంఖములొత్తిన రోజులవి. జాతీయోజద్యమ స్పందనమునకు సత్యాహింసలను నాజా నేయములను బూంచి సారథిగానున్న మహాత్ముఁడు సాబర్మతీ యోగి బాపూజీ. ఆ బాపూజీ పాదపద్మములచేఁ బునీతమయి వినయాశ్రమ సంస్థాపనము జరిపించికొన్న యూరు సీతారామమూర్తిగారి యభిజనస్థానము. ఒకసారిగాదు మూఁడుసారులు మహాత్ముని మహాగమనమునకు నోచికొన్నపాటు మాగాణ మాగడ్డ, అట్టి వినయాశ్రమ స్థాపనమునకు విద్యారణ్య మహర్షి వెలసినవారు గొల్లపూఁడి సీతారామశాస్త్రిగారు సంగమ వంశీయులగు హరిహరబుక్కరాయలువలె జతగూడినవారు

తుమ్మల బసవయ్యగారు. ఆ బసవయ్యగారు కర్మయోగి. వీధి లేళుని యట్టివారు. రాజకీయముగా వారు సీతారామమూర్తిగారి గురువులు. తొలినాళ్లలో బసవయ్యగారి ప్రభావము సీతారామమూర్తిగారి మీఁద ననల్పముగా నున్నది. బసవయ్యగారి కర్మక్షేత్రమం దుతికి సీతారామమూర్తిగారు పల్లీ పట్టనములలో బాపూజీ సందేశమును విన్పించిరి. పాలెములు తిరిగి ఖద్దరమ్మిరి. గ్రంథాలయోద్యమమందుఁ బాల్గొని పామరులలో విజ్ఞాన ప్రచారము చేసిరి. బాపూజీ సందేశమునకు రూపకల్పముగా నున్న తిలక్ జాతీయ విద్యాలయమం దాచార్యుఁడై శిష్యులలో దేశాభిమానము మూర్తీభవించునట్లుగాఁ బాటుపడిరి. కోడెగాఁ డయిన సీతారామమూర్తిగారి కవితా సుప్రభాతమున కుదయభాస్కరుఁడుగా నున్న కారణజన్ముఁడు మహాత్ముఁడు.

ఈ సమయమునందే యాంధ్ర రాష్ట్రోద్యమము ముప్పెనవలెఁ దెలుఁగునాటిని ముంచియెత్తు చున్నది. దూరదృష్టిగల మనీషిశేఖరుల యండదండలతో నా యుద్యమ మాబాలగోపాలము సమ్మోతలూగించిన దినములవి. అనాంధ్ర ప్రవృత్తి బలీయమై యాంధ్రక్షేత్రమున స్వైర విహారము చేయుచున్న నాళ్లవి. తెలుఁగు నదుల నీటివలె, యడ్డుపాకలు లేకుండ తెలుఁగువారి తెలివితేటలు సముద్రముపాలఁగుచున్న రోజులవి. సహజముగా సీతారామమూర్తిగారి వేడివేడి చూపులు తెలుఁగువారి బానిసపు హొయలుపై ప్రసరించినవి. తెలుఁగువాఁ డెరుకమాలినవాఁడై, కృతబుద్ధిగాక, పెడ్రకంతలుపట్టి, చెడి చెటాకులలోఁ గలియటను ప్రత్యక్షముగాఁ జూచినవారీ కవిగారు. 'తెలుఁగుదేశము, తెలుఁగుభాష, తెలుఁగు చరిత్ర, తెలుఁగు ప్రజ, తెలుఁగు సంస్కృతి అనినంతనే నా యొడలు పులకరించును. ఇవి నాకు ప్రాణకల్ప విషయములు. "నేను తెలుఁగువాఁడను" అను నహంకారము నా కెక్కువ. ఈ యహంకారమే నన్ను కవిని చేసినది. ఇట్టి నా జాతియు, నా భాషయు పరతంత్రములై పరకీయ సంస్కారము నాశ్రయించి ప్రాచీన గౌరవమును కోల్పోయినవి గదా! ఇది నా మనస్సులో ననుక్షణముగా రేఁగునట్టి యారాటము. ఈ యారాటమునకు నా జీవుఁడు కదలినాఁడు. ఆ కదలికయే రాష్ట్రగానము,' అని సీతారామమూర్తిగారు వ్రాసిరి.

ఈవిధముగా నొకవంక జాతీయోద్యమము, మరొకవంక నాంధ్రరాష్ట్రోద్యమము సీతారామమూర్తిగారిలో నున్న సృష్టికిఁ బ్రధానమయిన రజోగుణమును గిలిగింతలు పెట్టినవి. ఈ సృష్టికి మరొక యుద్బోధకము గూడ నున్నది. అది తండ్రియగు నారయ్య తేజస్సు. నారయ్యగారి సంస్కారమే సీతారామమూర్తిగారిని దిద్ది తీర్చినది. ఆ నారయ్యగా రాధ్యాత్మిక తత్త్వము ముద్దగట్టినవారు. "చదువక యున్న నేమి? బుధసత్తము లుబ్బగ, నర్థభావ సంపద వికసింప భాగవత భారతముల్ వివరించు" ప్రతిభ యిచ్చినవారు. నారయ్యగారి సంస్కారబలమును సీతారామమూర్తిగారే రసవంతముగా వర్ణించిరి.

"నిత్య సత్యాలాప నియతిపై ననురక్తి
చెందినాఁడు, జయంబు నందినాఁడు
పరవిత్తమది విషప్రాయంబ యని విశ్వ
సించినాఁడు, తిరస్కరించినాఁడు
దీనార్తి లోకంబుఁ దిలకించి కన్నీరు
జార్చినాఁ, డండకుఁ జేర్చినాఁడు
మొగమోట దిగఁద్రావి తగవు చెప్పెడి నేర్పు
నేర్చినాఁడు, యశానఁ బేర్చినాఁడు
కష్టమున్ సుఖమున్ దుల్య దృష్టితోడఁ
జూచినాఁ, డొక త్రాసులోఁ దూఁచినాఁడు
నాఁడు నేఁడును బుధులు కొండాడు నడత
నివ్వటిల్లిన నారయ్య కెవ్వరీడు.

"ధర్మజ్యోతి"యందు సెట్టి యీ విధముగా భాషించును.

"కారణజన్ముఁ డాతఁడు, జగమ్మున నా రొక పుచ్చువక్కకై
పారములేని పాపముల పాలగుచుండఁగ, నైదుకట్ల బం
గారము నస్మదీయమును గాచి, శరత్తులు దాచి' రూకయుం
గోరక యిచ్చె, లేమి కనుఁగుంగొడు కైవసివాఁడ్చుచుండియున్.'

ఆ తండ్రి బిడ్డఁడు గాన సీతారామమూర్తిగారు సత్య దయా ధర్మ సచ్ఛీలములనే నమ్మిరి. వారి యీ సంస్కారమును ప్రోదిచేసి వన్నె వెట్టినది బాపూజీ జీవన తత్త్వము.

సీతారామమూర్తిగారి కవిత్వమునకు మరొక ముఖ్యమయిన యాలంబనము గ్రామజీవనము. పల్లెపట్టుల సొగసులు, జానపదుల సరస సంభాషణము లీ కవిని ముగ్ధుని జేసినవి. పారంపర్యముగా వచ్చు వ్యవసాయ వృత్తి నాటికి నేటికి వీరిని లోఁగొన్నది.

"కల్లకపటము లేని పల్లెలో నాఁగలి
దున్నువారు నన్నుఁ గన్నవారు
మడికి నొక్కపూఁట, బడికొక్క పూటగా
దాఁటినాఁడ జిన్నతనము నేను."

అని వారే చెప్పికొన్నారు. ఈ వ్యవసాయమునందు వారికిఁ గల యభిరుచిని స్వదేశాభిమాన మక్షర రూపములో వెలయించుటకుఁ దోడ్పడినది.

## 2

ఏనాఁడు రాష్ట్రోద్యమ జాతీయోద్యమములు సీతారామమూర్తిగారి నాకర్షించినవో, యానాఁడే వారి కవిత వీరరస ప్రధాన మయినది. స్వాతంత్ర్యోద్యమమునకు, వీరరసమునకుఁ బొత్తెక్కువ. ఇతర రసముల కట తావులేదు. నారయ్యగారి తత్త్వముగూడ ధర్మవీరము నాశ్రయించినట్టిదే. ప్రాచీన భారతీయాలంకారికులచే నీ వీరరసము బహుధా ప్రపంచింపఁబడినది. భరతుఁడు త్రివిధ వీరరసములను వివరించినాఁడు. రసగంగాధరకర్త యెనిమిది వీరరస భేదములను బేర్కొనినాఁడు. అచ్యుతరాయలు వీ రందరికంటె నాలుగాకు లెక్కువ చదివినవాఁడు. అతఁడు మొదట వీరరసమును బంద్రెండు తెఱఁగులుగాఁ బేర్కొనినాఁడు. కాని పిదప నా రసమునందు నిరువదియొక్క భేదములను జెప్పినాడు. వీరరస వివేచనము పరిపుష్టముగా నొనర్చిన జి. వి. సుబ్రహ్మణ్యముగారు స్వాతంత్ర్య యశోమాన వీరముల నధికముగాఁ జేర్చిరి. (చూడు. వీరరసము. పుట 101) సీతారామమూర్తిగారి కావ్య ప్రపంచమును సింహావలోకనము చేసినచో నట దయావీరము, ధర్మవీరము, సత్యవీరము, త్యాగవీరము, అహింసావీరము, స్వాతంత్ర్యవీరము, మాన వీరము సాక్షాత్కరించును. దీనినిబట్టి సీతారామమూర్తిగా రచ్యుతరాయల గ్రంథమును ముందుంచుకొని కవిత్వ మల్లినారని నా యభిప్రాయము గాదు. వారి కావ్యావలి సమీక్షింపఁగా నా యెరుక కందిన సత్య మిది. కాటూరి వేంకటేశ్వరరావుగారు పేర్కొనినట్లుగా "ఓరుగల్లులో, పల్నాడులో, విద్యానగరంలో ధ్వజినీనాథులై తెలుగు మాగాణమును తమ రక్తధారలతో తడిపిన రావుతుల వంశంలో బుట్టిన చౌదరిగారి కలము ఎంతసేపూ వీరరసము నాశ్రయిస్తుంది."

బహుజన భోగ్యములయిన రసములు శృంగార వీరమ్ము లని ప్రాచీనుల యభిప్రాయము. అందులకే కాఁబోలు ధీరోదాత్త చరిత్రతోఁ గూడిన నాటకమునందా శృంగారవీరములకే ప్రథమ పట్టము గటిరి. కాని యీ సిద్ధాంతమునకు పూర్వ పక్షము లేదని నికరముగాఁ జెప్పలేము. ఉత్తరరామ చరిత నాటకమును బరిశీలించినచో శృంగారవీరములతోపాటు కరుణరసమునకుఁ గూడ సమస్థాయి కల్పింపవలసి యున్నది. ఉత్తరరామ చరితము నందంగిరసము వీరరస భేద మనువా రున్నారను విషయము వ్యాసకర్తకుఁ దెలియును. తర్కబద్ధమయిన యలంకార శాస్త్రము బుద్ధిని సంతృప్తిపరుపఁ బ్రయత్నించున్న గాని హృదయమునకుఁ బుష్టి కల్పింపఁజాలదు. అందుచేఁ గరుణ మొక్కటే రసమనియు నితర రసములు తద్వికారములే యనియు భవభూతి భాషించుటలో నతిశయోక్తి యున్నదన్నచో నంగీకరింపఁ గలమేమో కాని, సత్యము కొరవడినదని చెప్ప సాహసింపలేము. భవభూతి వాక్కు ప్రగాఢ మనస్తత్త్వ పరిశీలనముతో భాసించునటిది. రసానుభవ కాలమున చిత్తవిద్రుతి కలుగుననుట సర్వజనుల కనుభవైకవేద్యము. అందువలననే కరుణమును శృంగారవీరములతోపాటు సమానముగనే మన్నింపవలసిన యక్కర యున్నది. ఈ దృష్టితో విమర్శించినచో సీతారామమూర్తిగారి కావ్యములందుఁ గరుణము వీరరసమును వెన్నుదన్ని యున్నదని చెప్పక తప్పదు. వారి యాదిమ కావ్యము లనఁదగు ఆత్మార్పణము, బాపూజీ—ఆత్మకథ, రాష్ట్రగానము పరిశీలించినచో వారికిఁ బ్రీతిపాత్రము లయినట్టివి వీరకరుణ రసములే యనియు, తదనంతర కావ్య ప్రపంచమునందు నిండి, నిలఁద్రొక్కుకొన్నది యీ రసద్వయమే యనియుఁ దెలియకపోదు. "కావ్యానికి నాడూ నేడూ శృంగారరసమే ప్రధానాశ్రయం. కవులలో శృంగారమును విడిచినవారూ, విడువక మాట దక్కించుకొన్నవారూ అరుదు. చౌదరిగా రొక్కరే దాని జోలికి వెళ్లకుండా, ఉత్తమ కావ్యములను రచింపగల్గిరి. స్వభావముచేతనే వారు వీరకరుణ రసలుబ్ధులు."

## 3

"అద్భుత నాంధ్రకవి ప్రపంచ నిర్మాత" లలో నటు ఆంగ్లభాషకు, నిటు వంగభాషకు—ముఖ్యముగా రవీంద్రనాథ ఠాగూరునకు—నంతో యింతో ఋణపడిన కవు లెందరో కలరు. ఈనాఁడు మొదటి బంతికిఁ జెందిన యొక్కొక్క కవి మీఁద నొక్కొక్క శక్తి పనిచేసినది. ఆంగ్లసాహితిని మథించి, యా సంస్కారముతో, భారతీయ సాహితీ సంప్రదాయము లను లగించి, కవిత్వ మల్లినవారు కొందరు. వీ రాంగ్ల సాహిత్యమందలి ప్రక్రియా వైవిధ్యమును జూచి, తెలుఁగున నాఁట నూతన ప్రతిష్ఠలు చేసిరి. ఆంగ్లసాహిత్య పఠనమునే పరమావధిగా భావించి, దానిని మించినభాష యీరేడు లోకములలో లేదని యెంచి, యాంగ్లభాషా భావములకుఁ దెనుఁగు దుస్తులు తొడిగి చరితార్థు లయినవారు కొందరు. ఈ సమయమునందే రవీంద్రుని కవితాకాంతులు తెలుఁగునేల నాలుగు చెఱఁగుల వలముకొన్నవి. ఆ యాంగ్లభాషా కవులు, నీ రవీంద్రుఁ డాంధ్రకవుల హృదయాంతరాళములలోఁ బీట వెట్టుకొనిరి. ఇరు

తెగలవారి ధ్వనులు, ప్రతిధ్వనులు తెలుఁగుగడ్డపంయి విరిసినవి. ఆ రెండు భాషాభావములకు లోపడక, సంస్కృత సాహిత్యామృతమునే క్రోలి కవితాగానము గావించిన కవులు గలరు. వారిలో నెన్నఁదగినవారు సీతారామమూర్తిగారు. సీతారామమూర్తిగారి కాంగ్లభాష తెలియదు. ఆ యాంగ్ల భావములు వారి కంతు పట్టలేదు. వారిలో జీర్ణము కాలేదు.

సీతారామమూర్తిగారు సంప్రదాయసిద్ధముగాఁ జదివినవారు. వారి గురువులయినవారు కావూరి శ్రీరాములుగారు, తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు. వీరు సంప్రదాయ మెఱిఁగిన దేశికోత్తములు. ఆంగ్లభాషలో నాలోచించి తెలుఁగులో మాటాడువారు గారు. అందును వేంకటప్పయ్యశాస్త్రిగారు "ఏకశ్లోక రహస్య బోధనముచే" "శిష్యాన్ సుధీ లోకాగ్రేసరుఁ జేయు" మహాపండితుడు. "అద్రి తనయా నాథార్చ నాధీన ధీవాసుఁ"డు. "రామగాథామృతాఖ్యాక గ్రంథమతల్లికా జనకుఁ" డు. సీతారామమూర్తిగారికి "శబ్దశాస్త్రాది లక్షణ సంప్రదాయ మెఱిఁగించినవారు దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు. శాస్త్రిగారి ప్రబోధము చిన్నయసూరిని సీతారామమూర్తిగారి కాత్మ సాహితీ లక్షణ బంధువుగా నొనర్చినది. సారాంశమేమనఁగా సీతారామమూర్తిగారి సంస్కృతాంధ్ర సాహిత్యపఠనము ఎ. బి. సి. డి.లతోఁ బ్రారంభము గాలేదు. వారియూర నాంగ్లభాష బోధించు పాఠశాలలేదు. ఎచటి కయినవెళ్లి వారున్నత పాఠశాలలోఁ బఠింపలేదు. సీతారామమూర్తి గారెఱింగినది చిట్టిగూడూరి సంస్కృత పాఠశాల. వారుపాధ్యాయ వృత్తి స్వీకరించినది జాతీయ విద్యాలయములో. ఆ పాఠశాలలో సంప్రదాయ సిద్ధమయిన చదువు చెప్పెడివారు. ఇందుచే జీవన ప్రారంభదశలో సీతారామమూర్తిగారి మీఁద నాంధ్రతాముద్ర, భారతీయ తేజస్సు మహాశక్తులై ప్రభావము చూపినవి. ఆ శక్తులు దేశీయములు, నిష్కళంకములును. తరువాతవారు గుంటూరుజిల్లాబోర్డు— ఉన్నత పాఠశాలలలో నాంధ్ర పండితులుగాఁ బనిచేసిరి. అప్పటికి వారి హృదయ మన్యభాషా ముద్ర పడవలసిన స్థితినిమించి పరిణతి చెందినది. సీతారామమూర్తిగారు పోయిన పోకడలన్నియు— భాషయనుఁడు, భావములనుఁడు — తెనుఁగుదనముతో నిండియున్నవి. ఇతర భాషా విశారదులతోడి పొత్తునముకూడినను, వారి తెనుఁగుఁదనము మాఱలేదు. జాఱలేదు. అనేక కారణములనుబట్టి వారిలో నది మఱింత బిఱ్ఱబిగిసినది. అందుచేతనే వారికట్టు బొట్టులలో, వడవడికలో, పలుకుబడిలో, కవనములో "జానుఁ దెనుఁగు" ముద్రయే విగ్రహరూపము ధరించి కొట్టవచ్చినట్లు కన్పడును. దైనందిన సంభాషణములలో సైతము వారి పలుకుబడిని గమనించినచో నది సుసంస్కృత చిత్తుఁడగు "ప్రాతఃకాలపు" మానిసిదిగా నుండును.

పై వాక్యములు పఠించినవారు మూర్తిగారొక ఛాందసుఁడేమో యని భావింతురేమో! అదికాదు. ఆయన విద్యాపఠనము, వేషభాషలు సంప్రదాయబద్ధముగా నుండిన నుండుఁ గాక! వారిజీవన సంస్కారము మాత్రము వర్తమాన యుగబద్ధమయినట్టిది. ఏలయన సంస్కార మనునది వ్యక్తి తనశక్తియుక్తులను బట్టి పెంపొందించికొను నట్టిది. పితృమూర్తి ధర్మనిరతి, జాతీయభావము, బాపూజీ తత్త్వము నేకమై మూర్తిగారి సంస్కారమును పెంచినవి. అనఁగా భారతీయ సంస్కారము పురాణరూపములోఁగాక, వర్తమాన రూపములో సీతారామమూర్తిగారిలోఁ గన్పడునన్నమాట. హేతువాదమునకు, సత్యదృష్టికి, బాపూజీ ప్రసాదించిన సాంఘిక ధర్మమునకు జాతీయ భావమునకు నందని సిద్ధాంతపుబులుగాని, తత్ప్రదేశముగాని వారిజీవన సంస్కృతిలో మచ్చునకయినఁ గానరావు. ఈ శతాబ్ద ప్రారంభమునుండి భారతజాతి సంస్కృతి యుగానుకూలంగా నెట్లు పెరిగినదో, యట్లే సీతారామమూర్తిగారి జీవన సంస్కృతికూడఁ బెరిగినది. వారిజీవన తత్త్వము ప్రగతిశీలముకలది. జాతీయభావమునకు దర్పణమయినట్టిది. అందుచేతనే వారికవితా భాండాగారములో నవీన యుగభావరూపమును నామమాత్రముగా సంతరించికొన్న, యభారతీయ లక్షణ గ్రంథములుగాని, స్మృతులుగాని, పురాణములుగాని కన్పట్టవు. నుఱి కన్పడునట్టివి గాంధీయుగతత్త్వ సందేశ కావ్యములే. ఆంధ్ర జాత్యభ్యుదయగానములే. సర్వోదయశాస్త్ర గ్రంథములే. సీతారామమూర్తిగారికి నుద్దీప్తి కల్గించినవి యభారతీయ భాషామత సంస్కృతులుగావు. సనాతన ధర్మమునుగాదు. హైందవమతమునుగాదు. వారి నుత్తేజపఱిచినట్టిది నవీనకాలము నందొక భాగమయిన గాంధీయుగము. గాంధీ ధర్మమే వర్తమాన యుగధర్మము. అదే స్వచ్ఛ భారతీయ సంస్కృతికి దర్పణమై, భిన్నత్వములో నేకత్వమును జూపునట్టిది. వర్తమాన యుగధర్మముపై ప్రాచీనయుగ ధర్మచ్ఛాయలుండిన నుండవచ్చును గాక! కాని సనాతన ధర్మమే వర్తమాన యుగధర్మముకాదు. కారాదుగూడ.

వర్తమాన యుగధర్మమును వలచినవారు కావుననే సీతారామమూర్తిగారీ యుగమున కనుకూలముగా వ్రాయఁ గల్గిరి. ఇక్కడే పరోక్షముగా సాహిత్యప్రక్రియలకు సంబంధించినంతవఱకు వారిపై నాంగ్లభాష పనిచేసినది. దీనినొక కొంత వివరింపవలసి యున్నది. ఆంగ్లసాహితీ ప్రభావమువలన నవీ

నాంధ్ర సాహిత్యమెన్నో గడుసుపోకడలు పోయినది. ఈ పోకడలను జూచి, కంటగించికొని, భారతీయములని నిరసించి, వెక్కిరించి, తృప్తిపడువారిమాట యటుండనిండు ప్రాచీనాంధ్ర సాహిత్యమునకు దేవభాషవలన నెన్ని వన్నెచిన్నెలు చేకూరినవో, యట్లే నవీనాంధ్ర సాహిత్యమునకు నాంగ్లభాషవలన తత్త్వమునకు సంబంధించినంతవఱకు మహోపకారముజరిగినది. ఇది కాదనరాని సత్యము. సత్యముపై నమ్మకకలవారిమాట. భాషామోహముపెరిగి, స్వభాషా సంప్రదాయములనుజ్జగించి వికారములకు లోనయిన వారీనాఁడేకాదు, ఆనాఁడునున్నారను మాటఁ మనమేనాఁడు మఱువరాదు. ఆంగ్లసాహిత్య ప్రభావమువలనఁ కావ్యపరిమితి, కావ్య ప్రారంభము, నాయికా నాయకు, లితివృత్తము మున్నగువానికి సంబంధించినంతవఱకు నెన్నో యుత్తమ పరిణామాలు కల్గినవి. ప్రాచీన భారతీయాలంకారికుల నియమ నిబంధనలు తిరస్కరింపఁ బడినవి. ఒకనాఁడు రసాభాసకుఁ దార్కాణముగానున్న నాయికా నాయకుల గాథలు గానముచేయఁ బడిన వీనాఁడు చరిత్రను సృష్టించిన వీరుల దేశభక్తులగాథ లుపాదేయము లయినవి. ధనంజయుఁడు చెప్పినట్లుగా, నితివృత్తము రమ్యముగావచ్చు జుగుప్సితముగావచ్చు, ఉదారముగా వచ్చు, నీచముగావచ్చు, నేదయినసరియే యీ నాఁటి కవులచే భావ్యమాన మయినది. మహాకావ్య నిర్మాణము మందగించినది. ఖండకావ్యములు శరపరంపరగా బయల్వెడలినవి. ఈ యుగమ్ము ఖండకావ్య యుగమయినది. పరిమిత కథతో లఘుకావ్యము వెల్లుట యీనాఁటి కవులకొక పరిపాటి యయినది. ఆత్మాశ్రయ పరాశ్రయ కవిత్వములు, జాతీయభావ కవిత్వముమున్నగు కవితాభేదములు పొడసూపినవి. వచన పద్యము మున్నగునూతన ప్రక్రియల ప్రయోగములు చేయఁబడినవి. భావములలో, నా భావముల వ్యక్తీకరించు ఛందస్సులో, భాషలో, నాభాషా కారకములో నింతింతరాని మార్పువచ్చింది. ఈ విధముగా వచ్చిన మార్పులకు నుపాధులను దేవభాషయందుఁ జూపింతురు భారతీయ సాహితీ పరమాభిమానులు కొందఱు. కాని నవీన సాహిత్యగతిని దర్శించినచో వారివాక్కులు సత్యమును గాక ప్రగాఢాభిమానమును జాటుచున్నవని తెలియును.

## 4

సీతారామమూర్తిగారు కేవలము పద్యకవి. వారితర సాహిత్య ప్రక్రియల జోలికిఁబోలేదు. ఆయన రచించిన కావ్యములు పది. ఆ పదింటి రచనాక్రమిట్లుండును. (1) ఆత్మార్పణము. (2) బాపూజీ—ఆత్మకథ (ప్రథమభాగము) (3) రాష్ట్ర గానము (4) ధర్మజ్యోతి (5) పఱిగపంట (6) ఉదయగానము (7) శబల (8) సర్వోదయగానము. (9) గీతాంగణము. (10) తెనుఁగునీతి. స్వాతంత్ర్యావతరణమునకుఁ బిదప బాపూజీ—ఆత్మకథ శేషభాగములతోఁ గూడి సమగ్ర సుందరముగా మహావీర కావ్యమై వెలసినది . సీతారామమూర్తిగారు "పెద్దకాఁపు" అనునొక ఖండకావ్యమును రచించిరి. బాపూజీ నిర్యాణ సందర్భమున "అమరజ్యోతి" యను లఘుకావ్యము నిర్మించిరి. కనకాభిషేకము, గజారోహణము, గండపెండారమొసఁగుట మున్నగు మన్నలలు గావింపఁబడిన సన్మానసందర్భమున "తపస్సిద్ధి" యను లఘుకృతినిబాడి కృతజ్ఞతను బ్రకటించిరి. పిదప నీమూఁడు కావ్యములను "పఱిగపంట"లోఁ జేర్చిరి.

పై కావ్యములలో ఆత్మార్పణము, ధర్మజ్యోతి, సర్వోదయగానము లఘుకావ్యములు. రాష్ట్రగానము, ఉదయగానము ఆంధ్రజాతీయ భావోద్దీపకములు. పఱిగపంట, శబల్య ఖండకావ్యములు. బాపూజీ రచించిన స్వీయకథకు "సత్యప్రయోగ చరితము"నకు, వేలూరి శివరామశాస్త్రిగారి యాంధ్ర వచనానువాదమునకుఁ బద్య సర్గమయినట్టిది "బాపూజీ—ఆత్మకథ." గీతాంగణము బాపూజీ హృదయమును సమ్మోహపరిచిన భగవద్గీతా శ్లోకముల కనువాదము. తెనుఁగునీతి భర్తృహరి సుభాషిత త్రిశతి యందలి నీతిశతకమున కనువాదము.

లఘుకావ్యములలో నాయకులు దయయెట్టిదో తెలియని బోయఁడు, సత్యధర్మములను త్రికరణశుద్ధిగా విశ్వసించిన నారయ గారు, సర్వోదయ పథము వలచిన వినోబాభావే. రాష్ట్ర గానోదయ గానములలో నేఁబదియేండ్ల నవయుగాంధ్ర చరిత్ర పాడఁబడినది. ఆంధ్రరాష్ట్రసిద్ధికి మిత్రామిత్రులగు వారు మూర్తిగారి పొగడికలకు తెగడికలకుఁ బాత్రులయిరి. అనాంధ్రధర్మము తిరస్కరింపఁబడినది. రాష్ట్రోదయానంతరము సర్వసుఖమునకుఁగాక స్వార్థమునకు దేశాభిమానమునకుఁగాక కులప్రాంతాది భావములకు దాసుఁడయినతెలుఁగు వాఁడు విమర్శనీయుఁ డయినాఁడు. భాషాసిద్ధాంతములు తెనుఁగుతీపి వివరింపఁ బడినవి. అధికారదాహము, ధనతృష్ణామదాంధత లీసడింపఁబడినవి. రెండు కావ్యములలో సూత్రప్రాయముగా సత్యవిచారమున్నది. ఖండకావ్యములలో స్వాతంత్ర్యేచ్ఛ యధికము. చారిత్రక గాథల స్వీకరించి స్వాతంత్ర్య ప్రబోధమొనర్చిన ఘట్టములుగలవు. నవనాగరికతా ప్రభావఫలముగా జాతి యలవఱచుకొన్న యధర్మఖండనము గలదు. ఆంధ్ర రాష్ట్రమునకు, నాంధ్ర సంఘమునకు సేవచేసిన, తృణమో పణమో సమర్పించిన నాయకుల, కవుల, త్యాగుల ప్రశంసలున్నవి. తనకు మేలొనర్చిన వారికిఁ గృతజ్ఞత ప్రకటించుట లున్నవి. కృషీవలుని జీవనసరణి కవితావస్తువయినది. రైతుల పని పాటులు వర్ణింపఁబడినవి. ఉపాధ్యాయవృత్తిలో నార్జించిన యనుభవమునుబట్టి వ్రాసిన పద్యములున్నవి. ఇట్టి కవితాఖండము లాత్మాశ్రయ కవిత్వమున కుదాహరణము లనఁదగును. ఇంతయేల ? గతించిన యర్ధశతాబ్దమునందు సర్వభారత జాతి, సమస్తాంధ్రజాతి యెదుర్కొనిన సమస్యలవంచి పెబ్బరలు ఖండకావ్యముల కితివృత్తమయినవి. అన్ని చర్చలకు

మూలపీఠము బాపూజీ ప్రతిపాదించిన తాత్త్విక చింతనమే. వయస్సు పెరిగినకొలది మానవునిలో నంతర్ముఖ దృష్టి ప్రబలును. దేశకాలావధులను దిరస్కరించిన మానవజీవన తత్త్వవిచారము చెలరేఁగును. సీతారామమూర్తిగారు చేసిన భగవద్గీతా నీతి శతకాను వాదములు, జీవన సంస్కృతి పరిపక్వమై, యాంతరంగిక శోధన మెక్కువయినవేళలో బహిర్గతము లయినట్టివి.

ఆత్మార్పణములోఁ గపోతములు బలియై బోయని జ్ఞానిని జేసినవి. ధర్మజ్యోతిలోఁ దండ్రి నారయ్యగారు నిజమునకుఁ గట్టువడి పదివీసెల యితరుల బంగారమును దాచి, వా రడిగిననాఁడు ముద్దరసుద్దిగా నప్పగించుటయే కథగాఁ జెప్పఁబడినది. ఈ కావ్యములలో సత్యదయాత్యాగ ధర్మవీరములు కరుణము రసములు. సర్వోదయ గానములో అహింసా త్యాగవీరములు ప్రధానములు. సర్వోదయ సిద్ధాంతగాథ, వినోబా భావే యుపదేశము విని పులకితులై పిన్నలు, పెద్దలు నొనర్చిన త్యాగగాథలా కావ్యములో వర్ణింపఁబడినవి. తదితర కావ్యములలో—గీతాంగణము, తెనుగునీతి వీడిన—స్వాతంత్ర్య యశోమాన వీరములు రసములు.

ఈ ప్రక్రియాస్పృష్టి హేతువు ప్రత్యక్షాంగ్ల కావ్య పఠనముగాదు. నవీనాంధ్ర సాహిత్యములో ననేక విధములుగాఁ దలయెత్తుచున్న, ప్రక్రియా సంబంధమయిన పరిణామమును దూరముగా నుండి గుర్తించి, యుగానుకూల్యమును భజించి, యా మార్గమునఁ బోవుట. ఇట్లు పోవుటకు సీతారామమూర్తిగారి నమితముగా నాకర్షించిన జాతీయభావము బాపూజీ సిద్ధాంతములు దోహదము చేసినవి. మూర్తిగారు త్రికరణశుద్ధిగా వలచిన, సంపాదించిన ఈ జీవన సంస్కృతి నంతటెని తెనుఁగుదనము వీడని, సడలని పలుకులో వెలయించిరి.

## 5

సీతారామమూర్తిగారి కవితామార్గము తిక్కన సోమయాజుల మహాభారతము నాశ్రయించి నట్టిది. వారుపయోగించు శబ్దము చిన్నయసూరి యంగీకరించినట్టిది. కవిత్రయమువారి ముద్ర గలట్టిది. వారు బ్రతుకులోఁ జవిచూచిన సాధుమార్గమునే, నిష్ఠనే శాబ్దికముగఁ గూడ నాచరణయం దుంచిరి. తన కవితా పద్ధతిని గూర్చి వారు పల్కిన యీ పద్యములను వినుఁడు.

తెలుఁగునకు స్వస్తి చెప్పిన
తెలుఁగు కవిత్వంబు వల్కఁదియ్యయు నాకున్
గలుగద, మా తిక్కన య
జ్వలు ద్రొక్కిన త్రోవకేను సమ్మతి పడెదన్.

మోసులెత్తిన వేలుపుం బాసమీఁది
తగులమునఁ జేసి తెల్గును దెగడువారు
వ్రాయుదురుగాక తెలుఁగు కావ్యమ్ము లినుప
సుద్దలే కాని యవి లడ్డుముద్ద లగునె.

దీనినిబట్టి సీతారామమూర్తిగారికి సంస్కృత మన్న గిట్టదని యనుకొనరాదు. వారి కవనములో సంస్కృత సమాస బంధురము లగు పట్టు లనేకములు గలవు. ప్రకరణోచితముగా సంస్కృతమును సమాదరింపవలయుననునదే వారి యాశయము. కానిచో నీ పద్యమేల చెప్పెదరు ?

జీడిపప్పు వలయు జేజేల బాసయు
వలయుఁ బాసెమునకుఁ దెలుఁగునకును
తూలి తూలి దేని పాలు హెచ్చించిన
రుచు లడంగి రెంట రోఁతపుట్టు.

ఇది సీతారామమూర్తిగారి తీర్పు. వారి కవితామార్గమును రచనా సౌందర్యమును వివరించుటకుఁ దత్సమకాలీనులగు నిరువురు ప్రతిభాసంపన్నుల యభిప్రాయముల నుట్టంకింతును. ఆ యిరువురిలో నొకరు నవీనాంధ్ర విమర్శ పితామహుఁడగు కట్టమంచి రామలింగారెడ్డిగారు. మఱొకరు మహాకవి కాటూరి వేంకటేశ్వరరావుగారు. "బాపూజీ—ఆత్మకథ" పఠించి పరవశించినవారు రామలింగారెడ్డిగారు. సీతారామమూర్తిగారు రెడ్డిగారికి "బాపూజీ—ఆత్మకథ" నభిప్రాయార్థము పంపనేలేదు. రామలింగారెడ్డిగారు దైవవశమున నా మహావీర కావ్యమును బఠించి ముగ్ధులై "యనివార్యమయిన స్వేచ్ఛమై" యయాచితముగాఁ దమ యభిప్రాయమును బంపిరి. అది రెడ్డిగారి రాసిక్యమునకు నౌదార్యమునకు గుర్తు. సీతారామమూర్తిగారి జీవనములో నొక మధుర ఘట్ట మది. కాటూరి వేంకటేశ్వరరావుగారు "పరిఁగ పంట" కుఁ బీఠిక వ్రాసిరి.

"తమచే రచియింపఁబడిన "ఆత్మకథ" ను జదివి ఆశ్చర్యమును, ఆనందమును జెందితిని. విషయము గాంధీమహాత్ముని స్వీయచరిత్రము. లోకారాధ్యమయినది. సర్వ జనాదరణీయమును సేవ్యమును. తమ శైలి యించుమించు మహాభారత ప్రతిబింబము. ఇంతకంటె నెక్కువగా జెప్పుటకు సాధ్యమును గాదు. అవసరమును లే" దని యన్నారు రామలింగారెడ్డిగారు.

"ఆంగ్ల సాహిత్య సంపర్కంవల్ల మన కావ్య ప్రక్రియలలో నెన్నో మార్పులు వచ్చినవి. రవీంద్ర మహాకవి మర్యాదలు కూడా మనం అలవరచుకున్నాము. వీనితోపాటు హిందూస్థానీ నడకలు గూడా నేర్చుకొంటున్నది మన సాహిత్యం. నేటి కవులలో ఈ మూడు ప్రవాహాలనూ తప్పించుకున్నవారు నూటికి నలుగురు కూడా తేలరు. చౌదరిగారి కవితయం దట్టి సాంకర్యము మందునకయినా దొరకదు. భావనలో భావా విష్కరణంలో వాక్య విన్యాసంలో ఆంధ్ర సాంప్రదాయం మూర్తీభవించి ఉంటుంది. పదబంధమేమి, సాఫుసంతన లేమి పూర్వ మహాకవులను తలపిస్తూ, పులుముడూ, అన్వయ క్లిష్టతా, వెలితీ లేక సర్వాంగసుందరమయిన చౌదరిగారి కవిత్వం చదువుతూ ఉంటే ప్రాణాలు లేచివస్తవి. పద్య కావ్యములలో ఎడనెడ వారు రచియించే వచనములు సాక్షాత్తూ తిక్కన నోట్లో నుంచి పూడిపడినట్లుండును. ధర్మజ్యోతియందు చౌదరిగారొక మహాక్కర రచియించారు. నన్నపార్యునికి బిమ్మట మళ్ళా

అంత చక్కగా అక్కరను రచియించినవారు లేరు. సంప్రదాయ పిద్ధమయిన భాషా మర్యాదలందు చౌదరిగారికుండే ప్రీతియే నవీనులచే నిరసింపబడే చిన్నయసూరిని ప్రశంసింపజేసినది· తెలుగు కారకము చెడకుండా వాక్యరచన చేయడం వీరేశలింగము పంతులు మొదలుకొని నేటివరకు గద్యరచన చేస్తున్న వారిలో ఒక్క చౌదరి గారికే తెలుసును ..... తెనుగు నుడి కారపు సొంపు చౌదరిగా రెరిగినంతగా ఇతరు లెరుగరేమో. వేమన్నను, తిక్కన్నను గూడా మరపిస్తూ ఉంటవి వారి తెలుగు పోకడలు'' అని యన్నారు కాటూరి వేంకటేశ్వరరావుగారు. ఒక తెలుఁగు కవి మరొక తెలుఁగుకవి కావ్యాలిని సమీక్షించుచు నీ రీతిఁగా బ్రశంసించుట యీ వ్యాసకర్త యనుభవమునకు రాలేదు. మన గడ్డ తీరేమో కాని యొక తెలుఁగుకవి సాటి కవి వ్రాసిన కావ్యములను మెచ్చఁడు గదా! మెచ్చికొనక పోవుట యట్లుండనిండు. శిష్యులచే దిట్టింపకుండ మిన్న కుండఁడు గదా! రాజకీయములకు, వర్గములకుఁ బ్రాముఖ్యము గల్గు నీ దుష్కాలములో వేంకటేశ్వరరావుగారి సమీక్ష సీతా రామమూర్తిగారి కావ్య సత్యములను జాటుటయే గాక వారి సౌజన్యమును గూడఁ బ్రకటించుచున్నది. అట్టి యుదార విశాల దృక్పథముతో సీతారామమూర్తిగారి కావ్యములను జది విన పిదప వేంకటేశ్వరరావుగారి సమీక్షలో నతిశయోక్తు లున్న వని వచించుట దుస్సాధ్యమే యగును.

## 6

చిన్నయసూరికి నచ్చిన పదమునే సీతారామమూర్తిగారు స్వీకరింతురని చెప్పినాఁడను. ఈనాఁడు చిన్నయసూరి బాలవ్యాకరణమును గూర్చి బహు విపరీతాభిప్రాయములు సాహితీలోకమున వ్యాపించియున్నవి. ఒక పక్షమువారు చిన్నయసూరి యాంధ్రభాషకుఁ జేసిన ద్రోహము వాకొనరానిదని వాయెత్తి యరతురు. రెండవకోపు పట్టినవారు సూరిగారు లేకపోయినచో నీ యాంధ్రభాష యకాల గ్రామ్య ప్రళయముపా లయ్యెడిదని నొక్కి వక్కాణింతురు. ఇరు తెగలవారు చిన్నయసూరి వ్యాకరణ రచనా పద్ధతిని విస్మరించి, నేలవిడిచి సాము చేయుదురు. ద్వివిధ మార్గానుయాయులు రాగద్వేషములనుబట్టి యొక కొన్ని సూత్రములను నిర్మించికొని, యా సూత్రములను బాల వ్యాకరణమున కన్వయించి చిన్నయసూరిగారికి వెలకట్టుట కుపక్రమింతురు. ఈ వెలకట్టుటలో సత్యము తప్ప మిగిలిన యనుచిత తత్త్వము లన్నియుఁ గొలువుండును. ఏది ఏమయిన నొక్క విషయమును మాత్రము మనము విస్మరింపరాదు—అది సూరి యాంధ్రభాష కొనర్చిన సేవ. తన వ్యాకరణ మెట్టిదో యాయనయే స్పష్టముగాఁ జెప్పినాఁడు.

దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు ల
క్షణము; గానఁ బూర్వ కవుల లక్ష్య
ములను, లాతి లక్ష్యములఁ గాంచి, తక్కుల
క్షణ మెఱింగికొనఁడు చతురమతులు.

కాన తన వ్యాకరణమే త్రికాలాబాధితమని చిన్నయసూరి తలంచ లేదు. అట్లు తలంచినవారు వారి మార్గానుయాయులు. చిన్నయసూరి మార్గ పద్ధతి తెలిసియో, లేక తెలిసియు నైచ్చికముగా విస్మరించియో, బాలవ్యాకరణముపైఁ గచ్చు పూని తుదకు వ్యాకరణమునకే యెసరు పెట్టవలయునని కేకలు గొట్టినవారు, చిన్నయసూరి విమర్శకులు. ఇందుచే భాషాభివృద్ధి కుపయోగపడవలసిన లావును, జేవను వితండా వాదములకు బలివెట్టుచున్నా రిరుకోవులవారు. ఇది తగదు.

చిన్నయసూరి చేపట్టినది పాణిన్యాదుల సిద్ధాంత పద్ధతి. ఆయన మార్గము ప్రభునమ్మితము. కవిత్రయ భారత భాషకుఁ—ముఖ్యముగా నన్నయ భారత భాషకుఁ—బ్రముఖ స్థాన మొసఁగి చిన్నయసూరి బాలవ్యాకరణము రచించెనని వేత్త లందురు. ఒక కొన్ని చోట్ల సూరిగారు పెద్దన ప్రయోగమును బహూకరించుటయు, రాయలవారి ప్రయోగములకు సమ్మత పడకుండుటయు సంభవించినది. కాని చిన్నయసూరి సాధింపక వీడిన ప్రయోగములను భారతమునందు గుర్తించిరి ప్రాజ్ఞులయిన సత్యారాధకులు. భారత ప్రయోగముల మాట యటుండనిండు. చిన్నయసూరి యుపయోగించిన పదము, నొకదానిని దార్కాణముగాఁ దీసికొందము. ''కొన్ని లక్షణ గ్రంథముల పేళ్లు మాత్ర మిప్పుడు వినఁబడుచున్నవి'' యనునది సూరిగారు బాలవ్యాకరణ పీఠికలో వ్రాసిన వాక్యము. ఈ వాక్య మెవరో వ్యాపారదృష్టి బలిసిన పుస్తక ప్రచురణ సంస్థవారు తప్పుల తక్కెడగా ముద్రించిన బాలవ్యాకరణ పీఠికలోనిది గాదు. పరవస్తు—అలమేలమ్మగారు ప్రకటించిన బాలవ్యాకరణ పీఠికయందలిది. ''పేళ్లు'' అను ప్రయోగము బాలవ్యాకరణము ప్రకార మసాధువు. మరి చిన్నయసూరియే దానిని బ్రయోగించినాఁడు గదా! ఈ రూపమును బహూకరింపవలయునా? నిరాకరింపవలయునా?

చెప్పవచ్చిన దేమనఁగా బాలవ్యాకరణము సమగ్రము గాదని చిన్నయసూరికే తెలియును. తెలియనిది మనకు. ఆంధ్ర కావ్యభాష మహాభారత రచనానంతరము పరిణామము సెందకుండ నిలిచిపోలేదు. అది యెన్నో మార్పులు పొందినది. ఆ మార్పులు బాలవ్యాకరణము సూపనంత మాత్రాన నసాధువులు గావు. కారాదు. సందర్భోచితముగాఁ గావ్యభాషా పరిణామమును గుర్తించి సూరి సూత్రములకు వార్త్తికములను రచించి కొనుట యుత్తమ పద్ధతి. పరిపుష్టముగా నా పని చేయగలవారు చిన్నయసూరికిఁ దీటయినవారు ముందునకు రాలేక పోవుట తెలుఁగువారి దురదృష్టము. జరుగవలసిన పని యిట్లుండగా విభిన్న భాషావాదముల నన్నిటి నొక గాటు గట్టి, చిన్నయసూరిని దూర్పారఁబట్టి, వ్యాకరణమునకుఁ దిలోదకము లిచ్చుట యెలుకనుబట్టి యిల్లు గాల్చికొనుటయే. అది యభ్యుదయ లక్షణము గాదు. సంప్రదాయము పేర, నవీన యుగ ధర్మముపేర బంధనమును, స్వైర విహారమును బిగించుట రెచ్చగొట్టుట లగ్గు చేకూర్పవు.

సీతారామమూర్తిగారు తన కావ్యభాషను గూర్చి యీవిధముగాఁ జెప్పిరి.

నన్నయ తిక్కన యెఱ్ఱిన
మున్నగు నాచార్యకవుల ముద్ర వడని ప
ల్కెన్నఁడు మెచ్చను, వాలోఁ
జిన్నయ కొల్వున్నవాఁడు జీవాత్మవలెన్.

మిగిలిన లక్షణమార్య
వ్యవహారంబుల నెఱుంగ నగునని విద్వ
త్ప్రవరుఁడు చిన్నయ సెప్పుట
తవునని భావింతుఁ గొన్ని తావులయందున్.

కావలె, మఱొక్కు మని యాదికవియు, సోమ
యాజియును బల్కు, వీనిఁ జిన్నయ్య తీర్పు
తడవ లేదని కాదాడఁ దగునె మనకు
లక్షణమహో ! మహాకవి లక్ష్యమేని.

సీతారామమూర్తిగారి శైలి యాంధ్రమహాభారతమునకుఁ బ్రతిబింబమని రామలింగారెడ్డిగారి నిర్ణయము. కవిత్రయ కృత గ్రంథములలోఁ బ్రతిబింబించిన తత్త్వము సీతారామమూర్తిగారిని మిగుల నాకర్షించినది. ఆ ముగ్గురు కవుల పవిత్ర దృష్టి ననేక విధములుగా నలవరుచుకొంటకు వారు శ్రమించిరి. ఆ శ్రమలో నొక యంగము పదప్రయోగము. పదప్రయోగమునందు కవిత్రయమువారి లక్ష్యశుద్ధి సీతారామమూర్తిగారికి నచ్చినదనుమాట నిజమే. కాని వారిని లోఁగొన్న కవితా మార్గము తిక్కనదే. తిక్కన భాషలో భావ వ్యక్తీకరణములో దెనుఁగుఁదన మధికము. దానిని బాటింపఁ బాటుపడి నలుగురచేతనేననిపించుకొన్నవారు సీతారామమూర్తిగారు. ఆ భారత కవుల భాషకు నొక కట్టుబా టున్నది. ఒక ప్రత్యేక కారక వైచిత్రి యున్నది. ఆ కవిత్రయమువారి లక్ష్య పద్ధతిని బోయి పదప్రయోగము చేయుట యుత్తమ సంస్కార మగునని సీతారామమూర్తిగారి యభిప్రాయము. దీనినిబట్టి భావములను భారతకవుల భాషలోనే వ్యక్తీకరింపవలయు ననునదే సీతారామమూర్తిగారి యాశయమని యనుకొనరాదు. భారత కవులు—అందును దిక్కన— తమ భాషకే వన్నె చిన్నె లొసంగి తెనుఁగుదనము మొక్కవోకుండ, దాని నేవిధముగా నుపయోగించిరో యదేవిధముగాఁ బదప్రయోగము చేయఁ బ్రయత్నింపవలయునని — ప్రయత్నించితినని — సీతారామమూర్తిగారి తలంపు. ఇది వారి ప్రత్యేక భాషా సిద్ధాంతమనియే చెప్పవలయును. మరి వారు సమకాలీన భాషకు గౌరవము కల్పించిరా ? యను నదొక ప్రశ్న. కల్పించిరనియే సమాధానము. ఆ కల్పించుటలో—బహు వారములు తిక్కన మహాభారతమును బఠించి, తద్గత శైలీ సౌందర్య విశేషములను జీర్ణము చేసుకొనుటవలన నబ్బిన—సోమయాజుల కవితాముద్ర ప్రబలముగా నున్నది. ఆ ముద్రయే సీతారామమూర్తిగారిని అభినవ తిక్కనను జేసినది.

చిన్నయసూరిని ప్రామాణికునిగా నెంచిరి సీతారామమూర్తిగారు. ఐనప్పటికి సూరి సాధింపని కవిత్రయ ప్రయోగములను దదితర ప్రామాణిక కవుల ప్రయోగములు నెడనెడ వారు స్వీకరించిరి. వారే ప్రయోగములను జేసినప్పటికి విచ్చలవిడితనము వారి కావ్యములలోఁ గానరాదు. నియమ నిష్ఠలతో గూడి తెనుఁగుభాషా కారకము, తెనుఁగు నుడికారము కగ్గని మ్రగ్గని భాష వారి భాష. అట్టి, వారి భాషను జూచియే "బహుమార్గముల రచనా సంస్కారణాభి నివేశములతోఁ బరుగులు వారుచున్న వర్తమానాంధ్రకవివర్యుల కులములలో శ్రీ సీతారామమూర్తి చౌదరిగారు సంప్రదాయ రక్షణాభి నివిష్టులై మడిగట్టుకొని కూర్చున్న శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మణు" లని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రవచించిరనుకొందును.

ఇది సీతారామమూర్తిగారి కవితా ప్రపంచముయొక్క స్థూలమయిన పరామర్శ. ఆ కవితా ప్రపంచములో రెండు ముఖ్య లక్షణములు—సీతారామమూర్తిగారిని తదితర కవుల నుండి వేర్పరించినట్టివి—కలవని తెలియును. సీతారామమూర్తిగారి కావ్యముల కుద్బోధకములు, కారణములు నయినట్టివి జాతీయభావము, దేశహితైకదృష్టి, గాంధీ ధర్మము, సత్య దయాశౌచశీల సంరక్షణము. వారి కవితాభాషాపద్ధతి కవిత్రయ ముద్రతోఁ గూడి పురోగమించునట్టిది. అందువలననే వారీవిధముగాఁ జెప్పుకొన్నారు.

"కళకళాఱకే కవిత్వమని గంతులు వేయక, రోఁతరోఁతగా
వలపులు నింపి కబ్బములు వ్రాయక, విశ్వజనీన బోధ్యతా
లలిత, ముదార వృత్తము, కలా కమనీయము' సంస్కృతి ప్రభా
మిళితమునైన సృష్టి నెద మెచ్చితి, జాతికిఁ గానుక లిచ్చితిన్."

అట్టి సృష్టిలో నాదిమ కావ్యమయిన యాత్మార్పణమును ముందుగాఁ బ్రకటించి, తెలుఁగువారి కెఱుక పఱచినట్టిది "భారతి".

# కన్నుల వెలుగు

## శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

ఆటం బాంబులూ, ఏరోప్లేన్లూ, రాకెట్లూ, స్ప్రింక్లర్లూ—వింత శబ్దాలతో గగ్గోలుగావుంది వాతావరణం .....

దీపావళి రోజున తెల్లవారకముందే అభ్యంగనస్నానం చేసి విజయకుమార్ మేడమీద గదిలోకూర్చుని డిటెక్టివ్ నవల చదువుతున్నాడు. ఆఫీసుకాగితాలు, స్నేహితులు, భార్య ధర్మవేణి, డిటెక్టివ్ నవలలు— రోజంతా ఇలా ఏదోవిధంగా మనస్సుని క్షణం ఊరుకోనివ్వకుండా, అంటే అది ఏకాంతంగా వుండే అవకాశంలేకుండా, కాలంగడపటం అలవాటు చేసుకుంటు న్నాడు విజయకుమార్. ఏకాంతంగా వుండటమంటే ఆలోచించటం; ఆలోచిస్తే, అసంతృప్తి, హృదయంలో బాధ, గుర్తుకు తెచ్చుకో వటమే. అందువల్ల ఆలోచనకు అవకాశంలేకుండా మనస్సుని ఏదో వ్యాసంగంలో, ఒక పరుగులో ఉంచుతున్నాడు. డిటెక్టివ్ నవలలు తప్ప ఇంకోరకం పుస్తకాలైతే అవి ఆలోచనను ప్రేరేపిస్తాయని అతని భయం....

ధర్మవేణి పళ్లెంలో ఫలహారమూ, పాట్‌తో కాఫీ పట్టు కొచ్చింది. పుస్తకం ఒక ప్రక్కన పెడుతూ "నువ్వు తీసు కున్నావా?" అన్నాడు విజయ్.

"మీరు కానివ్వండి"

"నువ్వూతీసుకో ఇక్కడే .... నాకెందుకిదంతా ? కాఫీ చాలు." విజయ్ కాఫీపాట్‌వైపు చేయిచాస్తుంటే, ధర్మవేణి తనే పాట్ తీసుకొని కప్పులో కాఫీపోసింది.

"అదేమిటి ఈ చీరకట్టుకున్నావ్ ? ఇవాళ్టికంటూ కొన్నది, ఎప్పుడు— సాయంత్రం— కట్టుకుంటావా ?"

"ఏది కట్టుకుంటే ఏం ? నాకిదే బాగుంది."

"ఇది ఉగాదికి కొన్నదికదూ !"

"మీకు జ్ఞాపకాలు బాగా ఉంటాయి."

"ఉండవ్‌మరి ! ఒక్కొక్కసారి ఒక మరుపురాని రసవత్తర ఘట్టం జరుగుతూంటే !"

"మీరు వన్నేమీ అనక్కరలేదు, పండుగపూట."

"సరే, వెళ్లి దీపావళికోసం కొన్నచీర దీపావళినాడుకట్టుకో, బాగుంటుంది."

"దీనికూడా మీ ఆర్డరేనేమిటి ? నాకది బాగులేదు"

సగం త్రాగిన కాఫీకప్పు ట్రేలో పెట్టేసి ఆశ్చర్యంగా చూశాడు విజయ్ భార్యవైపు.

"ఎందుకని ? గంటలు గంటలు నువ్విష్టపడి సెలెక్టు చేసుకొన్నదేగా."

"నా సెలెక్షనేమిటి ? మీ సెలెక్షనయితే ! నాకా వూదా రంగుదే బాగుండేది."

తిరుగుమాటలేకుండా, పెదవి కొరుక్కొంటూ డిటెక్టివ్ నవలనిమళ్లీ చేతపుచ్చుకున్నాడు విజయ్. షాపులో గంధపు రంగు మైసూరు సిల్కుచీరా ? వూదారంగు బిన్నీ సిల్కుచీరా ? అన్న తర్కం వచ్చేటప్పటికి ధర్మవేణి భర్తనే నిర్ణయించమన్నది. విజయ్ విధిలేక తన అభిప్రాయంచెప్పాడు. వెంటనే ధర్మవేణి మాట్లాడకుండా ఆచీర తీసుకొన్నది. ఇప్పుడు అదితనకు బాగు లేదట !

"కాఫీ సాంతం త్రాగేసి చదువుకోండి" అన్నది ధర్మవేణి.

"నీకో నమస్కారం....నువ్వుమాత్రం జన్మజన్మాలకూ భార్యగా నా సెలెక్షన్‌కావద్దూ, కాలేవు ! ఇక దయచెయ్యి...'

ధర్మవేణి నవ్వింది.... "ఆఁ !.... మీరువేసే ఆర్డర్లకు యంత్రాలుకూడా ఎదురు తిరుగుతాయి ! లేకపోతే ఏమిటండీ? ఎప్పటికేది ఇష్టమొస్తే ఆ చీరకట్టుకుంటారు గాని అన్నిం టికీ ఒకటైంటేబిల్, రూల్సు, ఆర్డర్సు అంటే ఎవరువింటారు?

విజయ్ పుస్తకంమీదనుంచి తలత్రిప్పకుండానే వోరగా ఆమెనిచూస్తూ "పోనీ నన్ను తృప్తిపరచటానికి కనీసం ఒక్క సారైనా నేను చెప్పినట్లు ఎందుకు చెయ్యకూడదు ?" అన్నాడు.

"ఎందుకు వినలేదు, వింటూనేవున్నా.... కాఫీ త్రాగే య్యండి." అని ధర్మవేణి విసవిసానడిచి వెళ్లిపోయింది.

తనమాట ప్రకారమే ధర్మవేణి చీరమార్చుకుని వస్తుం దనే నమ్మకంతో, కాఫీపూర్తిచేసి ఆమెకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు విజయ్. కాని ఆమె తిరిగిరాలేదు. సుమారు ఒక గంటగడిచినతర్వాత విజయ్ దుస్తులువేసుకుని, మేడదిగివచ్చి స్నేహితునింటికి వెళ్లటానికి కారుకోసంచూస్తే కారులేదు. ధర్మవేణి కారులో తన స్నేహితురాలిఇంటికి వెళ్లిపోయిందని తెలిసింది. వంటఇంటిదాకా వెళ్లాడు. తల్లి వంటవాడికి వలహాలు ఇస్తూ సాయంచేస్తూవుంది.

"ధర్మ ఎక్కడికి వెళ్లింది ?"

"రుక్మిణి రమ్మన్నదని వెళ్లింది"

"ఏ రంగుచీర కట్టుకొన్నది ?"

"ఎందుకురా అడుగుతున్నావ్ ? ఏదికట్టుకున్నా మహాలక్ష్మిలా అందంగానే వుంటుంది. కనకాంబరంరంగు కాబోలు."

విజయ్ సైకిలువేసుకొని స్నేహితుని ఇంటికివెళ్లాడు

భోజనంవేళకు తిరిగివచ్చాడు విజయ్, కాని ధర్మవేణి రాలేదు. రుక్మిణి ఇంట్లోనే భోంచేస్తున్నానని కబురుపెట్టింది. విజయ్ మనస్సుబాగా వికలమైపోయింది. డిటెక్టివ్ నవల అతని ఆలోచనల్ని అరికట్టలేకపోయింది....

రెండేళ్ళక్రితమే విజయ్‌వివాహం చేసుకున్నాడు. చదువు పూర్తయినతర్వాత మూడేళ్ళు కాలేజి లెక్చరరుచేసి, తర్వాత ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా సెలెక్టు అయ్యాడు. చాలాకాలం వివాహం చేసుకోకుండా భీష్మించుకుని కూర్చున్నాడు విజయ్. అది ఒక విధంగా తండ్రిమీద, అన్నగార్లమీద, మేనమామమీదా కోపం! కాని హఠాత్తుగా తండ్రిపోవటంతో, అందరికంటె చిన్నవాడైన విజయ్ దగ్గరేవుంటూ, తల్లి క్రమంగా అతణ్ణి వివాహానికి సుముఖునిగా చేసింది. మంచి సంబంధాలకి కొరతలేదు. సంప్రదాయం సంపత్తూచూచి తల్లే ఎన్నికచేసింది ధర్మవేణిని. విజయ్ కట్నం విషయంలో చాలనిక్కచ్చిగా వున్నాడు.... దానిక్కారణం మధ్యకాలంలో అతని మనోవైఖరిలో వచ్చినమార్పు : విద్యాదశలోనూ, లెక్చరరుగానూ అతను ఆదర్శవాదే. లెక్చరరు చేసిన మొదటిసంవత్సరం అంతంలో వివాహం చేసుకుంటానన్నాడు విజయ్. కానిఅతను ఇష్టపడిన అమ్మాయి కులంవేరుకావటంతో తండ్రీ, అన్నలూ, మేనమామలు ఎవరూ అంగీకరించలేదు. తర్వాత వివాహమే అక్కర్లేదంటూ వాళ్లుతెచ్చిన సంబంధాల్ని తిరగొట్టుతూ వచ్చాడు విజయ్.

ధర్మవేణి అరవిచ్చిన గులాబిలా వుంటుంది. ఆమెకు బి. ఏ. చదువు పూర్తయిన వేసవిలోనే పెళ్లి జరిగింది. తల్లిదండ్రుల గారాబం కారణం కాబోలు ధర్మవేణిలో గులాబీ సౌందర్యంతోపాటు గులాబీ ముల్లులా గ్రుచ్చుకునే గుణంకూడా నిశితంగా వుంది. అందుకే విజయ్‌కు అనిపిస్తుంది : తను ఆమెను అర్థం చేసుకోగలడు. నెమ్మదిగా ఆలోచిస్తూనే వేచివుండగలడు, కానీ ఎంతకాలం ఈ వేచివుండటం, సర్దుకుపోవటం ? ఆమెకూ తనకూ మధ్యఒక వంతెన తనే పొడుగూనా నిర్మించుకురావాలి అంటే ఎలా సాధ్యం ! పోనీ అలా చెయ్యటానికే సిద్ధపడి రెండేళ్ళనుంచీ ప్రయత్నిస్తూవున్నా, ఎప్పటికప్పుడు తను దగ్గరకు వెళ్ళేకొద్దీ ఆమె దూరంజరుగుతూనేవుంది !.... చివరికి దొంగరకం దాగుడు మూతలాటలా తయారైంది. ఏ ఆటఅయినా సరదాగా వుండటానికి కాలనిర్ణయంవుంది, వూరికే పొడిగిస్తే సరదాలేక పోవటమేకాదు, అంతకంటె యాతనకూడ వేరేవుండదు !....

భార్య అంటే ఎలావుండాలి ? భర్తమనస్సుకు నిలువుటద్దంలా వుండాలి ! పోయిన జనవరికి ఇద్దరూ మహాబలిపురం వెళ్ళారు, అక్కడ ధర్మవేణి నరకంచేసేసింది ! భార్య, భర్త వూహించే కల్పనకు గోపురాలు కల్పిస్తూ వుండాలి, అలాకాక పోతే కనీసం చూచి ఆనందించే గుణమైనా ఆమెలో వుండాలి, అవి కూలదోస్తూవుంటే ఏంచేస్తాడు భర్త ? పోనీ తనే ఏదైనా కల్పించి, తనవూహాలో భర్తను కలుపుకోవటమే ఆమెవ్యక్తిత్వం విశిష్టతాఅంటే ధర్మవేణి విషయంలో అదీ నిజంకాదు. 'నంది' అంటె 'పంది' అనడమే ఏకైక లక్ష్యంగావుండేవ్యక్తి వేంచేసుకోవాలి ?.....

ధర్మవేణి ఎప్పుడు తిరిగి వచ్చిందో, భోజనం తర్వాత ఆలోచిస్తూ కునుకుతీసిన విజయ్ నిద్ర లేచేటప్పటికి ఎదుటే సాక్షాత్కరించింది. "మీకోసం ఎవరో వచ్చారు లేచి మొహం కడుక్కోండి. టీ కూడా సిద్ధంగా ఉంది .... " విజయ్ లేచి క్రిందికి వెళ్ళాడు. ఏమీ మాట్లాడకుండా. మాటలతో లాభంలేదు. మానసికంగా ఇన్నాళ్లూ పడుతున్న బాధనీ, తాపత్రయాన్నీ ఇవాళ్టితో అంతంచేసి, నిర్లిప్తంగా ఉండాలను కున్నాడు. ఇకనుంచీ !

వచ్చిన వ్యక్తి బాంక్ ఏజంట్ గోపాలరావు. కొంతసేపు మాట్లాడిన తర్వాత అతను క్లబ్బుకు వెళ్దామంటే విజయ్ బయల్దేరాడు. డ్రెస్ చేసుకోవడానికి పైకి వెడితే "సాయంత్రం పెందలకడే రండి" అని పురమాయించింది ధర్మవేణి. విజయ్ ముక్తసరిగా వూరుకున్నాడు. "కోపం వచ్చిందా ? ఇవాళ సాయంత్రం దీపాలు వెలిగించి బాణసంచా కాల్చాలి. రుక్మిణి నేనూ బజారు వెళ్లి చెరొక పదిహేను రూపాయల సామగ్రీ పట్టుకొచ్చాం .... మీరు భయం లేకుండా కాలుస్తారూ ? మీకోసం కొన్ని తెచ్చాను. ప్రత్యేకంగా, చూద్దురుగాని ..... " ధర్మవేణి అలా ఉత్సాహంగా మాట్లాడేస్తూ ఉంటే ఎనిమిదేళ్ల పసిపిల్లలా కనిపించింది విజయ్‌కి ..... కోపం పోయి "సిల్లీగర్ల్!" అనుకున్నాడు మనస్సులో నవ్వుకుంటూ. "ఏం వస్తారుకదూ !" అని ఆమె మళ్లీ అడిగినప్పుడు "సరేలే" అనేసి బయటపడ్డాడు విజయ్. కాని కారులో కూర్చోగానే "ధర్మ సిల్లీ గర్ల్ అయితే కావచ్చు కాని, భార్యగా ఎలా వేగటం ? నాకు మాత్రం సుతరామూ పనికిరాదు, నాట్ మై ఐడియా ఆఫ్ ఎవైఫ్!" అనుకున్నాడు....

ఆ సాయంత్రం చీకటి పడినాక విజయ్ క్లబ్బులో పేకాడుతూ ఉండగా ప్యూన్ పరుగెట్టుకొచ్చాడు : "బాబూ అమ్మగారికి, ప్రమాదం జరిగింది .... చిచ్చుబుడ్లు కాలుస్తుంటే ముఖం కాలింది, కళ్లల్లోనూ పడ్డాయి నిప్పురవ్వలు .... మిమ్మల్ని వెంటనే రమ్మంటున్నారు ..... " అని వార్త తెచ్చాడు.

విజయ్ ఇల్లు చేరుకునేప్పటికి అతని తల్లి ధర్మవేణిని ఒళ్లోపడుకోబెట్టుకుని ఉపచారాలు చేస్తోంది. ధర్మవేణి కళ్లు గట్టిగా మూసుకుని మూలుగుతోంది. నుదుటిమీదు ఒకటి, రెండు బొబ్బలు తేలాయి. ముంగురులు కూడా కొంతభాగం కాలాయి. కాని అసలు ప్రమాదం నిప్పురవ్వల కళ్లల్లో దూరటమే ! కళ్లల్లో మంటా, బాధా ఓర్చుకోలేక పోతోంది ధర్మవేణి ......

కారులో వెంటనే హాస్పిటలుకు వెళ్లారు.

హాస్పిటల్లో నాలుగు నెలల క్రితమే నేత్రచికిత్స కోసం ఒక ప్రత్యేక శాఖ తెరిచారు. హాస్పిటల్ చీఫ్ సర్జను బలరాం నేత్రవైద్యంలో నిపుణు డంటారు. ఆయనకు ఫోను చేస్తే ఆయన వూళ్లో లేరని తెలిసింది. ఇంతలో రెసిడెంట్ మెడికల్ ఆఫీసరుకు కబురు వెళ్లింది. ఆమె నెల క్రితమే క్రొత్తగా వచ్చిందట. ఈమధ్య నేత్రచికిత్స ఆమే చేస్తూం

దట. ఆమె అమెరికాలో ఒక ఏడాది ట్రెయినింగ్ కూడా అయిందట. సర్జను కేమాత్రము తీసిపోదు అని చెబుతున్నారు హాస్పిటలువాళ్ళు. ఇంతమాత్రమైనా ఒకరు సమయానికి ఉండటం ఏదో అదృష్టమే అనిపించింది విజయ్‌కి.

డాక్టరు వచ్చింది ..... సుమారు పదేళ్ల క్రితం ఇంటరులో తన విద్యార్థినిగా చదువుకున్న ప్రేమలత !—డాక్టర్ ప్రేమలత !

వచ్చీ రాగానే విజయ్‌వైపు చూచి : "ఏదీ ఆమె ?" అంటూ ధర్మవేణిని కూర్చున్నపాటున్నే టార్చితో గాయాలు పరీక్షించి, చకచకా టేబిల్ వగైరా సిద్ధంచేయించి, చికిత్స ప్రారంభించింది ప్రేమలత.

ప్రేమలత ఎప్పుడు డాక్టరైంది ? ఎప్పుడు అమెరికా వెళ్లింది ? ఎప్పుడు ఈ వూరు వచ్చింది ? ఎంతలో జీవితం ఎలా మారిపోయింది ! అంతా ఎనిమిదేళ్లలో జరిగిన ఒక విచిత్రంగా అనిపిస్తోంది విజయ్‌కి. ఒక్కపక్క దూరంగా నిల్చుండి మౌనంగా గమనిస్తున్నాడు ఆమెని ..... అసలు ఆమె తనను గుర్తించిందో లేదో అని కూడా సందేహం కలిగింది .....

ధర్మవేణికి కళ్లమీదుగా కట్టు .... చికిత్స ముగిసింది... ప్రేమలత ఏం మాట్లాడుతుందోనని ఉత్కంఠతో ఎదురు చూస్తున్నాడు విజయ్.

"మీరు ఆమెను ఇంటికే తీసుకువెళ్లండి. అవసరమైతే నాకు కబురు చెయ్యండి. రేపు సాయంత్రందాకా కట్టు విప్పగూడదు .... వెలుతురు ఎక్కువగా లేని గదిలోనే ఉండమనండి .... ఐ యామ్ వెరీ సారీ ఫర్ యూ" అన్నది ప్రేమలత.

ధర్మవేణిని కారులో కూర్చోబెట్టడానికి తీసుకువెళ్లారు.

"దృష్టి పోయే ప్రమాదం ఉందంటారా ?"

"ఇప్పుడేం చెప్పటానికీ వీల్లేదు. బర్న్స్ ఎక్కువగానే ఉన్నట్లున్నాయి .... ట్రీట్‌మెంట్ తర్వాతకానీ తెలీదు 'కార్నియా' ఎలా అఫెక్ట్ అయిందో .... అఫెక్ట్ కాదనే ఆశిద్దాం ..... ఇది రావలసిన ఆపద కాదు !"

"థాంక్స్ .... నా దురదృష్టం .... "

"మీరు అధైర్యపడకండి .... భగవంతుడున్నాడు ..."

ప్రేమలత వెళ్లిపోయింది. విజయ్ కారు స్టార్ట్ చేశాడు.

ప్రేమలత అమెరికా వెళ్లినా భగవంతుణ్ణి మరిచి పోలేదు. తన నెవరైందీ గుర్తించిందా ? బహుశా జ్ఞాపకం వచ్చినా, ప్రస్తుతం గుర్తించటానికి ఇష్టంలేదు కాబోలు!

మరునటిరోజు సాయంత్రం విజయ్ డాక్టరు ప్రేమలతకి ఫోను చేశాడు! "ధర్మవేణి ఆస్పత్రికి రాలేనంటోంది ..... మీరు శ్రమ అనుకోకుంటే ఒకసారి వచ్చి చూడండి .... కారు పంపిస్తున్నాను .... థాంక్స్ !"

ప్రేమలత వచ్చింది. ద్వారం దగ్గరికి వెళ్లి పలకరించాడు విజయ్. "నే నెవరో గుర్తు వచ్చానా డాక్టర్ ?"

ప్రేమలత నొసలూ కళ్ళూ, ఏదో సమస్య నెదుర్కొనేలా ఒక్క క్షణం చలించినా, వెంటనే ఆమె పెదవుల మీద చిరునవ్వు కనిపించింది. "ఆ .... మా లెక్చరరుగారు కదూ ! నిన్ననే గుర్తించాను. మొదట ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరంటే ఎవరో అనుకున్నాను. తీరా చూస్తే మీరు ! .... సరే, ఆమె ఎక్కడున్నారు ?" ఆమె కంఠం నిండుగా ఆత్మవిశ్వాసాన్ని వ్యక్తంచేస్తూ, స్నేహపూర్వకంగా ఉండటం గమనించాడు విజయ్.

ఆమెని మేడమీదికి తీసుకువెళ్లాడు.

కట్టు విప్పి మందు వేసిన తర్వాత, ప్రేమలతను గూర్చి ధర్మవేణికి పరిచయం చేశాడు విజయ్.

"అలాగా .... మీ రెలా ఉంటారో చూసేందుకు వీల్లేదు కద ! మీ వ్రేళ్లు చాల సున్నితంగా పనిచేస్తాయి అని మాత్రం చెప్పగలను ....." అన్నది ధర్మవేణి.

ప్రేమలత విజయ్‌వైపు చూచి చిరునవ్వు నవ్వుతూ ధర్మవేణి చేతిని తన చేతిలోకి తీసుకొన్నది. "తొందరలోనే చూద్దురుగాని నన్ను ! .... అధైర్యపడి మనస్సు పాడుచేసుకోకండి" అన్నది.

"ఆమాట వారితో చెప్పండి" అన్నది ధర్మవేణి.

ప్రేమలత వెళ్లిన తర్వాత పరధ్యానంగా మాట్లాడకుండా ధర్మవేణి దగ్గరే కూర్చుండిపోయాడు విజయ్. సూర్యాస్తమయం పసిడి వర్ణంతో కనిపిస్తోంది కిటికీలో నుంచి .....

ప్రేమలత విచ్చిన సంపెంగలా ఉంది. అప్పటికీ ఇప్పటికీ ఆమె సౌందర్యం రేకులు విచ్చి పరిపూర్ణత్వం పొందింది. ఒకనాడు ప్రేమలతా తనూ ప్రేమించుకున్నారు. కాని వివాహానికి సంఘం అడ్డం వచ్చింది. తల్లిదండ్రులూ, బంధువులూ—సంఘంలో ముఖ్యమైనవాళ్లు వీళ్లేకద ! ఆరోజు తన జీవితంలో ఆనందాన్ని, అమృతకలశాన్ని తనకు చెందకుండా చెయ్యటానికి తయారై, ఈరోజు ఎవరూ ఆ ఫలితానికి బాధ్యత వహించరేం ? ఇది తన దురదృష్టం, కర్మ అంటారు ! ఎవరికి అర్థమవుతుంది తన హృదయవేదన ? ఈ అమ్మాయిని తన జీవితానికి భాగస్వామినిగా చెయ్యటంతో బాధ్యత తీరిందనుకున్నారు గాని, మనస్తత్వాలు సరిపడక, అంతంత మాత్రంగానే ఉన్న దాంపత్యంలో 'అంధత్వం' కూడా దాపురించి సర్వమూ శూన్యమవుతున్న ఈ పరిస్థితి వాళ్లకు కనీసం అర్థమవుతుందా ? .... ప్రేమలత తన జీవితాన్ని గూర్చి ఏం నిర్ణయం చేసుకున్నట్లు ? ఇంతవరకూ చదువూ, ఉద్యోగమూ, సంపాదనా—ఇకముందు ఆమె జీవితానికి లక్ష్యం ఏమిటో ? ప్రేమలత మూడు తరాల క్రింద ఎప్పుడో వృత్తి చేసిన కళావంతుల కులంలో జన్మించటమే ఆమె చేసిన నేరమా? చదువూ, సంస్కారమూ, సౌందర్యమూ, గుణగణాలూ ఇవేమీ

లెక్కకు రాకపోయాయే ! సంఘాన్ని తిరస్కరించటానికే ఆనాడు తను సిద్ధపడ్డాడు. కానీ ప్రేమలత అందుకు సిద్ధంగా లేదు. ఎందుకో ఆమెకూ ధైర్యం చాలలేదు ! ఆమెలోని మంచి తనమే, సంఘానికి ఆమెని విధేయురాల్ని చేసిన బలహీనత కూడా అయింది .......

తల్లి మేడమెట్లెక్కి వచ్చి దీపం స్విచ్చి వేసేదాకా చీకట్లో అలానే కూర్చుండిపోయాడు విజయ్, తన దుర దృష్టాన్ని గూర్చి ఆలోచిస్తూ .... ధర్మవేణి నిశ్శబ్దంగా పడు కొని ఉంది .....

''అమ్మా ధర్మా, పెందలాడే భోంచేస్తే బావుంటుంది, లేస్తావా ?'' అన్నది విజయ్ తల్లి.

''వద్దు అత్తయ్యా, ఆకలి లేదు ..... వారికి పెట్టు.''

''ఇప్పుడు నాకేనా వచ్చింది తొందర !'' అన్నాడు విజయ్.

నిశ్శబ్దంగా, మౌనంగా, క్షణం పూరుకుండే స్వభావం కాదు ధర్మవేణిది, అలాంటి వ్యక్తి ఇంతసేపూ మౌనంగా ఏమి ఆలోచిస్తూ ఉండిపోయిందో, ఈ ప్రమాదాన్ని గూర్చి ఆమె మనస్సు ఎంత వికలంగా ఉందో అని తోచింది విజయ్‌కి తటాలున .... మృదువుగా అతను ''ధర్మా, క్రిందికి వెళ్దాం పద, ఇద్దరూ భోంచేద్దాం కాని !'' అన్నాడు.

''వద్దు. మీరు వెళ్లండి.''

''పోనీ, ఇద్దరికీ భోజనం ఇక్కడికే తెప్పించే ఏర్పాటు చేస్తానులేరా'' అన్నది తల్లి.

ఆమె మేడమెట్లు దిగి వెళ్లిపోగానే, ధర్మవేణి పిలి చింది : ''ఏమండీ !''

''ఏం కావాలి ?''

''అన్నం స్పూన్‌తో మీరు పెట్టరా నాకు ?''

''అమ్మ ఏమనుకుంటుంది ? తను పెట్టటం నీకిష్టం లేనట్లు అర్థంచేసుకుని మనస్సులో కష్టపడదూ !''

ధర్మవేణి మాట్లాడలేదు.

భోజనం మేడమీదికి వచ్చింది.

''లేరా చేయి కడుక్కో'' అన్నది తల్లి. ధర్మవేణి దగ్గరకు వెళ్లి ''లే తల్లీ !'' అన్నది.

''నాకు ఆకలి లేదు, ఈపూట మానేస్తాను అత్తయ్యా.''

''ఎందుకా మొండితనం ? చెప్పినట్లు వినరాదూ !'' అన్నాడు విజయ్ కోపంగా.

''ఇప్పుడే మన్నదని ? నీకెందుకు నువ్వూరుకో''! అన్నది తల్లి మందలిస్తూ.

''ఎవరికీ అక్కరలేని ఈ తిండి ఇక్కడికి తీసుకురావట మెందుకమ్మా ?'' విజయ్ విసుక్కున్నాడు.

''నువ్వు తినకపోతే వాడూ తినడు, ఎవరికీ మనసు బాగుండటంలేదు ..... ఇలా అధైర్యపడటం దేనికి ? లెండర్రా, మనకు మంచి జరక్కపోదు ....'' అన్నది తల్లి. ధర్మవేణి దగ్గరకు వెళ్లి లేవదీయబోయింది ఆమె. ధర్మవేణి వెక్కుతూ ఉంది. ''ఏడవకమ్మా కళ్లు బాధ చేస్తయ్.'' ధర్మవేణి లేచి కూర్చుని ''అత్తయ్యా, అన్నంవద్దు, పాలు తీసుకుంటాను'' అన్నది.

విజయ్ తల్లి వంటవాణ్ణి కేకవేసింది.

''నాకూ పాలే తీసుకురమ్మను'' అన్నాడు విజయ్.

ధర్మవేణి తల్లిదండ్రులు వచ్చారు. సర్జను బలరావ్ గారు వచ్చారు. డాక్టరు ప్రేమలతకు నేత్రచికిత్స బాగా తెలుసుననీ, అమెరికాలో డాక్టర్లు ఆమె ప్రతిభను గూర్చి మెచ్చుకుంటూ సర్టిఫికెట్లు ఇచ్చారనీ, అన్నారు బలరావ్‌గారు. ఆమెమీద తనకు మంచి నమ్మకం ఉందనీ, ఆమె చేస్తున్న దానికంటె వేరే చెయ్యవలసింది ప్రస్తుతమేమీ లేదనీ ఆయన చెప్పటంతో ధర్మవేణిని మద్రాసో, వైజాగో తీసుకువెళ్లే ఉద్దేశం తాత్కాలికంగా వదిలిపెట్టుకున్నారు.

ప్రేమలత రోజూ ఒక్కసారి వచ్చి వెడుతోంది. ఇంట్లో అందరికీ ఆమెమీద గౌరవం ఏర్పడ్డది. విజయ్‌తో ఆమె స్నేహపూర్వకంగా మాట్లాడుతోంది కాని, ఆమె మన స్సేమిటో అతనికి అవగాహన కావటంలేదు. ఆమెను గూర్చిన ఉత్కంఠ నానాటికీ ఎక్కువైపోతోంది అతనికి ...... ఒకనాడు తన్ను ప్రేమించి పెళ్లి చేసుకుంటాననన్న ప్రేమలత, జీవితంలో ఇంకే లక్ష్యమూ ప్రస్తుతం లేనట్లే కనిపిస్తూన్న ప్రేమలత, ఎందుకని అసూయో, ఆసక్తో, నిస్పృహో, కోపమో, ఏదో ఒక భావం చూపటంలేదు ? ఈ స్నేహం, నిర్లిప్తతా ఏమిటి ?

ఆ రోజు ఆదివారం. ధర్మవేణికి ప్రమాదంజరిగి ఎనిమి దవరోజు. ఇంకా కట్టు కడుతూనేవుంది ప్రేమలత. ఆరోజు ఉదయాన్నే విజయ్ ప్రేమలత క్వార్టర్స్‌కి బయలుదేరాడు....

''ప్రేమా, నా జీవితంయిలా దుర్భరమైపోతూందనుకో లేదు....''

''ఒక్క ప్రమాదానికే ఇలా అధైర్య పడతారేమిటి మీరు?

''అధైర్యం అంటావు, నీకేపాటి ధైర్యంవుందో చెప్పు.. ఒకనాడు నువ్వేంచేశావ్ ? మన వివాహానికి సంఘం అంగీకరించదు అని తెలుసుకోగానే, ప్రత్యుత్తరమైనా వ్రాయకుండా బంధం త్రెంచుకొనిపోయావు.... సంఘానికి దాసోహం అన్నావు.... ఎందు కని ? ఎన్నాళ్లనుంచో నేను అడగదలచుకున్న ప్రశ్న ఇది.... నువ్వెప్పటికైనా నాదానివేఅని సంవత్సరాలకొద్దీ వేచి ఉన్నాను. చివరకు మా అమ్మను తృప్తిపరచటానికి, ఇక ఏంచేస్తే ఏం, అని వివాహంచేసుకున్నాను. శాంతీ సౌఖ్యమూరెండూ లభించ లేదు.... ఇలా ఆదర్శాలు భగ్నమైన జీవితాన్ని దురదృష్టం పూర్తిగా చేజిక్కించుకున్న క్షణాన్నే నువ్వుమళ్లీ ఎందుకు కనిపిం చావ్ ? నా కింక జీవితంలో ఏమీలేదా ? చెప్పు, నువ్వు మారి పోయావా ?....''

ప్రేమలత కళ్లల్లో నీళ్లు తిరిగాయి....తలవంచుకొన్నది మాట్లాడకుండా....

# కన్నుల వెలుగు

''చెప్పు, నువ్వు నాదానివికావా ?''

ప్రేమలత కళ్లుతుడుచుకుని, విజయ్‌వైపు చూస్తూ నిశ్చలమైన కంఠంతో అన్నది :

''అవునూ ! కాదూ !.... నేను మీదాన్నే అనుకోండి, ఇప్పుడు లాభమేమిటి ? నాకు ఆశ్చర్యం ఏమిటంటే, మీరు ఇన్నిఏళ్ల తర్వాతకూడా జీవితాన్ని అర్థంచేసుకోకుండా అమాయకంగా ఎలా వుండిపోయారాఅని ! ఇరవైఏళ్ల వయస్సులో మాట్లాడిన మాటలే ముప్ఫైవచ్చినా మాట్లాడుతున్నారు ! చూడండి అప్పుడు మీకర్థంకాకపోవచ్చు, కానీ ఇప్పటికీ అర్థంకాలేదా నేను ప్రత్యుత్తరం వ్రాయనికారణం ?.... 'మా తల్లిదండ్రుల కిష్టంలేదు, ఏంచెయ్యమంటావు ప్రేమా ! నువ్వేంచెయ్యమన్నా చెయ్యటానికి సిద్ధమే !' అని వ్రాశారేనాకు, దానికి నేనెట్లా సమాధానం ఇవ్వగలను ? కొన్నినిర్ణయాలు ఎవరికివారే చేసుకునేవీ, బాధ్యత వహించవలసినవీ అనిమీకు తట్టటంలేదా ? మీరు చేసుకోవలసిన నిర్ణయం నామీదతోస్తే అదిన్యాయంగా నేను చెయ్యవలసిన నిర్ణయంకానప్పుడు, మరేం చేస్తాను ? మీకు నేనేనిజంగా కావాల్సివస్తే, ఆ ఉత్తరానికి ప్రత్యుత్తరం లేదుగనుక, సరాసరి నాదగ్గరకు వచ్చివేస్తారు, అలా నిర్ణయానికి వస్తారు, అనుకున్నాను. కాని తర్వాతమీకు నాసంగతే అక్కర లేకపోయిందే ! ఏమనుకోవాలినేను ? నామనస్సు ఎప్పటినుంచో మీకు తెలిసేవుందికదా ! అలాంటప్పుడు మీ జీవితంలో నేను అవసరమైన వస్తువునే అంటూ తెలిపేటందుకు మీరేంచేసినట్లు చెప్పండి ?.... ఎవరు సంఘానికి లొంగిపోయినవాళ్లు ?''

విజయ్ ఆమెమాటలు కడ్డువచ్చి : ''నా ఊహలకూ, ఆశయాలకూ మెరుగులు దిద్దేదానివి, ఆ నిర్ణయంమాత్రం నీది కాదా అదీనువ్వే చేస్తావనుకున్నాను !'' అన్నాడు.

''ఒకవైపు మీ తల్లిదండ్రులూ ఒకవైపు నేనూ అయినప్పుడు అదిమీకు మీరేతప్ప మరెవ్వరూ చెయ్యలేని నిర్ణయం. ఆలోచించండి.... అయినా మీరింత అర్భకులని మీకంటే చిన్నదాన్ని నాకెలా తెలుస్తుంది ?'' అంటూ నవ్వేసింది ప్రేమలత. ''మీ తల్లిగారిని చూస్తుంటే ఇప్పుడర్థమవుతోంది, ఆమె ప్రతిదీ ఏర్పాటుచేసిపెట్టుతూ మీకు స్వయంనిర్ణయ శక్తి లేకుండా తయారు చేసిందని !''

''ప్రేమా నువ్వెంత కఠినంగా మాట్లాడుతున్నావో తెలీదు నీకు !''

''తెలుసు— సంఘం, భగ్నజీవితం, దురదృష్టంలాంటి తెరలు ముందువేసుకొంచున్నారేమిటా అనిపించి, నిజమేమిటో చెబుతున్నాను అంతే !.... ధర్మ ఏంచేస్తోంది ? ఇంత ఆపదలో ఆ అమ్మాయి ఎంతధైర్యంగా నిశ్చలంగావుందో మీకేమైనా అర్థమవుతోందా ?....''

విజయ్ తటాలునలేచి, ''వెళ్తాను'' అన్నాడు.

ప్రేమలత అతనిచెయ్యిపట్టుకుని : ''ఉండండి, కాఫీ తీసుకుని వెళ్దురుగాని'' అన్నది ప్రాధేయపడుతూ, విజయ్ కూర్చున్నాడు.

ప్రేమలత లోపలికివెళ్లి స్టవ్‌మీద నీళ్లుపెట్టి తిరిగివచ్చి, జడవిప్పుకొని తలదువ్వుకుంటోంది.... విజయ్ ఆలోచనలో పడ్డాడు....

''నిన్నిప్పుడు వివాహంచేసుకుంటాను'' అన్నాడు ఉన్నట్టుండి.

ప్రేమలత నవ్వింది. ''మన ఉద్యోగాలుతీసేసి, తర్వాత మిమ్మల్నీ నన్నూ జైలుకు పంపిస్తారు''

''హిందూధర్మప్రకారం నేను నిన్ను చేసుకోవచ్చునే, ఈ చట్టానికి అర్థమేమిటి ? వ్యక్తుల నర్థంచేసుకోలేని వీళ్లనీ చట్టం ఎవరుచెయ్యమన్నారు ? ఉద్యోగం మానేసి పెళ్లి చేసుకుంటానునిన్ను శాస్త్రోక్తంగా....''

''మహా గొప్పపనిచేస్తారు !'' అంటూ ప్రేమలత లోపలికివెళ్లింది కాఫీ తీసుకురావటానికి.

హిందూ వివాహాన్నిగూర్చి, హిందూధర్మాన్నిగూర్చి విజయ్ ఆలోచిస్తూనే ఉన్నాడు. తను ప్రేమలతను ఎందుకు వివాహంచేసుకోగూడదు ? ఇక్కడ సపత్నుల ఈర్ష్యాసూయలకు ప్రమేయంలేదే ! ఈమాటే ప్రేమలతతో అంటే : ''ధర్మం ఎప్పటికీ ఒప్పుకోరు ! అది న్యాయంకాదు !'' అన్నది.... అసలు వివాహమంటే ఏమిటి ? మనసివ్వటమే ప్రధానమైతే ప్రేమలతే తన భార్య. మంగళసూత్రం కట్టడమైతే ధర్మ తన భార్య. ఇందులో ఎవరిని కాదనటం ?

ఒకనాడు ధర్మవేణికి కట్టు విప్పి పరీక్ష చేసింది ప్రేమలత. ''కంటిలో గాయాలు ఇంచుమించు మానిపోయినట్లే, కట్టు అవసరంలేదు'' అన్నది. కాని ధర్మవేణికి చూపు మాత్రం రాలేదు ! ఇల్లంతా గొల్లుమన్నారు.

ఇక శాశ్వతంగా అంధత్వమేనా ?

మూడు నెలలు వ్యవధి యిచ్చి, వెలుగుని ప్రసారంచేసే గుణం కోల్పోయిన కార్నియాని ఆపరేట్ చేసి, కొత్త కార్నియాని గ్రాఫ్ట్ చేస్తే చూపు వస్తుందని సర్జన్ బలరామ్ గారు అభిప్రాయ మిచ్చారు. తనే ఆపరేషన్ చేస్తానని కూడా ఆయన అన్నారు. ఇక అదొక్కటే ఆశ.

విజయ్‌కి ఏమీ తోచలేదు. ఆ సాయంత్రం క్లబ్బుకి వెళ్లకుండా ప్రేమలతను చూడటానికి వెళ్లాడు.

ప్రేమలత అభిప్రాయం అడిగాడు ఆపరేషన్ గూర్చి.

''ఆపరేషన్ చేస్తే చూపు రావటం నిజమే. తప్పకుండా వస్తుంది. కాని అది సున్నితమైన ఆపరేషన్. ఇక్కడ చేయించటం నా కిష్టంలేదు. బలరామ్‌గారు చెయ్యలేరు. వైజాగ్‌లో ప్రొఫెసరు పరమేశ్వరరావుగారిచేత చేయించండి...'' అన్నదామె.

''నమ్మకమేమిటి ?'' అన్నాడు విజయ్ నిస్పృహగా.

ఆ నిస్పృహ జీవితం మీదే నిస్పృహగా వ్యక్తం అయింది.

''నాలో నమ్మకం ఉందా ?'' అని ప్రశ్నించింది ప్రేమలత.

''ఆఁ''

''అయితే ధర్మకు తప్పకుండా చూపు వస్తుంది ..... ధైర్యంగా ఉండండి.''

విజయ్ వెళ్లటానికి లేచినవాడు ఆగాడు. ఏమిటో చెప్పబోయి, సందేహిస్తూ ఉన్నట్లు ఆమెవైపు చూశాడు. ఆమె అతనివైపు తదేకంగా చూస్తోంది. ధైర్యాన్ని, విశ్వాసాన్ని ప్రసాదిస్తూ కర్తవ్యాన్ని నిర్దేశిస్తోంది ఆమె చూపు.... అదొక వెలుగు!

''ప్రేమా! నీ మంచితనాన్ని ఒక్కసారి ముద్దెట్టుకోవచ్చా?'' అన్నాడు, భక్తుడు దేవతని వరం కోరుకుంటున్నట్లుగా విజయ్.

ప్రేమలత ఒక్క క్షణం నిదానించి అతనికి దగ్గరగా వచ్చింది. ఆమెను హృదయానికి హత్తుకొని పెదవుల్ని ముద్దుపెట్టుకున్నాడు. ఆమె అతణ్ణి దూరంగా త్రోసివేసింది.

''ఊఁ.... మంచితనాన్ని కాదు, నన్నే ముద్దెట్టుకుంటున్నారే! మిమ్మల్ని దగ్గరకు రానిస్తే ప్రమాదమే! ఇక వెళ్లండి'' అన్నదామె చిరుకోపంతో.

''నా జీవితానికి దారి చూపిస్తున్నావు...నీ సంగతేమిటి?''

''ఏముందీ, ఎందుకు డాక్టరయ్యానో ఆపని సాగుతూనే ఉంది కద!''

''నీకు మరేమీ అక్కరలేదా? .... నువ్వెంత దగ్గరగా ఉన్నావో మళ్లీ అంత దూరంగానూ ఉన్నావనిపిస్తుంది.... నువ్వు నాకు అర్థంకావు .... కాని జీవితంలో నువ్వే నా తుది విశ్వాసం.''

''మరి ప్రేమంటే ఏమనుకున్నారూ!'' అని నవ్విందామె. ''మనుష్యులు ఎంతదూరంలో ఉన్నా మనస్సులకి దూరమంటూ లేదే! మీరు ధర్మని అర్థంచేసుకోండి, నేనూ అర్థమౌతాను!''

మూడు నెలలు గడుస్తున్నాయి. అంతలో తలవని తలంపుగా ప్రేమలతను వైజాగ్ బదిలీ చేశారు. ఇది శుభ సూచకమనే భావించారు విజయ్ ఇంట్లో అందరూ. వైజాగ్ వెళ్లిన ప్రేమలత ఉత్తరం వ్రాసింది కూడా. తను పరమేశ్వరరావుగారితో సంప్రదించినట్లూ, ధర్మవేణిని తీసుకు రావలసిందనీ ......

''ఆపరేషన్ ప్రేమే చేస్తుంది. నేనూ ఉంటాను కాని నేను ముసలివాణ్ణవుతున్నాను'' అన్నారు డాక్టరు పరమేశ్వరరావు.

ఆపరేషన్ జరిగింది .....

ధర్మవేణి అన్నది విజయ్‌తో ఏకాంతంగా : ''ఏమండీ, ఒకవేళ నాకు చూపు రాకపోతే ఏమౌతుంది? .... జీవితాన్ని గూర్చి నేనెప్పుడూ ఆలోచించలేదు, దాని విలువేమిటో అర్థం కాలేదు నాకు ఇన్నాళ్లూ ..... క్షణం వూరుకోకుండా, నా కిష్టం వచ్చినట్లు ఈ ప్రపంచమంతా నాదే అయినట్లూ ఆడుతూ పాడుతూ గడిపాను. నాలోని ప్రత్యేకతని చూపు కోవటానికి మీరు అవునన్నది కాదని ఎన్నిసార్లో మీకు కోపం తెప్పించాను. కాని మీరు లేకపోతే జీవితం లేదని చెప్పటానికే భగవంతుడు నాకీ శిక్ష వేశాడనిపిస్తోంది! అజ్ఞానమే అయినా పొరపాట్లు చేసినప్పుడు,' ఫలితం లేకుండా వూరికే పోదు! .... ఇప్పుడు మీరే నా కన్నులకు వెలుగు కదా జీవితాంతమూ .... నాకు దృష్టి వస్తుందని మీకు నమ్మకమేనా?''

విజయ్ ఆమె చేతిని తన రెండు చేతులమధ్యా గ్రహించి: ''చూపు తప్పకుండా వస్తుంది ధర్మా!'' అన్నాడు. అతనిలో పరివర్తన పరిపూర్ణమయింది ఆ క్షణాన.

''డాక్టరు ఎంత మంచిదండీ! ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడుతుంది. ఆమె ఎలా ఉంటుందో చూడాలని కుతూహలం .... అందుకైనా నాకు చూపు రావాలి.... లోకాన్నీ మిమ్మల్నీ మళ్లీ చూడాలని ఎంత ఆశగా ఉందనుకున్నారు!''

ప్రేమలతే కట్టు విప్పింది ....

ధర్మవేణికి ప్రపంచం మళ్లీ క్రొత్తగా దృశ్యం అయింది. క్రొత్తచూపుతో ప్రేమను గుర్తించింది ధర్మ.

---

# తెనుగుమఱుగులు

## శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

ఇటీవల నన్నెచోడుని కుమారసంభవమును సవిమర్శముగాఁ బఠించుటలోఁ బెక్కు అపూర్వాంశములు గోచరించినవి. ఉన్న పాఠములతో నర్థము కుదురక చిక్కు గొలుపుచున్న పద్యములు కొన్ని కించిత్సంస్కారముతో సుగమములై సరసార్థములను సమకూర్పఁ జాలినవి. అట్టి వానిలోఁ గొన్నిటి నీ వ్యాసమునందు వివరింతును.

### 1 పైఁడిపాళియ—జాదరలు

కుమారసంభవము నందలి యష్టమాశ్వాసములో చంద్రోదయ వర్ణన సందర్భము నందలిది యీ పద్యము :

గీ. ఈశు నుద్వాహమున కమరేంద్ర దిగ్వి
లాసవతి పైఁడిపాళియఁ బోసి తెచ్చు
జాదరలొ నాఁగ రాగపూర్ణోదయేందు
బింబమునఁ బాండు కిరణాంకురంబు లెసఁగె.

(8—112)

మదరాసు విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన కుమారసంభవము నందలి పాఠమిది. తంజావూరులోని తాళపత్ర ప్రతిలో నిందలి మూడవ పాదమున 'జాదరలొ' స్థానమున 'బాదములొ' అని కలదు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి ప్రతిలో వ్రాతప్రతి పాఠము సంస్కరింపఁబడి 'పాదములొ నాఁగ' ఇత్యాదిగా నచ్చు వేయఁబడినది. వావిళ్లవారి ప్రతిలోఁ గూడ 'పాదములొ నాఁగ' అదియే కలదు. ఇట్లు మానవల్లివారి ప్రతియందును, వావిళ్ల వారి ప్రతి యందును నున్న 'పాదములొ' పాఠమునకు భిన్నముగా విశ్వవిద్యాలయ ప్రతిలో 'జాదరలొ' యను పాఠము ముద్రితమై యున్నది. ఇది పరిష్కర్తలు అర్థానుగుణముగా నవరించిన కల్పిత పాఠమే కాని యే వ్రాతప్రతిలోను నున్న పాఠము కాదని తోఁచును. ఈ పాఠము నిట్లు సంస్కరించుటకుఁ గారణ మేమైయుండును అని మనము పరిశీలింపవలసి యున్నది. శ్రీ మానవల్లివారు గ్రంథాంతమున ముద్రించిన లఘు టీకలో 'పాళియ' యను పదమునకు 'తట్ట' అని యర్థము వ్రాసిరి. ఆ యర్థమునే గ్రహించి పద్యార్థమున్న సమన్వయించుకొనుటలో 'పాదములొ' యను పాఠమున కర్థము కుదరలేదు. అందుచే పరిష్కర్తలు 'పాదములొ'' యను పాఠమును బరిహరించి 'జాదరలొ' యని దానిని సవరించిరి. గ్రంథాంతమునందలి పదముల పట్టికలో 'జాదరులు (నాఁగ)' 8—112=గందపొడి, చూర్ణ వసంతము అని యర్థము వ్రాసిరి. ఆ పద్యములోనే యున్న 'పాళియ' యనుపదమీపద ముల పట్టికలోని కెక్కలేదు. అందే గ్రంథాంతమున నున్న పాఠభేదములు—లఘు వ్యాఖ్యలో ''జాదరలు = గందవొడి= పాండుకిరణాంకురములతోఁ బోలిక'' యని వ్యాఖ్యానింపఁ బడినది. ఈ వ్యాఖ్యానమునుబట్టి పాండు కిరణాంకురములతోఁ బోలిక కుదుర్చుటకే 'పాదములొ' యను పాఠమునకు బదులుగా 'జాదరలొ' యను పాఠము కల్పింపఁబడినట్లు విశద మగుచున్నది. దీనినిబట్టి పరమేశ్వరుని పెండ్లికి తూర్పుదిక్కు అనెడి కాంత బంగారు'పళ్లెములోఁ బోసి తెచ్చు గందవొడియో యనునట్లుగా చంద్రబింబమునఁ బాండు కిరణాంకురము లొప్పుచుండె నని భావ మవగత మగుచున్నది. వీ రిట్లుగా నీ పద్యార్థమును కుదుర్చు కొనుటకు పాళియ యను పదమునకు పళ్లెము అనుట యర్థమున్న నిశ్చయ జ్ఞానమే కారణమని వేరుగాఁ జెప్ప నవసరము లేదు.

శబ్దరత్నాకరములో పాళియ, పాళె యను పదములకు జూదమాడెడు పలక యని మాత్రమే యర్థ మొసఁగఁబడి యున్నది. సూర్యరాయాంధ్ర నిఘంటువులో మాత్రము పై యర్థముతోఁబాటు రెండవ యర్థముగా పాత్రము, పళ్లెము అని యిచ్చిరి. ఇందు మఱొక విశేష మేమనఁగా 'పాదములొ' నాఁగ యనుటకు బదులుగా 'సాదములొ నాఁగ' యనియు, 'రాగ పూర్ణోదయేందు' అనుటకు బదులుగా 'రాగ పూర్వోదయేందు' అనియు ముద్రింపఁబడి యుండుట. ఇవి నిఘంటు వండితులు చేసిన సంస్కారములో, అచ్చు తప్పులో తెలియరాదు. 'జాదర' యను పదమునకు సూ. ని లోను, వావిళ్ల నిఘంటువులోను గందవొడి (చూర్ణ వసంతము—చి. ని) అనియు, జాదరాడు = గందవొడి చల్లుచు క్రీడించు అనియు నర్థము లొసఁగఁబడి యున్నది. జాదరాడు పదము క్రింద 'పొలయు తుమ్మెదలు బుప్పొడి జాదరాడి, చలువపూనీట వసంతంబు చల్లి' యను ద్విపద పరమయోగివిలాసములోని ప్రయోగము నిర్ధారక ముగా నొసఁగఁబడి యున్నది. ఇటీవల ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమీవారు ప్రచురించిన 'నన్నెచోడుని పదప్రయోగ సూచిక' లోఁ గూడ విశ్వవిద్యాలయ ప్రతి ననుసరించి 'జాద

రలో' యను పదమే గ్రహించి వారిచ్చిన యర్థమువే ప్రక్కన కుండలీకరణములో గందవొడి లేక చూర్ణవసంతము అని యిచ్చి యున్నారు. సూ. ని గాని, వావిళ్ల నిఘంటువుగాని 'జాదర' పదమునకు కుమారసంభవ ప్రయోగమును జూపలేదు.

తెలుఁగున చంద్రోదయ వర్ణనమును గావించిన యితర కవుల ప్రయోగ సంప్రదాయములను బట్టియు, తాళపత్ర ప్రతి పాఠమును బట్టియు నిచట 'జాదరలో' యను పాఠము సరసము కాదని తోఁపఁగలదు. జాజము, జాజాము, జాజాల పాలిక, జాజాలపాలె, జాజాలు అను పదముల క్రింద నిఘంటువులలో నీ క్రింది ప్రాచీన కవిప్రయోగము లొసఁగఁబడి యున్నవి.

గీ. శర్వరీ చంద్రపరిణయ సముచితాంకు
రార్పణ క్రియఁ గలయ వియద్విభాగ
పాలికలఁ దోఁచు క్రొత్త జాజాల మొలక
లనఁగఁ దారక లొండొండ యంకురించె.
కవికర్ణ రసాయనము. 4 ఆ. 83 ప

సీ. వనజభిద్రజనీ వివాహోత్సవారంభ
మునఁ దోఁచు జాజాల మొలక లనఁగ.
పె. శకుం. 2—183.

సీ. మద చకోర వివాహ మహిమను వెలిని నూ
త్నలయు జాజాలపాలిక యనంగ.
రా. వి. 3.20.

సీ. జాజాలపాలెల సర్వౌషధులు నించి
ప్రోక్షించె నొక్క పద్మాక్షి జలము.
శివరా. 2—56.

సీ. పొదివి మేనులఁ దోఁచు పులకాంకురంబుల
తుకము జాజాలపాలికలు చేసి
అని. 3—76.

సీ. పాలిక జాజాలపాలిక నాఁగను
నంకురార్పణ శరావాఖ్య దనరు.
ఆంధ్ర. భాష. 2—179.

జాజములు, జాజాలు అనఁగా వివాహాది శుభకార్యములయందు అంకురోత్పత్తికై పాలికలయందుఁ బోయు నవధాన్యములు. జాజాలపాలె, జాజాలపాలిక యనఁగా అంకురోత్పత్తికై నవధాన్యములు పోసి యుంచెడు శరావము. పాలిక, పాలియ, పాలె యునునవి సమానార్థకములైన పదములు. పయి ప్రయోగములలో కవికర్ణ రసాయనము నుండి యొసఁగఁబడిన పద్యమించుమించుగా నన్నెచోడుని పద్యమును బోలియే యున్నది. శర్వరీకాంతకును, చంద్రునికిని జరుగు వివాహ కాలమున వియద్విభాగము లనెడు పాలికలయందు తోఁచు జాజాల మొలకలో యనునట్లుగా నక్షత్రము లంకురించెనట ! పయి నన్నెచోడుని పద్యములోను 'పాళియ' యను పదమునకు శ్రీ రామకృష్ణ కవిగారు వ్రాసినట్లుగా 'తట్ట—పళ్ళెము' అని యర్థము కాక పాలిక—నవధాన్యముల మొలకలు మొలిపించెడు శరావము అని యర్థము చెప్పుకొనవలసి యున్నది. ఇట్లర్థము చెప్పుకొనిన పిదప—దానినిబట్టి సంస్కరింపఁబడిన 'జాదరలో' యను పాఠము కూడఁ బరిహరింపవలసి యున్నది. ఇట తాళపత్ర ప్రతిలో నున్న పాఠము 'జాదములో' యనుట మనము మరువరాదు. అది 'జాదములో' యనుటకు లేఖకుని పొరబాటు వలన తప్పుగా వ్రాయఁబడిన రూపము. పయి నొసఁగఁబడిన ప్రాచీన కవి ప్రయోగములలోని జాజములు జాజాలు అనుటకు బదులుగా నన్నెచోడుఁడు ప్రయోగించిన పదము 'జాదములు'. జాదములు అను పదము 'జాజములు' అనుటకు రూపాంతరము. దకారజకారములు మారి రూపాంతరము లేర్పడుట మన కితర పదములలోఁ గూడఁ గాననగును ఇప్పుడు నన్నెచోడుని పద్యమున కర్థ మిట్లు చక్కఁగా, సరసముగాఁ గుదురుచున్నది.

పరమేశ్వరుని యుద్వాహమునకు తూర్పుదిక్కు అనెడి కాంత బంగారు పాలికలోఁ బోసి తెచ్చు నవధాన్యముల మొలకలో (జాజాలు) యనునట్లుగా రాగపూర్ణమైన ఉదయ చంద్ర బింబమునఁ బొండు కిరణాంకురను లొప్పెను. ఎర్రని చంద్ర బింబము బంగారుపాలిక వలెను, అందుండి వెలువడు తెల్లని కిరణములు ఆ పాలికలో మొలిచిన జాజాల మొలకలవలెను నుండెనని భావము. ఇట్టి చంద్రోదయ వర్ణనము తెలుఁగులో ప్రాచీన కవీశ్వరులు కొందరు చేసిన చంద్రోదయ వర్ణనముతో సంవదించుచు సరసార్థ సంపాదకమై యొప్పారుచున్నది.

* * * *

## 2. "సురత్రాణపరానంత"

కుమారసంభవమునందే సప్తమాశ్వాసమున ఓషధిప్రస్థ పురవర్ణన సందర్భమునం దీ క్రింది పద్యము కలదు.

మహాస్రగ్ధర :
ఫలభారా నమ్రచూడ ప్రకర విహర దుత్పన్న కీరాళి పుంస్కో
కిలరావంబుల్ సెలంగన్ గృతకనగ తటాకీర్ణ కేకీరవంబున్
గలయం దద్ఘోష మోలిం గలమవన సురత్రాణపరానంత కాంతా
కులమంజుధ్వానమున్ సంకులముగ వరుసంగూడి చెల్వొంది
మ్రోయన్—7 ఆ. 98 ప.

ఇది విశ్వవిద్యాలయ ప్రతి యందలి పాఠము. శ్రీ మాన వల్లివారి ప్రతిలో మూఁడవ పాదమున 'కమలవన సురక్షాపగానంత అని పాఠము కలదు. తంజాపూరిలోని తాళపత్ర ప్రతిలోఁ గూడ మానవల్లివారి పాఠమే కలదు. వావిళ్లవారి ప్రతిలోఁ దొలి పాదమున 'చూడ ప్రకర'' యనుటకు మారుగా 'చూత ప్రకర' యను పాఠము మార్పఁబడి యున్నది.

ముత్తెఱఁగులయిన శబ్దములు పెల్లు రేఁగి సంకులముగ మ్రోఁగె ననుట యందలి తాత్పర్యము. వృక్షములమీఁది చిలుకలు, తుమ్మెదలు, కోకిలలు—వీని శబ్దములు, కృతక పర్వతములమీఁది నెమళ్ల కేకలు, కలమ వనములయందలి కాంతల మంజుధ్వానము—ఇవి మూఁడును కూడి సంకులముగ మ్రోఁగె నట ! : కాని యీ పదమునకు స్థూలముగా నర్థ మిట్టిదని గోచరించుచున్నను మూఁడవ పాదమునఁ గల 'సురక్ష్మాపరానంత' యను పదముల కర్థమేమో, వానికిఁ దక్కిన పదములతో నన్వయ మెట్లో కుదురలేదు. అధోజ్ఞాపికలో వ్రాఁతప్రతి పాఠ ముగా నిచ్చిన 'కమలవన సురక్షాపగానంత' యను పాఠము గూడ నిట సహాయకారి కాలేదు. అంతకుమునుపే 91 వ పద్య మున 'హాలిక నితంబినీ తతి' ని వర్ణించి యుండుటచే నిచట 'కలమవన' అని యుండుటయే సమంజసము. 'కమలవన' మనుట యిచట నంతగాఁ బ్రయోజనకారికాదు. సురక్ష్మాప రానంత' యనునది విశ్వవిద్యాలయ ప్రతిలో పరిష్కర్తలు చేసిన సవరణ. ఆ సవరణ వలనఁ గూడ నర్థము కుదురుటలేదు. అచట పాఠ మిట్లుండవలయును. 'కలమవన—సు—రక్షా—పర—అనంతకాంతాకుల మంజుధ్వానము' వ్రాఁతప్రతి పాఠములోని 'గా' ను 'రా' గా పఠించి—యూనివర్సిటీ ప్రతిలోని 'క్ష్మ' లోని మావత్తును తొలగించి దానిని 'క్షా' గా వ్రాఁతప్రతిలోనే యున్నట్లు పఠించినచో నా సమాసమున కర్థము చక్కఁగాఁ గుదురుచున్నది. ఇపు డా పద్యమున కర్థ మిట్లు చెప్పుకొనఁ దగును.

ఫలభారముచే మిక్కిలిగా వంగిన మామిడిచెట్ల సమూ హమునందు విహరించుచున్న—అందే పుట్టిన వగు చిలుకలు, తుమ్మెదలు, గండుకోయిలలు వీనియొక్క రావములును—క్రీడాపర్వత సానువులపై నిండియున్న నెమళ్లయొక్క కేకల వలన నుత్పన్నమగు శబ్దమును, కలమవనములను బాగుగా రక్షించుట యనెడి కార్యమునందు ఆసక్తి కలవారైన కాంతా సమూహము పక్షులను తోలుచు చేయుచున్న మనోహరమైన శబ్దమును కలసి సంకులముగ మ్రోసెను.

కనుక నీ పద్యమున 'చూడ ప్రకర' యనుటకు మారుగా 'చూతప్రకర' అనియు, 'సురక్ష్మాపరానంత' యనుటకు మారుగా 'సురక్షాపరానంత' అనియు పఠించుకొనవలెను. 'చూడప్రకర' యనుటకే యెట్లో యర్థము చెప్పుకొనఁదగి యున్నను 'చూతప్రకర' యనుట మరింత స్పష్టముగా నుండును. కోకిలలు, కీరములు, అలులు చూడములయందుండు నని సామాన్యముగాఁ జెప్పుటకంటె 'చూతములయం' దుండు నని చెప్పుట సమంజసము. అందుచే నీ పాఠమే మేల్తరమని తలఁపఁదగి యున్నది.

### 3. తత్పురి "పౌరజనంబు"—"వారజనంబు"

ఓషధి ప్రస్థ పురవర్ణనమునందలిదే మఱొక పద్య మిది చూడుఁడు :

చ. కొలఁదికి మీఱఁ బెద్ద యగు కోట తనర్పునవస్తుసంతతో
  జ్జ్వలతర సత్ప్రభాతి రవిచంద్రరుచుల్ సొరనేరకున్న సం
  ధ్యలు దివన త్రియామలును దత్పురి పౌరజనంబెఱుంగుఁ ద
  మ్ములము చవిన్ విహంగగతిఁ బువ్వులతావి రతిప్రసంగతిన్.
7 ఆ—105 ప.

ఆ పురమున కొక పెద్ద కోట కలదు. అది మిక్కిలి యున్నత మయినది. ఆ యున్నతిచేతను, ఆ కోటగోడలు బంగా రువి యగుటచే నా బంగరుకాంతియొక్క యతిశయముచేతను సూర్యకిరణములును, చంద్రకిరణములును నా పురమును ప్రవే శించుటకు వీలులేకుండెను. మరి యా పురమువారికి ఇది సంధ్య, ఇది రాత్రి, ఇది పగలు అని యెట్లు తెలియుచుండిన దనఁగా తాంబూలము చవిచేతను, పక్షుల గమనము చేతను, పూవుల తావులచేతను, రతిసంగమములచేతను తెలిసికొనుచుండిరి.

విశ్వవిద్యాలయ ప్రతిలో గ్రంథాంతమున తప్పొప్పుల పట్టికలో 'తత్పురి పౌరజనంబు' అనుట తప్పని, దానిని 'వార జనంబు' అని దిద్దుకొనవలయునని దిద్దుబాటు సూచించిరి. కాని యీ దిద్దుబాటు అనవసరము. అచట వారజనమునకు ఎట్టి ప్రసక్తియు లేదు. వారి వర్ణనము ప్రత్యేకముగా తర్వాత చేయబడి యున్నది. ఇచ్చట 'పౌరజనంబు' అనియే యుండుట యర్థానుకూలమును నయియున్నది. ఆ యూరి వారు—సూర్య చంద్ర కిరణములు కోటతనర్పుచే—వస్తు ప్రభా తిచే నందుఁ బ్రవేశించుటకు వీలు లేకపోఁగా— తాంబూలము రంగుచే ప్రాతస్సంధ్యను, గూండ్లకుఁ జేరుకొనుచుండిన పక్షుల కలకలారావముచే సాయంసంధ్యను, పూవులతావిచే—పగటి యందు వికసితములయి పరిమళములు వెదజల్లును గనుక పగటికి, రతివాంఛచే రాత్రికాలమును తెలిసికొనఁ గలుగు చుండిరి. కనుక నిచట 'పౌరజనంబు' అనియే యుండుట సమంజసము, అర్థానుకూలమును. కడపటి పాదమున 'తమ్మ

లము ధ్వనిన్' అని సవరించుకొనఁదగును. లేదా 'చవి' ధ్వని శబ్ద భవమని గ్రహింపఁదగును.

## 4. నీలి గుడిపిన క్రియన్

అష్టమాశ్వాసమున నంధకార వర్ణన సందర్భమున నందలిది యీ క్రింది పద్యము :

గీ. చీరి నేతితోఁ గాటుక సిక్క మెదిచి
నెఱియ బ్రహ్మాండ కుహరంబు దెఱపిఁ గదియ
వరుసతో ముద్దవరువడి వైచి కలయ
నీలి గుడిపిన క్రియఁ జీకువాలు గవిసె.
8 ఆ. 99 ప.

ఇచట 'నీలి గుడిపిన క్రియన్' అనఁగా నర్థమేమి ? సూర్యరాయాంధ్ర నిఘంటువులో 'నీలి' యను పదమునకు నలుపు, నీలిమ యని యర్థము వ్రాసి దానిక్రింద పయి నన్నెచోడుని పద్యమునే యొసఁగిరి. శుకసప్తతినుండి కూడ మరొక ప్రయోగ మొసఁగబడినది. తుదిని కుండలీకరణములో 'నీలిఁ గుడిపిన క్రియన్—నైల్యమును వ్యాపింపఁజేసిన రీతిని' అని వివరణము కూడ నొసఁగిరి. కాని పయి పద్యమును గల వర్ణనమునుబట్టి యీ వివరణ మంత సమంజస మైనదిగాఁ దోఁచుట లేదు. కాటుకపట్టు ప్రక్రియను గూర్చి నన్నెచోడునిదే షష్ఠాశ్వాసమునందలిది యీ క్రింది పద్యము గమనింపుఁడు :

మ. పరమస్నేహము హృత్సరోరుహమునం బాత్రంబుగా నించి సు
స్థిరతం బుణ్యదశం దపోగ్ని మది నుద్దీపించి బ్రహ్మాండక
ర్పర ఖండంబున మంత్రకాటుక దగన్ ఫాలాక్షుఁ గూర్పింప న
గ్గిరిరాజాత్మజ పట్టె నా నమరి నింగిం బర్వె వీలా భ్రములే. 6 ఆ. 96 ప.

అష్టమాశ్వాసమునందలి మరొక పద్య మిది :

గీ. తరుణతర శశిమండలా త్యరుణ రుచులు
గొడుగు లెదఁ గ్రుచ్చి వడి నెత్తికొనిన సాంద్ర
తిమిరపటలంబు వాలుపారె దీపదీప్తి
పరివృతం బైన కజ్జలపాత్ర పోలె. 8 ఆ. 111 ప.

పయి పద్యములయందు వివరించినట్లుగా కాటుకపట్టి—యా కర్పర ఖండమునుండి కాటుకపొడిని చీరి—దానిని నేతితో చిక్కఁగా మెదిచి—బ్రహ్మాండకుహరముయొక్క తెరపి యందు—అగ్రభాగమునందు— ముద్దగా పడవేయఁగా నది బ్రహ్మాండమంతటను—నీలి గుడిపినట్లుగా— వ్యాపించుటచే నంధకారమంతటను నిండినది— అని పద్యార్థము. చాకళ్లు బట్టలకు నీలిమందు పెట్టునపుడు అనుసరించు పద్ధతిని ఇట అనుసంధించుకొనవలయును. వారు నీలిమందును—పొడిని నీటిలో అట్లట్లే కలుపరు. ఆ మందును నీటిలో రంగరించి ముద్దగా చేసి యా ముద్దను నీరు నించిన పెద్ద బాన మూతికి దగ్గరగా పడవేయుదురు. ఆ ముద్ద కరిగి యా మందు నీరంతటను వ్యాపించును. ఇచట—నీలిమందును నీరు త్రాగఁజేసినట్లుగా— అని యర్థము చెప్పుకొనవలయును. అంతేకాని 'నైల్యమును వ్యాపింపఁజేసిన రీతిని' అని వివరించుట సరికాదు. శుకసప్తతి యందలి యీ క్రింది ప్రయోగము కూడ పయి యర్థమునకు నిర్ధారకముగానే యున్నది. చూడుఁడు :

గీ. ........ సకల జగద్భీషణాయమాన
నీలవన్నియలను నొక్క నీలి మ్రింగె
ననుట నిజమై యశేష వర్ణాంతరములఁ
గప్పుకొని యొప్పు చిమ్మ చీఁకటులు నెఱియ.
శుక. 1 ఆ. 184 ప.

నన్నెచోడుని 'నీలిఁ గుడిపిన క్రియన్' అను ప్రయోగమునకు సమానార్థకముగా శుకసప్తతియందు 'నీలి మ్రింగె ననుట నిజమై' యిత్యాదిగాఁ బ్రయోగింపఁ బడినది. ఒక్క నీలిమందు లోక భయంకరమైన—బట్టలలోని మురికిని, మాలిన్యము నంతను—మ్రింగె నను మాట యథార్థ మగునట్లుగా చిమ్మ చీఁకటులు—ఇతర వర్ణములఁ గప్పివైచి—తామే యంతట వ్యాపించె నని భావము. పయి చర్చచే 'నీలి గుడిపిన క్రియన్' అనుటకు 'నైల్యమును వ్యాపింపఁజేసిన రీతిని' అని వ్రాయఁబడిన వివరణము సరికాదని తెలుచున్నది.

---

**సీరియల్ నవల**

# ఆకర్షణలో అపస్వరాలు

## శ్రీ సింగరాజు లింగమూర్తి

*(గత సంచిక తరువాయి)*

## 19

కళాసమితి వార్షికోత్సవం ఇక రెండు రోజుల్లోకి వచ్చింది. అందరూ కృషిచేసి విరాళాలు పోగుచేశారు. జంటనగరాలలోని ప్రముఖులందరినీ ఆహ్వానించారు. ఈ వార్షికోత్సవానికి ఆహ్వాన సంఘం ఒకటి ఏర్పాటుచేసి అందులో ప్రముఖుల్ని, ఎక్కువ విరాళాలు ఇచ్చినవారిని సభ్యులుగా వేసుకున్నారు. ఈ వార్షికోత్సవం సందర్భంలోనే ఒక ప్రముఖ రంగస్థలనటుణ్ణి, ఒకప్రముఖ సంగీత విద్వాంసుణ్ణి, మరోప్రముఖ చలనచిత్ర నటుణ్ణి సన్మానించడానికికూడా నిశ్చయించారు. ప్రముఖ నటకుడుగా భూషణంగారిని, సంగీత విద్వాంసుడుగా 'స్వరభూషణ' కృష్ణానందం గారిని, చలనచిత్ర నటుడుగా కురంగేశ్వరరావుని సన్మానానికి గాను ఆహ్వానించారు. కళాసమితి కార్యవర్గం నిర్ణయమే అయినప్పటికీ భూషణంగారికి సన్మానంచేయాలనుకోడంలో సమితియందు దాసు పలుకుబడే ముఖ్యకారణమని కొందరు సభ్యులు గుసగుసలాడుకోకపోలేదు. సంఘటనలకు అభిప్రాయాల వంతెన కట్టేలోకులపద్ధతిని గ్రహించి దాసు, కళాసమితి అధ్యక్షుడు వీర్రాజుతోను, కార్యదర్శి రమణతోను తనతండ్రి భూషణంగారికి బదులు మరొకరి కెవరికైనా సన్మానం చేయండనికోరాడు.

"నిన్నుబట్టి మీ నాన్నగారికి సన్మానం చేయడంలేదు. ఎవరో ఏదో అనుకుంటే మనంచేసేదిలేదు. ఇది మాఇద్దరి నిర్ణయం కూడాకాదు. ఇప్పుడు మార్చుకోవలసిన అవసరంలేదు." అన్నారు.

దాసు చేసేదిలేక మాట్లాడకుండా ఊరుకున్నాడు.

ఆహ్వానసంఘంలో డాక్టరువాసుదేవరావుగారు, ఆయనభార్య రాజేశ్వరమ్మగారూకూడా సభ్యులుగాఉన్నారు. వీర్రాజు, రమణ, వాసుదేవరావుగారు, మరో ఇద్దరు ప్రముఖులు భూషణంగారి దగ్గరకువెళ్లి ఆయనకు సన్మానం జరుపదలచుకున్నట్టు చెప్పారు.

"కాటికి కాళ్ళుజాచుకు కూర్చున్నాను.... నాకు సన్మానమేమిటి ?.... ఏదో నాకుచేతనైనసేవ ఉడతాభక్తిగా నాటకరంగానికి చేశాను. అది ఏకళాకారుడైనా చేసేదే !.... అందుకని సన్మానాలు— ఆర్భాటాలూ దేనికి ?" అన్నారు భూషణంగారు.

"నిండుకుండలు అలాగే అంటారు. మిమ్మల్ని సన్మానించడం మమ్మల్ని మేము సన్మానించుకోడం, ఆంధ్రనాటక కళామతల్లిని సన్మానించడంలాంటిది.... మీరేమీ అడ్డు చెప్పకండి" అన్నాడు వీర్రాజు.

"మా కాలం అయిపోయింది.... నాటకరంగం క్రొత్త క్రొత్త ప్రయోగాలతో ఈనాడు ఎంతో అభివృద్ధి చెందుతోంది.' ఈ అభివృద్ధికి తోడ్పడే ఆధునిక నటకుల్లో ఎవరినైనా సన్మానిస్తే బాగుంటుంది" అన్నారు భూషణంగారు.

"మీవంటివారు మునుపుచేసినకృషి పునాదిలేనిదే ఆధునిక నాటకరంగం ఎక్కడిదండీ !.... మీరువేసిన అడుగుల మీద నడిచే నేటినాటకరంగం విలసిల్లుతున్నది. సినీనటుడు కురంగేశ్వరరావునికూడా సన్మానిస్తున్నాం. మిమ్మల్ని సన్మానించడం మా ధర్మం. మీ సన్మానంకోసం కాకపోయినా, మాకు సందేశం ఆశీర్వాదం ఇవ్వడానికైనా మీ సన్మానం మాకు అవసరం." అన్నారు వాసుదేవరావుగారు.

"ఇంతమంది పెద్దలువచ్చి అడుగుతుంటే కాదనలేకపోతున్నాను. కాని ఎక్కువ ఆర్భాటం చేయకండి" అన్నారు భూషణంగారు.

వార్షికోత్సవానికి ఆ నియోజకవర్గం మంత్రిని అధ్యక్షులుగాను, ముఖ్యమంత్రిని ప్రారంభకులుగాను నిర్ణయించారు. ప్రముఖ చలనచిత్ర దర్శకులు, నిర్మాతలు అయిన ఇద్దరిని వక్తలుగా ఆహ్వానించారు. నాటక, చలనచిత్రరంగాలతో ముడిపడదలచుకుంటున్న రచయితలు తమంతతాముగా సహకరించిన స్వాగత పత్రాలు, సన్మానపత్రాలు, మంత్రులకు ఉపన్యాసాలువ్రాసి సిద్ధం చేశారు. "కొత్త పుంతలు" నాటకం కరపత్రాలు అచ్చువేయించారు. కళాసమితి చేస్తున్న ఉత్తమకృషినిగురించి నివేదిక ముద్రించారు. జంటనగరాల కళాభిమానులు, ప్రసిద్ధ వాణిజ్యవ్యాపారులు విరివిగా విరాళాలు ఇచ్చారు. కార్యవర్గ సభ్యులు, ఆహ్వానసంఘసభ్యులు వార్షికోత్సవపు ఏర్పాట్లు, అతిథులకు వసతులు కల్పించడంలో నిర్విరామంగా కృషిచేస్తుంటే "కొత్త పుంతలు" నాటకం విజయవంతంగా ప్రదర్శించడానికి దాసు బుద్ధి

బలం ప్రయోగిస్తున్నాడు. జయలక్ష్మితోసహా ప్రతివారూ బాగాచేయాలనీ, మెప్పుపొందాలనీ ప్రయత్నిస్తున్నారు. సినీ దర్శక—నిర్మాతలు ప్రముఖ సినీనటుడు కురంగేశ్వరరావు వార్షికోత్సవాలకు వస్తున్నవిషయం ప్రతిక్షణం వాళ్లకు జ్ఞాపకంగానే ఉంటున్నది.

దాసులో ఒకప్రక్క ఉత్సాహం, మరోప్రక్క నిరుత్సాహం అలుముకున్నాయి. నటనను, దర్శకత్వాన్ని ప్రదర్శించే అవకాశం తనకురావడం, తండ్రి భూషణంగారిని సన్మానించడం సంతోషకారణాలైతే, మాలతి విముఖంగా ఉండడం, భూషణంగారి ఆరోగ్యం నానాటికి క్షీణింపవడం, భాస్కరం చెప్పిన మాట వినకుండా తలాయించి తిరగడం, సుబ్బలక్ష్మి వెళ్ళిపోవడం విచార కారణాలైనాయి.

"ఎవరికి దగ్గరిగా ఉందామనుకున్నాడో ఆమె దూరమైపోతున్నది. ఎవరికి దూరంగా ఉందామనుకున్నాడో ఆమె సాన్నిహిత్యం పెంచుకుంటున్నది.... ఏమిటీ చిత్రం ? మాలతికి ఎలా నచ్చచెప్పడం..... భాస్కరాన్ని ఎలా బాగుచేయడం" అన్న ఆలోచనలు దాసులో చెలరేగుతున్నాయి. వీటికి అతీతమైన సమయాన్ని కేటాయించుకుంటూ నాటకం విజయంకావడానికి ప్రయత్నిస్తున్నాడు.

* * *

వార్షికోత్సవ కార్యక్రమాన్ని మూడుగా విభజించారు. పొద్దున్నపూట ప్రముఖ చిత్రకారు డొకాయన రూపొందించిన రంగస్థల పతాకాభివందనంతో వార్షికోత్సవం ప్రారంభం, ఉపన్యాసాలు అప్పుడే ఏర్పాటుచేశారు. సాయంత్రం సన్మానాలు, రాత్రి "కొత్తపుంతలు" నాటక ప్రదర్శనం.

ఉదయం తొమ్మిది గంటలయ్యేప్పటికి ఆడిటోరియం ఆవరణం కార్లతో, సైకిళ్లతో, లాబీ జనంతో నిండిపోయింది. రోడ్డు పొడుగునా జనం మూగిఉన్నారు. ఆ మార్గంమీద ఏకారు వెడుతున్నా అందులో కురంగేశ్వరరావు ఉన్నాడేమోనని జనం విరగబడి చూస్తున్నారు. ఆడిటోరియంను త్రివర్ణ పతాకాలతో ప్రధానద్వారాన్ని మామిడితోరణాలు, అరటిస్తంభాలతోనూ అలంకరించి ఎర్రటిసిల్కుబట్టమీద, కళాసమితి వార్షికోత్సవాలనీ, సుస్వాగతమనీ చెమ్కీ అక్షరాలు వేయించారు. ఆహ్వానసంఘం వారు, కార్యకర్తలు హడావిడిగా ఉన్నారు. ఇంతలో వరుసగా నాలుగుకార్లు లోపలికివచ్చాయి. జనం చప్పట్లుకొట్టి విరగబడ్డారు. పోలీసులకు కొద్దిగా పనిబడింది. మంత్రులరాకను, కురంగేశ్వరరావు రాకనూ సింక్రొనైజ్ చేస్తూ హర్షధ్వానాలు క్రమ్ముకొన్నాయి. వీర్రాజు, రమణ, డాక్టర్ వాసుదేవరావు, మరికొందరు ఆహ్వానసంఘ ప్రముఖులు కార్లలో దిగినవారిని తీసుకువెళ్లి వేదికమీద కూర్చోబెట్టారు.

హాలంతా జనంతో క్రిక్కిరిసిపోయింది. వీర్రాజు మైకు ముందుకువచ్చి, రెండు చిటికెలువేసిచూసి ఆహ్వానసంఘ అధ్యక్షోపన్యాసం చదవడం ప్రారంభించాడు.

హాల్లో ఉన్నంతమంది వేదికమీదకూడా ఉన్నట్లనిపించింది. అగరొత్తులు వెలిగించడం, పూలహారాలు తేవడం, వేయడం,— ప్రతిపనికీ ఒక్కొక్కరుగా, ఎవరెవరో తెలిసినవారూ, తెలియనివారూ ముందుకువచ్చి వేదికమీద కనిపించారు.

తర్వాత ముఖ్యమంత్రి సమితివారే తయారుచేసి తనకు అందజేసిన ప్రారంభోపన్యాసం చదివారు. మంత్రిగారుకూడా తొలిపలుకులు చెప్పారు. రమణ కార్యదర్శి నివేదిక సమర్పించి, అందులో ప్రభుత్వసహాయాన్నీ, ప్రజల సహకారాన్ని అభ్యర్థించాడు. దాసు ప్రముఖులు పంపిన సందేశాలను చదివాడు. ఇక ఉపన్యాసాలు ప్రారంభమయ్యాయి. నాటకకళ పూర్వప్రాభవాన్ని గూర్చి, తెలుగు నాటకరంగం ఎలాపుట్టి, ఎలా అభివృద్ధి చెందుతూ వచ్చిందీ, తొలి తెలుగునాటక మేదైనదీ ఉపన్యాసాల్లో వివరించారు. కళాసమితికృషిని ప్రశంసిస్తూ, ఒక గాయకుణ్ణి, ప్రముఖ నటకులిద్దర్ని సన్మానించడానికి పూనుకోడం ఎంతో అభినందించదగిందనీ, ప్రభుత్వం యథోచితంగా సహాయం చేసినా కూడా ఇది ప్రజా ప్రభుత్వ యుగం కనుక, మనుపటి రాజరికాలు లేవు కాబట్టి, ప్రజలే కళల్ని పోషించాలనీ—ప్రజాస్వామ్య లక్షణ లక్షితంగా అధ్యక్షులు అంత్యోపన్యాసం చేశారు. ప్రతియేడూ కళాసమితి ఇలా వార్షికోత్సవాలు జరుపుకుంటూ, నటుల్ని, గాయకుల్ని సన్మానించడమే కాక, నాటక రచయితలను, కవులను కూడా సన్మానించడానికి పూనుకుంటే బాగుంటుందని కూడా అధ్యక్షపీఠంనుండి మంత్రిగారు సూచన కూడా చేశారు.

వందనసమర్పణం చేస్తూ రమణ అధ్యక్షులు చెప్పినట్లు కళాసమితి సాయశక్తులా కృషి చేస్తుందనీ, ప్రభుత్వ ఆదరణం, ప్రజల సహకారం ఉంటే కళాసమితి విస్తృతమైన పథకంతో సాంస్కృతిక కార్యక్రమాలు, నాటక ప్రదర్శనలు, నిర్వహిస్తూ కళాకారులను సన్మానించగలదని పేర్కొన్నాడు. మంత్రులు వచ్చిన సమావేశం కాబట్టి చాలామంది పత్రికా ప్రతినిధులు కూడా వచ్చారు.

"కురంగేశ్వరరావుగారు మాట్లాడాలి" అని ప్రేక్షకుల లోంచి కేకలు ప్రతిధ్వనించాయి.

"సాయంత్రం ఎలాగూ సన్మానం ఉంది కాబట్టి కురంగేశ్వరరావుగారు అప్పుడు తప్పకుండా మాట్లాడుతా మంటున్నారు" అని రమణ అంటుండగా కురంగేశ్వరరావే లేచి ఆ ప్రకటనకు తన అంగీకారంగా సభికు లందరికీ నమస్కరించాడు.

* * * *

సాయంత్రం సన్మాన సభ ప్రారంభమైంది. రమణ వేదికపైకి వచ్చి సభికులకు నమస్కరించి "మహాజనులారా, ఈనాడు ముగ్గురు ప్రసిద్ధ కళాకారులను సన్మానించుకునే సదవకాశం కలిగినందుకు మా కళాసమితి తన అదృష్టంగా భావిస్తున్నది. ఈ సందర్భంలో మాకు విరాళాలిచ్చి ప్రోత్స

# ఆకర్షణలో అపస్వరాలు

హించిన మీ అందరికీ మా కళాసమితి పక్షాన కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఈ సన్మాన సభకు సుప్రసిద్ధ వైద్య నిపుణులు, కళాభిమానులు అయిన డాక్టర్ వాసుదేవరావుగారిని అధ్యక్షత వహించవలసిందిగా కళాసమితి తరపున ప్రార్థిస్తున్నాను. సన్మాన్యులు, భూషణంగారు, కురంగేశ్వరరావుగారు కృష్ణానందంగారు, ఉపన్యాసకులు వేదికమీదకు వచ్చి ఆసీనులు కావలసిందిగా కోరుతున్నాను.'' అన్నాడు.

కరతాళధ్వనుల మధ్య అందరూ వేదికమీదకు వెళ్లి సుఖాసీను లయ్యారు. పూలదండల సంప్రదాయం ముగిసిన తర్వాత వాసుదేవరావుగారు అధ్యక్ష స్థానంలో నిలబడి తాము మొదటినుంచీ కళాసమితి కార్యక్రమాలను తిలకిస్తున్నట్టు అవి ఉత్తమ స్థాయిలో ఉండి, ప్రజల మెప్పులు బడిసినట్లు చెప్తూ ఈనాడు కళాసమితి వార్షికోత్సవాలు జరుపుకుంటున్న సందర్భంలో ముగ్గురు సుప్రసిద్ధ కళాకారులను సన్మానించడం సాటి సంస్థలకు మార్గదర్శకంగా ఉందని చెప్పి, ఆ ముగ్గురి కళాకారుల ప్రాశస్త్యాన్ని, శక్తిసామర్థ్యాలను పరిచయం చేశారు. తరువాత కళాసమితి పక్షాన వాసుదేవరావుగారు కళాకారులకు సన్మానపత్రాలు, నూతన వస్త్రాలు, నూట పద హార్లు ఇచ్చి సన్మానించారు. తమకు జరిపిన సన్మానాలకు కళాకారులు ముగ్గురూ ఉచితరీతిని సమాధానమిస్తూ కృతజ్ఞతలు తెలుపుకున్నారు. మరొక పది నిమిషాలలో 'కొత్త పుంతలు' నాటకం ప్రారంభం అవుతుందనీ, సభికులు నిశ్శబ్దంగా కూర్చోవలసిందనీ రమణ విజ్ఞప్తి చేశాడు. వేదిక మీద తెర మూసుకుంది.

* * * *

గ్రీన్‌రూంలో నటీనటులు హడావిడిగా ఉన్నారు. మీనాక్షి అద్దంలో తన మేకప్‌ను చూసుకుని మెడ అటూ—ఇటూ తిప్పుతూ జాకెట్ ఎత్తులపైన మెడవద్ద కేక్ పూసుకుంటుంటే, జయలక్ష్మి వద్దనే ఉండి వెంకటేశ్వర్లు ఏవో కబుర్లు చెప్తూ నవ్విస్తున్నాడు. దాసు అప్పుడే మేకప్‌మేన్ ముందునుంచి లేచి వచ్చి నిలువుటద్దంలో చూసుకుంటున్నాడు. మీనాక్షి అతని దగ్గరకు వచ్చి "ఏమండీ— నా మేకప్ ఎలా ఉంది ?'' అని చిత్రంగా, మురిపెంగా రెప్పలార్పుతూ ప్రశ్నించింది. "చాలా బాగుంది'' అన్నాడు దాసు క్రాపు సరిచేసుకుంటూనే.

"అబ్బ .... మిమ్మల్ని చూస్తుంటే ...... '' అంది చిరునవ్వుతో.

"ఏం ? .... ఎలావుంది .... బాగుండలేదా ?'' అన్నాడు దాసు మరోసారి అద్దంలో చూసుకుంటూ.

"ఉత్తప్పుడే అందంగా ఉంటారు .... ఇప్పుడు మరీ...'' అంటూ మీనాక్షిమాటలు మింగేసింది.

"కొంపదీసి స్టేజిమీద పోర్షన్ మర్చిపోయేవు, మైమరచి'' చిరుకోపంతో అన్నాడు దాసు నవ్వుతూ.

నటీమణుల కనుసన్నల్లో ఉంటూ వాళ్ళు కావాలనుకుంటున్నవి విని అడక్కముందే అందించే భారం స్వయంగా మోస్తున్నా డొక సభ్యుడు. జయలక్ష్మికి వెంకటేశ్వర్లు టీ తెచ్చిపెట్టాడు. అద్దం ముందు ముంగురులు సవరించుకుంటూ, పైట మడతలు దిద్దుకుంటున్న మీనాక్షి 'బల్ల మీద ఉంచండి' అన్నప్పటికీ అలాగే నిలబడి, ఆమె ఇటుతిరిగినప్పుడు స్వయంగా టీ కప్పు చేతి కందించి మురిసిపోయా డొక సభ్యుడు. గ్రీన్‌రూంలో సభ్యులు, సభ్యులు కానివాళ్ళు, పరిచయస్తులు ఎందరో మసురుతున్నారు. రమణ గ్రీన్ రూంలోకి వచ్చి "ఊఁ—అందరిదీ అయిపోయిందా, టైం దగ్గర పడుతున్నది'' అన్నాడు. రమణ వెంట రాజు కూడా వచ్చి దాసు భుజం తట్టి "బ్రహ్మాండంగా చెయ్యాలి'' అని ఒక చూపు ముందుగా వదిలి మీనాక్షిని కూడా పలకరించాడు. ఒక మూలకు వెళ్లి నిలబడి పైట తొలగించుకొని జాకెట్ సరిచేసుకుంటున్న మీనాక్షి రాజు పలకరింపునకు సిగ్గుపడి జవాబివ్వకుండానే నిల్చిపోయింది. "సరే—మేకప్ చూసుకోండి, మీ యాక్షన్ కూడా మా దాసుతో పోటీపడేట్లుండాలి మీనాక్షిగారూ !'' అని రాజు గ్రీన్‌రూం నుండి వెళ్లిపోయాడు.

"ఇంక అనౌన్సు చేయమంటావా ?'' అన్నాడు రమణ.

"ఊఁ—కానీ'' అన్నాడు దాసు.

రమణ స్టేజీ లోపలకు వెళ్లి మైకుముందు నిలబడి "కొత్త పుంతలు'' నాటకం కొన్ని క్షణాల్లో ప్రారంభమవుతుందని చెబుతూ, పాల్గొనేవారి పేర్లు, వారు వేసే పాత్రల పరిచయం ప్రకటించాడు. మరుక్షణంలో కొబ్బరి కాయ కొట్టడం, హారతి పట్టడం అయిపోయింది. వెంటనే నీలి తెర నెమ్మది నెమ్మదిగా విడివడింది. వేదికమీద మీనాక్షి ప్రియునికోసం ఎదురు చూస్తున్నట్టు హావభావాలను ప్రదర్శిస్తున్నది. ఆమె ఏమీ తోచనిదానిలా వెళ్లి రేడియో ట్యూన్ చేస్తుంది. ఆమె మనోభావాలను వ్యక్తీకరించేట్టు తెరవెనుక నుంచి పాట వినిపిస్తూంటుంది. సీను ప్రారంభం అయ్యేప్పటికి హాలులో నిశ్శబ్దం ఆవరించింది.

ముందువరుసల్లో ముఖ్యమంత్రి, మరి ఇద్దరు మంత్రులు వారికొక ప్రక్క కురంగేశ్వరరావు, మరో ప్రక్క కృష్ణానందం, తర్వాత భూషణంగారు కూర్చున్నారు. ఒక ప్రక్క వాసుదేవరావుగారు, రాజేశ్వరమ్మగారు, మాలతి, మైత్రేయి కూర్చున్నారు. మాలతి ఎంతో ఆసక్తితో, శ్రద్ధగా వేదికవైపు చూస్తున్నది.

దాసు వేదికమీదకు వచ్చాడు. ఖద్దరు ధోవతి, లాల్చీ, పైన వేస్టుకోటు, కాళ్లకు సాదా శాండిల్సూ—ఇదీ అతని వేషధారణ. మనిషి కాస్త అలిసినట్టు కనిపిస్తాడు. వసంత వేషంలో ఉన్న మీనాక్షి అతణ్ణి చూడగానే చిరుకోపంతో ముఖం ప్రక్కకు త్రిప్పుకొని కూర్చుంటుంది. దాసు ఆమె దగ్గరగా వెళ్లి ఆమెను సమాధానపరచడానికి ప్రయత్నిస్తూంటాడు.

"మీకు నాకంటే ఆ ప్రజలే ఎక్కువ.... వాళ్లమీద ఉన్న ప్రేమ పిసమంతైనా నామీద ఉందీ .... వెళ్లండి—అక్కడికే వెళ్లండి—" చిరుకోపం చిందుతూ, నిష్ఠూరోక్తులు పలుకుతూ, చూపుల్తో ప్రేమ నటిస్తున్నది మీనాక్షి.

"పిచ్చిదానా, నీమీద ప్రేమ లేకపోవడం ఏమిటి ? ఏరీకోరి చేసుకున్న ఇంతివికావూ ! .... నాతో సహకరించకపోతే పోనీ, కనీసం నన్ను అర్థం చేసుకోటానికైనా ప్రయత్నించు వసంతా ! .... తేపొ ప్రజలూ—ప్రజలూ అంటావు ...... వారి మన మెవరు చెప్పు." అంటున్నాడు దాసు.

"మనిద్దర్నీ దూరంగా ఉంచే ఈ మంత్రిపదవి ఎందుకు ? నాలుగుసార్లు కార్లలో తిరిగి, పదిమంది నౌకర్ల పనులు చేస్తుంటే సరిపోయిందా ? .... ఎప్పుడూ మీ రాచ కార్యాలు, టూర్లు, సభలూ—సమావేశాలూ .... ఒక ముద్దు లేదు, ముచ్చట లేదు ..... "

"ఈ మంత్రి పదవి నే నాశించానా ..... మొదట్లో నాకు మంత్రిపదవి వద్దంటే నీ వేమన్నావో జ్ఞాపకం చేసుకో.... అప్పుడు నీ భర్త మంత్రి కావాలనీ, అఖండ గౌరవాలు పొందాలనీ అనుకున్నావు. తీరా ఇప్పుడు అది వదులుకో మంటావు.... పదిమందినీ కలుపుకోమనీ, ఎన్నికల్లో గెలవమనీ శత పోరావు నువ్వే .... నేను మంత్రి అయినాక, కాలిమీద కాలేసుకు అనుభవించాలనుకున్నావు కాబోలు; మరి బాధ్యతలుమాత్రం నిర్వహించ వద్దూ ?"

మాలతి రెప్పవాల్చకుండా చూస్తున్నది. దాసుమీది ఆమె చూపులు ఆమెను మెలికలు త్రిప్పుతున్నాయి. రక్త ప్రసారంలో దాసు వేడిమి కలిగించాడు. మీనాక్షి ఎలా నటించిందో, దాసు చెప్పిన డైలాగు లేమిటో కూడా మాలతి అంతగా పట్టించుకోలేదు. మొదటి సీను మాత్రం ప్రేక్షకుల్ని ఆకట్టివేసింది. చకచకా మిగతా నాటకం జరిగిపోతున్నది.

పదవుల్లో ఉన్నవారి బాహ్య సమస్యల్నే తప్ప వారి కుటుంబ సమస్యల్ని పరిగణించని చాలామంది ప్రేక్షకులకు ఈ నాటకంలోని కథాగమనం ఇంపుగానే తోచింది. మంత్రుల నీతి నిజాయితీలు, ప్రజాశ్రేయః కాంక్ష, అవినీతిరహిత సమాజ స్థాపనా దీక్ష నటించడంలో దాసు తనను తానే మరచి నటించాడనిపించేట్లు పాత్రలో ఇమిడిపోయాడు. తన బాధ్యతల నుండి వైదొలగింప జేసేందుకు, ప్రజలకు తన ఋణాన్ని తీర్చుకోనివ్వకుండా అడ్డుపడేందుకు భార్య, బంధువులు, స్నేహితులు పదవుల్లోని వారిని ఎలా పీడించేదీ, ఆ విషవలయం లోంచి బయటపడలేని వ్యక్తి పడే అంతర్వేదనా దాసు చిత్రించడంలో పరాకాష్ఠ అందుకున్నాడు. ప్రేమించి పెళ్లి చేసుకున్న భార్య కూడా తనను అర్థం చేసుకోలేక, స్వార్థానికి పద విని, దేశాన్నీ వాడుకోవాలని బలవంతపెడితే గిజగిజ లాడిపోయిన భర్తలా దాసు నటన మాలతిలో ఏవో క్రొత్త ద్వారాలను తెరిచింది. నాటకం పూర్తి అయిందనేప్పటికి 'అరే—అప్పుడే అయిపోయిందే' అనుకున్నారు చాలామంది.

రమణ వేదికమీదకు వచ్చి సభికులకు కృతజ్ఞతలు తెలుపుతూ "నటీనటులను పరిచయం చేయడం సమంజసంగా ఉంటుందని భావిస్తున్నాను. పరిచయాలు అయిన తరువాత ఉత్తమ నటనకు బహుమతి శ్రీ కురంగేశ్వరరావు గారు అందజేస్తారు" అని ఒక్కొక్కరినే పిలిచి పరిచయం చేశాడు.

కురంగేశ్వరరావు దాసుతో కరచాలనం చేశాడు. 'చాలా రోజుల తరువాత ఒక చక్కటి నాటక ప్రదర్శనాన్ని చూశాను. దాసుగారి నటన అసామాన్యంగా ఉంది. సాధారణ నటులు అందులో అమెచ్యూర్ సంస్థల్లో ఉండే నటులు ఇంత ప్రతిభావంతంగా నటించడం నిజంగా గర్వకారణం. వారి దర్శకత్వం కూడా చాలా అద్భుతంగా ఉంది. ఇలా అమెచ్యూర్ సంస్థల దీక్షలోంచే ప్రభుత్వ సహాయంతో సర్వ సంపన్నమైన వృత్తి రంగస్థలం మన కేర్పడాలి. మన రంగస్థలం, చలనచిత్రరంగం కూడా విస్తరిస్తున్నాయి. ప్రభుత్వం ఎంత కట్టుదిట్టాలు అధికం చేసినా ప్రజలు కళాభిరుచి పెంచుకొని సినీరంగానికి ఇస్తున్న ప్రాధాన్యం అందరికీ తెలిసిందే ! ఎందరో కొత్త నటీనటులు మన కీనాడు అవసరం. కళాసమితి ఉత్తమ నటుల్ని అందిస్తుందన్న విశ్వాసం ఏర్పడింది." అని కురంగేశ్వరరావు తన చేతిలోని రజత పేటికను కరతాళధ్వనులమధ్య దాసుకు అందజేశాడు. వసంతగా నటించిన మీనాక్షిని కూడా కురంగేశ్వర్రావు ప్రశంసించాడు. ఒక పట్టభద్రురాలు నాటక రంగంలోకి ప్రవేశించడం సోదరీమణు లందరికీ మార్గదర్శక మనీ, గర్వకారణమనీ భావిస్తున్నా నన్నారు. ఆమె ముందు ముందు ఇంకా ఉత్తమ నటీమణి కాగలదని విశ్వసిస్తూ ఆమెకు రజితపతకం అందజేశాడు.

"నటనలో ఎన్ని సాధక బాధకా లున్నాయో, అందులో దానుగారు ధరించిన పాత్రను నిర్వహించడం ఎంత కష్టసాధ్యమో నటుడినైన నాకు మీకంటె బాగా తెలుసు. దాసుగారి భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుందని భావిస్తున్నాము. దాసుగారి వంటి నటులు సినిమా రంగంలోకి వస్తే మాకూ

కొంత భారం తగ్గుతుంది. దాసుగారికి అటువంటి అవకాశం త్వరలో కలుగుతుందని ఆశిస్తున్నాను.'' అంటూ కురంగేశ్వర రావు అప్పటికప్పుడు దాసుకు తనచేతి రిస్టువాచీతీసి అలంకరించి ''ఇది నా వ్యక్తిగత బహుమానం'' అని ప్రకటించాడు. హాలు దద్దరిల్లిపోయింది. మాలతి మనస్సు చెమ్మగిల్లింది. భూష ణంగారిలో కలిగిన ఆనందం వర్ణనాతీతం. ఆనందాశ్రువు లతో ''భగవాన్, వాడిని నాలుగు కాలాలపాటు వర్ధిల్లనియ్యి'' అని ప్రార్థించారు మనస్సులోనే.

మాలతిలో ఆనందం ఉరకలు వేస్తున్నది. దాసును అభినందించకుండా ఉండలేకపోయింది. ప్రక్కనే ఉన్న తల్లితో కూడా చెప్పకుండా చరచరా గ్రీన్‌రూంలోకి వెళ్లింది. అక్కడి దృశ్యాన్ని చూసి స్తంభించిపోయింది.

మీనాక్షి ఒంగి దాసుకు పాదాభివందనం చేస్తున్నది. ''ఏమిటిది మీనాక్షీ .... '' అంటూ దాసు ప్రక్కకు జరి గాడు., ఆమెను బుజాలు పట్టుకు లేపుతూ.

మీనాక్షి లేచి నిలబడి ''ఇంకెలా తెలుపుకోను నా కృత జ్ఞత .... ఏదో కాలేజీ నాటకాల్లో చిన్న చిన్న వేషాలు వేశాను. నాకు ప్రధాన పాత్ర యిచ్చి, నా నటనకు ఎన్నో సలహా లిచ్చి మెరుగులు దిద్దారు.'' అంది.

''అది నా కర్తవ్యం'' అంటూ దాసు ప్రక్కకు తిరిగే ప్పటికి గ్రీన్‌రూంలోంచి వెనుకకు వెళ్లిపోతున్న మాలతి కనిపిం చింది. ''మాలతీ!'' అని కేకవేస్తూ ముందుకు వెళ్లాడు. మాలతి ఆగిపోయింది. మాటలు లేకుండా పైటకొంగుముని వళ్లతో కొరుకుతూ తల వంచుకుంది. దాసు ఆమెకు ఎదు రుగా వెళ్లాడు. మాలతి కళ్లల్లో నీళ్లు నిండాయి. ఆప్యా యంగా బుజాలు కుదుపుతూ ఏడుస్తున్నావా మాలతీ ! ....'' అన్నాడు దాసు.

అప్పటికే అందరి దృష్టి అటు పడింది. మాలతి పమిటచెంగుతో కళ్లు తుడుచుకుంటూ అక్కడినుంచి చర చరా వెళ్లిపోయింది. దాసు అటువైపే చూస్తూ నిలబడి పోయాడు.

## 20

''క్రొత్త పుంతలు'' ప్రదర్శించిన తరువాత జంట నగరా లలో కళాసమితికి, దాసుకు కీర్తి ప్రతిష్ఠలు మరింత పెరిగాయి. వార్షికోత్సవం దృశ్యాలు, సన్మానితుల ఫోటోలు, 'క్రొత్త పుంతలు'' నాటకం దృశ్యాలు, సన్మానదృశ్యాలు ప్రచు రించి పత్రికలు కళాసమితికి, దాసుకు మంచి ప్రచారం ఇచ్చాయి. దాసుకు ఆఫీసులో కూడా గౌరవాభిమానాలు పెరిగాయి. అధి కారుల ప్రశంసలకు పాత్రుడైనాడు. అతనికి ప్రమోషన్ ఇస్తే మరింత ప్రోత్సహించినవాళ్లం అవుతామని అధికారులు అవకాశంకోసం చూస్తున్నారు. దాసుకు సినిమా ఛాన్సు తప్ప కుండా దొరుకుతుందనీ, అతణ్ణి మంచి చేసుకోవడం ఎందుకైనా మంచిదనీ కొందరు అతనితో స్నేహం కలుపుకుంటున్నారు. వెంకటేశ్వర్లుకు లోలోపల దాసుమీద, మీనాక్షిమీద అసూ యగాఉన్నా, పైకి ఏమీ అనలేక పోతున్నాడు. మరో పదిహేను రోజుల్లో కళా పరిషత్తు పోటీ నాటకాలలో పాల్గొనాలి. కాబట్టి దాసు ఎవరినీ నొప్పించక, అందరినీ కూడగట్టుకొని వస్తున్నాడు. ప్రదర్శనం చాలా బాగుందని అందరూ పొగడినా దాసుకు కొన్ని లోపాలు కనిపించి, వాటిని కూడా పూరించ డానికి కృషి చేస్తున్నాడు. వార్షికోత్సవం జరిగిన పిమ్మట వారం రోజులు అందరికీ విశ్రాంతియిచ్చి, తిరిగి రిహార్సల్సు ప్రారంభించాడు. దాసుకు ఒక ప్రక్క పరిస్థితులు ఇంత ప్రోత్సా హకరంగాఉన్నా, మానసికంగా అతనికి శాంతి లభించడం లేదు. భూషణంగారి ఆరోగ్యం రెండు రోజులు బాగుంటే రెండు రోజులు అనారోగ్యంతో బాధపడుతున్నారు. దగ్గు, ఆయాసంతో ఆయన రోజు రోజుకీ కృశిస్తున్నాడు. వాసుదేవ రావుగారిని అడిగితే, ఆయన ఉచితంగానే చికిత్స చేస్తాడని తెలిసినా, మాలతి విముఖంగా ఉండడం, అప్పటికే ఆ కుటుం బానికి ఎంతో ఋణపడి ఉండడంవల్ల దాసు వాసుదేవరావుగారి దగ్గరకు వెళ్ళడానికి అభిమానపడ్డాడు. వేరే డాక్టరిని మాట్లాడి మందులు, ఇంజక్షన్లు ఇప్పిస్తున్నాడు. రోజూ మందు ఖర్చుల సంగతి ఎట్లాఉన్నా, పళ్లకి, పాలకి, రొట్టెలకు బోలెడంత ఖర్చు అవుతున్నది. తండ్రికి, తనకు జరిగిన సత్కారాలవల్ల వచ్చిన డబ్బు చేతిలోవుంది కాబట్టి, అప్పులు తీర్చలేకపోయినా భూషణంగారికోసం ఖర్చుపెట్టగలిగాడు. ఒకరోజు చిల్లర లేక భాస్కరానికి పది రూపాయల నోటు ఇచ్చి పళ్లు తెమ్మని పంపిస్తే తిరిగి రాలేదు. అంతకుక్రితంరోజు బొగ్గుల దుకా ణంలో కట్టమని ఇచ్చిన పదిహేను రూపాయలు కూడా ఇవ్వ లేదని తెలిసేప్పటికి దాసు చాలా బాధపడ్డాడు. ఓ చెంప అప్పుల వాళ్లు డబ్బు చెల్లించమని ఒత్తిడి చేస్తున్నారు. ఇలాంటి పరిస్థితులలోనే సుబ్బలక్ష్మినుంచి ఒక ఉత్తరం వచ్చింది. ఏమి వ్రాసిందోనని ఆదుర్దాగా కవరు చించాడు దాసు.

''ప్రియమైన అన్నయ్యకు, నీ చెల్లెలు అనేక నమ స్కారములుచేసి వ్రాయునది ఏమనగా........మీకు ఉత్తరం వ్రాసి చాలారోజులైంది. నాన్నగారికీ, నీకూ జరిగిన సన్మానం వార్తలు, ఫోటోలు పత్రికలలో చూశాను. ఈ నాటికైనా దేశం నాన్నగారిని గుర్తించి, సన్మానించినందుకు నాకు చాలా సంతోషంగాఉంది. ఇంత చిన్నతనంలోనే నీకు నాన్నతో సమాన మైన గౌరవం లభించినందుకు నిజంగా నేను చాలా మురిసి పోతున్నాను......'బెండకాయ ముదిరినా, బ్రహ్మచారి ముది రినా' అనే సామెత ఒకటుందిగా మనలో. పెళ్లికాకపోయినా, సంసార బాధలు, తాపత్రయం పొందుతున్నావు. ఇప్పుడు నా బాధ్యత నీకు తీరిపోయింది కాబట్టి నీవు తొందరగా పెళ్ళి చేసు కుంటే బాగుంటుంది. మాలతి నీకు తగిన భార్య. ఆమె నిన్ను

చేసుకునే ఉద్దేశంలో ఉందనుకుంటాను. అంతస్తుల భేదాలు మీమధ్య అడ్డం రావనికూడా అనుకుంటాను. నేను అక్కడి నుంచి వచ్చేప్పుడు మాలతిని కలుద్దామనుకున్నాను. కాని, కుదరలేదు. ఆమెను అడిగాననీ, నమస్కారాలనీ చెప్పు. నాన్నగారి ఆరోగ్యం ఎలా ఉన్నదీ, ఎప్పటికప్పుడు తెలుపుతూ ఉండాల్సింది.........ఇక నా సంగతి—ఒక స్కూల్లో చేరాను......ఏదో జీవితం గడిచిపోతున్నది. ఇంతకంటే వ్రాసి మిమ్మల్ని బాధ పెట్టలేను. శ్యాముకు, చిట్టితల్లికి ఇక్కడ అంతా క్రొత్తగా ఉంది. ఎప్పుడూ ''మామయ్యదగ్గరకు వెళ్ళిపోదామే అమ్మా'' అంటుంటాడు శ్యాం. అమ్మకు, నాన్నకు నమస్కారములని చెప్పు. భాస్కరం బుద్ధిగాఉండి, చదువు కుంటున్నాడా? ఉత్తరాలు నా స్కూలు అడ్రసుకే వ్రాస్తుండు......ఇట్లు నీ ప్రియమైన చెల్లెలు.......అడ్రసు కాగితం దీనితో జత పరుస్తున్నాను'' దాసు ఉత్తరం మడచి జేబులో పెట్టుకున్నాడు.

''ఏమిటీ—ఇంత వ్రాసి తన స్వవిషయం దాచేసిందే?.... ఏదో బాధపడుతున్నట్టుంది. విశ్వనాథం సరిగా ఉంటున్నాడో లేదో?........అయితే మాలతి నిజంగా తనను పెళ్లిచేసుకోవాలన్న ఉద్దేశంతో ఉందన్నమాట.......మరి ఇప్పుడెందుకిలా మారిపోయింది?'' అని ప్రశ్నించుకున్నాడు దాసు. జరిగినవన్నీ జ్ఞాపకం చేసుకుంటున్నాడు. కారుక్రింద పడబోతున్న మీనాక్షిని ప్రక్కకు లాగడంలో ఆమె ఒత్తుకోడం, బట్టల షాపులో ఆమె ప్రక్కన నిలబడి చీరెలు బేరం చేయడం, గ్రీన్‌రూంలో మీనాక్షి తన కాళ్లకు నమస్కరించడం ఒక్కొక్కటే అన్నీ జ్ఞాపకం వచ్చాయి. ''నిజమే—అనుమానించడానికి ఈ మూడు సంఘటనలు చాలు. కాని, తను చేసిన తప్పేమిటి? బుద్ధి పూర్వకంగా తనేమీ చేయలేదే!......మాలతి అనుమానం బలపడటానికి కొంత మీనాక్షి ప్రవర్తనే కారణం....నిజానికి మీనాక్షి అందకత్తె అయినప్పటికీ తన కామెమీద వ్యామోహం ఏమీ లేదు. ఆమెకు దూరంగా ఉండటానికే ప్రయత్నిస్తుంటాడు. ఈ సంగతులన్నీ మాలతికి ఎలా తెలుస్తాయి?'' అని ఆలోచించాడు దాసు. ''తనకై తనేమీ చేయలేడనీ, కాలమే మంచీ—చెడూ నిర్ణయిస్తుందనీ'' సమాధానపరచుకున్నాడు.

దాసు మరునాడు కళా పరిషత్తు నాటకాల పోటీల్లో పాల్గొనేందుకు బయలుదేరి వెడుతున్నాడు. వాసుదేవరావుగారితో చెబుదామనీ, వీలైతే మాలతితో మాట్లాడుదామనీ వాసుదేవరావుగారింటికి వెళ్లాడు. దాసును చూడగానే వాసుదేవరావుగారు సాదరంగా ఆహ్వానించి డ్రాయింగ్‌రూంలో కూర్చోపెట్టారు.

''నాకు చాలా సంతోషంగాఉంది మిస్టర్ దాసూ!...... నీకు కళాపరిషత్తులో కూడా ఉత్తమ బహుమతి లభించి తీరుతుంది'' అన్నారు వాసుదేవరావుగారు.

''పెద్దల ఆశీర్వాదంఉంటే అంతే చాలు. ఏదో నా సాయశక్తులా కృషి చేస్తున్నాను'' వినయంగా అన్నాడు దాసు.

దాసు వినయ విధేయతలకు లోలోపలే మెచ్చుకుంటూ బాయ్‌ని కేకవేసి, ''దాసుగారు వచ్చారని అమ్మాయిగార్నితో చెప్పవోయ్'' అని ఆదేశించారు వాసుదేవరావుగారు.

''ఆ......ఇంకేమిటి విశేషాలు దాసూ!.......నాన్నగారి ఆరోగ్యం ఎలా ఉంది?''

''కొంచెం కులాసాగానే ఉంది సార్!''

''అంటే కొంచెం అనారోగ్యంగాకూడా ఉన్నారన్నమాట.......భలేవాడివేనయ్యా......నీవేం మొగమోటపడకు. మీ నాన్నగారికి నా సర్వీసెస్ ఎప్పుడూ లభిస్తాయి. ఆయనకు ఏమాత్రం బాగుండకపోయినా నాతో వచ్చి చెప్పు....., నేను ట్రీట్ చేస్తాను......అశ్రద్ధమాత్రం చేయకు'' అన్నారు వాసుదేవరావుగారు.

''థ్యాంక్సు......అలాగేనండీ!''

ఇంతలో మాలతీ, మైత్రేయి లోపలకు వచ్చారు. మాలతి నమస్కరించి మౌనంగా కూర్చుంది.

''ఏమండోయ్ దాసుగారూ రేపు . మీరు సినిమాలో హీరో అయితే మేము జ్ఞాపకం ఉంటామా?'' నవ్వుతూ అంది మైత్రేయి.

''అసలు అయితేకదా!'' అన్నాడు దాసు.

''అయితే మరచిపోతారన్నమాట......అవునులెండి—ఇప్పటికే కాస్త మరచిపోయారు. అప్పుడు పూర్తిగా మరచిపోతారు'' వ్యంగ్యంగా అంది మైత్రేయి.

''దాసు అలాంటివాడుకాదు మైత్రేయీ! చాలా బుద్ధిమంతుడు'' అన్నారు వాసుదేవరావుగారు.

''మీ దృష్టిలో నేను బుద్ధిమంతుడినే కావచ్చు....... అందరి దృష్టిలో అలా ఉంటానా సార్!'' మాలతి వంకచూస్తూ అన్నాడు దాసు.

''అదేమిటోయ్ !......చాలా తమాషాగా మాట్లాడుతున్నావ్!........ఏమ్మా మాలతీ నీవేం మాట్లాడవేం?'' కూతురివంక చూస్తూ అన్నారు వాసుదేవరావుగారు.

మాలతి ఒకసారి తండ్రివంక, ఒకసారి దాసువంక చూసి ఊరుకుంది.

''అక్కయ్య ఈమధ్య మాట్లాడటమే మరచిపోయింది నాన్నగారూ.......చదువుతున్నట్టు ఏదో ఓ పుస్తకం పుచ్చుకొని దిగాలుపడి కూర్చుంటుంది.......పలకరిస్తే కసిరికొడుతుంది'' అంది మైత్రేయి.

''ఏమిటీ—పెద్ద జబ్బే పట్టుకుందే!'' నవ్వారు వాసుదేవరావుగారు.

''మీరే డాక్టరుకదా—ఆ జబ్బేమిటో తెలుసుకొని చికిత్స చేయండి'' దాసు కూడా నవ్వుతూనే అన్నాడు.

# ఆకర్షణలో అపస్వరాలు

"మీరేం పంపో తిప్పనక్కరలా" అంటూ మాలతి విసవిసా వెళ్ళిపోయింది.

"ఏం అమ్మడూ—అక్కకీ, దాసుకీ మధ్య లిటిగేషన్ ఏమైనా వచ్చిందేమిటి?" తమాషాగా నవ్వుతూ అన్నారు వాసుదేవరావుగారు.

"నాకుమాత్ర మేం తెలుసు నాన్నగారూ......దాసు గారినే అడగండి" చిలిపిగా చూస్తూ అంది మైత్రేయి.

"ఏం దాసూ?"

"అబ్బే—అలాంటిదేం లేదండి!......ఎందుకో ఇవ్వాళ ఆవె చిరాగ్గా ఉన్నట్టుంది" అన్నాడు దాసు.

"ఉహూ" అంటూ వాసుదేవరావుగారు ఏదో ఆలోచిస్తున్నారు.

బాయ్ ట్రేలో కాఫీ కప్పులుతెచ్చి, ముగ్గురికీ అందించి వెళ్ళాడు. ముగ్గురూ కాఫీసిప్ చేస్తున్నారు. ఇంతలో మాలతి గదిలోంచి వీణావాద్యం వినిపించింది. దానితోపాటే ఆమె గాత్రం.

డ్రాయింగ్‌రూంలో టెలిఫోన్ మోగింది. మైత్రేయి రిసీవరు అందుకొని, "హలో — ఎవరూ......ఆఁ......ఆఁ...... ఉన్నారు........" అంటూ రిసీవరు చెవిదగ్గరినుంచితీసి, "నాన్నగారూ మీకే ఫోన్—హాస్పిటల్‌నుంచి" అంది. వాసుదేవరావు గారులేచి రిసీవరు అందుకొని "హలో......అ......ఎస్...... అలాగా......వస్తున్నా......ఆఁ......ఆఁ...ఓకే" అంటూ రిసీవరు పెట్టేసి "మిస్టర్ దాసూ, నేను అర్జెంటుగా హాస్పిటలుకు వెళ్ళాలి. నీవు కాసేపు కూర్చుని వెళ్ళు......వూరినుంచి మళ్ళీ వచ్చాక తప్పకుండా రావాలి సుమా!" అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయారు. బాయ్‌వచ్చి ఖాళీ కప్పులు ట్రేలో పెట్టుకొని వెళ్ళాడు.

"ఇంక నేను కూడా వెడతాను మైత్రేయీ!" అంటూ లేచాడు దాసు.

"కూర్చోండి—పోదురుగాని. వీణపాట అంటే మీకు చాలా ఇష్టంగా, అక్కపాట పాంతం వినివెళ్ళండి" అంది మైత్రేయి.

మాలతి ఆమె గదిలో కూర్చుని వీణమీద భావగీతం పాడుతున్నది.

"మామిడి చెట్టును అల్లుకొన్నదీ మాధవీలతొకటీ"...... మధ్య మధ్య మాలతి స్వరం తటాలున ఆగిపోయి, వీణా నిక్వాణమే ప్రధానమై వినిపిస్తున్నది. గుండెల్ని బిగబట్టి స్వరాన్ని ప్రయత్న పూర్వకంగా మాలతి వెళ్ళదీస్తున్నది. కంపిస్తున్న స్వర మాధుర్యాన్ని వీణానాదం కప్పివేస్తున్నది. తను బాధపడుతూ, తనను బాధ పెడుతూ, మాలతి ఎందుకీ వీణ వాయిస్తున్నదో దాసుకు అర్థం కాలేదు. లోని బాధ తనతో చెప్పరాదా? అనుమానం తీర్చుకోరాదా? క్షణంలో స్పష్టంగా పరిష్కారం కాగల అంశాలను సినిమాల్లోలాగా అపరిష్కృతంగా మాలతి ఎందుకు దాట వేస్తున్నదో కూడా అర్థం కాలేదు దాసుకు. అనాదరంగా అక్కడే కూర్చోడానికి దాసుకు మనస్కరించలేదు. "మాలతి దగ్గరకు వెళ్ళి నిలబడినా మాట్లాడుతుందన్న నమ్మకమేమిటి" అనుకుంటూ దాసు లేచి "వెడతాను మైత్రేయీ......ఇంకా నాకు చాలా పనులున్నాయి......మీ అక్కయ్యతో చెప్పు...... నా తప్పేమైనాఉంటే క్షమించమను" అంటూ చరచరా డ్రాయింగ్ రూంలోంచి ఇవతలకువచ్చి మెట్లు దిగుతున్నాడు. వెనుకనుంచి మాలతి పాట వినిపిస్తూనేఉంది. మెట్లు లెక్క పెడుతున్నట్టు దాసు దిగుతున్నాడు. దాసువంక ఏమీ అర్థంకాక చూస్తూ నిలబడిపోయింది మైత్రేయి. దాసు వీధిలోకివచ్చి రిక్షా చేసుకొని బయలుదేరాడు.

దాసు ఇంట్లో అడుగు పెట్టేప్పటికి భూషణంగారు మంచంమీద పడుకొని దగ్గుతూ, ఆయాస పడుతున్నారు. రాధమ్మగారు ఆయన దగ్గర కూర్చుని పరిచర్యలు చేస్తున్నది.

"ఏం నాన్నా......దగ్గు—ఆయాసం మరీ ఎక్కువగా ఉన్నట్టుందే ఇవాళ" మంచం దగ్గరకు వెళ్ళి పరామర్శించాడు దాసు.

"అవును నాయనా......చాలా......బాధగాఉంది....... ప్రాణంపోయినా బాగుండురా తండ్రీ.......ఈ బాధ భరించలేకుండా ఉన్నాను" ఆయాసపడుతూనే అన్నారు భూషణం గారు.

"డాక్టర్ని తీసుకురా నాయనా—ఒక ఇంజక్షన్ ఏదైనా ఇస్తే తగ్గుతుందేమో!" అంది రాధమ్మగారు.

"అలాగేనమ్మా......ఇప్పుడే తీసుకువస్తా" నంటూ దాసు ఆదుర్దాగా నడచి ముషీరాబాదు శృంగాటకం దగ్గరకు వచ్చి, ఒక రిక్షా చేసుకొని డాక్టరుకోసం బయలుదేరాడు. మరో అరగంటలో డాక్టర్ని తీసుకొని ఆయన కారులో ఇంటి ముందు దిగాడు. డాక్టరు భూషణంగారిని పరీక్షచేసి, ఇంజక్షన్ ఇచ్చాడు. ఒక సీసాలో అరకు పోసిచ్చి, గుండెలకు, వెన్నుకు రాయమని చెప్పాడు. డాక్టర్ కారు దగ్గరకు వెడుతుంటే దాసు ఆయన వెనకాలే వెళ్ళాడు.

"ఇప్పట్లో ప్రమాదమేంలేదు మిస్టర్ దాసూ...... ట్రీట్మెంటు సక్రమంగాఉంటే మనిషి కోలుకుంటాడు...... కాని, చాలా ఖర్చవుతుంది" అన్నాడు డాక్టర్.

"ఎంత ఖర్చయినా ఫర్వాలేదు సార్!.......మొదలు మీ కిప్పుడు ఏభై రూపాయలు ఇస్తాను......మీరు ట్రీట్మెంటు ప్రారంభించండి.........మరి నన్ను ప్రయాణం మానేయ మంటారా?" అని అడిగాడు దాసు.

"మీరు నిర్భయంగా వెళ్ళి రావచ్చు......మీ నాన్నగారికేం ప్రమాదంలేదు......" అంటూ డాక్టర్ కారెక్కాడు.

"ఒక్క క్షణం ఆగండి డాక్టర్!......లోపలకువెళ్ళి డబ్బు తీసుకు వస్తా" నంటూ దాసు లోపలకువెళ్ళి పెట్టె తెరచి, డబ్బు తీసుకువచ్చి డాక్టరు చేతిలో పెడ్తూ, "ప్రొద్దునా

సాయంత్రం వచ్చి, నాన్నగారిని చూసిపోతుండండి డాక్టర్!...... ఎంత డబ్బు ఖర్చయినా సరే.....నాన్నగారిని మీరు కాపాడాలి'' అని ప్రాధేయపడ్డాడు.

''మీరు ధైర్యంగా వెళ్ళండి దాసుగారూ! నే నున్నాగా, ఏం భయంలేదు'' అన్నాడు డాక్టర్. మరుక్షణంలో కారు ముందుకు, దాసు లోపలకు—

ఇంజక్షన్ ఇచ్చిన అరగంటకు భూషణంగారికి కాస్త ఉపశాంతి కలిగింది. మరో అరగంటకు దగ్గు—ఆయాసం కూడా కాస్త తగ్గి మాట్లాడగలుగుతున్నారు.

''ఏం నాయనా బట్టలూ అవీ సర్దుకున్నావా?'' అని భూషణంగారు ప్రశ్నించారు దాసును.

''నీ పరిస్థితి చూస్తే ఇలా ఉంది.......నాకు వెళ్ళాలని పించడంలేదు నాన్నా!'' అన్నాడు దాసు.

''ఇప్పట్లో నాకేం ప్రమాదంలేదు బాబూ!.....నీవు వెళ్ళిరా.......నాకోసం నీవు మానెయ్యకు. నీవు మానేస్తే సమితి అప్రతిష్ఠ పాలవుతుంది. నీకు మళ్ళీ ఇటువంటి అవ కాశంరాదు.'' కొంచెంగా ఆయాసపడుతూ అన్నారు భూషణం గారు.

''డాక్టరూ అదే అన్నాడు.......కాని నాకే మనస్సు పీకుతున్నది— ఎలా వదిలిపెట్టి వెళ్లనా అని......భాస్కరంఉన్నా, చేతికింద సహాయంగా ఉండేవాడు'' అన్నాడు దాసు.

''వాడు నేను చస్తేగాని బాగుపడడురా!''

'' ......అవేం మాటలండీ!'' అంది రాధమ్మగారు.

''వాడిని గురించి నీ వేం దిగులు పడకు నాన్నా...... ఈసారి వాడు ఇంటికివస్తే వాడికి ఏదోవిధంగా నచ్చచెప్పి ఒక దారిలో పడేస్తాను''

''ఏమో నాయనా—ఇక నీదే బాధ్యత అంతా....''

''లే నాయనా—కాళ్లు కడుక్కో......వడ్డిస్తాను'' అంది రాధమ్మగారు.

''ముందు నాన్నకు రొట్టె—పాలు ఇవ్వమ్మా—నేను తర్వాత తింటాలే!''

''నా కిప్పుడు తొందరలేదు......ఇంకా సేపు ఆగి తీసు కుంటా......మీ ఇద్దరూ భోజనం కానిచ్చిరండి'' అన్నారు భూషణంగారు.

''సరే—వడ్డించమ్మా!'' అంటూ దాసు లేచాడు.

## 21

విసమిసలాడే యౌవనంలాగా పూరంతా కళాకారుల తోను, కళాభిమానులతోను, కలకలలాడుతున్నది. కళాపరిషత్తు వార్షికోత్సవాలు మూడురోజులు జరపడానికి పెద్దపెట్టున ఏర్పాట్లుచేశారు. విశాలమైదానంలో వేలమంది ప్రేక్షకులు కూర్చునేందుకు వీలుగా పందిరి నిర్మించారు. నాటక ప్రదర్శనలకు, ఉపన్యాసాలకూ అనువుగా రంగస్థలం ఏర్పాటు చేశారు. పూరంతా త్రివర్ణ పతాకాల తోరణాలతో అలంకరిం చారు. పోటీలలో పాల్గొనేందుకు వచ్చిన నాటక సమాజాల వారికి, ప్రత్యేక ఆహూతులకు బసలు ఏర్పాటు చేశారు. ఏ హొటలు చూసినా నాటకశాల లాబీలాగా తోస్తున్నది. ఏ కిళ్లీకొట్టుముందు పరికించినా రద్దీగానే ఉంటున్నది. మూడు రోజులూ ఉదయంపూట ఉపన్యాసాలు, గోష్ఠులు, సన్మానాలు సాయంత్రంపూట నాటక ప్రదర్శనలు ఏర్పాటు చేశారు. వివిధ ప్రాంతాలనుంచి పండితులు, నాటక రచయితలు, కళాకారులు ఈ ఉత్సవాలకు వక్తలుగా, ప్రేక్షకులుగా, అభిమానులుగా విచ్చేశారు.

పరిషత్తు ఉత్సవాల్లో ఉత్తమ నాటకం, ఉత్తమ నటుడు, ఉత్తమ హాస్య నటుడు, ఉత్తమ నటి, ఉత్తమ రంగ స్థలాలంకరణ నిర్ణీతమౌతాయి. ఉత్తమ నాటక రచయితలకు కూడా బహుమానం ఏర్పాటు చేశారు. బహుమతి నిర్ణేతలుగా రంగస్థల నిపుణుల్ని కొందరిని నిర్ధారించారు.

నాటక సంఘాలవారు తమ తమ సమాజాలకు బహు మతులు రావాలని, రచయితలు తమ రచనలకు బహుమతులు పొందాలని, నటీ నటులు తమ నటనకు బహుమతి రావాలని ఎవరికి వారు ప్రయత్నిస్తున్నారు. నిర్ణేత లెవరో వాకబుచేసి, తెలుసుకొని కొందరు రచయితలు వారి పరిసరాల్లో తిరుగు తున్నారు. రచయితల్ని ఆసరాగా చేసుకొని సమాజాల నిర్వాహ కులు కూడా నిర్ణేతల కను సన్నల్లోకి వస్తున్నారు. నిర్ణేతల సర సన తమ నటీగుణాలను కూర్చోపెట్టి, వారి చుట్టూ సరదా పరదాలు కడుతున్న వారూ ఉన్నారు. ప్రిలిమినరీ సెలక్షనుకు వచ్చిన పరిషత్తు ప్రతినిధులచేత నిర్ణేతలకు తమసమాజాల్ని గురించి పరిచయపూర్వకమైన ''సిఫారిశ్''కు తాపత్రయపడు తున్నారు కొందరు.

''ఏందాసూ— ఒకసారివెళ్లి జడ్జీలను కలసివద్దామా?'' అన్నాడు రమణ.

''ఏమిటి రమణా ! నీవుకూడా ఇలా దిగజారిపోతున్నావు.. మన కళాసమితికి ఏ బహుమతీ రాకపోయినాసరే— నేను మటుకు అటువంటిపనికి పూనుకోను.'' అన్నాడు దాసు.

''మనం మడికట్టుకు కూర్చుంటే లాభంలేదు దాసూ.... అందరూ ప్రయత్నిస్తున్నట్టే మనమూ ప్రయత్నిద్దాం...... తప్పేముంది ?'' అన్నాడు రమణ.

''మళ్లీ ఆ మాటఎత్తితే నాదారినేను వెళ్లిపోతాను..... మీరు నాటకంవేసుకోండి— మానండి నాకుతెలియదు.'' కోపంగాఅన్నాడు దాసు.

''సరే.... ని కిష్టంలేనిపని నేనుమటుకు చేస్తానా ?... అదృష్టం ఉంటే బహుమతి వస్తుంది—లేకపోతే లేదు.''అన్నాడు. రమణ.

మొదటిరోజు జరిగిపోయింది. రెండవరోజు 'క్రొత్త పుంతలు' నాటక ప్రదర్శనఉంది. అంతకుముందు క్రొత్త పుంతలు నాటకం కళాసమితివారు ప్రదర్శించి మన్ననలందడం

# ఆకర్షణలో అపస్వరాలు

దాసుకు ఉత్తమనటుడి బహుమతిలభించడం పత్రికలలో చదివిన వారు, విన్నవారు ఆనాటకం చూడాలని ఉవ్విళ్ళూరుతున్నారు. నాటక ప్రదర్శనలసమయంలో ఉన్నంతజనం ఉపన్యాసాల సమయంలో ఉండడంలేదు. రచయితలుమాత్రం ఇటు ఉపన్యాస సభలకు, అటుప్రదర్శనాలకుకూడా వస్తున్నారు. ఉపన్యాసాలప్పుడు విడుదులు కలకల లాడుతున్నాయి. ఆ విడుదుల్లోనే రిహార్సల్సు, ఆ విడుదుల్లోనే పేకాటలు, ఆ విడుదుల్లోనే అంతరంగిక సమావేశాలు సాగిస్తున్నారు. సమాజాలవెంట హంగుదార్లుగా వచ్చినవారుమాత్రం హోటళ్లమీద, వినోదస్థలాల మీద దాడిచేస్తున్నారు.

దాసు సభలో ఉపన్యాసాలువింటూ కూర్చున్నాడు. అతని ప్రక్కనే రమణకూడా ఉన్నాడు. వాళ్లకూర్చున్న వెనుక వైపు మీనాక్షి ఆమెతల్లి కూర్చున్నారు. ఉపన్యాసాల తరువాత కొంతమంది కళాకారులకు సన్మానాలు జరుపుతున్నారు. ''నాకు తలనొప్పిగాఉంది రమణా! వెళ్లిపడుకుంటా''నని చెప్పి దాసు విడిదిలోకి వెళ్లిపడుకున్నాడు. దాసువెళ్లిన కాసేపటికి మీనాక్షి లేచి ''అమ్మా— కూర్చుంటావా— నీవుకూడా వస్తావా? అంది తల్లితో. ''అదేమిటే సాంతం చూడకుండానే వెడదామా? సరే— నీవు వెడితేవెళ్లు— నేను కాసేపు కూర్చుని వస్తాను'' అందామె, 'సరే'నంటూ మీనాక్షి విడిదిలోకి వచ్చేసింది. విడిదిలో దాసుతప్ప ఇంకెవ్వరూలేరు. మీనాక్షి పెట్టెతెరచి అమృతాంజనం డబ్బాతీసుకుని దాసుదగ్గరకువచ్చి నిలబడింది. దాసుకళ్లు తెరవకుండా పడుకున్నాడు. ''బాధగా ఉందా ?.... అప్పుడే నిద్రపోతున్నారా ?.... ఏమండీ !......'' అంటూ ఎంతో మృదువుగా, ఆప్యాయంగా పలకరించింది, మధ్య మధ్య దాసు జవాబుకోసం ఆగుతూ. దాసు కళ్లుతెరచి ''ఏమిటి?'' అన్నట్టు చూశాడు ఆమెవంక.

''తలనొప్పిగా ఉందని వచ్చేశారు.... అమృతాంజనం రాయమంటారా ?'' అంటూ మీనాక్షి అతనిదగ్గర కూర్చుంది. మీనాక్షి పైట చెంగుపోగులు దాసుముఖానికి గిలిగింతలైనాయి.

''నేను రాసుకుంటాలే— ఇచ్చివెళ్లు'' అన్నాడు దాసు.

''ఏం— నేను రాయకూడదా !'' అంటూ మీనాక్షి డబ్బిలోంచి అమృతాంజనం సీసాతీసి కణతలకు రాయబోయింది. దాసు ఆమెచేతులను ప్రక్కకు నెట్టాడు.

''మీనాక్షీ— ఏమిటిది.... ఎవరైనాచూస్తే ఏమనుకుంటారు ?'' అన్నాడు.

''ఏమనుకుంటారేం ?.... ఏదో మీరు తలనొప్పితో బాధపడుతున్నారుకదా అని అమృతాంజనం రాద్దామనివచ్చాను.... మీరు నాకెంతో ఉపకారం చేస్తున్నారు. స్నేహభావంతో నేను మీకీమాత్రం సేవచేయకూడదా ?'' నిష్ఠూరంగాఅంది మీనాక్షి.

''స్నేహాన్ని నలుగురూ నమ్మాలి.... అయినా దానికైనా హద్దులుంటాయి. ఒంటరిగా నాదగ్గరకూర్చుంటే చూసినవాళ్లు దీన్ని స్నేహభావం అనుకోరు.''

''ఇన్నాళ్లనుంచీ మీరు నన్ను అర్థంచేసుకోలేదన్న మాట. అవున్లెండి.... ఆడవాళ్లే అర్థంకారు. అందులో చదువుకొని అందంగా ఉండేవాళ్లు అసలే అర్థంకారు..... అంతేనా ?'' అంది దూరానికి జరుగుతూ.

దాసు మాట్లాడలేదు.

''ఆడది అరటాకు, చుట్టూఉన్న మగవాళ్లు ముళ్లు.... అని వూరుకుంది కాస్సేపు మీనాక్షి. దాసు అందుకోలేదు.

''దాసుగారూ !'' అని మళ్లీ పలకరించింది మీనాక్షి.

'ఊఁ' అన్నాడు దాసు.

''ఆడది చిలిపిగా, కలుపుగోలుగా ఉన్నందువల్ల రెండు లాభాలున్నాయి తెలుసామీకు ?'' అంది మీనాక్షి.

దిండులోకి ముఖంపెట్టుకుని చేతులతో తలను క్రమ్ముకొని పడుకున్నాడు దాసు. ''ఏమిటో నువ్వేచెప్పు''అన్నాడు.

''అందమైన ఆడదానిమీద అందరి కళ్లూ కేంద్రీకరిస్తాయి. నలుగురిలోకీ వచ్చినప్పుడు అందంకోసం కాకపోయినా అభిమానంకోసమైనా అందంగా కనబడాలంటారా లేదా?''

''నన్ను ప్రశ్నలు వెయ్యకు......నువ్వు చెప్పుకుపో, వింటున్నాగా''

''నలుగురిలో తిరిగే ఆడది ఏ ఒక్కరితోనో చనువుగా ఉండకపోతే వీల్లేదు. ఆ చనువు నిజమైన చనువుగా మారితే జీవిత మౌతుంది. కాదంటారా?— ఇతర మగవాళ్ల బారినుండి తప్పించుకొనడానికైనా ఆ చనువు రక్షణగా ఉపయోగపడుతుంది'' అంది మీనాక్షి.

దాసు వింటూ పడుకున్నాడు. మీనాక్షి అతని కణతలకు అమృతాంజనం రాసింది.

''వద్దంటే వినవుకదా. అయినా నువ్వింత విచిత్రంగా మాట్లాడుతావని నాకు తెలీదు'' అన్నాడు దాసు.

''పోనీ ఒక వియషం చెప్పండి......నా స్నేహం మీ కిష్టం లేదా?''

''విలువలు చెడడం మాత్రం ఇష్టంలేదు'' అన్నాడు దాసు..

''నాకు తోచిన ఒక విషయం చెపుతాను, మీరూ ఆలోచించండి, అవునో కాదో? నలుగురు ఆడవాళ్లతో చనువుగా తిరిగే మగవాడిని చూసిన ఆడది తనూ అతనితో చనువుగా ఉండాలనుకుంటుంది. కాని, తీరా ఆ చనువు లభించాక తను కాక, మిగిలిన ఆడవాళ్లు అతనికి దూరమై పోవాలని కోరుకుంటుంది. ఇది ఆడవాళ్ల తత్వం. అలాగే ఎవరో మగవాడితో చనువుగా ఉన్న ఆడదానికి తనూ సన్నిహితుడు కావాలని బహుశా మగవాడు కూడా అనుకుంటాడు. కాని, మరో మగవాడు ఆ ఆడదాని ప్రక్కన ఉన్నంతవరకూ దానిమీద కసిగానే ఉంటాడు. ద్వేషంగానే ఉంటాడు. వీలున్నంతవరకూ ఆ ఆడదంటే నిర్లక్ష్యంగా ఉన్నట్లే ప్రవర్తిస్తాడు. అవునంటారా?......ఇది నిజంగా ఆడదానికి రక్షణకాదుటండీ? ఇలా కొంతమందిమండి

తప్పించుకొని, ఆడది నలుగురిలో నడవ గలుగుతుంది. పరువు, ప్రతిష్ఠ, హోదా ఉన్న మగవాడితో చనువు పెంచుకున్న ఆడదైతే ఆ హోదాకు తక్కువైన వారందర్నీ పూర్తిగా వదిలించుకో గలిగిందన్నమాటే. నలుగురిలో తిరిగే ఆడదాని సాంఘిక మనస్తత్వం ఇది. ఇందువల్ల ఎవరితోనో, చనువుగా ఆడదిఉంటే మిగిలిన మగవాళ్ల బెడద తీరుతుంది” అని మీనాక్షి మూసికొని ఉన్న దాసు కనురెప్పల్ని అప్పళించి వేసింది. దాసు మౌనంగా చూశాడు.

“మీతో స్నేహం నాకు వెంకటేశ్వర్లువంటి వాళ్ల నుండి రక్షణండీ!” అని జడ ముందుకు వేసుకొని గోముగా నవ్వింది మీనాక్షి.

ఇంతలో అక్కడకు మీనాక్షి తల్లి వచ్చింది. తల్లినిచూసి మీనాక్షిలేచి “అమృతాంజనం రాసుకోండి” అంటూ తల్లి దగ్గరకువెళ్లి దాసుకు తల నొప్పిగా ఉన్నట్టు, తాను అమృతాంజనం తీసుకువెళ్ళి ఇచ్చినట్టు చెప్పింది. అప్పటికి సభ అయిపోయిందేమో—అందరూ ఎవరి విడిదులకు వాళ్లు చేరుకుంటున్నారు.

* * * *

సాయంత్రం ఆరు గంటలైంది. మొదట ఒక చరిత్రాత్మక నాటిక, ఆ తరువాత “క్రొత్త పుంతలు” నాటకం ప్రదర్శనం జరగాల్సి ఉంది. ఆ తర్వాత మళ్లీ ఒక నాటకం, నాటిక ఉన్నాయి. మొదటి నాటిక ప్రదర్శించబడుతుండగానే దాసు, మిగతా నటీ నటులు మేకప్ అవుతున్నారు. నాటిక పూర్తి కాగానే ఒక అరగంట వ్యవధిలో క్రొత్త పుంతలు నాటకం సెట్టింగ్స్, హంగులు ఏర్పాటు చేస్తున్నారు. మీనాక్షి పూల చెండుతో దాసు దగ్గరకువచ్చి “ఏమండీ, కాస్త పూల చెండు పెట్టరూ!” అంది. “నేనే దొరికానా ఇందుకు.....పోయి జయలక్ష్మితో పెట్టించుకో” అన్నాడు దాసు.

“జయలక్ష్మి చీరె కట్టుకుంటున్నదండీ—ఫస్టు సీను మనదేగా—మళ్లీ ఆలస్యమౌతుంది......ఫరవాలేదు ప్రొద్దున మీకు నేను అమృతాంజనం రాయలేదూ......?” అంటూ మీనాక్షి పూలచెండు అతని చేతి కిచ్చి, వెనక్కు తిరిగి, దగ్గరగా నిలబడింది. తనకన్నా ప్రజలంటే శ్రద్ధచూపే భర్త నాకర్షించుకోవాలని అలంకరణకు తాపత్రయపడే భార్య పాత్రకు అనువుగా మీనాక్షి అపూర్వంగా తయారైంది. వెనుకకు తిరిగి నిలబడిఉన్న మీనాక్షి జాకెట్ క్రింద ‘బ్రా’ పట్టీ ఆమె రొమ్ముల్ని కదలనియ్యనట్లే చూసే వాళ్ల కళ్లను కూడా కదలనిచ్చేట్లు లేదు. సిల్కుచీర పిరుదులమీద తళతళమంటున్నది. దాసు ఆ అందానికి నిశ్చేష్టుడై నిల్చున్నాడు.

“ఏమండీ! చెండు పెడుతున్నారా లేదా?” అని మీనాక్షి గిరుక్కున విసురుగా దాసువైపు తిరిగింది. ఆ వూపుకు భుజం మీది పైట జారిపోయి, మీనాక్షి రొమ్ములు దాసు వక్షాన్నదుము కొన్నాయి. అచ్ఛాదనలేని జాకెట్ కట్‌లోంచి ఉబికి తొంగి చూస్తున్న మీనాక్షి వయస్సు పొంగును దాసు అప్పుడు చూశాడు. మీనాక్షి ఇచ్చిన పూలచెండు అలానే చేతిలోఉంది. ఆమె భుజాలమీద వేసిన దాసు చేతులు క్రమంగా ఆమె వెన్నుమీద బిగుసుకున్నాయి. మీనాక్షి అతని కళ్లల్లో మెరుపును చూసింది. “చెండు నలిగిపోతుందండీ!” అంది హెచ్చరికగా. తెరలో గంట గణగణ మ్రోగింది. దాసులో ఆ గంట చైతన్యం కలిగించింది. సిగ్గుపడి దాసు మీనాక్షిని ప్రక్కకు నెట్టి, దూరంగా జరిగాడు. అతని చేతిలో చెండును మీనాక్షి తీసుకుంది. ఇంతలో రమణ అక్కడకు వచ్చాడు. జయలక్ష్మి చీరె కట్టుకుని కిలకిలనవ్వుతూ ఇవతలకు వచ్చింది. ఆమె వెనకాలే వెంకటేశ్వర్లు వేషంలో సిగరెట్ పీలుస్తూ వచ్చాడు. మళ్లీ తెరలో గంట మ్రోగింది. అందరూ చకచకా స్టేజీ లోపలకు వెళ్లారు. రమణ మైకు ముందు నిలబడి, “క్రొత్త పుంతలు” నాటకం రచన, సమర్పణ, దర్శకత్వం, పాత్రలు, పాత్రధారులు వగైరా ప్రకటించాడు. ఆ మరుక్షణంలో కొబ్బరికాయ కొట్టి హారతి పట్టారు. మరి కొన్ని క్షణాల్లో తెర ప్రక్కకు తొలిగింది.

అంతకుముందు పత్రికలలో క్రొత్తపుంతలు నాటకానికి జరిగిన ప్రచారంవల్ల ప్రేక్షకులు, జడ్జీలు, ఎంతో ఉత్సుకతతో నాటకం చూస్తున్నారు. సీన్లు చకచకా జరుగుతున్నాయి. సీనుకీ సీనుకీ మధ్య ఎక్కువ వ్యవధి లేకుండా నాటకం ప్రేక్షకుల ఆకర్షణకు పాత్ర మవుతున్నది. దాసూ, మీనాక్షీ ఒక సీను పూర్తి అయి, తెరపడగానే లోపలకు వచ్చేశారు. మరోసీను అయిదు నిమిషాల్లో ప్రారంభమైంది. ఆ సీనులో వెంకటేశ్వర్లు, జయలక్ష్మి ఉన్నారు.

దాసు సిగరెట్ ముట్టించి ఒక కుర్చీలో కూర్చున్నాడు. ఇంతలో ఒక సభ్యుడు “దాసూ—దాసూ” అంటూ చేతిలో టెలిగ్రాం పట్టుకు వచ్చాడు. దాసు ఆదుర్దాగా అతని చేతిలోంచి టెలిగ్రాం అందుకొని చూసి, కుప్పకూలిపోయాడు. చేతిలోంచి సిగరెట్ జారిపోయింది. కళ్లల్లో నీళ్లు నిండాయి. “నాన్నా” అన్న కేక గొంతులోంచి వచ్చి, పెదవుల దగ్గర ఆగిపోయింది. ఇంతలో రమణ అక్కడకు చరచరావచ్చి, “ఏమిటి..... ఎవరికి టెలిగ్రాం వచ్చిందట” అన్నాడు కంగారుగా. దాసు చేతిలోంచి టెలిగ్రాం అందుకొని చదివి, “అరరే—ఎంత అన్యాయల జరిగిపోయింది.......డాక్టర్ పరవాలేదన్నాడే.......అప్పుడే ఇంత ముంచు కొచ్చిందా?” అన్నాడు. దాసు, రమణను కౌగలించుకొని, “నేను నిర్భాగ్యుణ్ణి రమణా— చివరి దశలో దగ్గర లేకపోయాను” అని బావురుమన్నాడు.

“వూరుకోదాసూ......ఏడిస్తే ఏం ప్రయోజనం...... కాని, ఇంత హఠాత్తుగా పోతారనుకోలేదు.......ధైర్యంగా ఉండాలి” అని రమణ అతణ్ణి ఓదారుస్తున్నాడు. మీనాక్షికి కూడా కళ్లల్లో నీళ్లు తిరిగాయి. “మీకు చెప్పేంతటిదాన్ని కాను.......వూరుకోండి దాసుగారూ.......మిమ్మల్ని చూస్తుంటే గుండె తరుక్కుపోతున్నది.” నెమ్మదిగా అంది మీనాక్షి. మిగతా వాళ్లు కూడా అతనికి ధైర్యం చెబుతున్నారు.

# ఆకర్షణలో అపస్వరాలు

వెంకటేశ్వర్లు, జయలక్ష్మి నటిస్తున్న సీను పూర్తి అయి తెరపడింది. ఆ తరువాత సీనులో మళ్లీ దాసూ, మీనాక్షీ మరో ఇద్దరూ స్టేజీమీదకు వెళ్ళి నటించాలి. రమణకు ఏం చేయడానికి తోచలేదు. అంత దుఃఖంలోఉన్న దాసును స్టేజీ మీదకు వెళ్ళమని ఎలా చెప్పడమా అని మథనపడుతున్నాడు. అయిదు నిమిషాలైపోయింది. ప్రేక్షకులు ఆలస్యాన్ని భరించ లేకపోతున్నారు. నిశ్శబ్దంగాఉన్న ఆడిటోరియంలోంచి విచిత్ర శబ్దాలు వినిపిస్తున్నాయి. అంతవరకూ స్తబ్దంగాఉన్న దాసు, ''ఏమిటి రమణా—ఆ గోల?'' అని ప్రశ్నించాడు. ''ఇంకా సీను ప్రారంభం కాలేదని గోల చేస్తున్నారేమో........ఇది మీసీన్!'' అన్నాడు రమణ.

''మరి చెప్పవేం........రమణా నీవు వెళ్ళి అనౌన్సు చెయ్యి సీను వెంటనే ప్రారంభమౌతుందని........నే నీ లోపల మేకప్ సరి చేసుకుంటాను'' అంటూ అద్దం ముందుకు వెళ్లాడు దాసు. రమణ ఒకసారి దాసువంక పరిశీలనగా చూసి, తెరలోకి వెళ్లాడు. అంత దుఃఖంలోనూ, దాసు మేకప్ సరి చేసుకొని, స్టేజీమీదకు వెళ్ళడానికి సిద్ధపడుతున్నందుకు తోటివారు ఆశ్చర్యంగా అతని వంక చూస్తున్నారు. మీనాక్షికి అతని కాళ్లమీద పడాలనిపించింది.

''ప్రేక్షక మహాశయులకు ఒక విజ్ఞప్తి. సుప్రసిద్ధ నటులు, దాసుగారి పితృపాదులు అయిన భూషణంగారు దివంగతులైనట్లు ఇప్పుడే టెలిగ్రాం అందింది. దాసుగారు అంత దుఃఖంలోఉన్నా, ప్రేక్షకులకు నిరాశ కలిగించడం, నాటకం మధ్యలోనే ఆపివేయడం ఇష్టంలేక మేకప్ సరి చేసుకొని వస్తున్నారు. ఈ ఆలస్యానికి మన్నించగోరుతున్నాను. కొన్ని క్షణాల్లోనే సీను ప్రారంభమౌతుంది'' అని రమణ ప్రకటించేప్పటికి ప్రేక్షకుల్లో శబ్దాలుతగ్గి, గుస గుసలు వినిపించాయి. దాసు మేకప్ సరిచేసుకొని, ''పద మీనాక్షి!'' అంటూ స్టేజీలోకి వెళ్లాడు. మరుక్షణంలో తెర భారంగా, నెమ్మదిగా ప్రక్కకు తొలగింది. ఇంతవరకు నాటకం బాగా రక్తి కట్టిందనీ, ఉత్తమ ప్రదర్శనకు కళాసమితికి ప్రైజు వస్తుందనీ ఆశించిన సభ్యులు నిరుత్సాహపడుతున్నారు. దుఃఖంలోఉన్న దాసు సరిగ్గా నటించలేడనీ—అందువల్ల కళాసమితికి బహుమతి రాదనీ గుసగుసలాడుతున్నారు.

తండ్రిపోయిన విచారం ఆ క్షణంలో దాసుకు రంగస్థలంమీద అభిమానాన్ని పెంచింది. రంగస్థల నటుడుగా పేరు పొందిన భూషణంగారు తనకు అప్పగించిన వారసత్వం ఈ రంగస్థలమే నన్నట్టు అతనిలో ఒక అనుభూతి అలుముకుంది. ప్రేక్షకులు కళ్లప్పగించి చూస్తున్నారు. అతని ప్రక్కనే నటిస్తున్న మీనాక్షి దాసును జాగ్రత్తగా పరిశీలిస్తూ, తన నటన ద్వారా అతనిలో ఉత్సాహాన్ని రంగరిస్తున్నది. ఆ సీను ప్రేక్షకుల కరతాళ ధ్వనులమధ్య పూర్తి అయింది. గ్రీన్‌రూంలోకి వచ్చిన దాసు ఒకచోట కూలబడి మళ్లీ భూషణంగారు జ్ఞాపకంరాగా, నిశ్శబ్దంగా విలపించాడు. మిగతా రెండు సీనులతో కొత్తపుంతలు నాటక ప్రదర్శనం పూర్తి అయింది. జడ్జీలు, కళా పరిషత్తు ప్రముఖులు, మరికొందరు పెద్దలు గ్రీన్‌రూంలోకి వచ్చి దాసుకు సానుభూతి తెలిపారు.

''కట్టు కథలుగా చెప్పుకుంటుంటే వినడమేగాని ఎప్పుడూ చూడలేదు. ఇవ్వాళ ప్రత్యక్షంగా చూశాను. అంత దుఃఖంలోఉండి, ఉత్తమంగా నటించడం సామాన్యులకు చేత కాని పని'' అన్నాడు ఒక జడ్జి.

''సింహం కడుపున సింహం పుట్టక, పిల్లిపిల్ల పుడుతుందా అన్నట్టు భూషణంగారి కడుపున సామాన్యుడు పుడతాడా!.........తండ్రిని మించిన కొడుకు'' అన్నాడు మరో సాంప్రదాయవాది.

దాసు త్వర త్వరగా మేకప్ కడుగుకొని, రమణతో బసలోకి వెళ్లాడు.

''రమణా! ఏదైనా టాక్సీ చూడు—వెంటనే నేను వెళ్లిపోవాలి..........చీకటితో ఏదో రైలుందిగా'' అన్నాడు దాసు.

''రైల్లో వెడితే నీవు ఎప్పటికి చేరుతావు దాసూ!......ఏకంగా కార్లోనే వెళ్లడం మంచిది—తొందరగా చేరుకోవచ్చు'' అన్నాడు రమణ.

''నా దగ్గర అంత డబ్బెక్కడిది, రమణా!''

''డబ్బు కేమిటిలే.........సమితి డబ్బు నా దగ్గర ఉందిగా.. ఈ వంద రూపాయలు తీసుకో.........కాని ఈ పరిస్థితిలో నీవు ఒక్కడివీ పోవడం అంత మంచిదికాదు. పోనీ నేను వద్దామంటే ఎట్లా— నాకు తతంగం చాలా ఉంది.''

''మరేం ఫర్వాలేదులే.......మీరంతా కలిసిరండి. నేను ఇప్పుడు వెడతాను''

దాసుతో ఇంకెవరినైనా పంపుదామని ప్రయత్నించాడు రమణ. కాని, ఎవరి నడిగినా పోమన్నారు. మిగతా నాటకాలు చూడాలని ఉత్సాహం చూపారేగాని, దాసు పరిస్థితిని అర్థం చేసుకోడానికి ఎవరూ ప్రయత్నించలేదు.

''ఏమండీ రమణగారూ, మన నాటకం అయిపోయిందిగా—ఇంక నేనుండి చేసేదేముంది.........నేనూ మా అమ్మా, దాసుగారికి తోడుగా కార్లో వెడతాం'' అంది మీనాక్షి.

రమణకు కొంత ధైర్యం వచ్చింది మీనాక్షి ఆ మాట అనేప్పటికి. కాని, దాసు తనతో మీనాక్షి రావడానికి ఒప్పుకోలేదు. రమణ అతనికి నచ్చచెప్పి ఒప్పించాడు.

''ఏకంగా భోజనాలుచేసి, బయలు దేరండి'' అన్నాడు రమణ.

"క్షమించు రమణా!..........ఇప్పుడు నేనేం తినలేను. వాళ్లను భోజనం చేసిరమ్మను" అన్నాడు దాసు.

"నా మాట విను దాసూ!........నీకు తోచినంతమటుకే తిను.......మళ్లీ ఎప్పటికో తిండి" అని రమణా, మీనాక్షి, ఆమె తల్లి బలవంతం చేసేప్పటికి దాసుకు ఎంగిలి పడక తప్పింది కాదు. రమణ టాక్సీ మాట్లాడి వాళ్లను ఎక్కించి, "మీనాక్షి గారూ......జాగ్రత్తగా దాసును కనిపెట్టండి.......అతను ఏమో చేస్తాడనికాదు.........తిండీ తిప్పలూ లేకపోతే ఎనిమిషి కొరగా కుండా పోతాడు" రహస్యంగా అన్నాడు.

"నా కనురెప్పలా చూసుకుంటాను—మీ కా భయం అక్కరలేదు" అంది మీనాక్షి.

## 22

ఉదయం పదకొండు గంటలైపోయింది. దాసు ఇంటి ముందు నలుగురూపోగైఉన్నారు. ముందుగదిలో భూషణం గారి కళేబరాన్ని పరుండబెట్టారు. ఆచారం ప్రకారం తల దగ్గర ప్రమిదలో వత్తివేసి వెలిగించారు. ప్రక్కల ఉంచిన అగరు వత్తుల పొగ వీధిలోకి కూడా సువాసనలు చిమ్ముతున్నది. దగ్గరగా రాధమ్మగారు తల విరబోసుకొని, దైన్యంతో కూర్చుంది. రాత్రంతా ఏడ్చిందేమో కళ్లు ఎర్రగా, బరువులుగా ఉన్నాయి. ఆమె ప్రక్కనే మాలతి, ఆమెతల్లి రాజేశ్వరమ్మగారు కూర్చుని ఉన్నారు. భాస్కరం ఓ మూలకు ఒదిగి దిగాలుపడి కూర్చుని ఉన్నాడు. ఇంటిముందు వాసుదేవరావుగారి కారు ఆగి ఉంది.

"అసలు దాసుకు టెలిగ్రాం అందిందో లేదో" అని అక్కడున్న రాజు అన్నాడు.

"టెలిగ్రాం అందకుండా ఎలా ఉంటుందీ.......బయలుదేరి వస్తూనే ఉండాలి" అన్నారు వాసుదేవరావుగారు.

మాలతి వీధిలోకి తొంగిచూసి, "నాన్నగారూ!" అంటూ వాసుదేవరావుగారిని పిలిచింది. "ఏమిటమ్మా" అంటూ ఆయన దగ్గరకు వచ్చారు.

"రైలు వచ్చే టైం అయింది. సుబ్బలక్ష్మివాళ్లు వస్తారేమో కారు స్టేషనుకు పంపండి" అంది మాలతి.

"మన డ్రైవరు ఆమెను గుర్తు పడతాడుగా....... టాక్సీ మాట్లాడి, డ్రైవర్ని స్టేషనుకు పంపిస్తా........నేను ఒకసారి హాస్పిటలుకు వెళ్ళిరావాలి" అన్నారు వాసుదేవరావుగారు.

"సరే—అలాగే పంపండి........మీరు తొందరగా వచ్చేసేయండి మళ్లీ" అంటూ మాలతి లోపలకు వెళ్లింది.

"నేను ఒక అరగంటలో వచ్చేస్తానండీ—హాస్పిటలుకు వెళ్ళి........ఒక అర్జంటు కేసుఉంది" అని అక్కడున్న రాజుతోను, మరికొందరు ముఖ్యులతోను చెప్పి, కారెక్కి వెళ్ళిపోయారు వాసుదేవరావుగారు.

అక్కడ కూడిన వాళ్లంతా భూషణంగారి ప్రతిభను గూర్చి, ఆయన నటనా కౌశలం గురించి, దాసు మంచితనాన్ని గురించి చెప్పుకుంటున్నారు. ఇంతలో ఇంటిముందు ఆగిన టాక్సీ లోంచి దాసు దిగి చరచరా లోపలకు వెళ్లాడు. అతని వెనకే మీనాక్షి ఆమె తల్లి దిగివచ్చారు.

"నాన్నా!" అంటూ దాసు భూషణంగారి కళేబరం మీదపడి ఏడుస్తున్నాడు. అతణ్ణి చూడగానే రాధమ్మగారిలో మళ్లీ దుఃఖం పెల్లుబికింది. మీనాక్షి ఆమె తల్లి ఒక ఓరకు నిలబడ్డారు. రాధమ్మగారు, దాసు ఏడుస్తుంటే భాస్కరం కూడా వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. ఉన్నది ఒకటే గది, అవతలిది వంటగది కాబట్టి లోపలకు ఎవరూ రాలేకపోతున్నారు. గదిలో ఉన్నది అంతా ఆడవాళ్లే. దాసు ఏడుస్తూనే తాను తండ్రి అవసాన సమయంలో లేకపోయినందుకు నిందించుకుంటున్నాడు. అతను అలా దుఃఖిస్తుంటే మాలతిలో జాలి మెదిలింది. జాలివెంట అప్యాయత ఏర్పడి కళ్లల్లో నీళ్లు చిందాయి. అతణ్ణి ఎవరూ ఓదార్చేవాళ్లు కనిపించలేదు. "సమయానికి నాన్నగారు కూడా లేకపోయారే" అనుకుంది మాలతి. ఒకసారి దూరంగా నిలబడిన మీనాక్షి వంక, ఆమె తల్లివంక చూసింది. ఓదార్చడంవల్ల దుఃఖాన్ని పెంచడమే అవుతుందని మీనాక్షి అనుకుంటున్నది. దాసు దుఃఖించి బాధపడుతున్నాడే అని మాలతి అతనికి రిలీఫ్‌ను కోరుతోంది. ప్రక్కనేఉన్న తల్లివంకచూసి, "అమ్మా...నీవైనా వాళ్లకు ధైర్యం చెప్పు" అంది. రాజేశ్వరమ్మగారు రాధమ్మగారి దగ్గరకు జరిగి ఆమెను ఓదార్చాలని ప్రయత్నిస్తున్నది.దాసు ఏడుస్తుంటే ఇంక భరించలేకపోయింది మాలతి. దాసు దగ్గరకువెళ్ళి, ప్రక్కనే కూర్చుని భుజం పట్టుకొని, "మీరే ఇలా దుఃఖిస్తుంటే ఇంక మిగిలిన వాళ్ల సంగతేమిటి చెప్పండి......అటుచూడండి—మీ తమ్ముడు ఎంత ఏడుస్తున్నాడో?........మీ అమ్మగారికి, భాస్కరానికి ధైర్యం చెప్పడంపోయి, ఇలా ఏడుస్తారా!" అని సానునయంగా పలికింది.

"మాలతీ......ఇంక మా నాన్న ఎలా వస్తాడు మాలతీ.... ఆయన్ను బ్రతికించుకోలేని దరిద్రుణ్ణి........నాన్నకు ఇంత జబ్బుగా ఉంటే నాటకం ఆడటానికి వెళ్ళిన దుర్మార్గుణ్ణి మాలతీ!.......దేవుడు కూడా నన్ను క్షమించడు" అంటూ దాసు మాలతి ఒళ్లో తలపెట్టుకొని కుమిలిపోయాడు.

"ఊరుకోండి.....మీరేం లోపం చేశారు—ఆయనకు..... డాక్టర్ని ఏర్పాటు చేశారు.......డాక్టర్ ప్రమాదమేమీ లేదని చెప్పడంవల్ల మీరు నాటకానికి వెళ్లారు.....మీరు తప్పు చేశారని మీ నాన్నగారు కూడా అనుకోలేదు" అని మాలతి అప్రయత్నంగా దాసు తల నిమురుతూ ధైర్య వచనాలు పలికింది. దాసు భాస్కరాన్ని కౌగలించుకొని, "తమ్ముడూ—ఇంక మనకు నాన్న లేడు" అంటూ విలపించాడు.

ఆ విషాద వాతావరణం చూసిన మీనాక్షి కళ్లల్లో నీళ్లు నిండాయి. దాసు దగ్గరకువెళ్ళి ఓదార్చేందుకు ధైర్యం రాలేదు. మాలతి అతణ్ణి ఓదార్చడం చూస్తుంటే మీనాక్షి అంతఃకరణం స్నేహమయమైంది. ఆ భావనలో అంతకుముందు తాను మాలతిని చూడటం, దాసు తనమీద చూపే నిరసన, మాలతికోసం దాసు బాధ పడటం అన్నీ స్ఫురణకు వచ్చి, "మాలతికి దాసు గారిని కాకుండా చేయడానికి తమ స్నేహం కారణమైందా?" అని ప్రశ్నించుకున్నది.

ఇంతలో వాసుదేవరావుగారు సందు చేసుకొని లోపలకు వచ్చారు.

"అభిమానానికిపోయి నాన్నగారిని చంపుకున్నాను......ఆ డాక్టరికి చూపించేబదులు నాన్నగారిని మీ దగ్గరకు తెచ్చినా బ్రతికేవారేమో!" అంటూ దాసు వాసుదేవరావుగారిని చూసి బావురుమన్నాడు.

"ఊరుకో దాసూ—ఊరుకో.......అతనూ మంచి డాక్టరే!........నేనైనా వాటుకు మందు ఇవ్వగలనుగాని, ప్రాణం పోయగలనా?.......ఆయుర్దాయం తీరిన తరువాత ఎవరూ ఏం చేయలేరు దాసూ!.......అన్నీ తెలిసినవాడివి ఇలా బెంబేలు పడితే ఎట్లా?" అన్నారు వాసుదేవరావుగారు.

భూషణంగారికి అంత్యక్రియలు ప్రారంభించారు· కొంతమంది కళాభిమానులు, భూషణంగారిపట్ల గౌరవ ప్రపత్తులు చూపుతూ, పూలహారాలనుతెచ్చి కళేబరాన్ని అలంకరించారు. మరికొంతసేపు సుబ్బలక్ష్మికోసం ఆగారు. "ఆమె వస్తుందో రాదో— ఎంతసేపు అని ఆపుతాం......ఇప్పటికే చాలా పొద్దు పోయింది" అని వాసుదేవరావుగారు అనడంతో అందరూ భూషణంగారి దేహాన్ని శవ వాహనంమీద ఉంచారు. రాధమ్మగారు క్రిందబడి శోకిస్తూంటే ఆమెను మాలతి, రాజేశ్వరమ్మగారు, మీనాక్షి ఓదారుస్తూ లోపలకు తీసుకుపోయారు.

*　　　*　　　*　　　*

భూషణంగారి మృతదేహానికి దహనక్రియలు జరిపి, దాసు, భాస్కరం వాసుదేవరావుగారి కారులో ఇంటికి వచ్చేప్పటికి సాయంత్రమైంది. వాసుదేవరావుగారి వంట మనిషివచ్చి వంటచేసి సిద్ధంగా ఉంచడంవల్ల రాజేశ్వరమ్మగారు అందరినీ భోజనాలకు లెమ్మంది.

"నే నిప్పుడు తినను......అందరిదీ కానివ్వండి" అన్నాడు దాసు.

"అదేం కుదరదు దాసూ!........విచారం ఉంటుంది...... నేను కాదనను.........కాని, తిండి మానుకుంటే ఎట్లా?" అని వాసుదేవరావుగారు దాసును మందలించి వంటవాడిని కేకవేసి త్వరగా అందరికీ వడ్డించమన్నారు.

ఇంతలో అక్కడకు పోస్టుమన్‌వచ్చి, ఒక కవరు గుమ్మంలోనే నిలబడిన మీనాక్షి కిచ్చి వెళ్లాడు.

"మీకు మద్రాసునుంచి లెటర్ వచ్చింది" దాసుతో అంటూ, కవరు అందివ్వబోయింది మీనాక్షి.

"మద్రాసునుంచా........ అటు పెట్టు—తర్వాత చూడవచ్చులే" అన్నాడు దాసు. కాని, దాసు అన్నంత సులభంగా మీనాక్షి కవరు ప్రక్కగూట్లో పడవేయలేకపోయింది. కవరుమీద ప్రింటులో కనిపిస్తున్న అక్షరాలు చూస్తుంటే అది ఎవరిదగ్గరినుంచి వచ్చిందో తెలిసిపోయి, ఏం వ్రాశారో తెలుసుకుందామన్న ఉత్సాహం మీనాక్షిలో కలిగి కవరు చించింది.

దాసును మద్రాసులోని ఒక సినిమా సంస్థవారు తమ క్రొత్త చిత్రంలో హీరోగా బుక్ చేసుకో దలచినట్లు, వెంటనే తప్పకుండా బయలుదేరి రమ్మన్నట్లు అందులో ఉంది. మాలతి ప్రక్కన ఉండగా తను దాసు సమీపానికి పోవడం మీనాక్షికి నచ్చలేదు. అందుకని ఉత్తరం మాలతి చేతికి అందించింది. మాలతి కూడా ఉత్తరం చదివింది.

"నాన్నగారూ! దాసుగారికి సినీ ఛాన్సు వచ్చింది. వెంటనే బయలుదేరి రమ్మని ఉత్తరం" అంది—భోజనంముందు కూర్చుంటున్న వాసుదేవరావుగారితో. దాసు ఆమె వంక ఆశ్చర్యంగాచూసి, విషాదంగా నవ్వుకున్నాడు. మొదట సంతోషంతో మాలతి ఆ కబురు చెప్పిందేకాని, ఆ మరుక్షణంలోనే ఆమె ముఖంలో విచార రేఖలు కనిపించాయి. వాసుదేవరావుగారు 'ఎందుకా' అనుకున్నారు.

అందరి భోజనాలు అయి లేచేప్పటికి ఇంటిముందు సుబ్బలక్ష్మి పిల్లలతో రిక్షాలోంచి దిగి లోపలకువచ్చి, తల్లిని కౌగలించుకొని ఏడ్చింది. ఆమెను మీనాక్షి, మాలతి, రాజేశ్వరమ్మగారు ఓదార్చారు. చీకటిపడుతున్నదని మీనాక్షి అందరితో చెప్పి వెళ్లదలచింది. దాసు వాకిట్లోఉన్న రాజును పిలిచి, మీనాక్షిని, ఆమెతల్లిని ఇంటివద్ద దించవలసిందిగా కోరాడు.

"ప్రొద్దుటి రైలుకు వస్తే మీ నాన్నగారిని కడసారి చూసుకునేదానివి" అంది మాలతి సుబ్బలక్ష్మితో.

"ఏం చేయను.......నాకు ఇంతవరకే ఉంది ఋణం" అని విచారించింది సుబ్బలక్ష్మి.

"దాసూ—నీవేమీ అనుకోకుండా ఉంటే ఒక సంగతి చెప్తాను. వింటావా?" అన్నారు వాసుదేవరావుగారు.

"నేనేమీ అనుకోను సెలవియ్యండి" అన్నాడు దాసు.

"ఈ ఇల్లు చాలా చిన్నది......ఈ పది రోజులూ పోయిన తరువాత ఇంటికి ఎలాగూ తాళం పెట్టాలిట— మూడు మాసాలపాటు. నక్షత్రం మంచిదికాదట.......నాకిలాంటి పట్టింపులేమీ లేవు కాని, మీ క్షేమాన్ని కోరేవాడిని కాబట్టి చెబుతున్నాను......రాత్రికే మీరంతా మా బంగళాకు వచ్చేయండి" అన్నారు వాసుదేవరావుగారు. రాజేశ్వరమ్మగారు కూడా రాధమ్మగారితోనూ, దాసుతోనూ అదేమాట అన్నారు.

"ఇప్పటికే నేను మీకు చాలా ఋణపడి ఉన్నాను" అన్నాడు దాసు.

"అణా పైసలతో సహా తీర్చుకుందువుగాని లేవయ్యా నీ ఋణం........నా మాట విను......" అన్నారు వాసుదేవరావు

గారు. దాసు మాలతి వంక చూశాడు. ''ఒప్పుకోండి'' అన్నట్టు న్నాయి మాలతి చూపులు.

''పెద్దలు......మీరు చెప్పినదాన్ని కాదనలేక పోతున్నాను.... కాని, ఎక్కడైనా కాస్త పెద్ద ఇల్లు దొరికితే వెళ్ళిపోతాను.''

''ఓ—అలాగే.......లేకపోతే ఎల్లకాలం మా ఇంట్లో ఉండమంటానా?.......అయినా నీకు సినిమా ఛాన్సు వచ్చింది— ఎలాగూ మద్రాసు వెడతావు'' అన్నారు వాసుదేవరావుగారు, దాసు మనస్సును విచారంలోంచి వెలుగులోకి తేవాలని.

''ఏమో—చెప్పలేను......ఈ పదిరోజుల తర్వాతగాని, వెళ్ళ డానికి వీలులేదుగా! ఆ తర్వాత వెడితే ఆ ఛాన్సు అందాకా నాకోసం ఉంచుతారా?'' అన్నాడు దాసు.

మాలతి డ్రైవర్ని పిలిచి అవసరమైన సామానులు కార్లో పెట్టించింది.

ఇంటికి తాళం పెట్టారు. మాలతి, దాసు, మైత్రేయి, వాసుదేవరావుగారు కారులో ఎక్కారు. రాజేశ్వరమ్మగారు మిగి లిన వారితో టాక్సీలో ఎక్కింది.

## 23

పత్రికలలో కళా పరిషత్తు వార్షికోత్సవాల వివరాలు' పోటీ నాటకాల ఫలితాలు ప్రకటించబడినాయి. ''క్రొత్త పుంతలు' నాటకంలోని నాయకపాత్ర ధరించిన దాసుకు ఉత్తమ నటుని బహుమతి, కళాసమితికి ఉత్తమ ప్రదర్శన బహుమతి, ప్రోత్సా హక నటిగా మీనాక్షి కొక బహుమతి ప్రకటించబడినాయి. అవే పత్రికలలో భూషణంగారు దివంగతులైనందుకు సంతాప ప్రకట నలు, భూషణంగారి జీవిత విశేషాలు కూడా ప్రకటించబడినాయి. జంట నగరాలలోను, మరికొన్ని ప్రాంతాలలోను సంతాప సభలు జరిపి, కీర్తిశేషులైన భూషణంగారి నటనా వైదుష్యాన్ని, ఆయన నిరాడంబరతను, నాటక రంగానికి ఆయన చేసిన సేవను కొని యాడారు. 'అకాడమీ' కార్యవర్గం సమావేశమై, సంతాప తీర్మానం చేస్తూ, భూషణంగారి ప్రతిభను గుర్తించి, వారికి వార్షిక భృతి ఏర్పాటుచేసి ప్రతినెలా అందజేయడానికి నిశ్చయిం చాముగాని, ఈలోగానే వారు కీర్తిశేషులవడం దురదృష్టమని వెల్లడించింది. ఈ ప్రకటనలు, పొగడ్తలు దాసు కొక నగ్న సత్యాన్ని తెలిపాయి. ఆంధ్రదేశం కళాకారులను గుర్తించి బతి కుండగా గౌరవించలేదు. గతించిన తరువాత వారంతటివారు లేరని వాపోతుంది. ఇదొక రకమైన పరాజయతత్వం.

రమణ కళాపరిషత్తు వారిచ్చిన బహుమతులను తెచ్చి దాసుకు చూపెట్టాడు. ఆ సమయంలో మీనాక్షి కూడా అక్కడే ఉండడంవల్ల ఆమెకు వచ్చిన బహుమతిని ఆమెకు, దాసు బహు మతిని దాసుకు ఇచ్చాడు.

''నిజంగా దాసూ, నీ కృషివల్ల దేశంలో మన కళాసమితి పేరు సుస్థిరంగా నిలిచిపోతుంది. నిన్ను చూసి మేమంతా గర్వపడుతున్నాం'' అన్నాడు రమణ.

''నీవు కూడా నన్ను పొగడుతున్నావా రమణా!....... నా చేతనైనట్టు కృషి చేశాను. మీరందరూ నాతో సహకరించక పోతే మన నాటకం ఇంత విజయవంతం అయేదేకాదు. ఇందులో నా ప్రతిభ యేముంది?'' అన్నాడు దాసు.

మాలతీ, మీనాక్షి సినిమా వాళ్లనుండి దాసుకు పిలుపు వచ్చిన విషయం చెప్పారు.

''నీకీ అవకాశం రావడం నాకు చాలా సంతోషంగా ఉంది దాసూ! కాని......నా కొక్కటే విచారం......నీ దారిని నీవు పోతే కళాసమితి మూతపడుతుందేమోనని'' అన్నాడు రమణ.

''ఒక్క వ్యక్తి లేనంతమాత్రాన ఏ సంస్థా ఆగిపోదు రమణా!.......అట్లా అనుకోడం మిగతావారినందరినీ హీనపరచి నట్లు అవుతుంది. వ్యక్తితో ముడి పెట్టుకొని ఏ సంస్థా ఉండ కూడదు. పదిమందీ కూడినప్పుడు సంస్థ అవుతుందేకాని, ఒక్క వ్యక్తివల్ల సంస్థ నిలకడ బుజువుకాదు' అన్నాడు దాసు.

''కాదనను......అంతా అన్ని శక్తులూ కలవాళ్లు కాలేరు.. ఒక్కొక్కచోట ఒక్కొక్క ప్రధాన వ్యక్తి ఉండక తప్పదు..... సరే.......ఈ మాటల్లోపడి అసలు విషయం మరచిపోయాను'' అన్నాడు రమణ.

'ఏమిటి' అన్నట్టు దాసుతోపాటు మాలతీ, మీనాక్షి కూడా రమణవేపు ఆసక్తిగా చూశారు.

''క్రొత్త పుంతల నాటకాన్ని విజయవాడలో ప్రదర్శించ మని చాలామంది కోరారు. నీవు కాదనవన్న ధైర్యంతో నేనూ, వీర్రాజుగారు మాట ఇచ్చివచ్చాం. ప్రదర్శనం బహుశా ఈనెల చివరలో ఉంటుంది'' అన్నాడు రమణ.

''సరే—దానికేం.......అలాగే వేద్దాం'' అన్నాడు దాసు.

''అదేమిటీ—కార్యమంతా అయాక మద్రాసు పోవాలిగా'' అంది మీనాక్షి.

''ఎప్పుడు రమ్మని వ్రాశారు వాళ్లు?'' అని ప్రశ్నిం చాడు రమణ.

''వెంటనే బయలుదేరి రమ్మని వ్రాశారు.......కాని ఎట్లా కుదురుతుంది?'' అంది మాలతి.

''నేను ఇంకా ఏమీ ఆలోచించుకోలేదు రమణా!''

''అదేమిటండీ!.......ఇంత చక్కటి అవకాశంవస్తే ఇంకా ఆలోచించలేదంటారా రేమిటి?'' అంది మీనాక్షి.

అప్పుడే అక్కడకు వచ్చిన మైత్రేయి ''ఏకాయకిని హీరో వేషమే ఇస్తున్నప్పుడు ఇంకేం ఆలోచనండోయ్ దాసు గారూ !'' అంది.

''ఇలాంటి అవకాశం కోసం ఎంతోమంది తపస్సు చేస్తుంటారు .... మీరు ఆశించకుండా వచ్చిన అవకాశం పోగొట్టుకుంటారా ఏమిటి కొంపదీసి'' అంది మీనాక్షి.

''నాటకం విజయవాడలో పడటం, పడకపోవటం ఇక నీ చేతుల్లో ఉంది దాసూ ! .... నీ భవిష్యత్తును కళాసమితి

కోసం పాడుచేసుకోమని నేనేకాదు—ఎవరూ అనలేరు .... నీది వ్యక్తిగత విషయం. కళాసమితికి వచ్చే మంచీ—చెడూ అందరికీ సంబంధించింది'' అన్నాడు రమణ.

''మనం అందరం కలిసి దాసుగారిని చికాకు పరుస్తున్నామేమో.......అసలే విచారంలో ఉన్నారు'' అంది మాలతి మందలింపుగా.

''ఆలోచిద్దాంలే రమణా!.......నాకు ఎటూ తోచకుండా ఉంది'' అన్నాడు దాసు.

''సరే— తొందరేంలే......వీరరాజుగారు ఏదో అర్జంటు పని ఉండి రాలేకపోయారు.......రేపు వస్తామని చెప్పారు...... ఇదుగో ఈ రెండువందలూ ఖర్చులకు ఉంచుకోమని ఇమ్మన్నారు'' అంటూ రమణ నోట్లు దాసుకు అందివ్వబోయాడు. దాసు కొన్ని క్షణాలు ఆలోచించి ''నన్ను పాచికగా ఉపయోగించ దలచుకున్నారా రమణా!'' కొద్దిపాటి కోపంతో అన్నాడు.

''నన్ను అపార్థం చేసుకుంటున్నావు దాసూ......నేను ఎటువంటివాడినో నీకు తెలియదూ?......వీరరాజుగారికి అటువంటి ఉద్దేశమేలేదు. ఉంటే, నీకంటే ముందే నేను వ్యతిరేకించేవాడిని. నీవు బయలుదేరిరాగానే ''పాపం, చేతిలో డబ్బు ఉందో, లేదో సమితి డబ్బులోంచి కొంత సర్దకపోయారా, తర్వాత చూసుకొనేవాళ్ళం'' అన్నారు వీరరాజుగారు. సరే— మనం వెళ్లగానే ఇద్దాంలెండి అన్నాను. అదీ జరిగింది. అప్పటికి విజయవాడవాళ్ళ మాతో నాటకం విషయం మాట్లాడనే లేదు'' అన్నాడు రమణ.

''అయినా, ఇప్పుడు నాకు డబ్బు అవసరంలేదు......నేను అన్ని ఏర్పాట్లు చేసుకున్నాను'' అన్నాడు దాసు.

మాలతి దాసు వంక ఆశ్చర్యంగా చూసింది.

''సరే, అయితే, నేను మళ్ళీ కలుస్తా'' అంటూ, రమణ అందరి దగ్గరా సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

కొన్ని క్షణాలు ఆ గదిలో మౌనం పరుచుకుంది.

''ఇప్పుడే వస్తాను.'' అంటూ మాలతి అక్కడినుంచి 'వెళ్లింది. మైత్రేయి ఏదో మ్యాగజైను తిరగేస్తున్నది. మీనాక్షి అవకాశంవచ్చినా ఉపయోగించుకోలేని దాసు పద్ధతుల్ని నెమరు వేసుకుంటున్నది.

''ఏమిటి ఆలోచిస్తున్నావు మీనాక్షీ !'' అన్నాడు దాసు.

''మీ గురించే.... మీరుమటుకు సినిమాఛాన్సు వదులుకోకండి !'' అంది మీనాక్షి.

దాసు నవ్వి ఊరుకున్నాడు.

''దాసుగారి నవ్వుకోసం ఒక డిక్షనరీ వ్రాయాలి.'' అంటూ మైత్రేయి మ్యాగజైను టీపాయిమీద పడేసి వెళ్ళిపోయింది. గదిలో మీనాక్షీ దాసూమిగిలారు.

''నన్ను క్షమించండి.... మీ మనస్సు నామూలంగా నలిగిపోయింది.'' అంది మీనాక్షి. మునుపంటి సోఫాలోకి దాసు ప్రక్కకువచ్చి కూర్చుని మాట్లాడేది మీనాక్షి. ఇప్పుడు దాసుకూ మీనాక్షికీమధ్య మాలతి కూర్చుని లేచివెళ్లిన ఖాళీసోఫా ఉన్నప్పటికీ మీనాక్షి తనచోటులోంచి కదలలేదు.

దాసు మీనాక్షివంక నిశ్శబ్దంగా ఆశ్చర్యంగా చూశాడు.

''మీరూ మాలతీ ప్రేమించుకుంటున్న విషయం నాకు తెలియదు....''

''ఇప్పుడెట్లా తెలిసింది ?''

మీనాక్షి పెదవులు కదిలేలోగానే మాలతి గదిలోకి వచ్చింది కాఫీకప్పులచేతో. కాఫీత్రాగి మీనాక్షి వెళ్తానని లేచింది.

''రాజును ఒకసారి కలవమన్నానని చెప్పు'' అన్నాడు దాసు మీనాక్షివంక నమ్మకంగాచూస్తూ.

''రాజుఎవరు ?'' అని మాలతి ప్రశ్నించింది.

గడపదాకా వెళ్లిన మీనాక్షి వెనక్కుతిరిగి ''మీకు దాసుగారెవరు ?'' అని ప్రశ్నించి ఒక్కఅంగలో గడపదాటి వెళ్లిపోయింది.

మీనాక్షిప్రశ్నలో దాగిఉన్న జవాబుకు దాసు ఆశ్చర్యపోయాడు. మాలతి తికమకపడింది.

దాసూ మాలతీ ఇలా ఏకాంతంగా మిగిలిపోవడం అనుకోని సంఘటన. ఎవరూ ఏమీ మాట్లాడేతత్వంలోలేరు. నిశ్శబ్దం అంతరాల్లోంచి ఏవో శబ్దాలు స్వనితమవుతున్నాయి ఇద్దరిలో.

''మాలతీ !'' అన్నాడు దాసు మనస్సును విదుల్చుకొని.

కళ్లెత్తిచూసి 'ఊఁ' అని పలికింది.

''నామీద కోపం పోయిందా ?'' మరో పరిస్థితిలో అయితే దాసుకు అలా ప్రశ్నించే ధైర్యం ఉండేదికాదు. జీవితంలో మీనాక్షిసమస్య కాదని తేలిపోయింది. మాలతి ఏకాంతంలో నిలిచింది. తాను విచారంలోఉన్నాడు కనుక మాలతి తనమీద ఆరోపణాలు చేసేందుకు పూనుకోదన్న అభిప్రాయం దాసుకు కలిగింది. ఆ విశ్వాసంతోనే ఆ ప్రశ్నవేశాడు. మాలతి జవాబు కోసం కొంతసేపు ఎదురుచూడక తప్పిందికాదు. అసలే మితభాషిమాలతి. అంతరంగాన్ని చిలికివేసిన ఈ ప్రశ్నకు త్వరగా జవాబివ్వడం మాలతికి చేతకాలేదు.

''నా మనస్సులో అంతస్ములులేవు.... మీరునన్ను ఆకర్షించారు.'' తలవంచుకొని అన్నది మాలతి.

''ఆకర్షణలో అపస్వరం ఎలా పలికింది మాలతీ?'' దాసు ఈ ఏకాంతంలో మాటమాటకూ 'మాలతీ' అని పిలవడం మాలతిలో సిగ్గునూ మార్దవాన్నీ కలిగించాయి.

''అపస్వరం వల్లనే సుస్వరం ఆపాతమధుర మవుతుంది''

''మాలతీ !'' మళ్లీదాసు మాలతిమనస్సుమీద పేరు పెట్టి దెబ్బతీశాడు. మామూలుగా మాలతిని తేరిపారచూడలేని దాసు మాలతి కళ్లల్లోంచి తనచూపులు మరల్చుకోకుండానే

మాట్లాడుతున్నాడు. "నీ సంస్కారానికి నేనూ ఆకర్షితుణ్ణయ్యాను మాలతీ కాని....జీవితంలో నేను పిరికివాణ్ణి." అన్నాడు.

"మీ పరిధిలోకి వచ్చిన ప్రతిస్త్రీ మీ పిరికితనాన్ని అలంబనం చేసుకుంటుందేమోననిపించింది నాకు. మీ పిరికితనం నా ఒక్కర్తెకే లాభించాలని వావూహ" అన్నది మాలతి.

"స్త్రీ మగవాడిలో పిరికితనాన్ని సహిస్తుందా మాలతీ!" మరోదెబ్బ మాలతి అభిమానంమీద.

"పిరికి మగవాణ్ణి ప్రేమించడం...." మాలతి మాటలు మధ్యనే ఆపివేసి దాసు "స్త్రీ ఆధిక్యానికి నిదర్శనం, అంతేనా మాలతీ ?" అన్నాడు దాసు.

మాలతికిది ఆఖరుదెబ్బ. మాలతి కళ్లల్లో నీటిపొద కదిలింది. చరాలునలేచివెళ్లి దాసుకాళ్లమీద పడింది.

"మీ ఆకర్షణకూ దూరంకాలేకపోయాను, నా ఆధిక్య భావానికీ దూరంకాలేకపోయాను. నా చదువూ సంస్కారానికి మీరేనాకు ప్రదక్షిణాలు చెయ్యాలనుకున్నాను. అది జరగలేదు. పైగా మీనాక్షి మీకుదగ్గ రౌతుందేమోనని భయపడ్డాను. నా అహానికి దెబ్బతగిలింది. మిమ్మల్ని వదులుకోలేకనే ద్వేషించాలనుకున్నాను, నాలోని సుపీరియార్టీ కాంప్లెక్సును సంస్కారంతో కప్పిపుచ్చాలనుకొన్నాను, కాని సాగలేదు.... ఫలితం. ఇదుగో నా కాంప్లెక్సును కన్నీళ్లగామార్చి మీ కాళ్లదగ్గర వదిలేస్తున్నాను. నేనిక మీ మాలతిని" అంటూ మాలతి వెక్కివెక్కి ఏడ్చింది.

దాసు మొదటిసారిగా మాలతిని స్పృశించాడు. ఆ మొదటి స్పర్శే ఇరువురి కౌగిలిగా రూపొందింది.

*   *   *   *

కర్మకాండ జరుపటానికి ఒకసత్రంలో ఏర్పాటుచేశారు. ఖర్చులకోసం దాసుమళ్లీ యాదయ్యను బ్రతిమాలి ఎక్కడైనా వడ్డీకి తీసుకురావాలనుకున్నాడు. మాలతిద్వారా దాసుపరిస్థితులన్నీవిన్న వాసుదేవరావుగారు "దాసూ, కర్మ జరిపించడానికి డబ్బుకోసం నీవేం తిప్పలు పడక్కరలేదు. అన్ని ఏర్పాట్లు నేను చేస్తాను. ఎంతఖర్చయినాసరే కర్మకాండ యథాప్రకారం జరిపిద్దాం" అన్నారు.

"మీ కిప్పటికే చాలా ఋణపడ్డాను." అన్నాడు దాసు.

"నీవింకా నన్ను పరాయివాడిగా భావిస్తున్నావా దాసూ!. మాలతి నాకెంత ప్రధానమో నీవూఅంతే" అని అంటుంటే దాసు ఆయనముందు తలవంచుకోక తప్పిందికాదు.

కళాసమితి సభ్యులు, వీర్రాజుగారూవచ్చి దాసును పరామర్శించి సానుభూతితెలిపిపోయారు. ఆఫీసునుంచి కొందరు, మరికొందరు పరిచయస్థులు అడపాదడపావచ్చి సానుభూతి తెలుపుతున్నారు. వీలైనప్పుడల్లా రమణా, రాజూవచ్చి కబుర్లు చెబుతూ దాసుమనస్తాపాన్ని తగ్గించడానికి తోడ్పడుతున్నారు. రాజు వచ్చినప్పుడల్లా దాసు మీనాక్షి ఉత్తమగుణాల్ని ఏకరువు పెట్టడం రాజుకు పూర్వాశ్చర్య సూచనమైంది.

కర్మకాండ అంతా పూర్తిఅయిపోయింది. చివరిరోజున ఆశీర్వచనమప్పుడుకూడా వాసుదేవరావుగారే దాసుకు, భాస్కరానికి బట్టలు ఇవ్వాల్సివచ్చింది. విశ్వనాథం, అతనితండ్రి వస్తారేమోనని దాసు, రాధమ్మగారు అనుకున్నారు. అక్కడికీ సుబ్బలక్ష్మి వాళ్లురారని చెప్పనే చెప్పింది.

ఉద్యోగం చేసుకుంటున్నదికదా కర్మ అయిన తరువాత సుబ్బలక్ష్మి వెళ్ళిపోతుందనుకున్నారు. కాని, సుబ్బలక్ష్మి ఆ ప్రస్తావనే తేకపోయేప్పటికి దాసు ఆశ్చర్యపడ్డాడు.

'నీవు ఎన్నాళ్లు సెలవు పెట్టివచ్చావు సుబ్బులూ?' అని ఒక రోజున దాసు అడిగాడు.

"ఇంక అక్కడకు వెళ్లక్కర లేదన్నయ్యా!......ఇక్కడే ఉద్యోగం చూసుకోవాలి"

"ఏం?—అసలేం జరిగింది.?"

"ఇన్నాళ్లనుంచీ చెప్పకుండా వూరుకున్నాను.....మీ బావగారు నువ్వనుకున్నంతపనీ చేశారు. మంచి మాటలతో నన్ను తీసుకువెళ్లి ఉద్యోగం ఇప్పించారేకాని........నేనంటే, ఆయనకసలు ఇష్టంలేదు. ఇక్కడినుంచి టెలిగ్రాం రాగానే బయలుదేరుతానంటే ఒప్పుకోలేదు......ఆయన మళ్లీ పెళ్లి చేసుకుంటానికి నాకేమీ అభ్యంతరం లేదని కాగితం వ్రాసిస్తే పంపుతానన్నారు. ఇది ధర్మం కాదని ఎంత బ్రతిమాలినా, మా అత్తగారు ఎంత చెప్పినా వినలేదు. ఆయనా, మామగారూ ఒకటై రాసిచ్చిందాకా వూరుకోలేదు" అని చెప్పింది సుబ్బలక్ష్మి.

"చాలా పొరపాటు చేశావు తల్లీ!.......చేజేతులా కాపురం కూలదోసుకున్నావు" అంది రాధమ్మగారు.

"పోనీలేమ్మా— నా ప్రాణానికి సుఖం లేనప్పుడు ఎలా జరిగితేనేం? ఆయనకు ఇష్టం లేనప్పుడు ఎందాకా పాకులాడతాం........" అంది సుబ్బలక్ష్మి కళ్లల్లో నీళ్ళు నింపుకుంటూ...

"నీవు కాగితం ఎందుకు వ్రాసిచ్చావు.......పోనీ రావడం మానేయాల్సింది" అంది మాలతి.

"ఎలా మానెయ్యను.......టెలిగ్రాం రాగానే గుండె పగిలింది.......ఆఖరుసారి నాన్నను చూడకుండా ఎలా ఉండగలను?........వెంటనే బయలుదేరివస్తే చూసేభాగ్యమైనా కలిగేది........వాళ్ళు ఓ పట్టాన బయలుదేరనిస్తేగా....... తీరా వచ్చేప్పటికి చూపైనా దక్కలేదు" అంది సుబ్బలక్ష్మి బాధాస్మృతిలో.

"ఏమైనా నీవు కాగితం వ్రాసివ్వడం చాలా పొరపాటు" అన్నాడు దాసు.

" ఆరంపపు కోతకంటే ఇదే నయం అన్నయ్యా!...... వెళ్ళినప్పటినుంచీ రోజూ కాగితం వ్రాసిమ్మనే గొడవ!...... ఆయన మళ్లీ పెళ్లి చేసుకున్నా, నేను ఉండవచ్చునట......నేను పనికిరానుకాని, నా సంపాదన కావా లాయనకు."

"ఈనాటికి కూడా ఆడదాని బ్రతుకు ఇంత అధ్వాన్నంగా ఉండటం సిగ్గుచేటు" అంది మాలతి.

"ఇప్పుడు మళ్లీ ఉద్యోగం దొరకాలంటే ఎంత కష్టం" అన్నాడు దాసు.

సుబ్బలక్ష్మి ఏమీ మాట్లాడలేక తల వంచుకు కూర్చుంది.

"కానివ్వండి—ఏం చేస్తాం.......ప్రయత్నిద్దాం—ఎక్కడైనా దొరక్కపోతుందా?" అంది మాలతి.

## 24

విజయవాడలో "క్రొత్తపుంతలు" నాటకం వేయడానికి నిర్ణయం జరిగింది. మళ్లీ మద్రాసునుంచి దాసుకు ఉత్తరం వచ్చింది—ఆరు వేలు అడ్వాన్సు ఇస్తామనీ, వెంటనేవస్తే అగ్రిమెంటు వ్రాసుకోవచ్చుననీ, షూటింగు కూడా త్వరలో ప్రారంభించుదామనుకుంటున్నామనీ. దాసుకు ఏమీ తోచకుండా ఉంది. "తనను నమ్ముకొని కళాసమితివారు విజయవాడలో నాటకం వేయడానికి సిద్ధంగా ఉన్నారు. తీరా తను మానేస్తే ఎంత అభాసు అవుతుంది? మొన్న మొన్ననే పరిషత్తు మన్ననలు పొందిన సమితి పేరు, ప్రతిష్ఠలు ఏమవుతాయి?" అని ఆలోచించాడు. "ఆరువేలు ఎన్నాళ్లు ఉద్యోగంలో తిప్పలుపడితే వస్తాయి..... ఒక పిక్చరులో మంచి పేరు వచ్చిందంటే బోలెడన్ని బుక్కింగులు వస్తాయి. తన దారిద్ర్యం తీరిపోతుంది. అప్పుడు డబ్బు దేనికి దేనికి ఖర్చు పెట్టడానికీ తోచనంత డబ్బు ఉంటుంది. అప్పులన్నీ తీరిపోతాయి. సుబ్బలక్ష్మిని, పిల్లల్ని హాయిగా పోషించవచ్చు..... భాస్కరానికి పెద్ద చదువులు చెప్పించవచ్చు.......నెమ్మదిగా ఒక మేడ కట్టుకోవచ్చు......మంచి అందమైన కారు కొనవచ్చు. కార్లో తనూ, మాలతీ హాయిగా తిరగవచ్చు.......కాని అసలు అంత తీరిక ఉంటుందా? ఎప్పుడూ కాల్‌షీట్లు ఉంటాయేమో.......నాటకంలో మీనాక్షితో యాక్టు చేసినందుకే మాలతి అనుమానించిందే, రేపు సినిమాల్లో అనేకమంది తారలతో ప్రేమ ఘట్టాలలో నటిస్తుంటే మాలతి పూరుకోగలుగుతుందా?........ఈ ఆడవాళ్లు ఏ విషయాన్నీ పూర్తిగా ఆలోచించలేరు........ఇప్పుడు సుఖాలమీద దృష్టితో ఒప్పుకోమంటారు. అప్పుడు కాపురం మీద దృష్టి తో వదులుకోమంటారు.........ఏమిటీ తనూ ఆలోచిస్తున్నాడు.......నిజంగానే తను మద్రాసువెళ్ళిపోతాడా?...... తనలో ఇంత స్వార్థమా?.......తనను నమ్ముకున్న కళాసమితి ఏం కావాలి?.......ముందు విజయవాడలో నాటకం ఎట్లా పడుతుంది......నిరుత్సాహపడిపోరూ? తన స్వార్థానికి తిట్టుకోరూ?" అని మథనపడుతున్నాడు దాసు. ఇటువంటి సందిగ్ధావస్థలో ఉండగానే మరో క్రొత్త సమస్య వచ్చిపడింది......ఓ రోజు ఆఫీసుకు వెళ్ళేప్పటికి అందరూ అభినందనలు తెలపడం మొదలుపెట్టారు. సినిమా ఛాన్సు వచ్చినందుకేమో ననుకున్నాడు దాసు. అధికారి కూడా దాసును పిలిపించి, "మీ నాన్నగారు పోయినందుకు మొన్నవచ్చి సంతాపం తెలిపానా—ఇప్పుడు కంగ్రాచ్యులేషన్సు చెప్తున్నా దాసూ........కూర్చో" అన్నాడు.

"ఇంకా నేను ఏదీ నిర్ణయించుకోలేకుండా ఉన్నాను సార్!"

"ఏమిటి నిర్ణయించుకొనేది?" ఆశ్చర్యంగా అన్నాడు అధికారి.

"అదేసార్......సినిమా ఫీల్డుకు వెళ్లేదీ—లేనిదీ" అన్నాడు దాసు.

"ఏమిటీ.......నాకు తెలియదే.......ఎవరైనా ఆఫర్ చేశారా?"

"మరి మీరు దేనికీ—కంగ్రాచ్యులేషన్సు చెప్తున్నారు?" ఏమీ అర్థం కానట్టు చూస్తూ అడిగాడు దాసు.

"ఇదిగోనయ్యా ఆర్డర్సు........ఎ. ఐ. ఆర్. వాళ్లు నిన్ను అనౌన్సరుగా అప్పాయింటుచేసి, ఇక్కడి స్టేషనుకే వేశారు. అని అధికారి ఆర్డరు కాగితం దాసు చేతి కిచ్చాడు. దాసు ఆదుర్దాగా దాన్ని చదివి, "ఈ సంగతి నే నెప్పుడో మరచిపోయాను సార్! రెండేళ్లక్రితం ఇంటర్వ్యూలో సెలక్టుచేసి వెయిటింగ్ లిస్టులో వేశామని తెలిపారు. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగమాయె—పెద్ద పెద్ద సిఫార్సు లుండాలి. ఆ నాకెవరిస్తారులే అనుకున్నా.... ఇప్పుడు నాకేంచేయాలో తోచకుండా ఉందిసార్!" అన్నాడు దాసు.

"సినిమా సంగతేమిటి?"

దాసు చెప్పాడు.

"ఓయి నీ ఇల్లు బంగారంకాను—చెప్పావ్ కాదేం?..... ఇంకా ఆలోచ నెందుకు—వెంటనే బండెక్కు.........ఇంక నీ కీ ఉద్యోగాలన్నీ ఎందుకు మిస్టర్ దాసూ!" అన్నాడు అధికారి.

"స్థూలంగా ఆలోచిస్తే అంతేనండీ.......మా కళాసమితి వారు నన్ను నమ్ముకున్నారు. పై వారంలో విజయవాడలో క్రొత్త పుంతలు నాటకం వేయడానికి సిద్ధంగా ఉన్నారు....... నాదారిని నేను వెళ్ళిపోతే ఎలాగా అని ఆలోచిస్తున్నా"

"భలేవాడివే........బంగారు గొడ్డలి—ఇనుప గొడ్డలి సామెతగా ఉంది నీది. వీళ్లకోసం అంత ఛాన్సు వచ్చినప్పుడు వదులుకోడం శుద్ధ తెలివి తక్కువ........బాగా ఆలోచించుకో" అన్నాడు. అధికారి.

'సరే' నంటూ దాసు ఇవతలకు వచ్చేశాడు.

మరో గంటలో ఆఫీసులో అందరికీ తెలిసిపోయింది. దాసుకు వచ్చిన సినిమా ఛాన్సు సంగతి, రేడియో ఉద్యోగం సంగతీను. అందరూవచ్చి అతనికి అభినందనలు తెలియజేసిపోతున్నారు. "ఒక మంచి గుమాస్తాను ఆఫీసు పోగొట్టుకుంటున్నది" అన్నాడు బలరామయ్య. తను వ్రాసిన డ్రాఫ్టులన్నీ సూపర్నెంటు దాసుచేత దిద్దిస్తున్నాడని అసూయపడ:తున్న డేనియల్ దాసు వెళ్ళిపోతున్నందుకు లోలోపలే సంతోషించాడు. కాళిదాసువచ్చి "ఆంధ్రదేశంలో నీఅంతటి నటుడు లే"డని పొగడి, "బ్రదర్ నన్ను మరచిపోకు. నీవు ఆఫీల్డులోకి జొరబడుతున్నావు కాబట్టి నిలద్రొక్కుకున్నాక నా గురించి ప్రయత్నం చెయ్యి—ఒకటీ, రెండు పాటలైనా వ్రాసేందుకు" అని ప్రాధేయపడ్డాడు. దాసు లోలోపలే నవ్వుకున్నాడు, అతని పొగడ్తలకీ, ప్రాధేయపడటానికీ. అదే కాళిదాసు తన నాటకం కళాసమితివారు తీసుకోకుండా పడగొట్టింది దాసేనని మొన్న మొన్నటివరకూ ఆఫీసులో

ప్రచారం చేశాడు. దాసుకు ఏమీచేయ బుద్ధి పుట్టలా. ఎంతో సేపు తనలో తాను తర్కించుకుంటూ గడిపాడు. "ఏది ఏమై నప్పటికీ, రిజైన్ చేస్తాను" అనుకొని రాజీనామా పత్రం వ్రాసి, అందులో తనను తొందరగా రిలీవ్ చేయవలసిందిగా అధికారు లకు విన్నవించుకున్నాడు. ఆ కాగితాన్ని బలరామయ్య చేత సంతకం పెట్టించి ఫైలు అధికారికి పంపించాడు. దాసు రాజీనామా ఇచ్చిన సంగతి కూడా ఆఫీసంతా పాక్కిపోయింది. అంతా అప్పటి కప్పుడు కూడబలుక్కుని చందాలు వేసుకొని, సాయంత్రం ఆఫీసు వదలగానే అతనికి 'తాజ్' లో పార్టీ ఇద్దామని నిర్ణయించుకొని దాసు దగ్గరకు వచ్చి చెప్పారు. "అవసరంగా ఈ ఆర్భాటమంతా దేనికి?" అన్నాడు దాసు. "అవసరమే—మీరే మీ అడ్డు చెప్ప కూడదు" అన్నారు కాళిదాసు, రావులు. "అయినా ఇప్పుడేం తొందర?........రిలీవ్ అయ్యేప్పుడు ఇవ్వవచ్చులే—నాకు సాయం త్రం వేరే పని ఉంది" అన్నాడు దాసు. "సరే", అన్నారు వాళ్ళు. "ఇంక దాసుగారికి క్షణం తీరిక ఉండదు" డేనియల్ అదోలా నవ్వుతూ అన్నాడు నెమ్మదిగా."

దాసు ఆఫీసునుంచి బయలుదేరి వాసుదేవరావుగా రింటికి వెళ్ళాడు. అతణ్ణి చూడగానే మాలతి నవ్వుతూ "నాకేం బహుమానం ఇస్తారు—మీ చెల్లెలికి ఉద్యోగం ఇప్పిం చాను" అంది.

"ఏమివ్వమంటావు?" ముసి ముసిగా నవ్వుతూ అన్నాడు దాసు.

"మీరు చాలు........" అని నాలుక కరచుకొని, సిగ్గు పడుతూ తలవంచుకుంది. మాలతి—దాసుకు దగ్గరగా వచ్చింది.

"నన్నునీ ఋణగ్రస్తుణ్ణి చేసుకొని ఏనాడో స్వాధీన పరచుకున్నావుగా" అని గడ్డం పుచ్చుకొని మాలతి ముఖం ఎత్తి కనుపాపల్లో ప్రతిబింబాలు వెతికాడు దాసు.

ఇంకో పరిస్థితిలో అయితే మాలతి ఆ మాటకు జవా బిచ్చి చిరుకోపం తెచ్చుకునేది. ఇప్పుడు శబ్దాల్లో జవాబివ్వలేదు. "నేనే మీకు స్వాధీనమయ్యాను" అన్నట్లు దాసు గుండెలకు తలను పాదివికొని కౌగిట్లోకి ఒదిగింది. "నీవు నా అదృష్ట దేవతవు మాలతీ!" అంటూ దాసు ఆమెను ముద్దుపెట్టుకున్నాడు. ఇంతలో అక్కడికి "ఇద్దరు దొంగలూ గదిలోచేరి ఏం చేస్తు న్నారు" అంటూ మైత్రేయి గలగల నవ్వుతూ వచ్చేప్పటికి మాలతీ—దాసూ విడిపోయారు.

"దాసుగారు ఎంతో మంచి వారూ—నోట్లో నాలుక లేనివారూ అనుకున్నా......ఫర్వాలేదులే అక్కా! మీ ఆయన సాహ సోపేతుడేలే.........ఏమండీ—సినిమా దాసుగారూ!" అంది మైత్రేయి మళ్ళి నవ్వుతూ.

"నీ తిక్కా అణుగుతుందిలే........వస్తున్నాడులే రేపు గోపాలరావు బావ—మొట్టికాయలు మొట్టడానికి" చిరునవ్వుతో అంది మాలతి.

"ఫో అక్కా.......నీవు తప్పించుకొని నన్ను అంటగడు తున్నావు........నీకేం హాయిగా హీరో దాసుగారు దొరికారు...... సారీ—బావగారు" కొంటెగా దాసువంక చూసి, నాలికతో వెక్కి రించి, "బావా—బావా పన్నీరు........బావను పట్టుకు తన్నేరు" అంటూ మైత్రేయి దాసు చుట్టూ తిరుగుతూ, చప్పట్లుకొట్టి గలగల నవ్వుతుంటే ఆమె నవ్వులో మాలతీ, దాసులు శృతి కలప కుండా ఉండలేక పోయారు.

"ఏమిటి మైత్రేయి పాట పాడుతున్నది?" అంటూ మీనాక్షి వేనటీబ్యాగ్‌తో లోపలికి వచ్చి, ఓ సోఫాలో కూర్చుంది.

"ఏం మీనాక్షీ—ఆఫీసునుంచి సరాసరి ఇటే వచ్చేశావే" అంది మాలతి.

"అవును మాలతీ!.........అస లిప్పుడు వద్దామనుకో లేదు. బస్సులో వస్తుంటే దాసుగారి ఆఫీసులో పనిచేసే నీరజ కనిపించి, దాసుగారు రిజైన్ చేసినట్లు చెప్పింది. అందుకని కలసి పోదామని వచ్చాను" అంది మీనాక్షి.

"ఏమండీ—చెప్పనేలేదేం?" దాసువంక చూస్తూ అంది మాలతి.

"ఏదీ—నీవు చెప్పనిస్తేగా.......ఇంటికి రాగానే....."

"అంత మాట్లాడకుండా పెదవుళు నొక్కేస్తోందా మా మాలతి" అని కిలకిల లాడింది మీనాక్షి.

"అయితే మద్రాసు ప్రయాణం కడుతున్నారన్నమాట?" అదోలా చూస్తూ ప్రశ్నించింది మాలతి.

"ఏం మీనాక్షీ—నీరజ నీ కింకేం చెప్పలా?" అన్నాడు దాసు.

"ఇంకేం చెప్పలేదే!" ఆశ్చర్యంగా చూస్తూ అంది మీనాక్షి.

"బహుశా ఆమె కింకా తెలియలేదేమో.......అందరికీ తెలిసిందే ఆఫీసులో" అన్నాడు దాసు.

"అబ్బబ్బ!.......మామూలుగా మాట్లాడుతున్నప్పుడు కూడా సస్పెన్సేనా హీరో బావగారూ!.........చంపక అదేమిటో చెబుదురూ!" అంది మైత్రేయి.

దాసు లేచి నిలుచుని, "నా చేతిలో ఏముందో చూడండి" అంటూ పంట్లాం జేబులోంచి ఓ కవరు తీశాడు.

"కవరూ......మళ్ళీ సినిమావాళ్ల దగ్గరినుంచి వచ్చిం దేమో!" అన్నారు ముగ్గురూ.

"ఢిల్లీనుంచి ఎ. ఐ. ఆర్. వారు పంపారు."

"ఢిల్లీనుంచే.......అయితే హీరోబావగారూ......ఢిల్లీలో రేడియో స్టేషనులో తెలుగు నాటకం మీకోసం షెడ్యూలుచేసి అందులో మిమ్మల్ని బుక్ చేశారాండీ!" నవ్వుతూ వ్యంగ్యంగా అంది—మైత్రేయి.

"ఆమాత్రం నాకు తెలియదా మరదలా......నన్ను అనౌన్సర్‌గా అప్పాయింటుచేసి, ఇక్కడి స్టేషన్‌లోనే చేరమన్నారు'

"కంగ్రాచ్యులేషన్స్ దాసుగారూ!........కాని మీరు సిని మాలో నటించడానికే రిజైన్ చేశారని చెప్పిందే నీరజ."

# ఆకర్షణలో అపస్వరాలు

''ఆమె కేదీ తెలియదు సరిగా.''

ఇంతలో అక్కడకు బాయ్‌వచ్చి, ''సార్.......మీకోసం రమణగారూ, రాజుగారూ వచ్చారు........డ్రాయింగ్‌రూంలో కూర్చోపెట్టాను'' అన్నాడు.

''బహుశా నా సంగతి తేల్చుకుంటానికే వచ్చినట్టున్నారు'' అన్నాడు దాసు లేస్తూ. అందరూ డ్రాయింగ్‌రూంలోకి వెళ్లారు.

''ఏం రమణా!........ఏమిటి విశేషాలు?'' అని ప్రశ్నించాడు దాసు.

''మేమేమైనా చేస్తామనా—అంగరక్షకుల్ని ముగ్గురినీ వెంట తెచ్చావు?'' నవ్వుతూ అన్నాడు రాజు.

''నీ అంగ రక్షకులు నాకేమీ అక్కర లేదులే. నా అంగ రక్షకులు ఇద్దరే'' అంటూ మీనాక్షివంకచూసి నవ్వాడు దాసు.

''ఇదుగో బావగారూ! నేను కూడా కాను, ఒక్కరే మీ అంగరక్షకులు. కాదని వాదిస్తే నేనూ రిజైన్ చెయ్యాల్సివస్తుంది'' అంది మైత్రేయి, చిలిపిగా.

''ఏం దాసూ........ఏం నిర్ణయించుకున్నావు......వీర్రాజుగారు కనుక్కురమ్మన్నారు.....నీవు సరేనంటే తేదీ ప్రకటిస్తాం—లేకపోతే మానేస్తాం........వెంకటేశ్వర్లు నీ వేషం వేస్తానంటున్నాడు. కాని, మా కెవ్వరికీ ఇష్టంలేదు'' అన్నాడు రమణ.

''నాకూ ఇష్టంలేదు.......అతను ఆ వేషంవేస్తే నేను వేయను.......హీరోయిన్‌గా ఇంకెవరినైనా చూసుకోవాల్సిందే!'' అంది మీనాక్షి.

''రమణా—ఒక్కవిషయం చెప్పనా?'' అన్నాడు దాసు. ఆశ్చర్యంగా అందరూ అతనివంక చూశారు.

''నేను ఉంటానూ— ఉండనూ అన్న విషయం అట్లా ఉంచండి........ఒకరి ఇష్టా యిష్టాలతో ప్రమేయం లేకుండా సంస్థను దృష్టిలో పెట్టుకొని ఆలోచించండి......మీకందరికీ నామీదఉన్న అభిమానంవల్ల నేనే మళ్లీ ఆ వేషం వెయ్యాలంటున్నారు. వెంకటేశ్వర్లువేస్తే పనికిరాదంటున్నారు. మీనాక్షి కూడా వెయ్యనంటున్నది. అది చాలా పొరపాటు. ప్రతి నటుడూ ప్రతి పాత్రనూవేసి మెప్పించడానికి ప్రయత్నంచాలి. అయితే ఎవరి విశిష్టత వారికుంటుంది. నేను వేసే పాత్రను వెంకటేశ్వర్లు వేసి ఇంకో విధంగా మెప్పించవచ్చు.......ఎందుకు ప్రయత్నించకూడదూ?'' అన్నాడు దాసు.

''నీవు చెప్పింది కాదనలేను దాసూ!.......అదిక్రమంగా జరగాల్సిన పని.........ఇప్పుడీ నాటకంలో సాధ్యంకాదు. జనం నీమీద మోజుగా ఉన్నారు. వెంకటేశ్వర్లుకున్న సామర్థ్యం మనకందరికీ తెలిసిందే........అయినా ఒకవేళ వెంకటేశ్వర్లు నీ కంటే బాగా నటించినా జనం మెచ్చరు'' అన్నాడు రమణ.

''ఏమో బాబూ!......నేను మాత్రం వెంకటేశ్వర్లు ప్రక్కన వేయలేను......అంతగా అయితే నాకు జయలక్ష్మి వేసే వేషం ఇవ్వండి'' అంది మీనాక్షి.

''అయితే దాసు సినిమాలోకి వెళ్లడం ఖాయమన్న మాట'' అన్నాడు రాజు.

''ఇదుగో మీనాక్షీ! ఇలా మనస్సులో జంటలే రంగస్థలం మీద కూడా జంట పడాలంటే ఇక రాజును కూడా రంగంమీదికి దింపాల్సి వస్తుంది'' అన్నాడు దాసు.

ఇంతలో వాసుదేవరావుగారు ఆయన గదిలోకి వెడుతూ. డ్రాయింగ్ రూంలోకి తొంగి చూసి ''ఏమిటీ— అంతా సభ తీర్చి కూర్చున్నారు?'' అంటూ లోపలకు వచ్చారు. రమణా, రాజూ, దాసూ, మీనాక్షి లేచి ఆయనకు నమస్కరించారు.

''ఏమిటి విశేషాలు రమణగారూ?'' అన్నారు వాసుదేవ రావుగారు.

''దాసుగారు రేపు విజయవాడలో నాటకంవేసేదీ లేనిదీ తెలుసుకుందామని వచ్చారు నాన్నగారూ!'' అంది మైత్రేయి.

''మా కళాసమితి పరువు, ప్రతిష్ఠలు దాసుమీద ఆధార పడి ఉన్నాయండీ!'' అన్నాడు రమణ.

''మరి ఏం నిర్ణయించుకున్నావు దాసూ?'' అన్నారు వాసుదేవరావుగారు.

''మీరు పెద్దలు......నా శ్రేయస్సును కాంక్షించే వారు......నా కింక సలహా లిచ్చేవారెవరున్నారు చెప్పండి........ నాన్నగారు కాస్తా........'' అని అంటుంటే కళ్లల్లో నీళ్లు నిండాయి దాసుకు.

''విచారించకు దాసూ!.......కాని, ఇది వ్యక్తిగత విషయం.. సినిమారంగం డబ్బు కుమ్మరించే మాట నిజమే.......ఆ రంగంలో కూడా నీకు మంచి భవిష్యత్తే ఉంటుంది......కాని ఆ రంగంలోని రాజకీయాలకు, అభిమాన దురభిమానాలకు, కనిపించని చెడుగుకూ అతీతంగా నీవు ఉండగలవనే నమ్మకం కూడా నా కుంది.......ఇక వెళ్లడం, వెళ్లకపోవడం నీవే నిర్ణయించుకోవాలి'' అన్నారు.

''నేను అన్ని విషయాలూ ఆలోచించాను. కళాసమితి స్థాపకులలో నేను కూడా ఒకడిని. ఆ సంస్థవల్లనే నేను మీ అందరికీ ఇంత కీలక సమస్యగా తయారయ్యాను.....కీర్తిశేషులైన మా నాన్నగారు ఈ రంగస్థలాన్ని నాకు వారసత్వంగా ఇచ్చి పోయినట్లు అనుభూతి నాలో కలిగింది. మనదేశం లాగానే ఇదీను. దేశానికి భారీ పరిశ్రమలు ఎంత అవసరమో, నిరుద్యోగ సమస్య తీరడానికి లఘు పరిశ్రమలు అంతకన్న ఎక్కువ అవసరం. సినిమా భారీ పరిశ్రమ. మనుష్యులకన్న యంత్రాలకు ఎక్కువ ప్రాధాన్యం ఉండే రంగం అది. నాటక కళ లఘు పరిశ్రమ. ఎక్కువమంది కళాకారులకు శిక్షణ కేంద్రం ఈ రంగం ...... మా నాన్నగారు నాటక రంగానికే జీవితం అంకితం చేసినట్లు నేనూ నాటక రంగానికే అంకితమై పోదామనీ, ఆయన ఋణం ఇలాగైనా తీర్చుకుందామనీ నిశ్చయించుకున్నాను.'' అని దాసు అనేప్పటికి అందరూ సంతోషంగా చప్పట్లు కొట్టారు.

దాసు మాలతి వంక చూశాడు. ఆమె కళ్లు ఆనందంతో మెరిసిపోతున్నాయి.

"నిజంగా నీవు చాలా గొప్ప త్యాగం చేస్తున్నావు దాసూ !" అని అభినందించాడు రమణ.

"దాసుగారు కాబట్టి సినిమా ఛాన్సు వదులుకున్నారు గాని, ఇంకొకరైతేనా, నీ నాటకం ఎంత చేసునని ఈపాటికి మద్రాసు బండీ ఎక్కేవారు," అంది మీనాక్షి.

"ఎట్లాగైనా దాసు దాసే .... ఇంకొక రెట్లా అవుతారండీ !" అన్నాడు రాజా. అది దాసును అభినందించడమో, మీనాక్షి మాటలతో తానూ ఏకీభవించుతూ మాట కలపడమో తెలియలేదు.

"మీ రెవరూ నన్ను పొగడ నక్కరలేదు..... నేను వెళ్లననడంలో కూడా స్వార్థం లేకపోలేదు .... మాలతికి నేను సినిమాల్లోకి వెళ్లడం ఇష్టంలేదు." చిరునవ్వుతో అన్నాడు దాసు.

"బాగుంది— చివరికి నామీద నెపం వేస్తున్నారు చూశారా నాన్నగారూ!" ముసిముసిగా నవ్వుతూ అందిమాలతి.

"ఇకనుంచి మన గొంతు రోజా రేడియోలో వింటావులే రాజా !" అన్నాడు దాసు.

"అదెలా ?"

"అన్నౌన్సర్ పోస్టు వచ్చిందోయ్ రమణా ? మా ఆఫీసులో రిలీవ్ కాగానే అక్కడ చేరుతా."

"భలే గుడ్ న్యూస్ ! .... కంగ్రాచ్యులేషన్స్ !" అన్నాడు రమణ.

"నేను మరో గుడ్ న్యూస్ చెప్పనా—మీ అందరికీ ... మా మాలతిని దాసు కివ్వడానికి నిశ్చయించుకున్నాను. మా వేనుల్లుడు గోపాలరావుకు మైత్రేయిని నిర్ణయించాం. రెండు పెళ్లిళ్లు ఒకేసారి జరుగుతాయి. కనుక మీరంతా బంధుమిత్ర పరివార సమేతంగా ఏ తన్మూహూర్తమునకు విచ్చేసి, మత్కృత సకలోపచారముల స్వీకరించి నన్నానందింప చేయ ప్రార్థన .... ఇట్లు ..... " అని నవ్వారు వాసుదేవరావుగారు. అందరూ చప్పట్లు కొడుతూ ఉంటే మాలతి సిగ్గుతో క్రీగంట దాసువంక చూసింది.

"ఏమో ననుకున్నాను .... వాసుదేవరావుగారు కూడా బాగా యాక్టు చేయగలరు" అన్నాడు రాజా.

"నాకు తెలియకపోలేదులే. నువ్వూ యాక్టు చేయగలవు మీనాక్షి ఉంటే" అన్నాడు దాసు.

"ఓ—బేషుగ్గా .... నేనూ చిన్నప్పుడు నాటకాలు వేశాను .... ఏ వేషం అని మాత్రం అడక్కండి .... ఈ శుభ సందర్భంలో నాదో చిన్న అనౌన్సుమెంటు .... మీనాక్షి విల్ బి మై లైఫ్ పార్టనర్" అన్నాడు రాజా.

"తెలుగు .... తెలుగు" అని చప్పట్లు కొట్టింది మైత్రేయి.

"మనం ఇష్టం వచ్చినన్నాళ్లు తెలుగుతోపాటు ఇంకా అంతకంటె ఎక్కువగాను ఇంగ్లీషు వాడుకోడానికి మన నాయకులు అనుమతించారు మైత్రేయిగారూ !" అని రాజా జవాబిచ్చాడు.

"సరే—అంతా బాగానే ఉంది, ఈ అనౌన్సుమెంట్ల అనంతరం .... " అని వాసుదేవరావుగారు అంటూంటే "ఒక చిన్న పార్టీ—పదండి లోపలికి" అంది మైత్రేయి.

(స మా ప్త ము)

# పాంచాల - బాభ్రవ్యుఁడు

## శ్రీ దువ్వూరి జగన్నాథశర్మ

తొల్లి మహాదేవానుచరుం డగు నందికేశ్వరుండు రూపొందించిన కామాగమ సహస్రాధ్యాయి ఔద్దాలకి శ్వేతకేతునిచే అర్ధసహస్రాధ్యాయిగ హ్రస్వీకరింపఁ బడినది. దానిని నూటయేఁబది అధ్యాయములుగా పాంచాలుం డయిన బాభ్రవ్యుఁడు కామాగమ సూత్ర ఫక్కి యనఁదగినట్లు సంక్షేపించి యుండెను. ఈ యర్థమును కామసూత్రమందు వాత్స్యాయనుఁడు

"శాస్త్రే ప్రకృతత్వాత్ తత్ సమయావ బోధకశ్చా
చార్యేభ్యః + ప్రజాపతిః + మనుః + బృహ
స్పతిః + నందీ + శ్వేతకేతుః + తదేవతు +
బాభ్రవ్యః సంచిక్షేప—" ఇత్యాదిగ నుపోద్ఘాతించెను.

ఈ కామాగమ సూత్రఫక్కి యొక్క నిర్మాణోద్దేశము—"న—రాగాయ్యై = లోకయాత్రాయ్యై"—"కుశలోవిద్వాన్ ధర్మార్థావలోకయన్ నాతిరాగాత్మకః + ప్రయుంజాన =" అని. ఇట్టి మహోదారాశయ మున్న గ్రంథకర్తలెవ్వ రెవ్వరు ? అనియాశంకము. నందియేమో మహాదేవానుచరుఁడు—శ్వేతకేతువేమో ఉద్దాలక నందనుఁడు—బాభ్రవ్యుఁడో ? పాంచాలుఁడు. ఇచ్చట బాభ్రవ్యు లెందరు శ్రుతగోచరు లగుదురని వివేకించుకొందము. —ఈ పాంచాలుఁడు గాక ఇంకను ఇద్ద రుండిన వారు—ఎట్లనఁగా—

1. ఒక బాభ్రవ్యుఁడు గోత్రకర్త యనఁబడిన ఋషి. "వైశ్వామిత్ర దేవరాత, ఔదలత్రయార్షేయ ప్రవరాన్విత బాభ్రవ్యసగోత్రః" అనునట్టి యభివాదన మందలి యాతఁడు.

2. ఇంకొక బాభ్రవ్యుఁడు. స్మరదర్శనానుష్టుప్ శ్లోకద్వావింశత్ కర్త—పాంచాలుఁడుకాఁడు. వామకేశ్వర తంత్రాంతర్గతముగ హంసకిరణావళీత్యాది ఖండకావ్య ప్రణేత. శాక్తేయ పంచ మకారాది ప్రవక్త—చిత్ సూర్యాలోక కావ్యకకర్త—ఒక యవధూత.

3. మల్లనాగుని వాత్స్యాయన కామసూత్రమందుగ్గడింపఁ బడిన బాభ్రవ్యుఁడో పంజాబు దేశస్థుఁడు—"కాశ్యప—అవత్సార—నైధ్రువత్ర యార్షేయ ప్రవరాన్విత పంచాలస గోత్రః" అని యభివాదనము చేసియుండి నాతఁడు.

1. ఈ గోత్రర్షి ఈ—పంచాల మహర్షి వల్లనే ఋగ్వేదమువంటి బహు ప్రాచీన వాఙ్మయమందు ఆలింగన చుంబనాది సాంప్రయోగిక చతుష్షష్ఠి నిర్వచించఁబడినది. "పంచాలేన మహర్షిణా ఋగ్వేదే చతుష్షష్ఠిర్నిగదితా." గురుదత్తేంద్రపాదులు.

2. పాంచాలుం డగు బాభ్రవ్యునిచేత కామాగమ సాంప్రయోగికాధికరణమందు నఖక్షత దంతక్షతాది కళా చతుష్షష్ఠి ప్రతిపాదిత మయినది. "బాభ్రవ్యేణాపి పాంచాలేన స్వకృతే సాంప్రయోగికేఽధికరణే ఆలింగనాదయ ఉక్తాః" ఇంద్రపాద.

3. ఆ ఋగ్వేద మహర్షి—ఈ బాభ్రవ్యుఁడు ఈ యిరువురును గూడ—ఒకే గోత్రము కలవారు. ఇరువురును సారస్వత ముఖమున ఆలింగనాది కళా చతుష్షష్ఠిని ప్రతిపాదించి యున్నవారు. "ద్వయో రప్యేక గోత్ర నిమిత్త సమాఖ్యేన పాంచాలేన నిగదనాత్ సంబంధోఽస్తి—" ఇంద్రపాద. ఇదియే పాంచాలికీ చతుష్షష్ఠి.

4. బాభ్రవ్యుని కిట్లు పాంచాల సంకేతము స్వకీయ ప్రవర యందలి ఆ గోత్రర్షి పంచాల ప్రమేయ మట్లుండఁగా ఆతఁడు పాంచాల దేశీయుఁడు—పాంచాల రాజధాని యగు కాంపిల్య—మహానగరమం దాతని నివాసము—విశేషించి పాంచాలు రన్న ప్రతీతి గల బార్హదిషులకు—ముఖ్యముగా బ్రహ్మదత్త మహారాజునకు—అతఁడు పురోహితుఁడు—వేదాంగశిక్షా క్రమాను శాసకుఁడు.

5. ఇంకను విశేష మేమనఁగా తాను నిర్మింపఁ బూనిన కామాగమ సూత్ర ఫక్కియందు ప్రతిపాదిత విషయము పంచాలమను ప్రౌఢోక్తియుం గలది. "1. పంచాల శబ్దః—పంచానాం విషయాణాం ప్రకాశనాయాల మితి పంచాలః. 2. "ప్రవృత్తించ నివృత్తిం చ శాస్త్రం పంచాల సంజ్ఞికమ్"—అని.

6. ఈ కళా శాస్త్రమందు నిర్వచింపఁబడిన ఆలింగన చుంబనాది చతుష్షష్ఠి కళలు—అందుకు సంబంధించిన—విద్యా చతుష్షష్ఠి వీటి ప్రయోగ విజ్ఞాన ప్రశస్తిని లోకములో బహిరంగముగఁ గాకున్న మానె రహస్యముగా నయిన నెల్లరును శిరసావహించువారె ! ఇందువల్ల నీ శాస్త్రము ఉత్కృష్టమైనదే ! ఎట్లనఁబడినది—పెద్దలవల్ల ?

1. విద్వద్భిః పూజితా మేతాం
ఖలైరపి సుపూజితామ్
పూజితామ్ గణికా సంఘైః
నందినీం ! కో ? నపూజయేత్— —యశోధరుఁడు.

2. క. శ్రుతి—శాస్త్రాంగ—పురాణ ప్రతతియు—
ఇతిహాస—కావ్యభరతాగమముల్ +
స్మృతి—సంగీత—రతి కళాగతుల
—అలంకృతుల నెఱుఁగఁగాఁ దగు—కవికిన్— —అప్పకవి.

కామము అనఁగా మనస్సు మొదలగు ఇంద్రియముల చేతఁ గోరఁబడినట్టి విషయానుభవ సుఖము. జితేంద్రియ ప్రాభవముల లభింపఁదగిన రీతిగా ధర్మార్థ కామములు—ఇవి పరస్పర వైరుధ్య మెనయకుండ లోక సమ్మత విధవర్తన మతి

వహించుకొనియుండి నట్లయితే కామము గూడ ప్రశస్త గుణ మనిపించుకొనును. ఇట్లు కానప్పు డది హేయ గుణములు పదునారింటిలోఁ జేరిపోవును. ఇట్టి లోకస్థితి నిబంధనముగా బాభ్రవ్యుఁడు కామసూత్రాగమమునకు నిర్మాత యయ్యెనని వాత్స్యాయనుఁడు వచించి యున్నాఁడు.

మరియును—"బాభ్రవీయ సూత్రార్థాన్ సువివృత్య వాత్స్యాయనః కామసూత్రాగమం యధావిధి చకార"—బాభ్రవ్యాః= బాభ్రవీయాః ఇతి. బాభ్రవ్య శిష్యాః = బాభ్రవ్యమతానుసారిణః" జయమంగళ వార్తికము. మిక్కిలి ప్రౌఢ మయి నట్టి యీ వాత్స్యాయనుని కామసూత్ర నిర్మాణ మంతయును బాభ్రవ్య మతానుసరణమే యనవచ్చును. ఐనను—తన రచన—ముప్పదియారధ్యాయముల గ్రంథమునందును ఐదుమార్లు మాత్రమే సూటిగా నతఁడు బాభ్రవ్యుని వక్కాణించెను. తన్మతానుయాయులను నర్థమున నాలుగు సార్లుగ బాభ్రవీయ శబ్దము నుచ్చరించెను. బాభ్రవ్యుని కంటె సనాతనుఁ డనఁదగిన ఔద్దాలకిని ఒక్కపరి స్మరించెను. బాభ్రవ్యునికి—వాత్స్యాయనునికి మధ్య కాలపు వారిలో మధుర నుంచి పాటలీపుత్త్రమున కేగిన దత్తకుని ఒక్కమారు—పతంజలి యనఁబడుచున్న గోనర్దీయుని ముమ్మాఱు—పతంజలి చరిత్ర మందు గోణికాపుత్రుఁడుగాఁ జెప్పఁబడిన పతంజలిని ముమ్మాఱు అర్థశాస్త్ర వృత్తికారుఁడని సుప్రసిద్ధి గల ఘోటకాముఖుని ముమ్మాఱు, సాహిత్య శాస్త్రమందు రీతి నిర్ణయకారుఁడని ప్రతీతి గడించిన సువర్ణనాభుని తొమ్మిదిసార్లు అర్థశాస్త్ర వార్తిక కర్తయయి యుండిన చారాయణుని ముమ్మాఱుం దడివి వాత్స్యాయనుఁడు తన గ్రంథమును రచియించెను—సారస్వత పీఠము యొక్క ఆదేశము ననుసరించి ఔపనిషదికమును కుచుమారుఁడు రచించెను. ఏతత్ గ్రంథమునే వాత్స్యాయనుఁడు చేబట్టి నాతఁడు—ఇట్లు ఆతఁడు వినియోగించుకొన్న గ్రంథావళి :— దత్తకుని వైశికాధికరణము, గోనర్దీయుని ప్రౌఢాధికారికము, గోణికాపుత్త్రుని ఆంతః పౌరికము, ఘోటకాముఖుని భార్యాధికారికము, సువర్ణనాభుని సాంప్రయోగికము, చారాయణుని సాధారణాధికరణము. ఇవియే వాత్స్యాయనునిచే గ్రంథరచన సందర్భమందు యోజనకు వినియోగింపఁబడిన పురాతన గ్రంథరాజములు. ఈ గ్రంథము లన్నియు ఇప్పుడు అదృశ్యము లయినవి. కుచుమార తంత్ర సూత్రము లందలి గొంత భాగము వేయేండ్ల క్రిందటనే శ్లోకీకరణ మందెను. అది మాత్రమే ముద్రితమయి యిప్పుడు లభించుచున్నది. మిగతా గ్రంథాళి అంతయుఁ గూడ "శుద్ధ—బాభ్రవీయా యనమ్—భజగోవిందమ్" తలపునకు వచ్చి నిర్వేదముచే అశ్రుపాతమే తప్ప—ఏది ? కామశాస్త్రోపాధ్యాయుం డయిన విశాఖిలుని రచనము ? కామశాస్త్రము. అది క్రీ. శ. 820 వరకు వామన పండితుని యొక్క యింట నుండెడిదే ? అభినవ గుప్తుని (క్రీ. శ. 1020) నాటికి నిల్చియున్న ఆ విశాఖిల భరత మిప్పుడేదీ ? కాశ్మీరుండగు వసునందన రచనమగు స్మరశాస్త్ర మిప్పు డగుపడకున్నదే. ఇట్లే 1. శంకరుని మనసిజసూత్రము. 2. ఈశ్వరుని మన్మథ తంత్రము. 3. ధ్రువపాలుని నాగార్జునీయ యోగశతకము. 4. సోమదత్తి విటవృత్తము. 5. మన్మద సంహిత 6. నాగర వల్లభము. 7. కామ ప్రకాశము. 8. రసిక సర్వస్వము 9. కామరత్నము. 10. ప్రణయ చింత. 11. మాంధాతృని మదన మహార్ణవము. 12. దేవి సింహుని కామశాస్త్రము. 13. వ్యాస జనార్దనుని కామ ప్రబోధము. 14. కామరాజుని మదనోదయ సార సంగ్రహము. 15. సిద్ధదేవుని రతిశాస్త్ర సముచ్చయము—వాత్స్యాయనునికిఁ దరువాత నిర్మితమయిన ఈ గ్రంథ సముదాయము కూడ ఈనాఁడు అంతర్హితము అయిపోయినదే ?

ఐనను వాత్స్యాయనుని రచనము—నందికేశ్వరుని మొదలుగాఁమహాభాష్యకారుఁడయిన పతంజలి పర్యంతము ఆచార్యాభిప్రాయ పరస్పర భిన్నత లన్నింటికిని ప్రాతినిధ్యము నిల్చినది. ఆ మహా విద్వన్మఖండు లందరికిని సారస్వత ప్రమాణమున స్మారక చిహ్నము నాఁదగినది. ఈ వాత్స్యాయనీయము వయిని వజ్రఖడ్గ ధరాచార్యుఁ డొనర్చిన వార్తికము, భోజుని శృంగార ప్రకాశ విధానము, గురుదత్తేంద్ర పాదుండగు యశోధరుని జయమంగళ, భాస్కర నృశింహుని వివరణము, వీరభద్ర దేవుని కందర్ప చూడామణి, మల్లదేవ టీక, శంకర వివృతి, మాధవాచార్యుని హిందీ వివరణ, ఆదినారాయణశాస్త్రి ఆంధ్రీకరణము, యస్. ఆర్. షిమిడ్ జర్మనీ ట్రాన్స్లేషను = 1888 నాఁటి ఆంగ్లీకరణము, రంగస్వామి అయ్యంగారి ఆంగ్ల భాషాంతరీకరణము, గేంబర్సు, బగ్బీగార్ల ఆంగ్లాను వాదములు ఇట్లు బహుముఖముల నీ గ్రంథరాజము సురక్షిత మయుండి విశేష వ్యాప్తి నందియున్నది. ఇది యంతయు నిట్లుండ—

వాత్స్యాయనుఁడు అలంకార సూత్ర రచయితయై యుండెనని సాహిత్య విద్యావేత్తలు చెప్పుచున్నారు. న్యాయ దర్శనము వయిని భాష్యమును విరచించినవాఁడని శాస్త్రజ్ఞులు పలుకుచున్నారు. ఇప్పటికిని ఆ న్యాయదర్శన వాత్స్యాయన భాష్యము విశ్వనాథ వృత్తి సమేతమై విద్వాంసులు—విద్యార్థుల మధ్య పఠన పాఠ్యములందున్నది. సూత్రములు—భాష్యము ఈ యుభయ గ్రంథములు రచించినవాత్స్యాయనులు పరస్పర భిన్నులా ? ఒకే వ్యక్తియా ? మరియు—"విష్ణు గుప్తస్తు—కౌండిన్యఃచాణక్యో ద్రోమిళోంశులః—

వాత్స్యాయనస్తు—మల్లనాగః." అను వివిధ పర్యాయ నామములు గనవాఁడై వాత్స్యాయనుఁడు వ్యవహరింపఁబడినట్లు క్రీ. శ. 1260 నాఁటికి ఉన్న ప్రతీతిని పురుషోత్తమ పండితుఁడు గ్రంథ స్థగిత మొనరించి యున్నాఁడు. మరియును తన గ్రంథమందు ఆభీరకొట్ట రాజును, కుంతల శాంతకర్ణిని క్రోడీకరించియున్న వాత్స్యాయనుఁడు బుద్ధ నిర్వాణాత్పూర్వుఁ డయి——యుండవచ్చునా ? ఇలా గంటియాశంకములను జర్చింపఁబూనుట విద్వద్రంజకము లన నొప్పును గాని—బాభ్రవ్యుని గూర్చి చెప్పుట ప్రధానాంశమయి యున్నప్పటిలో వాత్స్యాయనుని గూర్చి యాశంకము లేర్పరించుట అప్రస్తుత మన్న యాక్షేపణముగలదు. కనుక నిక ముఖ్యముగా ప్రస్తుతాంశములో బాభ్రవ్యుఁడు కామాగమ సూత్ర ఫక్కిని రచియించిన కాలమును గూర్చి యోజింపవలయును. అవంతికా

# పాంచాల - బాభ్రవ్యుడు

పరిసరమునందు శంభోద్ధార క్షేత్రమున లౌకాయతిక చార్వాక పీఠములు అర్థకామములు రెండే పురుషార్థము లన్న ప్రచారమును సాగించుచున్న కాలమున బాభ్రవ్యుడు తన కామాగమమును విరచించి యుండినట్లుగా లోక ప్రతీతి యున్నది. కౌరవులలోని దుర్యోధనునికి చార్వాకునకు మైత్రి కలదన్న ఐతిహ్యము లున్నవి. యుధిష్ఠిర శకము 661 లో జన్మించి చార్వాకుడు 727 లో మరణించెను. ఆ చార్వాకుని జీవిత కాలము 66 సంవత్సరాలు. దీనినిబట్టి దుర్యోధన చార్వాక సమకాలీనత యనగా వేరుమాటలలో మహాభారత కౌరవ పాండవ యుద్ధకాలము బీ. సీ. ఇరువది యైదవ శతాబ్ది యని చెప్పవలయును. కల్హణుని రాజతరంగిణి ఇందుల కంగీకరించును. మెగాస్తనీస్, ఆర్యభటుడు 31 శతాబ్దమని— ట్రిబౌటు 27 శతాబ్ది యని, శ్రీ శచంద్ర విద్యాధర 20 శతాబ్దమని, పర్గీటరు 18 శతాబ్ది యని, విలియం జోన్సు 17 శతాబ్ది యని, ధీరేంద్రపాల్ 16 శతాబ్ది యని, కల్నల్ కోల్‌బ్రూక్, కల్నల్ విల్‌ఫర్డు మహాశయులు 14 శతాబ్ది యని విల్సను, ఫెర్గూసను, శ్యామాశాస్త్రి, బూచ్నాన్, ఆర్‌సీ దత్తు ఈ చారిత్రక శోధకు లందరును 13 శతాబ్ది యని, వీ యన్ గోపాలయ్యర్ 12 శతాబ్ది యని మహాభారతాహవ కాలమును నిర్ణయించిరి. ఇట్టి వివాద బాహుళ్యమున్న యంశములో బాభ్రవ్యుని కాలనిర్ణయ ప్రశంస అనవసరము. ప్రయాస జనకము. ఇట్టి ఘట్టముల కొత్తిడి తెచ్చువారు—అరిది.

ఇంతకును—బాభ్రవ్యునికిఁ జార్వాకునితో సమకాలీనత యను వంశము—వట్టి లోక ప్రతీతి మాత్రమే. ఆ చార్వక దుర్యోధన సమకాలీనతను భారతము చెప్పినప్పటికి—అది యిప్పట్ల అనావశ్యకము.

భాగవత—హరివంశ—విష్ణు పురాణములనుబట్టి బ్రహ్మదత్త బాభ్రవ్యులు సమకాలీనులని రూఢిగా విశ్వసింపవచ్చును. బ్రహ్మదత్తుడు బ్రహ్మరాతుండగు శుకుని దౌహిత్రుడు. ఈ బాంధవమునకుఁగూడ సారస్వత సాక్ష్యమున్నది— భారతాహవ కాలమందున్న పాండవపత్ని ద్రౌపది—బ్రహ్మదత్త శ్రీ పాంచాల ప్రభునియొక్క పౌత్రునికి ప్రపౌత్రి. అనగా పాంచాలికి బ్రహ్మదత్తునికి మధ్యను— నాలుగు పురుషాంతరముల యెడమున్నది— ఇట్లుచూడఁగా బాభ్రవ్యుడు బ్రహ్మదత్తునితోఁబాటుగా— కౌరవపాండవ మహాయుద్ధము జరుగుటకు ముందున్న వాఁడని విశ్వసింపవచ్చును — గనుకనిట్టి యాధారమునంజేసి బాభ్రవ్య కాలనిర్ణయము క్రీస్తుపూర్వము ఇన్నవ శతాబ్ది యని నిశ్చయింపవచ్చుఁగాదా యనఁగా— అట్టిపనికి సుళువుచాలదు— ఏలననఁగా మహాభారతయుద్ధము జరిగినకాలము ఇదమిత్థమన్న అంకెకు రాలేదు. ఇట్టియంకే తేల్చఁదగిన మఖ— పూర్వాషాడ ఇత్యాది సప్తర్షిచారము — ఇట్లే యుధిష్ఠిరశకము ఈ గణితము బొత్తుగా భ్రష్టమయిపోయినది—కాఁగా వక్తవ్యాంశములో మహాభారత రచనముకంటే బాభ్రవ్య కామాగమ రచనము ముందు— అనిమాత్రము చెప్పఁజెల్లును. బాభ్రవ్య ప్రముఖ కామాగమ మహాచార్యు లెందఱియొక్క — ఎంతవాఙ్మయమో ఉత్పన్నమయినదన్న నిర్ధారణము విషాదజనకము. వాఙ్మయోత్పన్నత నుండి తత్తత్కర్తలు కాలక్రమమున విస్మృత సాగర నిమగ్నుల గుదురు. ఇది ఇట్లుండ కామశాస్త్ర పరమయిన గ్రంథములు కొన్ని యిప్పటికిని అందందు భద్రముండినవి. అవియముద్రితములు — 1 అనంగదీపిక. 2. రతిసారము. 3. రతిచంద్రిక, 4. తృతీయ పురుషార్థ సాధకసరణి, 5. బంధోదయము 6. వేశ్యాంగనా కల్పద్రుమము, 7. రఘుపతి రహస్యదీపిక, 8. మదనార్ణవము. 9. మదన సంజీవిని, 10. అనంగ తిలకము 11. అనంగశేఖర, 12. స్త్రీజాతి లక్షణాది విచారము. ఇత్యాదిగ్రంథములు కొన్ని రచయిత యెవ్వరో నిరూపింపఁబడు అవకాశము చాలకున్నవి. అట్టిస్థితి వాఙ్మయచరిత్ర కొకలుప్తి.

1. రంతిదేవుని యోగాధికారికము 2. సిద్ధనాగార్జునుని వశీకరణ తంత్రము, 3. క్షేమేంద్రుని వాత్స్యాయన సూత్రసారము, 4. భర్తృహరి జడవృత్తము, 5. నాగరీదాసునినాగర సముచ్చయము 6. హరిహరుల శృంగారదీపిక — రతిదర్పణము 7. ఈశ్వర కామితుని కామశాస్త్రము, 8. అనంతుని కామసమూహము, 9. రేవణారి వీరారాధ్యునిమారరహస్యము, 10. సహజీ నృపాలుని శృంగారమంజరి. 11. మీననాథుని స్మరదీపిక, 12. శ్రీనాథభట్టుని కామతంత్రము, 13, కామరాజు దీక్షితుని రసికబోధిని, 14. విశ్వేశ్వరుని రసచంద్రిక, 15 చిత్రధరుని శృంగారసారము, 16. మూలదేవుని స్మరదీపిక, 17 కేశవుని కామప్రభృతికము 18 వరదరాజుని కామానంద పటలము. 19. కౌతుకదేవుని శృంగారకుతూహలము, 20. సదాశివుని కామకల్పలత, 21. పుండరీక విఠలుని రతిప్రకాశము 22. కర్ణదేవుని కామసారము. 23. మాధవదేవుని రతిసారము, 24. అనూపసింహుని రతి ప్రబోధము 25. భావానందుని సదర్పకందర్పము 26. రుద్రభట్టుని అనంగదీపిక, 27. క్షేమేశ్వర శాస్త్రి రతినీతిముకుళము ఈ గ్రంథములన్నియు భద్రమున్నవి. ఈ వాఙ్మయ మంతయును సంస్కృతము. బాభ్రవ్య పాంచాలికీ చతుష్షష్ఠి—సాంప్రయోగికము గ్రంథవిషయము. ఇవిగాక ముద్రితములయి రహః ప్రచారమందున్న గ్రంథరాజములు 1. వాత్స్యాయన కామసూత్రము. 2. జగజ్జ్యోతిర్మల్ల వ్యాఖ్యతో పద్మశ్రీ నాగరసర్వస్వము. 3. కల్యాణమల్లుని అనంగరంగము. 4. కాంచీనాథ వ్యాఖ్యతో కొక్కోకుని రతిరహస్యము. 5. ప్రౌఢదేవరాయని రతిరత్న ప్రదీపిక, 6. జ్యోతిరీశ్వరుని పంచసాయకము. 7. జయదేవుని రతిమంజరి. 8. నాగార్జునుని ఆదిశాస్త్రము = కోకశాస్త్రము.

ఈ బాభ్రవ్య వాత్స్యాయనాదుల సందర్భము విద్వల్లోకమునమాత్రమెఱింగినది — ఈ కామాగమమునకు విశ్రుత నామమ : కొక్కోకము=కళాశాస్త్రము, కొక్కోకశాస్త్ర నిగుంభ కళావాఙ్మయ కర్తలకు నా అంజలి.

---

# నా - సోమనాథుని గ్రంథస్థకాలము

శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

నాచన సోమనాథకవి కాలమును గూర్చి వ్రాయుటలో పినాకినీ తీరమందలి పెంచుకలదిన్నె తామ్ర శాసనములోనిదాన కాలము తప్పుగా ఉన్నదని తెల్పు క్రింది వాక్యమున్నది.

'బుక్కరాయల పెంచుకలదిన్నె శాసనమును సంపాదించిన యూరోపీయుడగు రైసు పండితుఁడు పండితుల సాహాయ్యమున 'తారణ' ను 'సాధారణ' అనియును, 'రసాభ్రనయనేందుభిః' అను వాక్యమును, 'కరాజన యనేందుభిః' అనియును సవరించి, శాసన కాలమును శా. శ. 1292 (క్రీ. శ.1370) వ సంవత్సరమునకు మార్చినారు. శాసన కాలమును (విజయనగరం) బుక్కరాయల పరిపాలనా కాలము (క్రీ. శ. 1344—77) లోనికి చేర్చుటకై ఈ మార్పును చేయవలసి వచ్చినది. వీరేశలింగము పంతులుగా రీ మార్పునంగీకరించి యీ కవి క్రీ.శ. 1360—70 సంవత్సర ప్రాంతములయందు న్నాఁడని నిశ్చయింపవచ్చు ననిరి.

ఉత్తర హరివంశమునకు పీఠిక వ్రాసిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'రసాభ్రనయనేందుభిః' అను వాక్యమును 'రసర్తు నయనేందుభిః' యని (లేక—రసాంగ నయనేందుభిః— అని కాని) సవరించి శాసనకాలమును శా. శ. 1266 (క్రీ. శ. 1344) అని నిర్ణయించియున్నారు. అప్పటికి బుక్కరాయలు రాజ్యమునకు రాకపోయినను యువరాజుగా నున్నాడనియు, నన్నగారి రాజ్యకాలములోనే సర్వ సమర్థుఁడైన బుక్కరాయ లొక యగ్రహారమును దాన మొసంగె ననుటలో నాక్షేప ముండదనియు, ఎపిగ్రాఫికా కర్ణాటికా వాల్యుం ఖహసన్ జిల్లా చెన్నరాయపట్నం తాలూకా శాసనము 256 సంఖ్యగల దానిలో హరిహరరాయలు రాజుగా నున్నను వాస్తవమునకు విద్యానగరమును నిర్మింపజేసినవాఁడు, పేరు పెట్టినవాఁడు బుక్కరాయలే యని యున్నదనియు, నాగరలిపిలో 'భ్రూ' 'భ్ర' అను నక్షరములు 'ర్తు' ను బోలి యుండుటవలన శాసనమును వ్రాసినవారో, చదువువారో పొరపాటుపడి యుందురనియు ప్రభాకరశాస్త్రులుగారు తమ నిర్ణయమునకు హేతువులన, జెప్పియున్నారు. ఆలోచించి చూఁడగా రైసు పండితుని మార్పు కంటె శాస్త్రులవారి మార్పు సమంజసమైనదిగాఁ దోఁచుచున్నది. రైసు పండితుని మార్పులో సంవత్సరములు సంఖ్యయును గూడ దిద్దవలసి వచ్చినది. శాస్త్రులుగారి హేతువులు గూడ బలవత్తరముగాఁ గన్పట్టుచున్నవి. కావున నింతకంటె ప్రబల సాక్ష్యము లభించువరకును శాసన కాలమును శా. శ. 1266 (క్రీ. శ. 1344) గానే భావించు టుచితము.'

ఆంధ్ర కవితరంగిణి (4—118, 119)

ఇక నీ పెంచుకలదిన్నె శాసనకాలములతో సమకాల మన తగిన వక్రోక్తికాలము ఉత్తర హరివంశ కథలో కథేతర కాలముగా నాచన సోమనాథకవి వ్రాసియున్నాడో, లేదో పరిశీలించవలసి యున్నది. త

చదివి చూడగఁ యుద్ధ కథలో క్రింది గీతపద్యము కనబడుచున్నది. చూడుడు.

తే. మురని శుంభ హయగ్రీవ—నరకముఖులు
బవరమునఁ దలపడ్డ—బవర మచట
భీకరంబయ్యె నుద్భట—లోకపాల
రచిత సమకాల బాహువి—క్రమముచేత.

—(1—26)

అష్టదిక్పాలకు లందరు రాక్షస నాయకులతో భయంకరమైన యుద్ధము కావించి రనుట కథ సారాంశము.

దీనిలో కడపటి పాదమున తన రచనా సమకాలము కాబోలను వ్యంగ సూచన చేసినాఁడు, వక్రోక్తి కవి నాచన సోమనాథుడు.

'రచిత సమకాలబాహువి—క్రమముచేత.'

ఈ గ్రంథాంతరంగిక కాలసూత్రములో మొదట విక్రమ సంవత్సరము గోచరించుచున్నది. దీనికి సమకాలమగు శక వర్షసంఖ్య లిందున్నవో, లేవో లెక్కించి చూడనిదే బోధపడదు.

సామాన్య సంఖ్యా గణితములో పేర్కొన్న సంకేత సంఖ్యలు వక్రోక్తి గణితములో, యుక్తి వ్యంగ్య సంఖ్యలుగా మారిన ననుట కాలదోషము కాదు.

ఇందలి 'బాహు' సంఖ్య తప్ప, తక్కిన 'సమ, కాల, విక్రమ' సంఖ్యలన్నియు విశిష్ట సంఖ్యలుగా ఉన్నవి.

సమాగ్ని—3, త్రికాల—3, బాహు—2, త్రివిక్రమ— 3 సంఖ్యలు సమసంఖ్యలుగా ఉన్నను, ఇవి విక్రమ సంవత్సర

సమకాలము నీయజాలవు. వామగతిగా అవి కలియుగము 3233 గతాబ్దము లగును. ఈ కాలము నంగీకరించుటకు హరివంశమందలి కవి గద్యకాలము ప్రతికూలముగా ఉన్నది.

'ఇది శ్రీ మదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరంబున—ఉత్తర హరివంశంబు.'

నాచన సోముని కాలముకాని, తిక్కన సోమయాజి కాలము కాని, పద్యములో వక్రోక్తిగా చెప్పినట్లు క్రీ. శ. 131 ప్రాంత ప్రాచీన కాలము కాజాలదు. పైగా ఇది విక్రమ సంవత్సరముతో సమకాలముగా నుండదు. క్రీ. శ. 13—14 శతాబ్దముల మధ్య కాలముగా తిక్కన—సోమనల కాలముండి తీరవలెను.

ఇక నీ ప్రాచీన విషమ కాలము నెట్లు లెక్కించిన సమ కాలము సమకూడునో ఆ మార్గము నాలోచించుట కాల దోషము కాదు. విక్రమ సంవత్సరముచేత రచితమైన సమ కాలబాహు విక్రమ సంఖ్య లెట్టివి ? ఇది ప్రస్తుత జిజ్ఞాస.

ఇందలి 'విక్రమ—క్రమ' శబ్దములు క్రమముగా 'విషమ—సమ' శబ్దముల వంటివి కాబోలన్నచో అప్పుడా 'బేసి —సమ' సంఖ్యలో వ్యంజకము లగుచున్నవి. సంఖ్యానుశాసనములో క్రమ—విక్రమముల కొకే త్రివిక్రమ సంఖ్య సూచింపబడినది. ఇట్లే కాలశబ్దమునకు త్రికాలము సూచింపబడినదే కాని, షట్కాలము, (ఋతు) పేర్కొనబడలేదు. సమ శబ్దానికి సమాగ్ని సంఖ్య సూచింపబడినదే కాని, సమపాదసంఖ్య సూచింపబడలేదు. కాగా, ఇట్టి శ్లేష సంఖ్యలతో వక్రోక్తి కాల మెట్లు సమన్వయమగునో లెక్కించుట కల్పన కాదుగద !

'విక్రమముచేత రచిత సమకాలబాహు విక్రమము'— ఎట్టిది ?

ఈ వక్రోక్తి కాలసూత్రములో క్రమముగా సమ—2 కాల—6, బాహు—2, విక్రమ—1 వ్యంగ్యసంఖ్య లున్నవనుట కాక్షేపము లేదు.

పైన లెక్కించినట్లే ఉత్తర హరివంశ రచనా కాలములో వక్రోక్తిగా 2621 (వామగతి) శా. శ. 1262 వర్షంబులగు నేటి విక్రమ సంవత్సర సమకాలము—దీనికి సరియగు క్రీ. శ. 1340 తేది—కలదనుట గణిత సిద్ధాంతము. క్రీ. శ. 1344 తేదీ పెంచుకలదిన్నె తామ్రశాసనమందలి 'అష్టభాషాకవి .... నాచన .... సోమనాథ' చరిత్రతో తద్గ్రంథస్థ వక్రోక్తికాలము సమకాల మగుచున్నది.

ఇట్టి గ్రంథస్థ వక్రోక్తి శాసన సమకాలములన్న తిరస్కరించి,—'భాషాచరిత్రకు ప్రబలాధారము గ్రంథస్థ మయిన వాస్తవ ప్రయోగశక్తి. వ్యంగ్యగణితాదుల చరిత్రకు ప్రత్యక్ష సాక్ష్యము మృగ్యము, అనుమాన ప్రమాణము గౌణపక్షము' అని భాషా తత్త్వవేత్త లనుట ఏకాక్షి లోకరక్షకః అన్నట్లున్నది, సమదృష్టి అవసరము.

---

## గ మ ని క

భారతి డిశంబరు సంచికలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి వ్యాసశీర్షికలో విషాదాంతం అనటానికి బదులు 'విషాందాంతం' అని పడినందుకు విచారిస్తున్నాము.

ఉదయించని ఉదయాలు అనే పుస్తక విమర్శ రెండుసార్లుపడినది. అంతేకాక ఒకచోట ఈ విమర్శకర్త దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారన్నట్లుగా పడినది. శ్రీ శాస్త్రిగారు వ్రాసినది చిన్నయసూరి జీవిత సంగ్రహ విమర్శ అని గమనించి, పొరపాటును మన్నించగోరుచున్నాము.

—సం. భా.]

# కాటూరి వేంకటేశ్వరరావు

ద్విఖ్యాత శతావధానులైన శ్రీ తిరుపతి వేంకట కవులలో శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి ప్రియశిష్యులై, కమనీయ కవితా ధురంధరులైన శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు కైలాసవాసి కావడమువల్ల ఆధునికాంధ్ర సారస్వతంలో తీరని లోప మేర్పడినది. శ్రీ వేంకటేశ్వరరావుగారును, శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారును జంటకవులై, నవ్యాంధ్ర సాహిత్య జగత్తులో నొక ప్రత్యేక ప్రతిష్ఠ గడించిరి. ఈ కవుల తొలి కృతియైన 'తొలకరి'కి కీర్తిశేషులు కట్టమంచి రామలింగా



రెడ్డిగారు పీఠిక వ్రాసియుండిరి. అది నవ్య కవితా క్షేత్రమున 'తొలకరి'గా నానాడు వెలసినది. సాహితీ ప్రపంచమున వీరి యశస్సు శాశ్వతముగావించినది 'సౌందరనందము'. ప్రాచీన సంప్రదాయములను విడనాడక, నవ్యకవితాగుణ సౌరభముచే విలసిల్లు సౌందరీనందకృతి, యాంధ్ర సారస్వతేయుల, కవి కుమారుల, యాదరాభిమానముల నత్యంతముగా చూరగొన్నది. ఈ రసవత్కృతి తమ గురువర్యులగు శ్రీ చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారి షష్ఠిపూర్తి మహోత్సవ సందర్భమున కానుకగా వర్పించి, గురు ఋణమును దీర్చుకొని ఈ జంట కవులు ధన్యులైరి.

ఉపాధిగల కుటుంబమున జన్మించుటచేత ఉద్యోగపు టలజడులులేక, వేంకటేశ్వరరావుగారి అరువది ఎనిమిదేండ్ల జీవితము, సాహిత్య జీవితమువలెనే సరళముగా ప్రశాంతముగా సాగిపోయినది. స్వతస్సిద్ధముగా కాటూరివారు సౌజన్యమూర్తి—సహృదయత్వముతో సంస్కార విశేషముతో వారు సారస్వతలోకాన్ని వశపరచుకొన్నారు. ప్రత్యేక రచనలలో కాటూరివారి కావ్య రచనా ప్రతిభ యితోధికముగా విస్ఫారినది. పౌలస్త్య హృదయము, గుడిగంటలు ప్రాచీన సాంఘిక ధర్మములను నవ్య దృష్టితో సమన్వయము చేయుటకై రచితములైనవి. ఈ రెండు నీనాడు విద్యార్థి లోకము గూడ నెరుగునని చెప్పిన వాని వ్యాప్తిని మనము గ్రహింపవచ్చును.

కాటూరివారు కేవలము కవియేకారు. వారు కీ. శే. ముట్నూరి కృష్ణారావుగారి వెనుక కృష్ణాపత్రికకు సంపాదకులై, పత్రికా వాఙ్మయమునకు పరిచయులైరి. ఆంధ్రజాతీయ కళాశాలకు కొంతకాలము అధ్యక్షులై, ఆ కళాశాలా గౌరవమును నిలువబెట్టి, ఆ సంస్థను నిర్వహించిరి. ఆకాశవాణి విజయవాడ కేంద్రమున వారు తెలుగునకు సలహా సంఘ సభ్యులుగా నుండిరి. ఈ తరువాత శ్రీ వేంకటేశ్వరరావుగారు పాల్గొనని, జరిపింపని, సాహిత్య కార్యక్రమములేనే లేదని చెప్పవచ్చును. క్రిందటి యేడు హైదరాబాదులో జరిగిన శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి సాహిత్య సమావేశమునకు వేంకటేశ్వరరావుగారే యధ్యక్షులు.

ఇట్టితర వ్యాసంగములలోనున్నను, వారిది ప్రధానమైనది కవితా వ్యాసంగమే. వారు పద్య రచనయందేగాక, వచన రచనయందు సిద్ధహస్తులు. వారు 1950 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో "కవి పరమేష్ఠి", అని శ్రీ చెళ్లపిళ్ల వారినిగూర్చి వ్రాసిన వ్యాసము, వారి వచన రచనలలో మకుటాయమానమై యున్నది.

అనువాద రచనలలో వారందెవేసిన చేయి—సట్టభద్రులు కాకపోయినను, వారాంగ్ల భాషా సాహిత్యమును బాగుగా నధ్యయనము చేసినారు. నల్లకలువ (ట్యూలిపు అను నాంగ్ల నవల కనువాదము) ముగ్గురు మూర్తులు (ఎ. యస్. పి. అయ్యరు గారి యాంగ్ల గ్రంథమునకు తెలుగు) గాంధిజీ స్వీయ చరిత్ర (మహాత్మాగాంధి ఆటోబయాగ్రఫీకి తెలుగు) మొదలగు వీరి యనువాదములు ఆ యా మూల గ్రంథాలకు సరియైనవని విమర్శకు లభిప్రాయ మొసగియున్నారు.

కేంద్ర సాహిత్య అకాడమీవారి కొరకు వేంకటేశ్వరరావు గారు-కావ్యమాలను సంధానించినారు. అందు ప్రాచీనకాలమునుండి నేటివరకుగల కవుల కావ్యములనుండి యుదాహరణ లీయబడినవి. ఇందు వారికి ప్రాచీన కావ్యములతో గల పరిచయమేగాక, నవీన కవుల కవితా సంప్రదాయములను నెంతచక్కగా నవగతము చేసికొనిరో యా విషయము గూడ సువ్యక్తమగుచున్నది.

'భారతి' పత్రికలో వారిటీవల తమ 'సౌందర్య లహరి' అనువాదమును అందించిరి. ఆంధ్ర కావ్య విమర్శనము అను నొక మహా గ్రంథము వారు తలపెట్టినట్లు తెలియుచున్నది; కాని, యది ఎంతవరకు వచ్చినదో మనకు తెలియుటలేదు.

తెలుగులో నీనాడు, కవులనుగూర్చి శుష్క చారిత్రకాంశములుతప్ప—వారి వారి యనుభవములను, మనస్తత్త్వమును తెలుపు సన్నివేశములు, ఘట్టములుగల జీవిత చరిత్రలులేవు. వారితో జంట కవులైయున్న శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారిట్టి రచనను శ్రీ వేంకటేశ్వరరావుగారినిగూర్చి లోకమున కందించిన నాడు కాటూరివారి కవితా ప్రతిభ, కవితా పరిణామము, గణనీయ వ్యక్తిత్వము—మనకు వెల్లడి యగును. —ని. వే.]

# ఆరుగురు కథకులూ - ఒక నాయిక

## శ్రీ బుచ్చిబాబు

అసలు ఈ గొడవకంతటికీ కారణం కనకం. నేనంత వరకూ కనకాన్ని గురించి పట్టించుకోలేదు. బాగా పరీక్షగా చూళ్లేదు కూడా. ఆ క్షణంలో ఆమెను రైలు పెట్టెలోనుంచి తోసివేద్దామన్నంత కోపం వచ్చింది. ఆమె నొక్కదాన్నే కాకుండా, అసలు స్త్రీజాతంటేనే శాశ్వతమైన ద్వేషం రేగిన క్షణం అది. మనం బాగా ఎరగని వాళ్లని ఎందుకు ద్వేషిస్తామో ఇప్పటికీ అర్థంకాదు. వాళ్లు మనకంటె ధనికులా, హోదాగలవారా, అందమైనవాళ్లా, తెలివైనవాళ్లా, బలవంతులా? ఏమో తెలియదు. వేటిల్లో మనకంటె అధికులో తెలియక, వారిని మనస్సులో దూరం గావుంచేసి, వారికేసి చూడక, వారిని గురించి జరిగే దుష్ప్రచారం ఏదన్నాఉంటే, దానికి మనం కూడా తోడ్పడతామా! ప్రేమకి కారణాలుండవు. ప్రేమ గుడ్డిదంటారు. ద్వేషానికీ కారణాలుండవు. అది గుడ్డిదీ, చెవిటిదీ కూడా.

కళ్ళు బాగా తెరిచి చూచాను కనకాన్ని. కోలమొహం, చంద్రబింబంతో పరిపోల్చే గుండ్రనైన స్త్రీమొహంలో చక్కదనం, ప్రశంస తరతరాలుగా సాగడంవల్ల కాబోలు, నాకు కోల మొహం గిట్టదు. కోలగా సాగారి, కంటికింద గీటువల్ల కాబోలు విశాలంగా కనబడేకళ్లు—పలకరించి, తబ్బిబ్బుచేసి, బంధించి వేసే పెద్దకళ్లు నా కసలే గిట్టవు. మధ్యాహ్నపు ఎండలో బారుగా ఎగిరే తెల్ల జండాలమల్లే ప్రస్ఫుటంగా మెరిసే పళ్ల వరస, ఎఱ్ఱ మందారాలతో మలిచిన విల్లుకి మల్లేనోరు, అసలు వంకర లేకండా కట్టించుకున్న పళ్ల వరసలా, ధగధగమెరిసే పళ్లంటే భయం, ఎఱ్ఱ మందారంలో కాస్తంత నలుపుఛాయ, యముడు మొహాన బొట్టుకిమల్లే— ఆ రకం నోరంటే యావగింపు. ఆమె ఎత్తరి. సామాన్యమైన ఎత్తుగల స్త్రీలనే ఎరుగుండి, ఎత్తయినవాళ్లంటే దూరంగాఉండ బుద్ధేస్తుంది. పాపిడి కనబడక, చిందర వందరగా రేగిన తల, జుట్టు— ఏమిటో అడవిలో రేగిన తేనెపట్టుకుమల్లే—సంస్కారంపట్ల వైరం ప్రదర్శించే వైఖరి జడంటే హడలు; ఇంక నడుం ఒంపులు, రొమ్ములులేచి పడడాలు, మెడకింద నీడ తళుక్కు, భుజాల గుండ్రతనం మొదలైనవాటి మాటంటారా, కొట్టొచ్చినట్లు, మాంసంకొండ విరిగిమీద పడ్డట్లు—చుట్టుపక్కల ఉండను, పారిపోతాను. అసలు కనకం అన్నపేరే గిట్టదునాకు. బంగారు పసిమిఛాయకాదు. శీతాకాలంలో పొట్టు రేగినట్లు కనబడే చర్మం, వర్షాన్ని కర్చుచేసుగుని కదలలేని ముసలిమేఘంలో మసలే చామనఛాయ నీడ కళేబరం—రోతస్మాండి!

ద్వేషం, చెవిటిది కూడా అన్నాను. ఈసారి ఆమె చెప్పున్నది శ్రద్ధగా విన్నాను. ఆవిడ కంఠాన్ని వర్ణించలేను. అవతల వాడికంఠంలో జొరబడి, వాడుచేసే ధ్వనితో జోడై సాగించిన బృందగానంలో జీరలాగా, నలుగు రైదుగురు జోరుగా తిట్టుకుంటూ ఉంటే బైటపడే గొడవలోని రోదనలాగా, హాస్పిటల్ వార్డు మొత్తం ఒక్కసారి మూలిగినట్లుగా—యవ్వనంలోని మాధుర్యం, నాజూకు, లాలన, సిగ్గు భిడియాలకు విడాకులిచ్చి, విచ్చలవిడిగా పేట్రేగిపోయిన నడివయస్సుకి ఏకాంత నైతిక నిద్రకి మేలుకొలుపులాంటి కంఠం. కనకం వయస్సు; ముప్పై పైమాట; ముప్పైఅయిదు? ఆరు ఏడు........నలభై, నలభైలోపా? ఏమో, భారతావని జనాభాలో సగంవంతు స్త్రీలైతే, వారిలో ముప్పై ఏ దాటని స్త్రీలసంఖ్య ఎంతో జనాభా లెక్కలవల్ల తేల్చేవరకూ కనకం వయస్సు నలభై దాటదు. నాకు దగ్గరగా జరిగి కూర్చున్నప్పుడు—నాకు ముప్పై లోపే గావున—తనకి అంతకంటె ఎక్కువ వయస్సుందని దగా చేసుకున్న క్షణాలు లేకపోలేదనుకోండి. తను తెచ్చి పెట్టిన గొడవ చెప్పేముందు, ఆవిడ అలవాట్లను కొన్నింటిని వివరించకుండా ఉండలేను. మా థర్డ్‌క్లాస్ టూరిస్టు పెట్టిలో, యాత్రాధిపతి విశ్వపతి, వంటాయన వీరయ్య వొకర్—అనకూడదు, ఎటెండెంట్ అనాలి కాబోలు—నా ఎటెండెంటు జాలయ్యతో, ఇరవై ఇద్దరం వున్నాం. సీటు ఇద్దరేసి. కనకం సీటు తొమ్మిదోది—ఆమె ప్రక్కన ప్రెసిడెంట్ రాఘవయ్యగారి చెల్లెలు శ్యామల కూర్చోవాలి. నా సీటు పదహేడవది. అదేం చిత్రమో, తన సీటులో కూర్చోలేదు కనకం. ఏసీటు ఖాళీగా కనబడితే అందులో కూర్చుని, పక్కవాడితో కబుర్లు మొదలెడుతుంది. నా పక్కన పద్మనాభం. అతని తిరుగుడు జబ్బు—తిరుగుతూ ఉంటాడు. అది చూసుకుని కనకం పక్కనచేరి, రైలు కుదిపినప్పుడల్లా అంగుళం చొప్పున దగ్గరకి జరుగుతూ, మొహంలో మొహంపెట్టి, వాగుతూ రో పుట్టించే ఒక అలవాటుంది. ఆమెకి ఆడ, మగ, పెద్ద, పిన్న వివక్షతల జిజ్ఞాసే లేనట్లుంది. మూడో నెంబరుసీట్లో ధనంజయంగారని—ఒక వృద్ధుడు, భక్తుడు పురాణ కాలక్షేపం చేస్తూ, సమాధిలోపడి పరమాత్మని సందర్శిస్తూఉన్న పవిత్ర సమయంలో ఈమె, ఆయన పక్కనజేరి, తనూ, తన్మయం పొందినట్లు, కాలక్షేపంలో తన కంఠం జోడించి, ఆ భక్తాగ్రేసరుణ్ణి, శిఖరాన్నుండి కింద లోయలోకిలాగి, ధ్వంసమైన ఆధ్యాత్మికానుభూతి కళేబరంపైన నాట్యం చేస్తుందంటే అతిశయోక్తిగా తోచచ్చు. అది యదార్థాన్ని అగ్నిసాక్షిగా పెండ్లాడిన అతిశయోక్తి. పేషంట్లనుండి పారిపోయి, పుణ్యక్షేత్రాలు దర్శించి, మనశ్శాంతిని సమకూర్చుకుందాం అని బైలుదేరి డాక్టర్ నాగభూషణంగారికి బోలెడు పని కల్పిస్తుంది. చెంప చూడమంటుంది. రెప్పలు పైకితోసి కళ్ళు చూడమంటుంది

వళ్ళు, చిగుళ్ళుచూపి, "మరేం పేచీలేదుగదా" అంటుంది. ఆమెకి గుండెలో నెప్పి, పొట్లు—భోజనానంతరం జీర్ణకోశం నుండి కూతలు, పిలుపులు. పాపం నాగభూషణం తీరిక దొరికినప్పుడల్లా ఆవిడకిలేని జబ్బులేవో తెలుసుకోడంలో నిమగ్నుడై ఉంటాడు. ఆయనభార్య విజయ సిగ్గుపడి, అదోలాగయ్యేది. కాని, కనకం, వారి సంతానం 'రవి' (కుర్రాడు), 'రమ' (అమ్మాయి)లను సముదాయిస్తుంది గావున, ఆమె ఏమీ అనలేక పెట్టెలో తోటి యాత్రీకులు చూపుల్లో కనబరచే సానుభూతితో తృప్తిపడేది. మద్రాసు దాటింతర్వాత, కనకం వైఖరిలో మరింత తెగింపు, స్వేచ్ఛ కనపడసాగాయి. వీపుకి బొత్తాములున్న జాకెట్ రెడీమేడ్‌ది కొంది కాబోలు పట్నంలో—రక్షితలాల్‌కి, ఆయన భార్య రాజీబాయికి మధ్యలో నిలబడి, బొత్తాములు బిగించమనేది— ఎవర్ని ఉద్దేశించో ఎవరికీ అర్థంకాక బిక్కమొహంతో తోటివారికేసి చూసేవారు. చెట్టిగారి భార్య చిట్టెమ్మ గ్రహించి, తనే బొత్తముల్ని సరిచేసి, ఒక అవాంతరాన్ని తప్పించి, అందరి మన్ననలకూ పాత్రురాలైంది. లక్ష్మణమూర్తి—పెట్టెలో మాకు కాస్తంత దగ్గర—సాహిత్య ప్రియుడు, కవి, ఏవేవో పాడుకుంటూఉంటాడు. ప్రేరణ కోసం అన్నట్లు, అల్లా తేరిబారి చూసినప్పుడు, కనకం అటు వెళ్ళి, అతని దృష్టిని అరికట్టి, తనవైపుకి తిప్పుకుని—'నామీద అల్లండి—ఎన్ని కావ్యాలైనా—తట్టుకోగలను' అన్నట్లు ఒక సవాల్‌చూపు, దృశ్యం ప్రదర్శించి, ఆకవి పుంగవుణ్ణి, వూహా జగత్తులోంచి ఒక్కతోపుతో స్థూల జగత్తులోకి తోసేస్తుంది. ఇది కొందరు మొదట్లో హర్షించినా, మానవుడి ప్రాథమిక హక్కులపై ఆమె సలుపుతున్న దాడిని గుసగుసల ద్వారా ఖండించడం లేకపోలేదు.

మా దక్షిణ యాత్రా టూరిస్టుపెట్టె బైలు దేరిన ఐదారు రోజులవరకూ మేం ఒకర్ని ఒకరు తెలుసుకుని, తెగలకిందా, బృందాలకిందా విడిపోయి, ప్రతివారూ వారివారి అంతస్థులు, పొలిమేరలు నిర్ణయించుకుని, స్థిమితమైన దృక్పథంతో మసలుకోడం జరగలేదు. పెట్టెముందుభాగంలో వారందరూ ఉత్తరాదివారు, మేం దక్షిణాదివారం. మధ్యలో బోర్డర్—సరిహద్దు ప్రాంతంవారు. చూడవల్సిన చోట దర్జాగా ఖర్చుచేసి సౌకర్యాలు కూర్చుకునేవారు ఒక బృందం. అగ్రిమెంటు ప్రకారం అనుకున్నదానికిమించి నయాపైసా రాల్చనివారు ఒక కూటమి. మా టూర్ ఏర్పాటు చేసిన విశ్వపతి టైమ్‌టేబిల్ ప్రకారం బైట కెళ్ళడానికి ఐదు నిముషాల్లో సిద్ధం అవగలవారంతా ఒక గుంపు, తెమలక, బద్ధకించి "నేను హాయిగా పడుకుంటా—మీరు చూసి బావుకురండి—ఏముంది ఆలయాలన్నీ ఒకటేగా—అక్కడుండే దేముడే ఇక్కడున్నాడు" అని పెట్టెలో దిగడిపొయ్యేవారు ఒక అల్ప సంఖ్యాకుల మండలి. ఆయన్ని ప్రెసిడెంటు అని ఎందుకు వ్యవహరిస్తున్నారో నే నెరగను—ఈ మండలికి నాయకుడనొచ్చు రాఘవయ్యగారిని. కాని, వారిభార్య సుందరం, చెల్లెలు శ్యామల, ప్రతి వింతా చూడ్డానికి వస్తూంటారు. ఈవిధంగా వారం సాఫీగా సాగిపోయింది మా ప్రయాణం—కనకం కొత్తగొడవ తెచ్చిపెట్టేవరకూ అన్న మాట.

మొదట రెండు, మూడు రోజులూ కనకం మధ్య మధ్య మా పెట్టెలో లేదన్న విషయం నేను గమనించలేదు. ఆవిడ లేకపోతే స్వేచ్ఛగా గాలిపీల్చేవారున్నా, వాళ్ళు మళ్ళా సజీవులై ఉన్నామని ఋజువు చేసుకోడానికి ఆవిడ కావల్సివచ్చేది. రైలు కుదుపుకి పత్రిక చదవడం యజ్ఞంగా ఉండేది నాకు. కిటికీ ఆవతల కదిలిపొయ్యే దృశ్యాన్ని ఎంతసేపు చూడటం—? పురిటికి పుట్టింకి వెళ్ళిన మా ఆవిణ్ణి గురించి ఎంతసేపు ఆలోచించడం? మొదటికాన్నూ—ఆదుర్దాగా ఉండేది, అట్లా ఆమెని విడిచేసి నే నిట్లా యాత్రకి బైలుదేరడం ఏమిటని మనస్సు పీకడమూ ఉండేది. ఇదంతా అస్పష్టమైన మానసిక బాధ—ఎవరితోనో చెప్పుకోవాలి—ఇందుకు తగ్గవారు మా పెట్టెలో లేరనిపించింది. దిగమింగుకున్నదంతా గడ్డకట్టి, ద్వేషంగా ఘనీభవించింది. దీన్ని బైటకి కక్కవెయ్యడానికి కనకం దొరికింది. ఆవిడ వైఖరి, చేష్టలు, మాటలు కసిగాచూసి, ద్వేషింపతగ్గ లక్షణాలు ఎన్నిఉన్నాయో లెక్కించుగుంటూ గడపడంలో కాస్త రహస్యమైన సడలింపు కనబడేదనే ఒప్పుకోవాలి. ఆ కనుబొమ్మ లెగరెయ్యడం, పెదవుల ఒంకర్లు, చేతివేళ్ళు బిగించి, జబ్బలు పైకి ఎగరవేస్తూ, కాళ్ళు కదుపుతూ, అవన్నీ—ఎంత ఘోరంగా ఉన్నాయో తిలికించడంలో ఆనందం. పమిట దిగలాగి మళ్ళా పైకి లాగుతూంటుంది. ఆవక్షంలో బింకంలేదు—కాని, ఉన్నట్లు కనబడాలని ఆమె తీసుకునే జాగ్రత్తని తిలకిస్తే, ఆవేదన తగ్గినట్లుగా ఉంటుంది.

ఆస్థితిలో కనకం కనబడదేం చెప్మా అనుకుంటూండగా రైలు నిలిచింది. ఇంజిన్ కాసేపు చడుగుడు ఆడి, మా పెట్టెని దూరంగా ప్లాట్‌ఫారం అవతల సైడింగ్‌లో దిగవిడిచి చక్కాపోయింది. మా టూరిస్టుకార్ కావల్సినచోట ఆగిపోతుంది. అక్కడ చూడవల్సినవన్నీ ప్రోగ్రాం ప్రకారం చూశాక, ఏ రైలు వెడుతుంటే ఆ రైలుకి తగల్చబడుతుంది. ఆ రైళ్ళ రాకపోకలు ఒక చట్టా ప్రకారం నిర్ణీతమైనా, అవి ఆలస్యం అవడంవల్ల మా పెట్టెలో జనం, ఆ సమయానికి గుమిగూడక పోవడంవల్ల ప్రోగ్రాం తారుమారై, ఆర్గనైజర్ విశ్వపతి గారిమీద అందరం ఒక్కసారి విరుచుకుపడటం, మా యాత్రా విశేషాలలో ప్రధానమైంది.

చీకటి పడుతోంది. చెట్లు, ఆకాశం చీకటి మేఘాల ముసుగులో తలదూర్చుకుంటున్నాయి. పక్షులు వోపికలేక, రెక్కలని శ్రమతో వూపుకుంటూ, చెట్టుకొమ్మలు చేరుకుంటున్నాయి. చీకు చింత లేక సాగిపోయిన రైలుపట్టాలుతప్ప చీకటి కాంత ప్రకృతి మెడచుట్టూ పెనవేసుకుని, దిగులుగా తనలోకి లాక్కుంటోంది.

"కనకం కనబడదేం" అన్నా రెవరో.

"నాకు వెయ్యేళ్ళాయుష్షు—మీరంతా అంతకాలం వోర్చుకోగలిగితే" అంటూ పెట్టెలోకి ప్రవేశించింది.

కనకం పెట్టెలో చీకటిగాఉంది. ఆమె బ్యాటరీలైట్ వెలుగు నలుమూలలావేసి మాట్లాడుతూంది.

"మన థర్డుక్లాస్ మొహాలకి లైట్లు కూడానా—ఈ లైట్ ఆ పక్క ఫస్ట్‌క్లాస్ కారేజ్‌లో కృష్ణమూర్తిది. వాళ్ల కారేజ్‌లో దీపాలున్నాయి. ఇంకా మధుసూధనంఅని—పాత స్నేహితుడులెండి—ఆయనా, భార్యా, వాళ్లబేబి......హాయిగా సోఫాలమీద, ఫ్యాన్లకింద, లైట్లేసుకుని చదువుకుంటున్నారు."

కనకం ఈ ముక్కలు చెబుతుండగానే మేమంతా పెట్టెలోంచి దిగి మా పెట్టె వెనకాల తగిల్చిన మరో టూరిస్టుకార్ చూశాం. అది చిన్న పెట్టె. ఫస్టుక్లాస్ సదుపాయాలు, హంగులు గల పెట్టె. అందులో కిటికీలోంచి లైట్ల వెలుగు నేలమీద పడుతోంది. మద్రాసులో తగిల్చారో, మరి ఏ మరోమధ్య స్టేషన్లో తగిల్చారో నాకు తెలియదు. విశ్వపతిని కేకేసి అడిగాడు రక్షితలాల్, ఆ లైట్లు మా పెట్టెలో ఎందుకు పెట్టించకూడదని. అతను బిక్కమొహం వేశాడు. ఆ రెండోపెట్టెలో యాత్రీకులు ఫస్ట్‌క్లాస్ ప్రయాణీకులట. ఎక్కువ డబ్బు ఇచ్చారుట. అందుచేత, దానికుండవల్సిన సౌకర్యాలు, హంగులూ సమకూరాయిట. ఇంజన్ లేకపోయినా, బ్యాటరీలు చార్జ్ చేయించి ఫాన్లు, లైట్లు పనిచేసే సదుపాయం కల్పించాడుట, వారి పెట్టె కంట్రాక్టరైన గౌరీపతి—తన అన్నగారుట.

"ఏడీ, ఇల్లా పిలవండి, ఆయన్నే అడుగుతాం" అన్నాడు రాఘవయ్య.

"మా అన్న తను దిగడి, ఆ పెట్టె వ్యవహారం కూడా నన్నే చూసుకోమన్నాడు." అన్నాడు విశ్వపతి.

"ఆ బ్యాటరీ ఏమిటో తీగల్లో కెక్కించి, ఈ పెట్టెలో కూడా కాస్త లైట్లు ఏర్పాటు చేయించండి" అన్నాడు లక్ష్మణమూర్తి.

"అది వీలుపడదండి—"

"ఏం, ఎందుకు వీలుపడదూ?"

"రైల్వేవాళ్లు ఒప్పుగోరు—బోలెడు డబ్బవుతుంది" దాంతో మావాళ్ల జోరు తగ్గింది.

రిటైర్డ్ శానిటరీ ఇన్స్‌పెక్టర్ చౌదరిగారు, 'ఆమాత్రం డబ్బు మేమూ ఇచ్చుకోగలం' అని మొదలెట్టగానే, ఫస్ట్‌క్లాస్ కారేజ్‌లో అలజడి బైలుదేరింది. తలుపుతీసి ముగ్గురు వ్యక్తులు దిగారు. అందులో ఒకాయన మా పెట్టెకేసివచ్చి, 'కనకంగారూ' అనిపిల్చాడు. ఆమె బైటకొచ్చింది. 'రండి వెడదాం అన్నాడు. 'నిమిషంలో' అని లోపలికెళ్లి పది నిమిషాలతర్వాత వూడిపడింది, మఫ్లర్‌లాంటిది నెత్తిని కప్పుకుని.

'నా ఫ్రెండ్స్. వారే. మధుసూధనం—ఆయన కృష్ణమూర్తి—వెనకాల ఇందిర—ఆయనభార్య. ఆ ముందామె, బేబీ నెత్తుకుందే—ఆమె హేమలత మధుభార్య........వస్తా' అని మెల్లగా అంటూ నా ముందునుంచి నడిచి వారిని చేరింది. వారు మెల్లగా నడుచుకుంటూ, ఫర్లాంగు వెళ్లారు—అక్కడ రోడ్డు. ఏదో కారాగింది. అందులో ఎక్కి వెళ్లారు. కనకం అంటె అందుకే మా కోపం. పెట్టెలో వారందరి కోపమూ నా ఒక్కడిలో వ్యక్తమైందంటే ఆ కోపాన్ని ద్వేషం అనొచ్చు.

"చూడండి వాళ్లెంత పెద్ద మనుషులో. లైట్లు ఆర్పకుండా వెళ్లారు. వంటకి పూనుకో విఠలయ్యా' అన్నాడు విశ్వపతి.

"మేం పెద్ద మనుషులం కామనా?' అన్నాడు రక్షితలాల్.

'ఎంతమాట. వారు బైటికి వెడుతున్నప్పుడు తలుపు తాళం వేసుగుని, లైట్లు ఆర్పేసి వెళ్లడం ధర్మం. ఆ లైటు మనకి కాస్త ఉపకరిస్తుందని......అల్లా వెళ్లారుగాన అంటున్నాను......" అంటూ పనిలో నిమగ్నుడయ్యాడు విశ్వపతి.

భోజనం సిద్ధమయ్యేవరకూ, అటూ, ఇటూ తిరిగాం—నేను, లక్ష్మణమూర్తి, చౌదరి. నక్షత్రాలు తియ్యగా మెరుస్తున్నాయి. నేలమీద రాళ్లు, మట్టి. దూరంగా చెట్ల నీడలు, కీచురాళ్లరొద, దిగులుగావుంది. స్టేషన్‌దాకా నడిచివెళ్లే వోపికలేదు. కొందరు పెట్టెలోకెళ్లి పరున్నారు. ధనంజయుం పురాణం పఠిస్తున్నాడు. నాగభూషణం పైప్ ముట్టించాడు. జాలయ్య విస్తళ్లు సర్దుతున్నాడు. చిట్టమ్మ గుర్రు వినబడుతోంది. చిత్రం, మనిషికి తోటివారి సంపర్కం కావాలి. అది తీరా సమకూడితే భరించలేడు. ఆకలితీరి, శరీరం శాంతించినతర్వాతనే తోటి మానవుణ్ణి లేపి కబుర్లు చెప్పమనడం. భోజనాలయ్యాక, గుంపులు గుంపులుగా పొగపీల్చుప చారులయ్యాక, పెట్టెలోకి నిష్క్రమించి, పరుండే యత్నాలు జరిగాయి. చలిగావుంది. కిటికీ అద్దం క్రిందికిదించి, దుప్పటీ కప్పుకుని పరున్నాను. ఆవిడకి ఉత్తరం వ్రాయాలి. నిజానికి వ్రాసేటందుకు ఏమీ కవబడలేదు. త్రోవలో చూసిన వింతలు, విశేషాలు గురించి వ్రాయొచ్చు. నాకది విసుగు. ప్రత్యక్షంగా చూడ్డంలో కలిగే అనుభూతి, వర్ణనలో విసుగు పుట్టిస్తుంది. విసుగు పుట్టించకుండా, కొంత కల్పనచేసి, చమత్కారంగా వ్రాస్తే అది సత్యదూరం అవుతుంది. అది చదువుకున్న వ్యక్తి అసూయపడటం జరుగుతుంది.

'మహ చూశావులెద్దూ ,ఎల్లాగైతే.......నేనూ చూశాలే' అన బుద్ధేస్తుంది. నాకా రకం చమత్కారమైన వ్రాతలు అలవాటులేదు. ఇంక కనకం గురించి వ్రాయాలి. అసలు కనకం ఎవరు? ఎక్కడిది?

"నేనే కనకాన్ని" అని గుసగుస కంఠం వినబడింది. భుజం తట్టడం నిల్చింది. ఉలిక్కిపడిలేచాను.

'రా చెప్తాను.'

లేచాను. ఆమె వెనకాలే వెళ్లాను. మెల్లిగా తలుపు తీసింది. బైటికి దిగాం.

'పదకొండుకాలేదు, అప్పుడే అంత నిద్రా!" ఆమెపై కోపం వచ్చింది. నన్ను ఎందుకు లేసినట్లు. ఎందుకిట్లా తీసుకొచ్చినట్లు! అట్లా నడుస్తూ కొంతదూరం వెళ్లాం. నక్షత్రాలు స్వచ్ఛంగా మెరుస్తున్నాయి—చలికి వణుకుతున్నట్లుగా. పల్చటి నల్లరంగు చీరలోంచి స్త్రీ శరీరం కనబడ్డట్లు ప్రకృతి అస్పష్టమైన కాంతితో, గాలి వీచినప్పుడల్లా పక్కకి తిరిగి పడు

కుంటున్నట్లు, చలించినప్పుడు తప్ప, అంతటా నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉంది.

"వాళ్ల స్నేహితులెవరికో ముందుగా ప్రాశొట్ట మధుసూదనం—కారు తీసుకొచ్చారు. భోజనాలకెళ్లి చక్కా వచ్చాం" అంటోంది కనకం.

"ఏమిటైతే, మహా. ఎందుకు నన్ను లేపడం?"

"వాళ్ల పెట్టెలోనే పడుకోమన్నారు. అందులో ఆరు సీట్లట. ప్రస్తుతం, వాళ్లు నలుగురు 'బేబీ' అంతే—రెండు సీట్లు ఖాళీ.........

"రేపు తెల్లారంగానే తీసుకెడతా, రా—

వాళ్లెంత మంచివారనుకున్నావు. మధు భార్య హేమ, మనిషి మంచిదేననుకో, కాని, అదోకలాగుంటుంది. మొగుడి చక్కదనం ఎక్కడ, తనెక్కడ! ఇంక ఇందిర—కృష్ణమూర్తి పెళ్లాం—చాలా అమాయకురాలు. నన్ను అక్కడే ఉండిపొమ్మని బలవంతం చేసింది........ ఆ జోడాలమధ్య పుల్లలా నే నెందుకని వచ్చేశాలే......"

"సరె, ఇదంతా ఎందుకు చెబుతున్నట్లు—?"

"నీకు నిద్రట్టదు—నాకూ నిద్రట్టదు"

"అంటె?"

"ఇన్నాళ్లూ ఒంటిగా ఉంటంమూలాన, మనుషులతో చెప్పుకోడం అంటె సర్దా. చలిగాఉందా—? పద వెనక్కిపోదాంలే" వెనక్కి తిరిగింది కనకం. నేనూ తిరిగాను.

"ఒంటిగా ఉండటంఅంటె? మొగుడు, పిల్లలూ, సంసారం......లేవూ......?"

"అయ్యోరాత. అవన్నీఉంటే ఇంకనేం. ఇట్లా నీతో వస్తానూ? పెండ్లయిన వాలకమే నీది. అవునా?"

'ఉ' అన్నట్లు తలపంకించాను.

"పెండ్లాందగ్గరలేదు గనక, మంచివాడివి గనక, ఇట్లా రమ్మనంగానే వచ్చావు పాపం......"

ఆవిడ జీవితంలో ఎన్ని పాపాలు చేసిందో నే నెరగనుగాని, ఆవిడ సంభాషణలో చాలా పాపాలు దొర్లుతాయి. అదోక అలవాటు. వాటిని వ్యాఖ్యానిస్తూ, బుర్రపాడు చేసుకోనక్కరలేదు.

"ఎందుకులేవు—భర్త చనిపొయ్యాడా?" నవ్వుతోంది కనకం—బాగా నోరంతా విప్పి—తెల్లజండాలు గాలిలో ఎగిరినట్లు.

"మళ్లా తిరిగొస్తాడని భయం ఉన్నట్లు అడుగుతావేం. మొగుడుతో కాపరం చేసే మొహమేనా నాది?"

"ఏమో, మొహంలో అవన్నీ తెలుస్తా యేమిటి?"

"పోనీలే, సంసారినిచేసి, నా పరువు ప్రతిష్ఠలు నిలబెట్టావు, పాపం. అదే పదివేలు.

"ఇంక వెళ్లి కప్పుకు పడుకో"అంది. పెట్టె దగ్గరకి చేరుకున్నాం.

"నువ్వో?" అన్నాను.

"నక్షత్రాలని చూస్తుంటాను. కోపమా? చలా? కొంగు కప్పేదా?"

"ఛా, ఛా జబ్బు చేస్తుంది, నువ్వూవచ్చి పడుకో" అన్నాను.

"నామీద అంత దయెందుకో"

"నీతో ఏదన్నా ప్రమాదమే. నే పోతా" అన్నానేకాని, చటుక్కున ఆమెని దిగవిడిచి వెళ్లలేకపొయ్యాను.

"ఈ ఒక్కమాటా విను"

దగ్గరగా వెళ్లాను.

"ఏమిటో చెప్పరాదూ?"

"మీఆవిడ ఆడపిల్లని కనబోతోంది" అని నవ్వుతోంది.

'వెళ్లు' అని విసుక్కుని, పెట్టెలోకివెళ్ళి, ముసుగు తన్ని పరున్నాను. తన సీట్లోకెళ్లి పడుకుంది కనకం.

ఫస్ట్‌క్లాస్ ప్రయాణీకులతో చిదంబరంలో పరిచయం ఏర్పడింది. మా పెట్టెలో జనం బండ్లమీద బైలుదేరారు. నేను, లక్ష్మణమూర్తి, కనకం, నాగభూషణంగారి కుటుంబం పక్కపెట్టెలో మధుసూధనం, హేమలత, కృష్ణమూర్తి అతనిభార్య ఇందిర ఒక గైడ్ కుతంత్రానికిలొంగి, రెండు కార్లల్లో వూరంతా చూసి, ఆలయం సందర్శించాం. కృష్ణమూర్తి ప్లీడరు, చరిత్ర చదివినవాడట. అక్కడ శిల్పాల సౌందర్యం గురించి విపులంగా చెప్పడం సాగించాడు. ముప్ఫై రెండెకరాల ఆవరణలోఉంది నటరాజస్వామి ఆలయం. అంతటా చెక్కడాలతో నిండిన సభలూ, విహారాలూ, ఆరామాలు. ఆలయం లోపలి ప్రాకారంలో నాలుగు గోపురాలున్నాయి—రెండింటిపైన నూటఎనిమిది నృత్య భంగిమలు చెక్కబడి ఉన్నాయి. చోళ, పాండ్యరాజులు సాధించిన విజయాల స్మారక చిహ్నాలుగా మూడువందల అడుగుల పొడవు, నూటయాభై అడుగుల వెడల్పు గలిగి, వెయ్యి స్తంభాలతో నిండిన రాజసభని చూశాం. నటరాజమూర్తి కనకసభలో ఉంటుంది. ఈ మూర్తి సౌందర్యానికి తన్మయులైన శిల్పులు, వందలాదిగా నృత్యసభలో చెక్కిన నాట్య భంగిమాల నకళ్లుచూస్తూ, అక్కడే నిలబడిపొయ్యాం, నేను, కృష్ణమూర్తి, కనకం. ఒక శిల్పంముందు మేం నిలబడి ఉండగా ఫోటో తీశాడు మధుసూధనం. కనకం, ఒక శిల్పం నడుం పక్కన తన మొహం కనబడేటట్లు నిలబడి, రెండో వైపుకి మధుసూధనాన్ని వచ్చి నిలబడమంది. నన్ను ఫోటో తియ్యమంది. 'మీరూ రండి' అని హేమలతని పిలిచాను. ఆవిడ అయిష్టంగా తలవూపి, బేబీతో దూరంగా వెళ్లింది. ఇట్లాంటి సందర్భాలలో ఎట్లా సముదాయించాలో నాకు అనుభవంలేదు. రాపిడికి చెదిరిపోయిన ఆ రాతి శిల్పాలలో కనకం కలిసిపోయినట్లుంది. ఆమె మొహం చర్మమూ రేగి రాలుతోన్నట్లుంది. దుస్తులు వేసుకునే ఆచారం మంచిదే. అందువల్లనే, అవి లేకుండా నగ్నంగావున్న శరీరం ఎట్లా ఉంటుందో వూహించుగునే అవకాశం ఏర్పడింది. ఆమెది ఎంత స్థూలమైన కాయమో, ఎంత ఎత్తయినదో శిల్పాలమధ్య తెలిసొచ్చింది.

# ఆరుగురు కథకులూ - ఒక నాయిక

వాళ్లంతా ముందుగా నడుస్తున్నారు. కెమెరా వరికరాలు మూసివేసి, మధుసూధనాని కందిచ్చి, అక్కడ అల్లిక బుట్టల కొట్టు చూస్తూ నిలబడ్డాను. వెనకాలే వచ్చింది కనకం.

''చూశావా హేమలతని''

ఉలిక్కిపడ్డాను.

''మధుకి తగిందేనా?''

''ఏమో—ఎవరిక్కావాలి?''

''నాక్కావాలి''

''నాకు తెలీదు''

''ఎందుకంతకోపం? నాకు మొగుడు లేడనేగా. నేను పదేళ్లక్రితం ఎల్లా ఉండేదాన్నో వూహించి, ఆమె నాకంటె అందమైనదేమో చెప్పు'' అంది చెవిలో నోరెట్టి.

అప్పట్లో ఆమెమీద వచ్చిన కోపాన్ని నిలదొక్కుకోవడం చాలా కష్టమైంది. అసలందుకోసమే ఈ నృత్య ప్రదర్శనలంటూ పెట్టారు. నటరాజ నృత్యంలో కోపమూ, పగ—ఒక శక్తిగా రూపొంది, ప్రేక్షకులలో నిగూఢమైన ఈ ఉద్రేకాలు బైట పడేటందుకు ఉపకరించింది. వారిని విముక్తుల్ని చెయ్యడమే నాట్యం ప్రయోజనం అనిపిస్తుంది. ఆమెని, ఆ రాళ్లమీద క్రిందపడేసి దొర్లించి, ఆమె శరీరాన్ని కాళ్లతో నలిపి, నాట్యం చేసెయ్యాలనిపించింది. కాని, అది సాధ్యం కాదుగా!

తర్వాత తంజావూరు దర్శించాం. ఆ ప్రయాణంలో నాలుగైదు గంటలు, నేను, కనకం, ఫస్టుక్లాస్ పెట్టిలోనే వెళ్లాం. అక్కడ ప్రత్యేకమైన టేబిల్ మీల్స్ సదుపాయాలున్నాయి. వారి అతిథులుగా కులాసాగా గడిచింది. కాని, ఆ పెట్టెలో హేమలత, ఇందిర, కనకంపట్ల అంత స్నేహభావం చూపడంలేదనిపించింది. ఆమెచేత వారి పనులు చేయించుకుంటున్నారు. బేబిని ఆడిస్తుంది, వూరుకోబెడుతుంది—వాళ్ల చీరలు, మడత బెడుతుంది. జడ అల్లుతుంది. కాఫీ సరంజాం శుభ్రం చేస్తుంది— విసుగు లేకండా చేసినకొద్దీ, ఆమెపట్ల వారి అపనమ్మకం ఎక్కువవుతోందనిపించింది. హేమలత సన్నటి మనిషి—మెడకింద ఎముకలు కనిపిస్తాయి. పొడుగాటి సదునైన చేతివేళ్లు, కోరగాచూసే కళ్లు, ఏదో అసంతృప్తి, ఏదో ఆకలి, ఆ కళ్లని కలవరపెట్టినట్లుంటాయి. కనకం అంత నిండైన విగ్రహం కాకపోతే, ఆ చూపులో వేడికి, ఆమె కరిగిపోను.

తంజావూరులో డెబ్భైనాలుగు ఆలయాలున్నా, మేం ఆరే చూశాం. వాటిలో ప్రసిద్ధమైనది రాజరాజు కట్టించిన బృహదీశ్వరాలయం. ద్రవిడ శైలి కట్టడం, రెండువందల పదహారడుగుల ఎత్తుది. దాని శిఖరం ఎనభై టన్నుల బరువుగల ఒక పెద్దరాయిమీద కట్టబడింది. సరస్వతి మహల్ పుస్తక భాండాగారంచూసి, నేను అందరితోపాటు బాగుందన్నానుకాని, నాకేమీ నచ్చలేదు. విసుగు పుట్టింది.

శ్రీరంగం బాగుంది. వూరంతా ఒక ఆలయం. శ్రీరంగ నాథుడు అద్భుతం. పోయిన మతిని వెదుక్కుంటూ తిరిగేందుకు తగిన స్థలం. అల్లా తిరుగుతూండగా ఒక రాయిమీద కూర్చుని, చిత్రం గీస్తున్న రామనాథం తటస్థపడ్డాడు. అతను ఆర్టిస్టు. ఫస్ట్‌క్లాస్ పెట్టెలో ఆరోసీటు అతను రిజర్వు చేయించకున్నదిట. ముందుగా వచ్చేసి, మరికొన్ని స్థలాలుచూసి, ఇక్కడ కలుసుకుని, ఆ టూరిస్టు కార్లో ప్రయాణంచేసే తోటి యాత్రికుడు, రామనాథం. వయస్సు ముప్పైలోపు. ఇంచుమించు నా వయస్సే. చాలా కళైన మొహం, ఒక్క ఆ పొట్టిమీసం మినహా మధ్యపాపిడి, ఒత్తైన ఉంగరాల జుట్టు, మంచిరంగు, నల్ల ఫ్రేమ్ కండ్లజోడు, పొడుగాటిముక్కు, చురుకైన మొహం. తెల్లటి ఖద్దరు లాల్చీ, లాగు, పొట్టికోటు—ఫస్ట్‌క్లాస్‌లో వెళ్లాల్సిన ఘటమే ననుకున్నాను.

గీస్తున్న పటంకేసి చూశాను. స్త్రీమూర్తి—దేన్ని చూసి చెప్మా అనుకుని అటూ, ఇటూ చూశాను. దూరంగా మరోరాతిమీద నిలబడివుంది కనకం. అప్పుడే స్నేహం చేసేసుకుంది చిత్రం.

''బాగుందంటారా? నాకు మనుషుల్ని గీయడంరాదు'' అన్నాడు రామనాథం.

''ఓ—మొహం కుదరకపోయినా, మిగత ఒళ్లంతా కుదిరిందిలెండి'' అన్నాను.

''నేను మొహంకేసి చూడటమేలేదు'' అన్నాడు. పుస్తకం మూసేసి, కనకానికి థ్యాంక్స్‌చెప్పి నడుస్తున్నాడు రామనాథం.

''చాలా మంచాయన. మనిషికూడా బావున్నాడుకదూ...'',

మొహం తిప్పివేశాను.

''నీకే తెలియాలి'' అన్నాను.

''అప్పుడే అలక—మాట పూర్తిగ చెప్పనీ—బావున్నాడు నీ మాదిరిగా అనబోయ్యాను'' అంది.

''వెళ్లు''

''వెళ్లు అని భలేగా అంటావులే.''

''ఛా, ఛా''

''అదిమరీ బాగాఅంటావు. మొగాడికి మరొకమొగాణ్ణి చూస్తే......''

''ఛవ్''

కొట్టబొయ్యాను, ఎల్లానో తమాయించుకున్నాను. నాకంటె పదేళ్లు పెద్దది,— ఏమిటీకబుర్లు ! నే నెవర్ననుకుంటోంది ! చరచరా నడుచుకుంటూ వెళ్లిపోయ్యాను.

* * * *

చీకటి పడింది, నేను మాఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటుకి చేరుకునేసరికి. చూడ్డానికెళ్లినవారు ఇంకా తిరిగిరాలేదు, థర్డ్‌క్లాస్ పెట్టెదగ్గరికి వెళ్లిచూశాను ఏమీతోచక. 'రండి. రండి' అని ఆహ్వానించింది కనకం.

''శ్యామలకి ఒంట్లో బాగాలేదుట. తల తిరుగుతోందిట, నేను రాలేనని పడుకుంది. ఒక్కత్తి వుంటుందిపాపం అని నేనూ దిగడిపొయ్యాను. శ్యామల, ప్రెసిడెంట్ రాఘవయ్యగారిచెల్లెలు పి. యు. సి చదువుతోంది.''

లేపలికెళ్ళి శ్యామలకేసిచూశాను. ఆమె వయస్సు ఇర వైలోపే ననుకున్నాను. నాజూకైన, పల్చటిశరీరం— ఆ నీడలో మరీపల్చగా కనిపించింది. వోణీ శరీరంచుట్టూ, అంటు కునివుంది. పరికిణీ మడతలు నడుంకింద స్ఫుటంగా కనబడు తున్నాయి. ఆశ్చర్యంతోచూసే పెద్దకళ్లు. బుజంపై మెలికలు తిరిగి జారుడుగా వ్రేళ్లాడుతున్న రెండుపాయలజడ—ఆమె కూర్చుంది. పరికిణీ, వోణీ సర్దుకుంది.

"వీరు రామనాథంగారని, ఉన్నవారు, బాగాచదువుకున్న వారు.... గొప్ప చిత్రకారులు." అని నన్ను పరిచయంచేసింది కనకం.

శ్యామల నమస్కారంపెట్టింది. సిగ్గుతో బైటికి చూస్తోంది.

"నాబొమ్మలు చూడందే, గొప్పచిత్రకారుణ్ణి అని ఎల్లా అనగలరు ?" అన్నాను.

"శ్రీరంగంలో నాబొమ్మ వేస్తిరిగా."

"అదిఏమీ బాగాలేదు."

"నేను బాగుంటేగా, బొమ్మ బాగుండేటందుకు. ఏమన్నా. ?"

"నేను మీ మొహాన్ని వెయ్యాలని యత్నించలేదు— ఊరికే, శరీరం ఆకారం.... పెన్సిల్ స్కెచ్."

"మొహం బాగాలేదని నాకు తెలియదంటారా—"

"అహహ. అదికాదు.... అంటె,— నా ఇంటరెస్ట్— అంటె, నాక్కావల్సింది.... కేవలం.... శరీరం.... ఎల్లాచెప్పాలో తెలీదు."

శ్యామల నవ్వింది— సంధ్యలో కడసారి కిరణంలా వెలిగిం చింది ఆ నవ్వురేఖలకు, ఆ కదలికకి కళ్లల్లోయి కల్పుతున్న ట్లుంది.

"మొగాడికి కావల్సింది శరీరమే— నాకుతెలుసు." అంది కనకం. శ్యామలలేచి దూరంగావెళ్లింది.

సంభాషణధోరణి ప్రమాదంగా పరిణమించకుండా విషయం తప్పించేటందుకు శ్యామలని అడిగాను, మందేదన్నా తీసుకుందా అని.

"మంచికాఫీ త్రాగితే, తలనొప్పిపోతుంది. రండి, మా కారేజ్‌లో కెళ్లి, కాఫీ తయారుచేసుకుందాం" అన్నాను..

"నాకేమీ ఒద్దండి—కాసేపు పడుకుంటే అదేపోతుంది" అంది శ్యామల.

"ఉండండి—కాఫీచేస్తాను."

ఇద్దరం మా పెట్టెలోకి వెళ్ళి, స్విచ్‌వేసి, హీటర్‌మీద కాఫీ తయారుచేశాం. దీపంవెలుగులో కనకాన్ని చూశాను. జుట్టంతా చిందరవందరగావుంది. జాకెట్టు చేతికింద చెమట డాగులు కనిపిస్తున్నాయి. ఒకవింత వాసన ఆవరించింది. జడలో తెల్ల వెంట్రుకలు మెరుస్తున్నాయి. కొన్ని రాగివర్ణంలో వున్నాయి. కంటికింద గీట్లు కనిపించాయి — పొట్టకింద మడతలో అక్క డక్కడ కాఫీరంగు చర్మం కనబడుతోంది. శిథిలమైన ఆల యంలా వుంది కనకం — స్తంభాలు, బురుజులు, గోపురాలు మిగిలి వెనకటి వైభవాన్నిచాటే ఆలయం— ఇంక పునర్నిర్మా ణానికి పనికిరాని శిథిలాలు. నాకారకం వస్తువులు ఇష్టం. మనిషి పార్కులో నాటిపెంచిన చెట్లు, మొక్కలులా అందంగా, వరసగా, క్రమంగా మానవకృషిఫలితంగా తయారైన ప్రకృతి నా కిష్టంలేదు. అవి ఫోటోలో ఎంత రోతపుట్టిస్తాయో, చిత్ర కళలోకూడా అంతే. అల్లాగే—మనుష్యులూను. బాగా మేకప్ చేసుగుని. ఫేషనబుల్‌గా, ఆధునికంగా కనబడే స్త్రీ, బొమ్మగా బాగుండదు. అసలు స్త్రీబొమ్మ చక్కదనానికి దుస్తులుకూడా అంతరాయమే. అందుకే ఓల్డుమాస్టర్స్, నగ్నంగా చిత్రించ డాని కిష్టపడేవారు, స్త్రీమూర్తిని. కనకాన్ని అల్లా చిత్రించే అవకాశంలేదు. ఆమెమనిషి—జీవితంలో నలిగి, మిగిలిన మనిషి. ఆ అనుభవంఅంతా ఆమె శరీరంలో వుంది. ఆ శరీరానికి శ్యామల మొహం తగిలిస్తే !

"ఎల్లుండి మేంవేరుగా కొడైకెనాల్ వెడుతున్నాం," అన్నాను.

"బాగుంటుందా ?"

"చాలా, గొప్పప్రకృతి దృశ్యాలు. మీ రొస్తారా?"

"ఎక్కడికైనా వొస్తాను— చాలా అవుతుందా?"

"నే చూసుకుంటాగా—తోడుగా శ్యామలకూడా వొస్తుం దేమో !" అన్నాను.

"పెళ్లికాని పిల్లని పంపుతారా?"

"మీరున్నారుగా."

నవ్వింది కనకం. దోవలో నిలబడ్డనన్ను 'కాస్త తప్పుకోండి' అని పక్కనించి దిగివెళ్ళింది కాఫీకప్పుతో. ఆమె ఇంచుమించు, నాఅంత ఎత్తువుంది. అల్లా నిలబెట్టి బొమ్మగియ్యాలనివుంది. శ్యామల కాఫీతాగింది.

"చీకట్లో ఎందుకు, మాపెట్టెలోకి రాకూడదూ ?" అన్నాను, శ్యామలతో

"ఇంకానయం. నేవొచ్చి కూర్చున్నందుకే మా వాళ్ళ మండిపడుతున్నారు" అంది కనకం.

"నేనొచ్చి మీ పెట్టెలో కూర్చుంటే మీవాళ్ల కోపం తగ్గుతుందేమో" అన్నాను.

నావద్దవున్న ట్రాన్‌సిస్టర్ రేడియోతెచ్చి శ్యామల కిచ్చాను.

"కాస్తకాలక్షేపం— వుండనివ్వండి" అన్నాను. ఆమె తీసుకోవాలో కూడదో తెలియక తటపటాయిస్తుంటే, కన కం దాన్ని తీసుకుని, అదిమోగేయత్నం చేస్తోంది. ఎల్లా చెయ్యాలో చెప్పాను. తిరుచిరపల్లి రేడియోకేంద్రం, ఇనై తట్టు సంగీతం వొస్తోంది. ఇంతలో జనంరావడం సాగించారు.

'థ్యాంక్స్' అంది శ్యామల. నేను నా పెట్టెలోకి వెళ్లి పొయ్యాను.

మర్నాడు పగలల్లా థర్డ్‌క్లాస్ పెట్టెలో గడిపాము. నన్నెవ్వరూ మందహాసంతో ఆహ్వానించి పలకరించలేదు. కనకం లేచి తనసీటు ఇచ్చింది. ట్రాన్‌సిస్టర్ పెట్టింది. దాన్ని మోగించ వద్దన్నారు, చెట్టిగారు, రక్షితలాల్. వాయిష్టం నే పెట్టు గుంటానంది కనకం. కాసేపు వాదించుకున్నారు. ధనంజయం గారి ప్రార్థనకది అంతరాయంట. మాకీ ఆరవగోల వద్దన్నాడు

# ఆరుగురు కథకులూ - ఒక నాయిక

పద్మనాభం. ధనంజయం దగ్గుతున్నాడు. ఆయన ఒంట్లో బాగాలేదట. నాగభూషణం మందు ఇస్తానంటే ఒద్దన్నాడు.

"కాసేపు కాలక్షేపం అవుతుంది రేడియో పెట్టండి" అన్నాడు ధనంజయం నవ్వుతూ. పెద్దాయన—గడ్డం నెరిసింది—తలని తెల్ల వెంట్రుకలు కాడల్లా వేల్లాడుతున్నాయి.

"మందులతోకాక, ఈ రేడియో గొడవతో కూడా ఆయన్ని చంపుతారా?" అని చౌదరి ప్రశ్నించాడు. దానిమీద వాదం రేగింది. రెండు పక్షాలయ్యారు జనం.

"ఇది ఫస్టుక్లాస్‌లో వారి రేడియో అనేగా మీ బెంగ—ఎవరిచ్చారో, వారు ఇక్కడే ఉన్నారు—మనతో కలిసే ప్రయాణం చేస్తున్నారు. ఇంక సరా!" అంది కనకం. జనం మౌనంలో పడ్డారు. కనకం రేడియోని, నాగభూషణంగారబ్బాయి 'రవి' కిచ్చి ధనంజయంగా రొక్కరూ వినేలాగు ఆయన దగ్గర కూర్చుని పెట్టమని తనూ వెళ్ళి ఆయన పక్కను కూర్చుంది.

"ఇదిగో మామయ్యా—హాయిగా పెట్టుగో రేడియో. రవి పెడతాడు."

"ఎంతమంచిదానివి కనకం. ఈ పెట్టెలో ప్రతివాడూ, నన్ను తాతయ్యా అంటున్నారు. ముద్దుగా మామయ్యా అని పిలిచింది నువ్వొక్కదానివే," అంటూ ధనంజయం బోసిగా నవ్వుతున్నాడు. నేను శ్యామలకేసి చూస్తూ కూర్చున్నాను. ఎవ్వరూ తనకేసి చూడకుండా, నాకేసి చూడటం గమనించాను. ఆమె చూపుకోసం ఆ పెట్టెలో గొడవంతా భరిస్తూ కూర్చోగలను. శ్యామలతో నన్నాకర్షించింది, అమాయకత్వం. ఆమె దగ్గరగా కూర్చుంటే ధైర్యంగా, ఆరోగ్యకరంగా ఉన్నట్లు అనిపిస్తుంది. ప్రెసిడెంట్ రాఘవయ్యగారి పరిచయంపొంది, కబుర్లుచెప్పి, వారు కూడా కొడైకనాల్‌కి వచ్చే ఏర్పాటు చేశాను.

దిండిగల్‌లో మేం దిగిపొయ్యాం. టూరిస్టు పెట్టెలు రెండూ, మధురవెళ్ళే ప్యాసింజర్ ట్రైన్‌కి తగిల్చారు. కనకాన్ని మీరూ రావాలని బ్రతిమలాడాను. ఒప్పుకుంది. కొడైకనాల్‌కి చేరుకున్నాం టాక్సీలో. రెండు గదుల కాటేజ్ పుచ్చుకున్నాం అక్కడ తటస్థపడిన స్నేహితుడితో రాఘవయ్యగారు వెళ్ళారు. నేను, వారి భార్య, చెల్లెలు శ్యామలా, కనకం దృశ్యాలు చూస్తూ గడిపాం ఆ రోజు.

సాయంత్రం నాలుగైంది, కోకర్స్‌వాక్ అనే చోటికి చేరుకునేటప్పటికి. అక్కడనుంచిచూస్తే, చుట్టూ అద్భుతమైన దృశ్యం కనబడుతుంది. చాలా ఎత్తైన చెట్లు, ఊదారంగు వూడలు, చెట్లకొమ్మలుమేఘాలమధ్య ఇరుక్కున్నాయి. సౌందర్యం భరించలేక ప్రకృతికన్య కన్నీరు కారుస్తున్నట్లు అక్కడ వన్నటి జలపాతం—ఏడవ్వద్దు అన్నట్లు అడ్డుకునే ఎర్రరాతి బండలు, ఆకుపచ్చ చీర విప్పేసి ఎండవేసినట్లు పచ్చని గడ్డి బయలు, దూరంగా ముద్దుకోసం దగ్గరకి జరిగిన కొండ శిఖరాలు "నే నింక నడవలేను బాబూ—ఇక్కడ రెస్టు తీసుకుంటాను. మీరు తిరిగిరండి" అంది రాఘవయ్యభార్య సుందరం.

"జలపాతం చూద్దామా?" అంది శ్యామల. కనకం ముందు నడుస్తోంది. ఆమె వెనక శ్యామల, ఆకుపచ్చరంగు చలికోటు వేసుకుని. కోటుకింద లంగా గూడ కట్టులా కనబడుతోంది. జడపాయిలు కోటులో ఉండిపోయి, బాబ్డ్ హైయిర్‌లా కనబడుతోంది తల. కొడైలోకొన్న ఆ కోటు ఆమెకి కాస్త ఒదులైంది—మరీ సన్నగా కనబడుతూంది. రాతిబండమీద కూర్చుంది. ఆమె మొహం ఆయాసంతో ఎర్రబడింది. చమట నుదుటిమీద హారంలా అనుకుంది. కోటు తీసేసింది. రంగు రంగు వూల డిజైను జాకెట్టు, అగ్గచారల వోణి—శ్యామల ఆ చెట్లల్లో, రాళ్ళల్లో కలిసిపోయింది. మనిషిలేని ప్రకృతికి ప్రాణంలేదు. శ్యామల చల్లటి చూపులతో, వెండి వెలుగుతో, మృదువైన నడుం ఒంపులో జిగిబిగి జడలో ఆ దృశ్యానికి పరిపూర్ణత సమకూరింది.

నేనామె బొమ్మ గియ్యలేకపోతున్నాను. కావల్సిన ఏకాగ్రత రావడంలేదు. మరోస్థలంనుండి వేద్దామని, కొంచెం పక్కకి జరిగాను. అక్కడ మొక్కలు గుబురుగా ఉన్నాయి. వాటిని పెంకుతో తవ్వి, తొలిగించే యత్నంలో ఏదో ముల్లు దిగి మూడో వేలు మధ్య రక్తం కారుతూంది. ముల్లు లాగేశాను.

"కట్టు కట్టుకోరు?" అని దగ్గరగా వచ్చింది శ్యామల.

"చిన్నది. ఫరవాలేదు. రుమాలుందిగా" అని చేతిగుడ్డ మడిచి వేలుకి నొక్కాను.

"కనకం ఏదీ?" అంది ఆమె.

"అల్లా ముందుకి వెళ్ళుంటుంది" అన్నాను.

"కాసేపు విశ్రాంతి— లొడ లొడా వాగుతూంటుంది. ఆవిడ బొమ్మ వేశారుటగా?" అంది శ్యామల.

"అవును. ఏదో స్కెచ్‌లాంటిది. వూరికే శరీరం ఒక ఏంగిల్‌లో ఎల్లాఉంటుందో స్టడీ చెయ్యాలని......"

"మీ కావిడంటె ఇష్టంకదూ?"

"ఆర్టిస్టు కళ్ళతో చూస్తాను, అంతే. అందులో ఏ ఉద్రేకమూలేదు."

"నాకు చెప్పకండి—కనకం వృత్తిలో మనిషిట. ఆమె ఈ బండిలో వస్తుందని తెలిస్తే మా అన్నయ్య రాకనే పోను. డబ్బుకోసం ఏదన్నా చేస్తుంది."

"నన్నింతవరకూకానీ అడగలేదు. ఆమె ఏ వృత్తిచేస్తే నాకేంపని. శుభ్రంగా ఉంటుంది. స్వేచ్ఛగా, చలాకీగా మాట్లాడుతుంది. నాకంటె, పదేళ్ళ పెద్దది. మా ఇద్దరిమధ్య నువ్వు వూహించిన స్నేహం లేదంటే నమ్ముతావా శ్యామలా?"

"ట్రాన్ సిస్టర్ ఇచ్చారుగా."

"మీ కంపార్ట్‌మెంట్‌లో కాలక్షేపంకోసం ఇచ్చింది."

ఆమె దగ్గరగా వచ్చింది. సూర్యుడు దిగిపోతూ, ఎర్ర కిరణంతో ఆమె బుగ్గస్పృశించాడు. చిరు వెంట్రుకలు బంగారు తీగెలుగా కళ్ళమీదికి జారి, వాటి నీడలు మెడకిందికి సాగుతున్నాయి.పమిటె గాలికి తొలిగింది. స్తనాలమధ్య విడివచోట లేతగా నీడ పడింది.

"చూడొచ్చా బొమ్మ."

"సాధారణంగా మనిషికంటె బొమ్మ బాగుంటుంది. నువ్వు నీ బొమ్మకంటె బాగుంటావు."

మోకాలుమీద తల గడ్డం ఆనించి కళ్ళల్లోకి చూస్తోంది. పల్చటి మనిషి, కాడలాంటి వేళు —బొమ్మకి బాగుండవు—

కాని, నాలో తృష్ణ బైలుదేరింది. ఆమెను గట్టిగా దగ్గరకు తీసుకుని, కౌగలించుకున్నాను. విడిచేసి పక్కకి తిప్పేశాను, నా మొహాన్ని. రుమాలుతో కళ్లంట కారే నీళ్ళని తుడుచుకున్నాను. భరించరాని అనుభూతికి అప్రయత్నంగా ఏడుపొచ్చింది.

"నే నింక నీ బొమ్మ ఎప్పుడూ వెయ్యలేను. ఇద్దరం మనుషులుగా ఐపొయ్యాము." నా క్రాపింగ్‌లో వేళ్ళుపెట్టి కదుపుతోంది శ్యామల.

"మీరు నన్ను ప్రేమిస్తున్నారా?"

"సమాధానం చెప్పే అర్హతలేదు నాకు" అన్నాను.

"నేను చెప్పనా?" అంది శ్యామల.

ఆమె మాట్లాడే అవకాశంలేదు. కనకం వచ్చేసింది. తను ఆ కింద రాళ్లమధ్య నీళ్లలో మొహం కడుక్కుందిట. చల్లగా, స్వేచ్ఛగా, ఆనందించిందిట.

"మీ మాదిరిగానే....." అని ముగించింది.

"ఏమిటా మాటలు?"

"తప్పేమన్నాను? ఈడు జోడైన మీ రిద్దరూ, స్వేచ్ఛగా, హాయిగా ఉన్నారన్నాను."

"అట్లాంటి వాగుడు ఎప్పుడూ వాగకు. నేను చదువుకున్న దాన్ని—అందులో నువ్వా అనడం—?"

"నువ్వా అంటె? నీ కంటె వయస్సులో పెద్దదాన్ని తమాషాకం టె తప్పా—ఏమండి. రామనాథంగారూ మీరు చెప్పండి."

శ్యామల ముందు నడుస్తోంది. ఆమె వెనకాల కనకం నడుస్తోంది. పశ్చిమ ఆకాశంలో కాస్త చెరిగిన కుంకుమ బొట్టులాగా, ఎరుపుమిగిలినా, చెట్లనీడలమధ్య చీకటి నాలుకలు జాస్తోంది. కనకం శ్యామలని గట్టిగా కౌగలించుకుంది. ముద్దు పెట్టుకుంటోంది.

"వెర్రిపిల్లా. నువ్వంటే ఎంత ఇష్టమో నువ్వెరగవు."

"మొగాళ్లంటె ఇష్టం నీకు."

"మొగాళ్లపట్లే ఇష్టంగా ఉండాలి ఆడది. వాళ్ళు దిగులుగా, ఒంటిగా, బెంగగా ఉంటారు. వోదార్పు కావాలి. నాకు చాలా అనుభవముంది. ఆ వోదార్పునిస్తే, పసిపిల్లలల్లె ఒళ్లో పడుకొని బోకట్లమంటారు. వాళ్ల కిష్టమైన ఆడాళ్లంటె మరీ ఇష్టం నాకు—సరా?"

శ్యామల, ఆమె చెంపమీద కొట్టింది. కనకం పక్కకి తిరిగి ఏడ్చేస్తోంది. నాకు భయమేసింది. ఏం చెయ్యాలో తెలియలేదు.

"చదువుకున్నదానివి, అట్లా చెయ్యొచ్చా శ్యామలా?"

శ్యామల కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి. కనకంవచ్చి, ఆమె మొహాన్ని తన కొంగుతో తుడుస్తోంది.

"మళ్లాకొట్టు—ఇదిగో చెంప. కొడితే ముద్దుపెట్టుకొన్నట్లుగా ఉంది." దాంతో శ్యామల, వెర్రిగా నవ్వేసింది. నిలిచిన ఏడుపు, వీడిన కోపమూ, ఎగిరివచ్చే ఆప్యాయతా, ఆమె మొహంలో నూతన వికాసాన్ని తెచ్చాయి. చీకటిని ఎవరో వెలిగించినట్లైంది. సుందరం మా ఎదురుగావచ్చి, తొందరగారండి, వెడదాం అంటోంది. వెనక్కి తిరిగి, ఇంటికి చేరుకునేటప్పటికి ఎనిమిదైంది.

ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు. రాఘవయ్యగారు నుండువా పక్కగదిలో పరున్నారు. వారిపక్కన, సుందరం, శ్యామల, మధ్య హాలులో కనకం పరుంది. నేను ముందువా ముందు గదిలో వేసుకున్నాను. బైటకొచ్చి చెట్టుకింద కూర్చుని ఆకాశంకేసి చూస్తున్నాను. దట్టంగా మేఘాలు అల్లుకున్నాయి. తీక్షణంగా చూస్తేతప్ప, వాటిమధ్య మెరిసే నక్షత్రాలు కనబడటంలేదు. ప్రకృతి అదృష్టవంతురాలు. భూమి నిద్ర పోతున్నప్పుడు ఆకాశం కాపలాకాస్తూ ఒక కంట కనిపెడుతూ ఉంటుంది. కనకాన్ని గురించి ఆలోచనలు. ఆమె ఆ వృత్తిలోదని నాకూ ఏదో అనుమానం ఉంటూనే వచ్చింది. ఆ వృత్తిని గురించి చదివాను. వారూ, వీరూ చెప్పగా విన్నాను. వృత్తులన్నింటిలోకీ అతి పురాతనమైందిట. అది లేకుంటే వివాహం అనే సంస్థ స్థిరంగా నిలబడదట. పాశ్చాత్య దేశాలలో కొందరు స్త్రీలు, కళాకారుల మోడల్స్‌గాఉండే వృత్తి సాగించి, జీవనం గడుపుకుంటారుట. కనకంలాంటి స్త్రీలు, ఇట్లా ఎందుకు గడపకూడదు? మన సంఘంలో ఇతరులకి సంతోషాన్ని, వినోదాన్ని కల్పించే ఏ వృత్తిపట్లా గౌరవంలేదు. నాటకంలో వేషంవేసే ఆడదానిపట్ల గౌరవం లేదు. ఆర్టిస్టు మోడలూ అంతే అవుతుంది. వీరందరూ, ఇతరులకి వినోదం కల్పించడంకోసం శ్రమపడేవారే. ఉద్యోగంచేసే స్త్రీకి పెండ్లి కావడంలేదు. అది కూడా, ఏదో విధంగా వదివుంది లోకీవచ్చి, శ్రమించడమే అవుతుంది. నాలుగు గోడలమధ్య—నాలుగు మంచంకోళ్లమధ్య గడపాలి. అసలు ఎవరూ సంతోషంగా ఉండటం హర్షించదు సమాజం. ఈ ప్రయాణంలో సమాజంలేదు. థర్డ్‌క్లాస్‌పెట్టె నియమాలను పాటించడంతప్ప, వ్యక్తిగతమైన పేచీలుతప్ప, నియమాలులేవు. కాసేపు స్వేచ్ఛ, ఎవరు ఎవరేం చేసిందీ, ఎవరికీ అక్కర్లేదు—దానివల్ల వారి చేతి డబ్బు, పడకుండా ఉండడంతప్ప. లేచి హాల్లో కెళ్లాను. చీకటిగాఉంది. కనకం ఒక నల్ల ముద్దలా బ్లాంకెంట్ కప్పుకునిఉంది. ఆమె నడుంపైన చెయ్యివేసి కదిపాను.

ఆమెస్తనాలు మోచేతికి తగాలాయి. చెయ్యి నా పీకమీదవేసి, చివాలున వొక్క తోపు తోసింది. వెనక్కిపడ్డాను. లేచి కూర్చుంది.

"ఎవరది?" బ్యాటరీలైట్ మొహంమీద వేసింది.

"మీరా రాఘవయ్యనుకున్నాను." ఆశ్చర్యపడ్డాను. మన పెళ్లాగో అయింది. లేచి వరండాలో కొచ్చేశాను. వెనకాలే వచ్చింది.

"మీరైతే ఫరవాలేదులెండి. ఎవ్వరితో అనమాకండి. నిన్నరాత్రి, రాఘవయ్య వచ్చాడు. మీద చెయ్యివేసి కదిపాడు. నేనండీ, కనకాన్ని—సుందరం అనుకున్నారా—భలేవారే—అన్నాను. సిగ్గుపడి వెళ్ళిపొయ్యాడు."

"నువ్వు చనువుగా ఉండబట్టే రాఘవయ్య అట్లా చేసుంటాడు. ఆయనకేం బాగా ఉన్నవాడు. ఎందుకట్లా తోసెయ్యటం?"

(సశేషం)

# 1962 సాహిత్య సమీక్ష

"శ్రీ వాత్సవ"

**1963** జనవరికి రెండు ముఖ్య సంస్థలకు నలభై ఏండ్ల నిరవధిక సేవ చేసిన గౌరవం లభిస్తున్నది. అవి రెండూ బహుదూరంలో ఉన్నప్పటికీ, సాహితీ సంస్కృతీ విజ్ఞాన వికాసాలకు ఈ నలభై ఏండ్లలోను చేసిన తోడ్పాటుకి లోకమంతటా ప్రఖ్యాతి పొందిన సంస్థలు. ఒకటి లండన్‌లోని రేడియో సంస్థ బి. బి. సి. ఇది ప్రభుత్వ నిర్వహణ నుండి ప్రత్యేక సంస్థగా ఏర్పడిన తరువాత, నలభై సంవత్సరాల అవిరళ కృషి చేసిన ప్రశంస పొందినది. ఈ నలుబది ఏండ్ల చరిత్ర, నాలుగు దశాబ్దాల ప్రపంచ విజ్ఞాన చరిత్ర, నలుబది ఏండ్ల బ్రిటిష్ సంస్కృతీ చరిత్ర. దీనిలో వినోదాలు, వేడుకలే కాక, వేదాంతము, విజ్ఞానము, శాస్త్రము, సంగీతము, సభ్యత సాహిత్యము ఏవిధముగా అభివృద్ధిచెంది—ప్రజలలో ఆయా దివ్యానుభూతుల ప్రభావంతో అభిరుచులు ఏవిధంగా మార్పు నందినదీ బి. బి. సి. నిరూపించింది. రేడియో విజ్ఞానములో అత్యుత్తమ ప్రమాణములను నెలకొల్పి ఉత్తమోత్తమ స్థాయి నందుకొన్నది.

బి. బి. సి. లాగునే మన దేశంలో అంత ప్రచారము చెంది, అంత ప్రఖ్యాతి చెందిన సంస్థ తెనుగు సాహిత్య పత్రిక 'భారతి'. నలుబది యేండ్లు పూర్తిచేసుకొనే భాగ్యం ఈ సంస్థకు కూడ కలుగబోతున్నది. 'భారతి' చరిత్ర, ఆ పత్రిక ప్రకటించిన వైవిధ్యము గల వ్యాసములు, పద్యములు, కథలు, నవలలు, నాటకములు సమాలోకనముచేసి చూస్తే—బి. బి. సి. పైన చేసిన వ్యాఖ్య 'భారతి' యెడల క్యూడ కోవిదులు చేయగలరు. ఈ 'భారతి' సంపుటములు తెలుగువారి పాటి విజ్ఞాన సర్వస్వ సంపుటలు. ఈ పత్రిక చరిత్ర పర్యావలోకనం చేస్తే తెనుగువారి సంస్కృతీ చరిత్ర పర్యావలోకనం చేసినట్లే. మన అభిరుచులు, మన ఆదర్శములు, మన ఆశయములు ఏవిధముగా మారిపోయినదీ ఈ 'భారతి' పత్రిక నలుబది సంపుటములు వ్యక్తము చేయగలవు. భాషలో, పలుకుబడిలో, సాహిత్యములో, సంగీతములో, కళలలో, విజ్ఞానములో నిధి నిక్షేపములవంటి ఉన్నత లక్ష్యములీ పుటలలో మనకు లభించగలవు.

నాటికీ, నేటికీ 'భారతి' నెలకొల్పిన ఉన్నత లక్ష్యాలలో కొంత అవనతి కల్గినదని పూర్వకాలపు ఛాందసులను కలదు. కాని ఆ యవనతి వారి లక్ష్యాలలోను అభిరుచులలోను కలిగిన పరిణామమే యని గుర్తింపలేక పోతున్నారు. ఒక ప్రసిద్ధ పరిశీలకుడు డాక్టర్ కార్స్ స్టెయిర్స్ ఈ సంవత్సరం బి. బి. సి. ఏర్పాటు చేసిన రీల్ లెక్చర్సు ప్రారంభం చేస్తూ ఈమాటనే స్పష్టంగా తెలియజేశాడు. పూర్వకాలంలో ఇరవయ్యో దశాబ్దము ముప్ఫయ్యో దశాబ్దంనాటి భావాలు నేడు పూర్తిగా మారిపోయాయి. అన్ని శాఖలలోనూ క్రొత్త క్రొత్త యభిరుచులతో, క్రొత్త క్రొత్త లక్ష్యాలతో క్రొత్త మేళనం సంభవిస్తోంది. ప్రాతకాలపునాటి వృద్ధుల మధురస్మృతులతోపాటు వర్తమానకాలపు సరిక్రొత్త అనుభవాలు మేళనం పొంది, నేటి యువకతరంవారి క్రొత్త ఆశయాలు, క్రొత్త ఆశలు రూపుకట్టుకొంటున్నాయి. దానిలో ప్రాత క్రొత్తల మేలు కలయిక గోచరిస్తుంది. నలభై ఏండ్ల క్రితం—మానవ నిర్మితమైన మహనీయ సంస్థలు గట్టి పునాదులమీద కట్టడంచేత తరతరాల వరకు చెక్కు చెదరకుండా ఉండేవి. ఆ కాలంలో సమాజ వ్యవస్థ అభిలషించిన విలువలు ప్రమాణాలు మార నక్కరలేదు. ఆ సమాజంలోని వ్యక్తి ఈ జీవన నాటకరంగంలో తనకిచ్చిన ఫాత్ర చేతనయినట్లు నిర్వహించిపోవలసి వచ్చేది. ఆ నాటకంలో తన పాత్ర నిర్వహించి—ఆ చట్రములో ఇమిడిపోవడం తప్ప, ఆ సన్నివేశం మార్చుకోవడానికి కాని కథా విధానం తనకు తోచినట్లు నప్పుకోవడానికి కాని వీలుండేది కాదు. ఇపు డలాగ కాదు. ఎన్నో ఏండ్ల చరిత్రగల మహనీయ సంస్థలు సైతం మానవ నిర్మితాలని తెలిసిపోయింది. అవి లోపరహితాలు కావు. తరచు అవి మార్పి వలు రూపాంతరాలు పొందించక తప్పదని జనం గ్రహించారు. అందుకే ఇష్టం వచ్చినట్లు మార్చివేస్తున్నారు.

నేడు మన సమాజంలోను, సభ్య జీవితంలోను వచ్చిన సమస్యలన్నీ ఈవిధంగా వచ్చినవే. జీవనలక్ష్యాలన్నీ ఇట్టే మార్చి వాటిని ఇష్టం వచ్చినట్లు నడిపించుకోవచ్చుననే నమ్మకం నేటి మానవునిలో కలిగింది. అందుకే ఈ పరిస్థితులు వెంటనే మారిపోవాలని ఇంతగా తహతహ పడుతున్నాడు. ఈ మార్పు గ్రహించలేని పెద్దలే 'భారతి' వంటి సంస్థలను తప్పుల పట్టుతున్నారు. 'భారతి' లో ఉన్నత ప్రమాణాలను సరియైన కొలబద్దతో కొలువలేక పోతున్నారంటే నేటి సాంఘిక ప్రపంచంలో మన జీవిత లక్ష్యాలు పెట్టుకొన్న ఉన్నత ప్రమాణాలు కొలువలేకపోతున్నా రన్నమాట. మన జీవితాదర్శాలు, సాహిత్య లక్ష్యాలు, మనము గొప్పగా భావించే విలువలు ఈ యుత్తమ పత్రిక పుటలో ప్రతిఫలిస్తున్నవి. ఏదైనా అవనతి కనిపిస్తే అది మన సాహిత్యవేత్తలలో, మన రచయితలలో, మన విజ్ఞానవేత్తలలో, మన కళా శిల్పులలో కలిగిన అవినీతియే. సమకాలీన సాహిత్యం సమకాలీన జీవనసరళికి అద్దంవంటిది కదా !

ఈ దృక్పథంతో 1962 లో వచ్చిన సాహిత్యమును పర్యావలోకన చేస్తే కొన్ని విశేషాలు మనకు భోధపడతాయి. 1962 లో—స్వతంత్ర భారతదేశం తొలిసారి తన స్వాతం

(్త్యము కోసం, తన దేశ రక్షణ కోసం ఇంతవరకు మిత్ర రాజ్యంగా భావించిన పొరుగు దేశం చైనాతో యుద్ధం చేయవలసివచ్చింది. ఈ పదిహేనేండ్లలో భారతదేశం పొందిన అభ్యుదయ వికాసాలతోపాటు, ఆత్మలాభాలు, అహంకారాలు, అంతఃకలహాలు అన్యోన్యద్వేషాలు వృద్ధిపొంది మనుష్యుల్ని సత్యధర్మాలను నీతిన్యాయాలకు దూరంచేశాయి. మంచితనంవైపు, మానవతవైపు మనుష్యుల విలులే తారుమారై పోయాయి. జాతి, కుల, మత, వర్గాలతోపాటు స్వార్థము సత్యద్రోహము పెచ్చుపెరిగి మానవుల్ని దానవుల్నిగా చేసివేశాయి. ఈ దేశంలో పౌరు లొక నిశ్చింతతో, ఒక నిర్లిప్త భావంతో 'యేనకేన వ్యుపాయేన' ఆత్మలబ్ధి చూచుకొంటున్నారు. తమ స్వార్థంకోసం ఎలాంటి ఆశయూ అయినా బలియిచ్చారు. దీనితో పాపభీతి, దైవభీతి ఇవన్నీ పోయాయి. డబ్బున్నవాడిది రాజ్యం. మొండివాడు రాజుకంటే బలవంతుడు. ఈ వ్యవస్థలో అసమర్థులు అందలాలు ఎక్కారు, సమర్థులు సందులలో ఇరుకుకొని నతమతమైపోతున్నారు. పామరులు పండితు లయ్యారు. సోమరులు సూత్రధారు లయ్యారు. వేటగాళ్లకు పెత్తనం లభించింది. కళాశాలలు క్రమశిక్షణారహితులకి కదనరంగా లయ్యాయి. శాసనసభలు సదసద్ వివేచనారహితుల చర్చావేదిక లయినాయి. విశ్వవిద్యాలయాలు విద్వేష బీజాలకు విలాసక్షేత్రా లయాయి. ఇట్టి స్థితిలో జారిపోతున్న విలువలను, మీరిపోతున్న హద్దులను తలచుకొని విచారించి ప్రయోజనము లేదు. వీటికి మూల కారణాలు అన్వేషించి అవి తొలగించి మన సాంఘిక వ్యవస్థకు సంస్కృతీ సమాఖ్యకు చికిత్స చేసి మరింత స్వాస్థ్యము చేకూర్చుకొని మరింత ఆరోగ్యవంతంగా జీవించేటట్టు చెయ్యాలి. ఇది సంఘానికీ—జాతికీ పుట్టిన ఒక సమాజ వ్యాధి—దీని రోగ నిదానంచేసి చికిత్స చేసుకోవాలి. ఒకానొక భాషా తత్త్వవేత్త బెంజమిన్ వార్ఫ్—ఈ విషయమై పరిశోధనలవల్ల ఒక అంశం కనిపెట్టాడు. మన మాతృభాష నేర్చుకొనే విధానాన్నిబట్టి మనం ప్రపంచాన్ని అర్థం చేసుకొనే రీతి, తోడి మానవుల్ని అవగాహన చేసుకొనే దృక్పథమూ ఆధారపడి ఉంటాయి, అని అభిప్రాయపడ్డాడు. భాషలో కొన్ని శబ్దాలు, అవి మారిన తీరు వాటి అర్థాలు. వాటి నిర్వచనాలు మన సాంఘిక దృక్పథాన్ని సూచిస్తాయి, ఉదాహరణకు "అమ్మా", "సాని" భారతకాలములో స్త్రీకి పర్యాయ వాచకములో ప్రయోగించినారు. నేడు వాటి అర్థములు మారిపోయినవి. ఆ యర్థములతోపాటు, అవి తెలియజేసే వ్యక్తుల యెడ మన దృష్టి కూడ మారినది. 19 వ శతాబ్ది చివరి భాగములో "అబద్ధము" అను మాట తప్పు అను అర్థములో ప్రయోగించినట్లు తార్కాణ లున్నవి. ఈనాడు 'అనృతము' నకు మారు మాటగా ఈ 'యబద్ధము' వాడుచున్నాము. దీనినిబట్టి 'తప్పు' యెడల మనకు కలిగిన మానసిక దృష్టి వ్యక్తమగుచున్నది. ఇలాగ ఎన్నో ఉదాహరణములు చూపవచ్చును. నన్నయ భారతములో వాడిన పదములు కూర్చి ఆంధ్ర సాహిత్య అకాడెమీవారు ఒక పదకోశము ప్రకటించినారు. అట్లే నన్నయకు ఇంచుమించు సమకాలికుడయిన నన్నెచోడుని పదకోశము ప్రకటించినారు. ఈ పదకోశములను గమనించినయెడల నాటికి నేటికి కలిగిన భాషా పరిణామము, తన్మూలముగా సంభవించిన సాంఘిక పరివర్తనము సులభము గ్రహింపవచ్చును. అలాగే—ఆయా వృత్తులలో వాడిన పదములు విభిన్న ప్రాంతములలో వేరువేరు తెరగుల వ్యవహారంలో నున్న భాషాసరళి చూస్తే అక్కడ ఆచార పద్ధతులు సంఘజీవనం తెలుసుకోవడానికి వీలున్నది. ఈరకం వృత్తి పదకోశం వ్యవసాయ వృత్తికి సంబంధించినంతవరకు డాక్టరు భద్రిరాజు కృష్ణమూర్తిగారొక ఉద్గ్రంథంగా ప్రకటించినారు. దీనినిబట్టి భాషకు సాంఘిక వ్యవస్థకు గల పరస్పర సంబంధం ప్రత్యక్షంగా చూడవచ్చును. అంతేకాక భాషలోని సాహిత్యమే కాక వాడుకలో పొందిన రూపాంతరాల వలన మనుష్యుల జీవితం పొందిన పరిణామ స్వరూపములు కూడ సులభంగా గ్రహించవచ్చును. ఈ శాఖలో కూడ డాక్టరు భద్రిరాజు కృష్ణమూర్తిగారొక పరిశోధనచేసి, కొండకాపుల భాషకు తెనుగుభాషకు గల సంబంధము నిర్ధారించినారు. విశాఖ జిల్లాలో కొన్ని కొండపల్లెలలో కొండకాపులు మాటలాడే మాటలనుబట్టి, వారి ఆచార వ్యవహారముల బట్టి, తెనుగు సాంఘిక జీవితంపైన ప్రభావము తెలుసుకోవచ్చు. ఇలాంటి భాషా పరిశోధనలవలన మన సంస్కృతి, సభ్యతతోపాటు సాంఘిక వ్యవస్థ రూపొందిన పద్ధతులు సువ్యక్తమవుతూ ఉన్నవి.

భాషవలన సాంఘిక వ్యవస్థపైన ముద్ర పడినట్లే సాంఘిక పరిణామం వలన మారిన విలువలు, భాషమీద సాహిత్యం మీద తెచ్చిన మార్పులు మనము సులభంగా పోల్చుకోవచ్చును. ఉదాహరణకు వ్యవస్థ, సంస్థ, అవస్థ వీటి అర్థాలు నేడు మనం వ్యవహరించే సందర్భాలు వేరు—వాటి అర్థాలు వేరు—ఏదైనా గొప్ప సాంఘిక విప్లవం తెచ్చిన పరిస్థితు లేర్పడితే దానితో జాతిజాతి అంతా కుదిపివేసినట్లయిపోయి, గొప్ప పరివర్తన కనిపిస్తుంది అంటారు. ప్రపంచ చరిత్రలో అట్టి పరివర్తనం తెచ్చిన ఫ్రెంచి విప్లవమూ, కడచిన రెండు మహాయుద్ధములూ సమాజాన్నే పూర్తిగా అతలాకుతలం చేశాయి. మన దేశంలో కూడ ఇట్టి విప్లవ భావాలకు దారితీసిన మార్క్స్—లెనిన్ సిద్ధాంతాలతో కూడిన సమతావాదము, కమ్యూనిస్టు భావాలు మన సాహిత్యంలో కూడా ప్రవేశించి ఆకలికేకలు, సామ్యవాద నినాదాలూ చేయించినా కాని చెరగని ముద్రలు వేయలేకపోయాయి. విశ్వశాంతి, విశ్వమానవ సమానత, ప్రజా విప్లవము అను నినాదాలతో వ్యాపించిన యీ కమ్యూనిజమే శాంతియుత సహజీవనం పేరున, సర్వజన సౌభ్రాతృత్వం పేరునా పావురాలు ఎగురవేసి పంచశీల సూత్రాలు పఠించి చివరకు సరిహద్దులో చాపక్రింద నీరుగా చల్లగా ప్రవేశించి దక్కిన ప్రదేశం ఆక్రమించిన చైనా రాహువయింది. ఈ దెబ్బతో—భారతదేశంమీద వెన్ను జరిచినట్లయి మేల్కొన్నది. కన్నులకు కమ్మిన ఎర్ర చీకటులు విడిపోయాయి. ఉన్న విషయం తేటతెల్లంగా తెలుస్తోంది. దేశదేశమంతా మేల్కొన్నది. ఒక్క కంఠంగా పలుకుతోంది. ఒక్క త్రాటిమీద నిలిచి

# 1962 సాహిత్య సమీక్ష

ఈ ఆక్రమణదారులను ఎదుర్కొంటోంది. ఒక్క సంఘటనతో మన విలువలు, మన ధర్మాలు ఎంతో మారిపోయాయి. మన తెలివితేటలపైన, మన సృజనశక్తిపైన మన సంస్కృతిపైన జరిగిన యీ ఆకస్మిక దండయాత్రకు ఎలాగ తట్టుకొంటాము ? ఈ సవాలును సాహిత్యలోకం ఏవిధంగా ఎదుర్కొన్నది ?

ఎవరో కొందరు పద్యాలు వ్రాశారు. తెల్లవారి లేస్తే కట్టలకొద్దీ, కాగితాలకొద్దీ కవితలూ, కావ్యాలూ, గాయాలూ, గేయాలు పత్రికా కార్యాలయాలకు, రేడియో కేంద్రాలకు అందుతూ ఉంటాయి. అవి పరిశీలిస్తే—కవితా గౌరవం కాదు, మనిషిలోను, జాతిలోను కలిగిన భావావేశమైనా ఒక లేశంకనుపిస్తుందేమో అంటే కనుపించదు. మన కవులు—నేటి కాలంలో వాస్తవికపరిస్థితులకు అతీతులైన, ఆదమరచి ఆదికాలంనాటి భారత రామాయణాదులలోనో, లేక యేళ్ళు ముదిరిపోయిన ముసలి ఊర్వశుల ముది ప్రణయం ఆరాధించే భావ కవితలతోనో, అభ్యుదయాన్ని అధికరించిన ఆకలికేకల కాకలీ నినాదాలతోనో కాలం పుచ్చుతున్నారు. తమ రు పరాకు చిత్తగిస్తున్నారని ఎవరైనా జ్ఞాపకం చేస్తే ఉలిక్కిపడతారు. ఏదో పలుకుతారు. అది పాటగానో మాటగానో అక్షరరూపం ధరిస్తుంది. ఈ సృజన పరిశ్రమకు పూర్వము కంటె హెచ్చు ప్రచారము, హెచ్చు ఆర్థిక మూల్యం లభిస్తున్న మాట నిజమే. కాని చిత్తశుద్ధి లేని యీ బొత్తులకట్టకు చిత్తు కాగితాల బుట్టలో తప్ప వేరే సముచిత స్థానం లభింపదు. ఉదాహరణగా అస్మిన్ వర్తమానకాలే జంబూ ద్వీపే భరతవర్షే భరతఖండే మేరోర్దక్షిణ భూభాగే హిమాలయ పర్వత ప్రాంతే .... చైనా—భారత యుద్ధ సమయే—మహాసంకల్పం కరిష్యామి—అని ప్రతి భారతీయుడు అంటున్నాడు కాని నేను సహితం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను అని చెప్పలేకపోతున్నాడు. "సంప్రతతే నమమ—" అని చేతులు కడుగుకొని బయటికి రావాలనే ఉద్దేశం. అందుకే మన కవులు యథాశక్తి పాటలు కడ్తునా రు. పద్యాలు చెప్తున్నారు. అవి ప్రసారించిన రేడియో కేంద్రాలు, అవి ప్రకటించిన పత్రికలు ఒక తృణం పారితోషికంగా ఇస్తే జేబులో వేసుకొంటున్నారు. ఆనాడు సత్యాగ్రహ సమరశంఖారావం వూదినప్పుడు పల్లె పల్లెల్లో మారుమ్రోగిన దేశభక్తి గీతాలలోని ఆవేశంకాని ఆవేదన కాని నేడు స్వతంత్ర భారతంపైన ముంచుకొని వచ్చిన చైనావారిని ఎదుర్కోవడంలో కనిపించదు. మన కవులకు కళావేత్తలకు దేశభక్తి తక్కువని అనలేము. దేశాభిమానం కొరవడదని చెప్పలేము. యుద్ధం వంటిది ఉత్తమ సాహిత్య రచనకు దోహద మీయదని అనుకోవాలి. ఈ సందర్భంలో పాటలు పద్యాలే కాక, కథలు, గాథలు ఇలాంటి రచనలు కొల్లకొల్లలుగా వచ్చి ప్రచార సాహిత్యం అమితంగా ఉత్పత్తి చేసింది. అవసర పరిస్థితికి అన్ని రంగాలలోను ఉత్పత్తి పెంచి వట్లే, సాహిత్యరంగంలో కూడా ఉత్పత్తి పెరిగింది. కథలు కాకరకాయలతోపాటు, కొందరు సమయజ్ఞులు నవలలు కూడ రచించి యథాశక్తి యుద్ధ కృషికి తోడ్పడుతున్నారు. టన్నుల కొద్దీ యీ సారస్వతం వస్తున్నదే కాని ప్రచారసాధనలుగానైనా వీటి నాణ్యం ఎవ్వరూ గుర్తించినట్లు లేదు. ఉదాహరణకు—ఒక సాహిత్య యుగ పురుషుడు వ్రాసిన పాట చూడండి.

"కడుపులుకాలే కష్ట చినీయుల
మనదే దేశము మళ్ళీ కొనుడని
కల్ల కథలలో కైపెక్కించీ
సాగనంపెనోయ్ చౌ ఎన్ లాయ్."

ఇలాంటి చరణాలు చాలా ఉంటాయి. ఇవికాక మరొక చరణంలో దేశమంటే దిబ్బకాదోయ్ అని చెప్పి, మనుషులంటే ఎవరో జ్ఞాపకం చేశారు.

మనుషులంటే మట్టిబొమ్మలు
కారు కారోయ్—కర్మకాండల
కదన భూముల కాకలారిన
భారతుల మగబిడ్డలోయ్—

ఈ వేగంలోను, ఆ వేగంలోను మాటలూ, మాటల అర్థాలు మారిపోయాయ్. భారతీయులు భారతులై పోయారు. కర్మకాండల కదన భూములు వచ్చాయి— (అంటే యుద్ధ భూములు స్మశానవాటికలుగా కర్మకాండలకు నిలవైనవని ఉద్దేశమే).

ఈనాటి అవసర పరిస్థితికి పోస్టాఫీసులలో రవాణా అవుతూన్న చైనా భారత సంవాద సాహిత్య మీరీతిగా రూపం కట్టుతోంది.

అంటే మన కవులు, వేత్తలు నేల విడిచి సాము చేస్తున్నారన్నమాట. ఈ యుద్ధం విషయంలోనే కాదు: తాము కల్పన చేయదలచిన కావ్య వస్తువులలో కూడ పురాతన పురాణములనే తమ మాటలతో ఎవ్వరికీ అర్థంకానట్లు "ఎడతెగని ప్రమాణాలతో యింకొకసారి" చెప్పేవారున్నారు. ఎందరెందరో అనువాదంచేసిన ఆ శాకుంతలమునే ఆ భగవద్గీతనే ఆ భాగవతముగా సరిక్రొత్త ప్రాత కథగా కావ్యగానం చేసేవా రున్నారు. పోనీ ప్రణయ కవిత్వంలో పసందు ఉన్నదనుకొంటే, భావ కవితాయుగంలో పాడిన వైతాళికులందరు ముగ్ధరాధికలను, మోహిత గోపికలను వశం చేసికొని స్నిగ్ధ విరహగీతాలలోని మధురిమలను, మైమరపులను పుష్కలంగా అనుభవించి "ఊహాగానములు" చేశారు. ఊర్వశీ ప్రవాసము లనుభవించారు—తొలకరి జల్లులు జల్లారు. తృణకంకణాలు ధరించారు. ప్రణయయాత్రలు చేసిన సౌభద్రులయ్యారు. ప్రేమగీతా లాలపించిన గిరి కుమారు లయ్యారు. అవతలితరం వారికి అనురాగ కవిత్వంలో ఏమీ మిగల్చలేదు. మరో ప్రపంచం పిలిచిందని మహాప్రస్థానంలో దారితీసిన అభ్యుదయ కవి మ్రోగించిన విప్లవశంఖం తర్వాత ఎన్ని కేకలు సినా ఎవ్వరూ వినిపించుకోవడం లేదు. దానితో కవులకి కావ్య వస్తువులు కరవైపోయాయి. పోతన గురించి ఒకరు వ్రాస్తే మళ్ళా అదే కథ యింకొకరు. ఉమర్‌ఖయ్యామ్ ఎందరో అనువాదం చేస్తే—ఇంకొక అనువాదం మరొక నూతన కవి

చేశాడు. దానిలో క్రొత్తదనం ఉండి కాదు. ఆ మిషతో—మార్కెట్టులో క్రొత్త వస్తువును చెలామణి చేయించవచ్చును. రవీంద్ర శత వార్షిక జయంతి పుణ్యమా యని రవీంద్రుని రచనలు అసంఖ్యాకంగా అనువాదం పొందాయి. ''గీతాంజలి''కి పాతిక అనువాదాల వరకు వచ్చినా కాని ఒక్కటి కూడా మూలానికి న్యాయం చేసేటట్టుగా లేదు. రవీంద్ర శత వార్షిక జయంతి సంవత్సరం పొటున జరిగినా కాని ఇంకా ఆ చెట్టు పేరు చెప్పి కాయల అమ్మకం జరుగుతోంది. రవీంద్ర గ్రంథావళీ—ప్రత్యేక ప్రచురణల సంస్థలవారు ప్రకటించినవే కాక, సాహిత్య అకాడెమీ యాజమాన్యం క్రింద అనువాదాలు చేయించి, ఏడెనిమిది సంపుటాలుగా ప్రకటించారు. ఇవికూడా చాలా అసంతృప్తికరంగా ఉన్నవి. వంగభాషలో కాని ఆంగ్లభాషలో కాని మౌలిక రచనలు చదువలేనివారికి యీ గ్రంథావళి యేమాత్రము తృప్తి కుదర్చలేదు. ఒక ఫ్రెంచి రచయిత అన్నట్టు—''చచ్చిన సింహం కంటే బ్రతికిన గ్రామ సింహం మంచిదన్న రీతిలో ప్రకటన పొందని మంచి అనువాదం కంటె ఏదోవిధంగా ప్రకటించిన చెడ్డ అనువాదం మేలు'' అనే దృష్టితో కేంద్ర సాహిత్య అకాడమీ వారు గొప్పగొప్ప గ్రంథాలు అనువాదం చేయించిన ట్లున్నది. రవీంద్ర గ్రంథావళినే కాక ప్రపంచములో ఉద్గ్రంథము లనదగినవి కొన్ని అనువాదం చేయించి ప్రచురించారు. వీనిలో షేక్స్పియర్ మహాకవి నాటకాలు, గేతే, మహాకవి నాటకం ఫౌస్టు, మోలియెర్, ఇబ్సన్ ఇట్టి రచయితల ప్రఖ్యాత నాటకాలు అనువాదాలు చదువుతూ ఉంటే చచ్చిన సింహాలను మించిన బ్రతికిన గ్రామ సింహాలు జ్ఞాపకం వస్తాయి. గ్రుడ్డిలో మెల్ల—ఈ రచనలలో కొన్ని మంచివి లేకపోలేదు. మచ్చుకి షేక్స్పియర్ నాటకాలలో ''మేక్‌బెత్'' రచన (అమరేంద్ర చేసినది) ప్లేటో ఆదర్శవాదం పొందిన అనువాదం (డాక్టర్ జి. వి. కృష్ణారావుగారిది) మౌలిక రచనలవలె సహృదయరంజకంగా తెనుగువారి మనస్సులను అలరింపజేసేవిగా ఉన్నవి.

రవీంద్రుని శతవార్షిక జయంతి చూచి—స్థానికంగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ యాజమాన్యం క్రింద—గురజాడ శతజయంతి ఒక సంవత్సరంపాటు జరిపిస్తున్నారు. బంతిలో బొలపాప అన్నట్లు పనిలో పని చిన్నయ్యసూరి పేరున శత వార్షిక వర్ధంతి, కందుకూరి వీరేశలింగం పంతులుగారి పేరున వట్టి వార్షిక జయంతి ఇవన్నీ కూడ ప్రదేశ్ అకాడమీవారు పెద్ద ఎత్తున చేయించారు. ఇవన్నీ చేసిన పద్ధతి అమ్మవారి జాతరలు జరిగినట్లు జరిపించారు. లాంఛనంగా ఉపన్యాసాలు, ఊరేగింపులూ జరిగినప్పటికీ, ఒక ప్రత్యేక సంచిక మాత్రం ప్రకటించారు. ఆ సంచికలో వ్యాసాలు, ప్రశంసలు, వ్యాఖ్యానాలు చూస్తే పౌనః పున్యముగా చల్లించే ప్రాత పాఠాలు గోచరిస్తాయి. మ్రొక్కుబడి చెల్లిపోయినది. కాని శాశ్వతంగా ఉండేటట్లు—కనీసం ఒక తపాలా బిళ్ల అయినా గురజాడ పేరున ప్రకటించలేకపోయారు. ఆ సమయానికి కేంద్ర ప్రభుత్వం సమ్మతించినా కూడా సరి అయిన ఫోటోగ్రాఫ్ లభింపక అది నిలిచిపోయిందంటే అంతకంటే శోచనీయమైన అంశం ఉండదు.

ఈ జాతరల పుణ్యమా అంటూ చిన్నయ్యసూరి, గురజాడ, కందుకూరి వీరిలో ఎవరు యుగకర్త అని చొప్పదంటు ప్రశ్నలు వేసినవా రున్నారు. కొందరు బ్రహ్మణ్యులు ఒకరిని ప్రస్తుతించే ఆవేశంలో మరొకరిని దూషించి భాషాద్రోహులని, అభివృద్ధి నిరోధకులని అరచివేసినవా రున్నారు. ఈ వాద వివాదాలతో సాహిత్యవేత్తలకు భాషా నిర్మాతలకు రాజకీయపు రంగులు పూసి తమ రంగు ఫిరాయింపులు వ్యక్తం చేసికొన్నారే తప్ప యిట్టి యల్పబుద్ధుల అవివేకపు వ్రాతలకు ఈ ముగ్గురూ అతీతులే. పరవస్తు, గురజాడ, కందుకూరి గారలు ఎవరికి చెందిన సాహిత్యభాషా క్షేత్రములలో వారు గొప్ప కృషి చేశారు. ఒకరికి ఒకరు పోటీ పడలేదు. పోటీ పడటానికి తగిన సమకాలీనత కాని సమాన వాతావరణముకాని యీ ముగ్గురినీ ఒక్కచోట చేర్చలేదు. ఇలాంటి సాహిత్య సమారాధనలు ప్రభుత్వ యాజమాన్యంల ని పరిషత్తులు, అకాడమీలు జరిపితే జమాబందీ సమావేశాల స్థాయికి మించిన సత్ఫలితాల సాధించలేమని రుజువుచేసుకొన్నారు. వారి శతజయంతులు వర్ధంతులు, వార్షిక సమావేశాలు పేరుతోనైనా అట్టి భాషా సంస్కర్తలు, సాహిత్యవేత్తలు తెనుగుభాషకు సారస్వతానికి చేసిన మహనీయ సేవ ఈ తరంవారు ఈ రూపంగానైనా జ్ఞాపకం చేసికోవడానికి వీలయింది. మరొక శతజయంతి, మరొక స్మారక సంచిక, మరొక జాతర—ఇలాగ సాగిపోతోంది.

ఇవన్నీ చూస్తూ ఉంటే ఏదో లోపం కనిపిస్తుంది. కవిత్వములో, కావ్య కల్పనలో పొడగట్టే చిత్తశుద్ధి లోపమే మన సాహిత్యవేత్తల కార్యక్షేత్రంలో కూడా కనిపిస్తుంది. లేకపోతే ఇట్టి సాహిత్యగోష్ఠి అధ్యక్షత వహించుటకు అంగీకరించిన ఒక మహాకవి, తన విధ్యుక్త పదవి ప్రకారం ఉచితంగానే అట్టి ధర్మాన్ని నిర్వర్తించవలసి యున్నప్పటికీ, దానికి ప్రత్యేకంగా పారితోషికము స్వీకరించిన తర్వాతనే ఆ గోష్ఠి సభకు అధ్యక్ష పీఠం అలంకరించారట. ఇది ఇట్లుండగా మన ఇరుగు పొరుగు భాషలవారు ఇలాంటి శతవార్షిక జయంతుల వంటివి జరుపుకొన్నారు. ఆ కవుల గూర్చి గ్రంథములు ప్రకటించారు. వారి గ్రంథావళి ముద్రించి అందరికీ అందుబాటులోకి తెచ్చారు. గురుదేవుడు రవీంద్రుని సంపూర్ణ గ్రంథావళి పశ్చిమ వంగ ప్రభుత్వంవారు ప్రకటించి వంగభాషలోని మూల గ్రంథావళిని రు. 75 లకే అందిస్తున్నారు. వీరేశలింగంగారి గ్రంథావళిని, గురజాడవారి రచనములను అదేవిధంగా తేవచ్చు. మనవారు అలాంటి మంచి పనులు చేయరు. ఇలాగే—తమిళంలో సుబ్రహ్మణ్య భారతి మహాకవిగా గణించి ఆయన గ్రంథావళిని మదరాసు ప్రభుత్వం ప్రచురించింది. మొన్న డిశంబర్ 12 వ తేదీని ఆయన జయంతి జరిపి, ఆనాడు—తమిళ సాహిత్య గోష్ఠితో సంతృప్తి నందక దక్షిణాది భాషల ప్రతినిధులను రప్పించి వారిచేత సాహిత్య ప్రసంగాలు చేయించడమే కాక దక్షిణ మండలములోని ముఖ్య మంత్రుల నందరినీ

రప్పించి సుబ్రహ్మణ్య భారతికి వారిచేత జేజేలు చెప్పించారు. మంచి వైభవంతో మంచి భక్తి తాత్పర్యాలతో ఆ ఉత్సవం జరిగింది. తమిళులే కాక—తోడి భాషలవారు హర్షించారు. మనము జరుపుతున సాహిత్య గోష్ఠులలో చప్పట్లు, జయ జయ ధ్వానములతోపాటు అపశ్రుతులు అపస్వరాలు వినిపిస్తాయి. మన వక్తలు—సాధారణంగా తోటి ఆంధ్రుని గొప్పతనం ఆతడు కీర్తిశేషు డయినా సరే ఒక పట్టున ఒప్పుకోలేరు. తన అంతటి మహా మేధావి బ్రతికిఉండగా మరొకడు యుగపురుషుడుగా గుర్తించలేడు. అందుకని ఆ యుగపురుషుడు చిన్నయసూరి కానీ, గురజాడ కానీ, కందుకూరి కానీ ఆ కీర్తిశేషుని స్మారకసభలో ప్రసంగిస్తూ ఆతడు సాధించిన గొప్పతనం ఏముందని పెదవి విరుస్తాడు. మహాకవే కానక్కఱలేదు. మామూలు పదహారణాల ఆంధ్రుని చిత్తవృత్తే అది.

జాతరలు, సాహిత్య సదస్సు లటుంచి కావ్య ఆవిష్కరణలు అంకితాలు, సన్మానాలు సత్కారాలు సమయానుకూలంగా ఖద్దరు నూలుదండలు మొదలు కాశ్మీరు శాలువలు వరకు, కప్పు కాఫీ మొదలు కనకాభిషేకాల వరకు, సాలి గ్రామదానం మొదలు సహస్రార్చన వరకు ఏదో రూపంగా జరుగుతుంది. మరునాడు పత్రికలలో విపులంగా వార్తలు, సచిత్ర ఛాయాపట విక్షేపాలు అంతా సవ్యంగా ప్రచురణ పొందిన తరువాత తీరా ఆ గ్రంథరాజం చూస్తే అది తిలకాష్ఠ మహిషబంధం లాగున ఉంటుంది. దానిని ఆవిష్కరించిన అమాత్యశేఖరులు కాని, అభినవ సినీ నాట్యాచార్యులు కాని ఆ గ్రంథమును చదువరు. చదివినా అందలి విశేషములు ప్రస్తావించరు. గుణదోష విచారమే ఉండదు. ఆ గ్రంథ పఠనాభిలాషులయినవా రెవరయినా దానిని చూచుట తటస్థిస్తే అన్నివిధాల ఆశాభంగం పొందుతారు. ఆధునిక యుగంలో పుస్తకం పరిచయం చేస్తున్న సాధనలు పత్రికలలో గ్రంథ సమీక్షలు. కొన్ని సమీక్షలు చదివితే, గ్రంథము పేరైనా చూడకుండా విమర్శకులు తమ సమీక్షలు ప్రకటిస్తారు. కొందరు తప్పులు ఒప్పులుగానూ ఒప్పులు తప్పులుగానూ వెల్లడి చేస్తారు. ఇటీవల జరిగిన ఒక చిన్న సన్నివేశ మిది. ఆ పుస్తకము—తమిళంలోని "శిలప్పదికారము" నకు మరుపూరు కోదండరామిరెడ్డిగారు చేసిన పద్యానువాదము. పేరు మంజీరగాథ. ఆ కావ్యములో నాయకి కన్నగి—అగ్నిప్రవేశము చేసి "నీఱు" యి పోయినదని కవి చెప్పెను. అగ్నిలో నీరయిపోవడ మేమిటి యని సమీక్షకుని ఆక్షేపణ. శకటరేఫముతో పలుకు "నీఱు" అర్థము ఆతనికి తెలియదు. మరొక విమర్శకుడు ఒక పుస్తకాన్ని సమీక్ష చేస్తూ ఇందలి పద్యములు ఛందస్సు చక్కగా ఉన్నవని ప్రశంస చేశాడు. ఆ పుస్తకము వచన గీతికల సంపుటము. ఎక్కడ చూచినా చిత్తశుద్ధి లోపిస్తున్నది. కమ్మని కావ్యమే ఈనాడు కరువైపోయినది. కథావస్తువు ఏదైతేనేం, కవి చెప్పదగిన అంశమేదైనాఉంటే అందులో విశేషం ఉంటుంది. అది లేకపోతే ఏమీలేదు. కథావస్తువు విషయంలోనేకాదు, కథన విధానం గురించికూడా ఈ మాటచెప్పవచ్చు. ప్రబంధశైలిలో పలికినా, పద్యములలో చెప్పినా, వచనములో తెలిపినా ప్రవచనములుగా నిలిపినా పలుకుబడిలోకాక పలుకువిషయములో క్రొత్తవిశేషముండాలి. అలాంటిది ఉంటేనే మంచికావ్యం వెలువడుతుంది. అది లేనపుడు పద్యప్రబంధములలో బంధకవిత్వం చెప్పినా ఒకటే, వచనగీతికలు చెప్పినా ఒకటే. అభ్యుదయ కవిత్వం, ఈ వచనగీతికలుగా వెలువడటం అందరికీ పరిచితమే. అలాంటి వచనపద్యాలు శ్రీశ్రీ, పట్టాభి, ఆరుద్ర ప్రభృతులు పుష్కలంగా తయారుచేశారు. వాటిలో ప్రణయ కవిత్వంకాని వేదాంతతత్త్వంకాని చూడటానికి వచనగీతికలు తావులుకావు. కానివానిలో ప్రణయినీ సంకేతాలు, ప్రకృతి వర్ణనలు ద్వైతాద్వైత సిద్ధాంతాల వేదాంతం చదువవచ్చునని కొందరు క్రొత్త కావ్యాలు రచించారు. అట్టివారిలో కేశవరావుగారి 'ఉదయించని ఉదయాలు', బోయి భీమన్నగారి 'అనాది కొననుంచి అనంతత్వంలోకి', ఈరకం రచనలకు దృష్టాంతాలు. పిల్లిశతకం చెప్పిన భీమన్నకవి—వచనగీతికలతోపాటు 'త్రిపద'లను పేరువ త్రిపాద గీతికలుకూడ వ్రాశారు. విధానమేది అయినా వెల్లడించవలసిన విశేషాంశం ఉంటే అది ప్రజల మన్ననలందుకొంటుంది. వచనగీతికలు రచయిత పలుకుబడికి గీటురాళ్లవంటివి. తెనుగు వచనరచనలో శక్తి జీవము పుష్టి యీ వాక్యాలలో పలికేటట్టు చేయడానికి రచయితకు భాషలో పలుకుబడి ఉండాలి. సమర్థులయిన రచయితలు చెప్పినట్లు పలుకుతుంది భాష. వినండి—"చలం"మాటలు :

గడచిన అనంతంలో<br>
మనంలేము<br>
గడవబోయే అనంతంలో<br>
వుండబోము<br>
ఈ అగాధ ఆద్యంతర హితసూన్యంలో<br>
ఒక్కక్షణం ఈ నేననే వెలుగు.

ఆయన రచించిన వచన గీతికలసంపుటి "సుధ" అంతా యిలాంటి వాక్సుధాలహరి నింపుతూనే ఉంటుంది. అందుకే అన్నారు సాహిత్యవిదులు "వాక్యమ్ రసాత్మకమ్ కావ్యమ్" అని. ఇలాంటి వాక్యరచనకే మరొక ఉదాహరణ— ముద్దుకృష్ణగారి యుక్తులు — ఛలోక్తులు; వారిచ్చిన నిర్వచనాలుకొన్ని :—

సరసం : రసగ్రహణ పారీణుల రహస్యం.<br>
శాంతి : యుద్ధానికీ యుద్ధానికీ మధ్య విశ్రాంతి.<br>
మతం : ఇద్దరికి సమ్మతంకానిది.<br>
ధనం : ఏ ఘనతా లేనివాడిని ఘనుడు అనిపించేది.

వచనంలో, ఎలాంటి పటుత్వంఉన్నదో యీ పై వాక్యములు నిరూపిస్తూ ఉన్నవి. కాని వచనంలోనే సాహిత్యమంతా విశేషంగా వస్తున్నది. మొలియర్ నాటకంలో ఒకపాత్ర గుర్తించినట్లు హఠాత్తుగా ఆతడు మాటలాడినదంతా వట్టి వచనమని తెలుస్తుంది. అలాగే నేడు మనం మాటలాడుతున్నది, వ్రాస్తున్నది వచనము— వట్టి చప్పని మాటలధోరణి. దీనిలోనే కథదు, గాథలు, నవలలు, నాటకాలు చెప్పుకొనిపోతున్నాము. అవి పత్రికల మూలకంగాను, ప్రచురణల ద్వారముగాను బహు ప్రచారం

పొందుతున్నవి. అందుచేత ఈ రచనములలో ఏవి సాహిత్యముగా సంభవించవచ్చునో, ఏవి సమకాలిక పత్రికా సంభవాలుగా పరిగణించవచ్చునో హద్దులేర్పరచలేము. నేడు ప్రజాస్వామికయుగం ప్రతివ్యక్తికీభావప్రకటనా స్వాతంత్ర్యమున్నది. నేటి జీవితసంఘటనలు చూచి తానుచెప్పదగిన సత్యాలను చెప్పవచ్చును. అవి నాటకాలుగా ప్రదర్శించినపుడు, తానుసృష్టించిన పాత్రలచేతచెప్పించవచ్చును. అయితే తాను చెప్పవలసిన విషయాన్ని న్యాయవాదిలాగ వాదిస్తూఉన్నట్లు చెప్పకూడదు. ఈ కాలంలో వస్తూవున్న నాటకాలలో ఈ పద్ధతినే రచన సాగుతున్నది. ఈ నాటకాలలో పాత్రలు మనకుబాగా పరిచితమైన వ్యక్తులే. రంగస్థలంమీద కనిపిస్తే మనకుతెలిసిన మునిసిపల్ ఛైర్మన్‌గా, మనయిరుగుపొరుగుఉన్న లంచగొండి ఆఫీసరుగాగుర్తుపట్టగలము. వాళ్ళు మాటలాడుతూఉంటే ఆ మాటలు మనకు నవ్వుతెప్పిస్తాయి. అంతటితో ఆగకూడదు. ఆ మాటలు మనల్ని ఉద్విగ్నుల్ని చేసి విషాదంతెచ్చి మనచేత కన్నీరు కార్పించాలి. అలాంటి నాటకాలు చాలా అరుదు. ఈ సంవత్సరం వెలువడిన నాటకాలలో హితశ్రీ రచించిన 'విచిత్రజీవులు', రాచకొండ విశ్వనాథశాస్త్రి 'నిజం', భమిడి రాధాకృష్ణ దైవశాసనంనెల్లూరు కేశవస్వామిగారి ఈకోవలోకి వస్తాయి. నిష్ఠురమైన నిజాన్ని కన్నుల ముందుపెట్టి మనల్ని గిలిగింతలుపెట్టి నవ్వించడమేకాక, కఠోర సత్యాలతో కనువిప్పు కలిగిస్తాయి. ఇవిగాక, ఏ కొంత నాటికలలో కొన్ని ఉత్తమ నాటికలు వెలువడుతున్నాయి. సోమంచి యజ్ఞన్నశాస్త్రి రచించిన నాటిక "హద్దుమీటి నడచువారు శిక్షింపబడుదురు", రావి కొండలరావు "కథ కంచికి", గొల్లపూడి మారుతిరావు "నిజం నిద్రపోయింది" పేర్కొనదగిన నాటికలు. "నిజం నిద్రపోయింది" నాటకం వింటూఉంటే కొడవటికంటి కుటుంబారావుగారి "యదార్థవాది" స్ఫురణలోకి వస్తుంది. నాటికలలో ఆంధ్ర నాటక కళాపరిషత్తుచేత బహూకృతి పొందినది— వేలూరి శివరామశాస్త్రిగారి "సుల్తానా". ఒక యాసగల తురకపిల్ల విషాదగాథ చిత్రించిన యీ "నాటిక" పరిషత్ చరిత్రలోనే ఒక నూతన నాధ్యాయం ప్రారంభంచేసింది. మంచినాటకములు వస్తే పరిషత్ బహూకరించగలదనే సత్యాన్ని బుజువుచేసింది.

రవీంద్ర శతవర్ష జయంతితో రవీంద్రభారతి రాజధాని నగరంలో అవతరించింది. ఈ రంగస్థలం— రవీంద్రుని నాటకానువాదాలకేకాక మరెవ్వరు ఏ నాటకం ప్రదర్శించినా వాటి చరమాంకాలకు భరతవాక్యం పాడింది. ఈ రంగభూమిపై ప్రదర్శనపొంది రక్తి కట్టిన మంచినాటకం ఇకముందు రావాలి. అయినా ఇక్కడ, ఇతర రంగస్థలాలలోను పోటీలు జరుగుతున్నవి; బహుమతులిస్తున్నారు. అలాగ బహుమానాలిచ్చి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ సత్కరించిన మూడు నాటకములు మూడు ఏడువందల యాభైలు పంచుకొని పుస్తకరూపంలో వెలువడ్డాయి. ఉత్తమనాటకములకని పంచిపెట్టిన యీ బహుమతి గృహీతలయిన నాటకకర్తల రచనలుచూస్తే, వీనిలో ఏవిధంగా నాటకాలు వ్రాయకూడదో నిరూపించడానికి ఈసారి తోషికాలిచ్చినట్లున్నది. దానికి అకాడెమీ వారిని అడిగి ప్రయోజనంలేదు. ఉన్నవానిలో ఉత్తమమైనవి యెన్నికచేసి యీ బహుమతులిచ్చారు. ఆమెచ్యూరు సంఘాలు అనంతంగా అవతరిస్తున్నాకాని వృత్తిచేత నటకులయినవారు మంచి నాటకాలు ప్రదర్శించ లేకపోతున్నారు. ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడెమీ ఇది గుర్తించి— కూచిపూడి వారిచేత పూర్వకాలపు యక్షగానరీతిని క్రొత్తరూపకాలు ప్రదర్శింపజేశారు. ఈ సంవిధానములో సమకూర్చిన క్షీరసాగర మథనము— దేవులపల్లి కృష్ణశాస్త్రి విరచిత యక్షగానము— రాష్ట్రపతి రాధాకృష్ణన్ వంటి పెద్దల ప్రశంసల నందుకొన్నది. రానురాను కాలగర్భములో కలిసిపోతున్నాయీ ప్రాచీన నృత్యనాట్య సంప్రదాయము లీరీతిగానైనా ఉద్ధరించి, ఆ కళానైపుణ్యం లీలామాత్రముగానైనా ప్రదర్శించడం హర్షింపదగినది. ఈ పద్ధతిలోనే కృష్ణశాస్త్రిగారు రచించిన— "విప్రనారాయణ", "మాళవికాగ్నిమిత్రము" అను యక్షగానములు ఆధునిక రచన లయినా పూర్వ యక్షగాన ఫణితులకు మెరుగులు దిద్దేవిగా ఉన్నవి.

ఎప్పటికయినా, తెలుగునాటక సంప్రదాయాన్ని యక్షగానములుగాని, పద్యరూపకములుగాని 18వ శతాబ్ది 'గ్రాండ్ ఆపెరాలు'లాగున ప్రదర్శించి బహుజన సమాదరణ పొందవలసియున్నది. మనతెనుగుతనము, మనజాతీయత, మన పూర్వ సంస్కృతిని ప్రదర్శించే ఉత్తమనాటికలు వచ్చినపుడే, మనకళకు సంప్రదాయానికీ ఒకతీరు ఏర్పడుతుంది. లేకపోతే అవి రంగస్థల విజయాలుగాగాని, సాహిత్య ప్రక్రియలుగా గాని రాణించలేకపోతాయి. దృశ్యమానంగా కాకపోయినా శ్రవ్యమానంగా అయినా రాణించే నాటకాలు చదువుకొనేటప్పుడు, విన్న సమయంలో పొందినంత ఆనందం పొందలేకపోతున్నారు. దీనికి నిదర్శనంగా— విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన సాహిత్య చరిత్రకుచెందిన దశరూపకాలు రేడియోలో విన్నప్పుడు పొందినంత ఉత్సుకత 'భారతిలో' చక్షరక్షర సంయోగము చేసినపుడు సహృదయులు తాము పొందలేకపోయామని అంటున్నారు. ఇదే అభిప్రాయం— గోపీచంద్ రచించిన— "మాలపల్లి" నవల రేడియో అనుసరణ భారతిలో చదివిన పాఠకులు కూడ వెలిబుచ్చారు. అయినా, తెనుగుసాహిత్యమునకు ఈ రెండు రచనలు అలంకారప్రాయమైనవని రసికులు నిర్ణయించారు.

గద్యరచనలో అనేక ముఖములుగా విజృంభించుచున్నది కథానికా రంగము. నేటి పత్రికలలో కథలకున్న ఆకర్షణ మరి యే యితర సాహిత్య ప్రక్రియకునులేదు. అందుకే కథారచనలో పోటీలుకూడాపెట్టి— ఉత్తమ రచనలకు బహుమతులిస్తున్నారు. ఈ కథలలో హెచ్చుభాగము, ప్రేమాయణములతోను కామాయనములతోను ప్రొద్దుపుచ్చినవిగానే ఉన్నవి. మధ్యతరగతి కుటుంబాలలో చాలీచాలని సంసారాలు, ఆ సంసారాలలో సతీపతుల కలహాలు, కుతూహల రహస్యాలు ఇవేమన రచయితలు తీసికొంటున్న వస్తువులు. ఇది మించితే కాలేజీ వాతావరణం, కామించిన యువతీయువకులు, ఆశాభంగాలు, జీవిత వైఫల్యాలు, కావేశాలు ఇవే కనిపిస్తున్నవి. ఇవి స్త్రీలు రచించినవయితే వాటికి గిరాకీయెక్కువ. కథలలో— కొన్ని ప్రత్యేక దృక్కోణాలతో పరిశీలించి— కొందరి ప్రత్యేక వ్యక్తుల

# 1962 సాహిత్య సమీక్ష

జీవన విధానాలను పరిచయంచేసే వాక్చిత్రాలు లేకపోలేదు. అట్టివి రచించినవారిలో— రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారు కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ల అని మూడుకథలు చాలా చిత్రమైన కళ ప్రదర్శించారు. వాస్తవికమైన సంఘటనల నుండి, హాస్యముతోపాటు కరుణ మేళవించి, మేలిమి బంగారానికి పుటం వేసినట్లు మేలుకొల్పే పరివర్తనం సాధిస్తారు. ఇట్టి రచనలలో "సబ్బుబిళ్ల" ఒక నిదర్శనం. ఈ రచయితే, మన చుట్టూవున్న మద్యనిషేధ శాసనంవల్ల జరుగుతున్నకఠోర సత్య సంఘటనలతో— ఆరు సారాకథలువ్రాసి ఆ సారానేరాలను విచారణచేసి పిచ్చియెక్కిన న్యాయవాదికివలెనే చదివిన చదువరులకుకూడ పిచ్చి ఎక్కించారు. కథకులలో వింత జీవితగాథలన్నీ విచిత్ర దృక్పథాలతో చూచిన తెనుగువారు బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు, చెరుకుపల్లి జమదగ్నిశర్మ తమకథలు పుస్తక రూపాలలో తెచ్చారు. కథలపోటీలలో బహుమతులందుకున్న ఆకొండి నారాయణమూర్తి, దుత్తాదుర్గాప్రసాద్ "బాబు", "దానిమ్మ పండు" అనుకథల సంపుటులు ప్రకటించారు. స్త్రీలలో— పి. సరళాదేవి రచించిన కథలు పెద్దవిచిన్నవి కలిసి, 'కుంకుమ రేఖలు' అను సంపుటముగావస్తే, యద్దనపూడి సులోచనరాణి కథలు 'తొలిమజిలీ' పేరున వేరొక సంపుటంగా వచ్చాయి. ఇదికాక స్త్రీలకథలు ప్రత్యేక సంపుటికూడ ఒకటి వెలువడింది. 'శ్యామసుందరి', వి. యస్. రమాదేవి రచించినకథలు 'శిరీష కుసుమాలు'గాను మమతలు—'మమకారాలు'గాను వెలువడి పఠితలను ఆహ్లాదపరుస్తూనే ఉన్నవి.

స్త్రీల రచనలకు కథారూపములుకంటె సచిత్రవార పత్రికలలోని సీరియల్ నవలలుగా ఎక్కువ ఆకర్షణ పొందుతున్నాయి. అందుకేనేమో, ఆడవారి రచనలకే బహుమతులు లభించి— అది వారంవారం ప్రచురణ, పొందుతూ ఉంటే ఆ బాలగోపాలాన్ని ఆకర్షిస్తూ ఉన్నవి. ఆడపిల్లల రచనలనితప్ప, ఈ కథలలో వాస్తవికతకాని, వస్తువిశేషంకాని కనిపించదు. యీ రచయిత్రుల భాషాపరిజ్ఞానముగాని విషయ పరిజ్ఞానముగాని అంతంతమాత్రమే. ఒక రచయిత్రి — సితారుమీద కథానాయికచేత కర్ణాటక సంగీత ప్రదర్శన చేయిస్తుంది. మరొక రచయిత్రి అజంతాగుహలలో బుద్ధస్తూపాలను చూపిస్తుంది. ఇంకొకతె, "శాంతి నికేతనం"లో లేనిపోని భవనాల పేరులన్నీయిచ్చి, అచ్చట వాటితోపాటు 'శ్రీ నికేతనం' కూడ చేరుస్తుంది. అది గ్రామాభ్యుదయ ప్రణాళికలో, సమాజ వికాసంలో తలపెట్టిన ఆచరణయుక్తమైన గ్రామీణ విద్యావిధానం అన్న సంగతి ఆమెకు తెలియదు. ఇట్టి రచనలకు వారంవారం చదువుతున్న పాఠకులేకాక వారి ప్రశంసా లేఖలుకూడా ఈ పత్రికలలో దర్శనమిస్తూ ఉంటాయి. వీటిలో అన్నింటిలోను, వివాహ జీవితంలో — దంపతులు సుఖము ననుభవిస్తూ ఉన్నాకాని వారిని వేఱు త్రోవను త్రిప్పే ఆకర్షణ లేవో కనిపించి తప్పుత్రోవను తొక్కిస్తాయి. తప్పులు చేస్తారు. కొందరు తప్పులుచేసినందుకు కించపడరు. మఱి కొందఱు పశ్చాత్తాపపడతారు. పడి — ఏ యాశ్రమంలోనో, ఏ దేవాలయంలోనో తప్పులు ఒప్పుకొంటారు, సన్యాసినులయిపోతారు లేకపోతే బలవన్మరణం పొందుతారు. ఇలాంటి కథలు వ్రాయడములో ఇటీవల మొదలుపెట్టినవారు శ్రీ త్రిపురనేని గోపీచంద్. ఈయన వ్రాసిన మెఱుపుల మఱకలు— ఈనాటి అస్తవ్యస్త జీవితంలో దారితప్పిన సీతాకోకచిలుక జీవితాన్ని చిత్రించింది. ఆమెచేసినదానికి కించపడదు. పైగా సమర్థిస్తుంది. భర్తఉండగా పదిమంది ప్రేమలను పంచుకోవడం పరమార్థంగా భావించి— ఆవిధంగా ప్రవర్తించి చివరకు పశ్చాత్తాపంతో ఋషికేశంలో ఆశ్రమంలో యోగినిగా ప్రత్యక్షమవుతుంది. గోపీచంద్ —గొప్పరచయిత, వచనరచనలో ఆయన చేయితిరిగినవాడు; మంచికథలు వ్రాశారు, మంచి మనోవిజ్ఞానం వెల్లడిచేశారు. మనుష్యుల మనస్తత్వాలను సూక్ష్మదర్శినిలో చూచినట్లు చూశారు. కాని జీవిత వాస్తవిక ప్రపంచంలో చిందులాడే మర్త్యులను వేదాంత తత్త్వ విదులయిన ఆధ్యాత్మిక వాదులతో ముడిపెట్టారు. ఆయనలో మానవతావాదం, హేతువాదం రెండూ కరగిపోయాయి. అధి భౌతికవాదం ఒకటి బయలుదేరి శంకరుని అవిద్యతోపాటు, అరవిందుని మాయను మేళవింపజేసి—ఒక అధ్యాత్మిక సత్యాన్ని తెలిసికోవాలని కోవాలని ప్రయత్నిస్తున్నాడు. ఆయన వ్రాసిన నవలలన్నీ ఈ దృక థంతో వ్రాసినవే, వీటి అన్నింటిలోను, రకరకాలుగా ఆయనచేసిన ప్రయోగాలు కనిపించుతున్నాయి. కాని అవిదిఒక లక్ష్యం సిద్ధింపజేసినట్లు తోచదు. ఈ పరిణామవాదాన్ని నిరూపించడానికి పెద యెత్తున ఒకనవల ఆయన తలపెట్టారు. అది నేటిసాంఘిక వ్యవస్థ పరిణామాన్ని చిత్రించే పరిశీలన. అది పూర్తికాకుండానే ఆయన హఠాత్తుగా కీర్తిశేషులయ్యారు. గోపీచంద్ ప్రకటించిన రచనలకంటె ప్రకటించని రచనలెన్నో ఉండిపోయాయి. అవి వస్తే గోపీచంద్ తెనుగువచన సాహిత్యంలో ఉత్తమస్థాయి నందుకొనేవాడు. గోపీచంద్‌ను అనుసరించి— 'పెక్కు' గుఱించి ఆధాత్మిక జీవనంగురించి నేటి హేతువాదంతో ఆధాత్మిక తత్వాన్ని ముడిపెట్టి చాలమంది నవలలు వ్రాస్తున్నారు. అవి సంఖ్యను మీటే కొద్దీవానిలో వాస్తవికతలోపించి వ్యర్థకాముకత, విషయలోలుపకత అతిశయిస్తున్నవి. అంతేకాక కొందఱు తమ ఆత్మ విద్వేషాలు, పాత పగలుతీర్చుకోవడానికి, కొందఱే యధార్థ వ్యక్తుల జీవిత సంఘటనలు తీసికొని వాటికికొంత అతిశయోక్తి కలిపి నీచాతినీచంగా వర్ణిస్తున్నారు. సాహిత్యం— పరనిందకు, ఆత్మస్తుతికి దోహదంచేసే అధమ సాధనగా వినియోగిస్తే అలాగచేసిన వ్యక్తులూ క్షుద్రులే అవుతారు—వారిరచనలూ క్షుద్రరచనలే అవుతాయి.

ఎటువంటి క్షుద్ర వాతావరణాన్ని తీసికొన్నా— దాన్ని రచయిత తనకుంచెతో కొత్తవన్నెలుపూసి క్రొందళుకు

లొలికించగలదు. పంకజంవంటి పవిత్రరచన ఎక్కడ ప్రభవించినా తాను వికాసంపొందిన విశాల వాతావరణంలో పవిత్ర పరిమళాలు వెదజల్లుతుంది. దీనికి దృష్టాంతంగా ఈ సంవత్సరం సాహిత్యానికి నోబెల్ బహుమతి నందుకున్న రచయిత జాన్ స్టీన్‌బెక్ చెప్పినమాటలు ఉదాహరించవచ్చును. ఈతడు నికృష్టమైన వాతావరణంలో పుట్టిన నిర్భాగ్యజీవుల కథలు రచించాడు. ఆ జీవిత చిత్రణలో ఆతనిచిత్తశుద్ధి, నిజాయితీ, సానుభూతి శంకింపరానివి. అందుకే ఆతడు ఉత్తమోత్తమ రచనలు చేయగలిగాడు. ఉత్తమ రచయితలైనవారు ఉత్తమ లక్ష్యాలేర్పఱచుకొని, ఉత్తమ సాహిత్యాన్ని సృష్టిచేయగల్గుతారు. నికృష్ట జీవితాన్నికూడ పునీతంచేసే నిర్మల వాతావరణాన్ని కల్పిస్తారు. స్టీన్‌బెక్ నిలుపుకొన్న లక్ష్యమదే! తన వ్యక్తిత్వాన్నీ తన నిశ్చలాంతఃకరణను కాపాడుకొన్నాడు.

"నేటి రచయితలు— (వారితో నేనుకూడ ఉన్నాననుకోండి) ఆత్మ వినాశనాన్ని ఆకర్షణీయంగా చెప్పాలనే ధోరణిలో ఉన్నారు. ఆ యాత్మశక్తి తరచు సర్వనాశనం అవుతూనే ఉన్నదనుకోండి. రచయిత అలాంటి పరిస్థితులలో ఉద్ధరించి ప్రోత్సహించవలసినది తన కర్తవ్యంగా భావించారు. ఈ వ్రాతరూపకమైనమాట మన జాతిని అభివృద్ధిపరచి అర్ధ విస్తారమైన మన సంస్కృతిని ప్రోది చేయడానికి ఎంతమాత్రమైనా సాయపడిందీ అంటే అదియిది ! ఉత్తమ రచన ఎల్లప్పుడూ ఒక భారం ఆనుకునే చేతికర్రగానూ, ఒక హితవుచెప్పే తల్లిమాటగానూ, తప్పుచేసి దిద్దుకొనే తెలివితేటగానూ, ఒక దౌర్బల్యంలోని బలంగానూ, ఒక పిరికితనం లోని బెదురు పోగొట్టే ధైర్య సముత్సాహంగానూ పనిచెయ్యాలి."

ఈ లక్ష్యాన్ని తెనుగు సాహిత్యంలో కృషిచేస్తున్న ఎందరు రచయితలు పాటిస్తున్నారు ? ఉత్తమ లక్ష్యాలు లేకపోతే ఉత్తమ సాహిత్యంరాదు. ఈ దృక్పథంతో విలువలుకట్టితే 1962 అంత మంచిఫలితాన్ని అందీయలేదనే చెప్పాలి. కాని 1963— "భారతి"కి నలుబదియేండ్ల మహోత్సవం జరిపే సమయంలో ఏ మయినా మంచి ఫలితాలు సాధిస్తుందేమో; ఆ శుభ తరుణంకోసం నిరీక్షిదాం.

"The writers of to day, even I, have a tendency to celebrate the destruction of the spirit and God knows it is destroyed often enough. It is the duty of the writer to lift up, to encourage. If the written word has contributed anything at all to our developing species and our half-developed culture, it is this great writing has been a staff to lean on, a mother to consult, a wisdom to pick up stumbling folly, a strength in weakness and a courage to support weak cowardice."—John Steinbeck.



# లేఖలు

# 'అర్జునుని శరీరవర్ణ మెట్టిది?'

[ఈ శీర్షికపట్ల పండితులు పాఠకులు చూపుచున్న ఆసక్తికి శ్రద్ధకు కృతజ్ఞులము. అయితే లేఖలను సాధ్యమైనంత క్లుప్తముగా వ్రాయవలెనని ప్రార్థన. —సం. భా.]

**"భారతి" సంపాదకులకు :**

ఆర్యా !

అర్జునుని శరీరవర్ణం ఏమిటి ? అన్న విషయముపై జరిగిన చర్చను చదువగా నాకుతోచిన అభిప్రాయం :

శ్రీ పాదవారు చేసిన భారతానువాదంలో : "అమలిన వర్ణము గలిగియు, నమలిన కర్మమును గలిగి యలరెడుదానన్" అని 'అవదాత' 'అర్జున' శబ్దములకు 'అమలిన' అని వాడటం బాగా గమనించదగ్గ విషయం. శ్యామవర్ణం అమలినంగా (Clear) వుండటంలో అసంబద్ధమేమీ లేదుకద ! అమరం "శుక్ల, శుభ్ర, శుచి, శ్వేత,.... అవదాత.... అర్జునాః" అంటున్నది. తెల్లగావుంటే శుభ్రంగా శుచిగావున్నట్లే, కాని శుభ్రంగా శుచిగా వుండటానికి తెల్లగానే వుండనక్కరలేదుకద ! ఈ సంగతి గుర్తిస్తే తేలేదేమిటంటే, అర్జునుని దేహవర్ణం శుభ్రమైన, అమలినమైన శ్యామవర్ణం అని. కారునలుపుకాదు, తేటనలుపు అని. ఆ తేటదనపు వైశిష్ట్యాన్నే అర్జునుడనుగ్గడించాడు. అందు వల్ల అర్జునుని శ్యామవర్ణము ప్రత్యేకమైన నిర్మలద్యుతి అనీ, అనన్య సామాన్యమైనదనీ బోధపడుతోంది.

నల్గొండ, —ఆర్. ఎస్. సుదర్శనం.

* * * *

ఆర్యా !

"భారతిలో" నేడు జరుగుచున్న ఈ చర్చ పన్నెండు సంవత్సరాలక్రితం "కృష్ణా పత్రిక"లో జరిగినది. దానికి కారకుడను నేను.

ఆనాడు ఆ చర్చజరుగు కాలమందు నేను పండితులకనేక మందికి వ్రాసినాను. ముఖాముఖిని చర్చించినాను. అందు అర్జునుడు నీలవర్ణదేహుడని స్పష్టముగా చెప్పినవారిలో శ్రీ వేలూరి శివరామశాస్త్రిగా రొకరు, మండలీక వెంకటశాస్త్రిగా రొకరు.

విషయము చర్చకువచ్చినది గనుక పన్నెండు సంవత్సరములనాటి ఈగాథ పాఠకమహాశయులకు జ్ఞాపకంచేసినాను.

ఏలూరు, —శంకర శ్రీరామారావు.

* * * *

ఆర్యా !

డిశంబరు 1962 భారతిలో "అర్జునుని శరీరవర్ణ మెట్టిది ?" అనుశీర్షికతో శ్రీ దీపాలపిచ్చయ శాస్త్రిగారు మంగిపూడివారి లేఖకు సమాధానవ్యాసమును వ్రాసినారు.

తిక్కనగారి అనువాదము :— (విరాట. 4—145)

అవదాత శబ్దమునకు అమరమున తెలుపనియే అర్థము చెప్పబడినది. కాని తిక్కనగారు "స్వచ్ఛత"యను భావమును వాడినట్లు తోచుచున్నది. భారతమును యథామూలముగ ననువదించిన శ్రీ పాదవారు తమపద్యమున "అమలిన వర్ణము" "అమలిన కర్మము" అని వ్రాసినారు. (అమలిన— మలినముకాని) యని దానికర్థముగదా ! తెలుపనియే సూచింపవలసిన శ్లోక పదము గృహీతమయ్యెడిది. కల్లీపాంబమూర్తిగారును, తమ టీకలో "శుక్లవర్ణంబుగలవాడ నగుట" అని మూలమునను సరించినారు. భావస్పష్టీకరణము చేయలేదు. అయినను, ఒక చోట నలుపువర్ణముగలవాడుగను, ఒకచోటతెలుపు వర్ణము గలవాడుగను, ఏ వ్యక్తియైన యుండునా ? శంకర భాష్యము నుదహరించుచు శ్రీ దీపాలవారు సూచించిన "స్వచ్ఛస్వభావ ! హే అర్జున !" అను దానిభావమేమి ? స్వభావము స్వచ్ఛమనియు వర్ణము అమలినము అనియుగదా ! సద్గుణములను తెలుపుతోను, దుర్గుణములను నలుపుతోను, వర్ణించుట కవిప్రసిద్ధము; లోకవిదితము. ఇంక "కరోమి కర్మశుక్లంచ" అను మూలమునకు సరియగు నర్థవిచారముచేసిన "శుక్లం కర్మచకరోమి" పవిత్రములైన కర్మలనుగూడ చేయుచున్నాను, అని గదా ! ఆకర్షనీయ వర్ణముతోబాటు, అంతరంగమున్ను, ఆకర్షణీయ సద్గుణ సంపత్తి గలదని యెంచవలెను. కాబట్టి నలుపు గాదనియు, దర్శనీయవర్ణ మనియు గ్రహింపవలెను. అర్జున శబ్దమునకు ఆకర్షణీయవర్ణమను నర్థముచెప్పిన "కృష్ణ" పదము పునరుక్తము కానేరదు. పదకొండుపేర్లను లోపింపవు. శ్రీ పిచ్చయ శాస్త్రిగారి సిద్ధాంతము ప్రకారము

"అర్జునుడు" మనకొకచోట తెలుపువర్ణముతోను, ఒకచోట నలుపువర్ణముతోను సాక్షాత్కరించును. ఇది శాస్త్రిగారి అపూర్వ సిద్ధాంతమువలన జరుగు మహోపకారము. "అర్జునుడు నల్లనివాడనియు, అవదాతమనగా, నలుప"నియు వాదించుట "ఊరంతా ఉత్తరంచూస్తే దాసరిపుల్లయ్య దక్షిణంచూస్తాడు" అని వ్రాయుటవలన శ్రీ శాస్త్రిగారు అర్జునుని దేహవర్ణము తెలుపనియే అభిప్రాయపడుచున్నట్లు తెలియుటలేదా ? "అవదాతవర్ణము" అమలిన వర్ణమని సమన్వయము చేసికొనవలెను. అందువలన "అర్జున" శబ్దమునకు ఆకర్షణీయము, అమలినము" అగు వర్ణము కలవాడని అర్థము సుసంగతము. శబ్దార్థ మెట్లున్నను, అర్థ సందర్భమునుబట్టి, పద ప్రయోగ వైశిష్ట్యమునుబట్టి సమన్వయము చేసికొనుట అనూచాన సంప్రదాయము.

"అర్జునుని మేనిరంగు నలుపా ? తెలుపా ? అన్న చర్చయేలేదు" అని వ్రాయుచు, ఒకచోట "శ్లోకములో నున్న తెల్లనివర్ణము కనబడకపోవుటయు పద్యములోలేని నల్లని వర్ణము కనబడుటయు, దృష్టిదోషముగాని మరేమియుగాదు", అని వ్రాయుట "ఎప్పటికెయ్యది ప్రస్తుత" మన్నట్టి వారి విమర్శనా ధోరణికి తార్కాణము.

నూజివీడు,— ఎస్.టి.పి.వి. రామానుజాచార్యులు

ఆర్యా,

కొందరు—సమర్థనాకాంక్షాపరులు అర్జున శబ్దమునకు "కృష్ణవర్ణ మిశ్రిత శ్వేతవర్ణుఁడ" ని కూడ నర్థము చెప్పుట కారంభించిరి. కాని యది యెట్టి రూపమగునో వారు గ్రహించి యుండరు. అట్టి వర్ణము పరమాసహ్యకరమగు బూడిద వన్నె యగును. అట్టి రూపేంద్ర నీలశ్యాముఁడగు నర్జునుని కంటగట్టుట తగదు.

అట్లయిన నర్జున శబ్దమున కర్థ మేమని విచారింప వలసి యున్నది. అర్జున శబ్దము "అర్జ షర్జ అర్జనే" అను ధాతువు వలన నేర్పడినది. దానివలనఁ జూపఱ నాకర్షించునది యను యౌగికార్థము దానికి స్పష్టమగుచున్నది. అనఁగా నర్జునుఁడన నాకర్షణీయమగు వర్ణము గలవాఁడని భావము. ఆకర్షణీయమైనది గావుననే తెలుపుకూడ నర్జున శబ్దవాచ్యమైనది. అట్లే యితర వర్ణములును నాకర్షణీయములుగ నున్నవు డర్జున శబ్దవాచ్యములు కావచ్చును. కాని యోగా ద్రూఢిర్బలీయసీ, యను న్యాయమునుబట్టి రూఢిగాఁ "దెలుపు" చెప్పఁబడుచున్నది. అయినను విరోధము గన్పించినపు డట్టి విరోధ పరిహారార్థము యౌగికార్థమును గ్రహింప వలయునేకాని కేవల రూఢ్యర్థమునే పట్టుకొని ప్రాకులాడుట తగదు. కనుక అర్జున శబ్దమున కాకర్షణీయ వర్ణము గలవాఁడనియే యర్థము చెప్పవలెను.

"కర్షతీతి కృష్ణః" చూపఱ నాకర్షించువాఁడనియు, శత్రువులను వశింపఁ జేయువాఁడనియు కృష్ణశబ్దమునకే యర్థము చెప్పి యర్జునుడనఁ దెల్లనివాఁడని యేల చెప్పరా దందురేమో కాని యర్జునుని కేవల కృష్ణశబ్దముచేతనే గాక శ్యామ శబ్దము చేత కూడ వ్యాసమహర్షి చెప్పిరి. కనుక యర్జున శబ్దమునకే యర్థమును సరిచేసుకొనవలెను గాని కృష్ణశబ్దమునకు గాదు. అందుచేత నర్జునుఁడు నల్లనివాఁడనియే చెప్పుట యుచితము.

మరియు దైశిక పరిస్థితి ననుసరించి కూడ నర్జునుఁడు తెల్లవాఁ డగుటకు వీలులేదు. అర్జునుని జన్మస్థలము హస్తినగరముగాని కుంతిభోజ నగరముగాని యయియుండవలెను. అది మన భారతదేశమునకుఁ జెందిన స్థలము. భారతీయులు శ్వేతవర్ణులు కారుగదా ! అట్టితరి యర్జునుఁడు హఠాత్తుగ తెల్లనివాఁ డెట్లగును ?

వస్తుతత్త్వ మిటులుండ 1962 డిసెంబరు భారతిలో దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు "అర్జున శబ్దమునకు నేనే కాదు. సాహిత్యజ్ఞానము కలవా రెవరైనను "తెల్లవాఁ" డనియే యర్థము చెప్పుదురని చదలవాడ సుందరరామశాస్త్రి, కట్రి సాంబమూర్తిశాస్త్రిగార్ల వివరణలఁ జూపి తమ యసమీచీన వాదమును బలపరుపఁ జూచిరి. మరియు తమ వాదమునకు బలకరముగా తెలుపని స్పష్టముగా యర్థము జెప్పని శ్రీపాదవారి "అమలిన వర్ణ" శబ్దమును కూడ నుపయోగించుకొనిరి. కాని యెవరో కొందరు సవిమర్శముగా పరిశీలింపక వ్రాసిన వ్రాతల నాధారముగా గొనుటకు గారణము వారి బుద్ధి నైశిత్యమై యుండును. కాని "కస్య చిద్గ్రంథకృతో విపరీతలేఖనం యుక్తి బలాద్యస్తు సిద్ధే న బాధకమ్" అని గదాధర భట్టాచార్యులవారు చెప్పినట్లు వాదమునకు నిలువనివారి మాటలు ప్రమాణములు గావు. అంతియగాక ఒక తప్పు పేర్కొని దానిని గప్పుకొనుటకు మరియొక తప్పు చేయుట సాహసకార్యమే గాని వేరుగాదు.

(నూజివీడు). న్యాయవేదాన్త విద్వాన్, ఉభయభాషా ప్రవీణ శ్రీమత్తిరుమల పల్లేర్లమూడి లక్ష్మీనరసింహాచార్యులు

ఆర్యా !

ఈ చర్చవల్ల తేలవలసినది అర్జునుడు నల్లనివాడా తెల్లనివాడా అనికాదు.

తేలవలసినది : అవదాత వర్ణం అంటే ఏమిటి ? అర్జునుడు అంటే ఏమిటి! అని. ఎందుకంటే అర్జునుడు నల్లనివాడనే అర్థము వాటిద్వారా చెప్పవచ్చునా ?

— ఒక పాఠకుడు.

* * * *

## 'కాళహస్తి మాహాత్మ్య పాఠ పరామర్శ'

అయ్యా

1962 డిసెంబరు భారతిలో శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారి "కాళహస్తి మాహాత్మ్య పాఠ పరామర్శ"ను గూర్చి

# లేఖలు

శ్రీ ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులుగారును, శ్రీ రావూరి మృత్యుంజయరావుగారును వ్రాసిన లేఖలు చదివితిని. శ్రీ విర్వాల చంద్రశేఖరయ్య వ్రాసినట్లు శరణార్థి నమస్కారార్థమున వాడబడు పదము. శరణార్థిచేయు'' అనగా "నమస్కరించు'' అనియే అర్థము. శైవ సంప్రదాయ తత్త్వము నెరిగినవారును భాషా సంప్రదాయము నెరిగినవారును అగు శివశ్రీ బండారు తమ్మయ్యగారును, శ్రీ నిడుదవోలు వేంకటరావు గారును ఈ సందర్భమున తమ అభిప్రాయము తెలియజేయుట వాంఛనీయము. "శరణార్థిఁ జేసి'' అను రూపము సరికాదు. శ్రీ దీ. పి. శాస్త్రిగారన్నట్లు "శరణార్థి'' అను విశేష్యమునకు "చేయు'' ధాతువు అనుప్రయుక్తముకాగా "నమస్కరించు'' అను విలక్షణార్థము సిద్ధించినందున అది శబ్దపల్లవ క్రియయే. (శ్రీ దీపాలవారును జూలై భారతిలో "అర్థిచేసి'' అని త్రెంచినారు. శరణార్థి ఏకపదముగా గ్రహింపవలెనని వారు అక్టోబరు భారతిలో వ్రాసినదే సరియైనది.) బాలవ్యాకరణములో ఈయబడిన శబ్దపల్లవముల "లిస్టు'' లో "శరణార్థి'' అను పదము లేనందున శ్రీ ఆచార్యులవారు అనుమానించుచున్నారు. "మొదలగునవి'' అని యున్నదికదా! ఇవన్నియు ప్రయోగసిద్ధములగు వ్యవహారములు. ఇట్టి శ. ప. క్రియలు భాషలో నెన్నియో కలవు. మహాకవుల ప్రయోగముల నరయు పట్ల భాషా సంప్రదాయములను, పలుకుబళ్లను గుర్తించి ఆదరింపవలె గని కేవలము బాలవ్యాకర్తను, ప్రౌఢవ్యాకర్తను, వరుసవారిని సంప్రతించుచు గిరిగీసికొనుట సరియైన పద్ధతి కాదు. వ్యాకరణ మవశ్య మాదరణీయమే కాని "వ్యాకరణమే సమస్తము'' కాదు. వ్యాకరణ మొక త్రోవ మహాకవు లొక త్రోవ. తెనుగునాట నాటినుండి నేటిదాక చిన్నయసూరియు, బహుజనపల్లివారును అనుశాసింపని ప్రయోగము లెన్నియో ఉన్నవి.

శ్రీ రావూరి మృత్యుంజయరావుగారు ద్రుతకార్యములని చూపిన ప్రయోగములను మరల ఒకతూరి తామే పరిశీలించుట మంచిది—కనుఁగొను, మఱియు కొన్ని శ. ప. క్రియలను గురించి శ్రీ దీ. పి. శాస్త్రిగారు తమ "సాహిత్య—సమీక్ష'' లో చర్చించియున్నారు. ఆ గ్రంథము చదివి ఆవెనుక విమర్శింప వచ్చును.

భారతిపత్రిక ఇట్టి చర్చల కవకాశము కలిగించి సారస్వతమునకు చాల మేలు చేయుచున్నది. ఇట్లే కుమార సంభవములోను, ఉత్తర హరివంశములోను గల గ్రంథులనఁ విడదీయుటకై పండితులు చర్చలు ప్రారంభింతురుగాక.

**ఆదిలాబాదు, —సదాశివ.**

* * *

అయ్యా,

జూలై భారతినుండి కాళహస్తి మాహాత్మ్య మునందలి సవరణల విషయమై జరుగుచున్న తర్జన భర్జనలు చూచితిని. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు 'శరణార్థిఁజేసి' అను పదమును 'శరణార్థిచేసి' అని సవరించుట తగియున్నది. కాని జూలై పత్రికలో విడదీసినట్లు శరణ+అర్థిచేసి అని గాని, అక్టోబరు సంచికలోవలె శరణార్థి+చేసి అని విడదీసి శబ్దపల్లవ క్రియ అని చెప్పుటగాని అవసరముగా కనపడుటలేదు. ప్రయోగమున 'శరణార్థి' కి 'నమస్కారము' అని అర్థము కలదు. దీనినే శ్రీ విర్వాల చంద్రశేఖరయ్యగారు డిశంబరు పత్రికలో తెల్పినారు కూడ. కావున శరణార్థి+చేసి అని విడదీసికొని శబ్దపల్లవ క్రియల సంబంధము ముడిపెట్టక యున్నను సరిపోవును. ఆగస్టు సంచికలో శ్రీ ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులుగారు 'శరణార్థి' ద్వితీయాంతముగ గ్రహించి 'శరణుగోరిన వానినిగఁ జేసి' అని అర్థము చెప్పినారు. అట్లన్న అర్థము పొసగదు. 'శరణార్థిచేసి' అని యున్ననే 'నమస్కరించి అను అర్థము వచ్చును.

శ్రీ రావూరి మృత్యుంజయరావుగారు డిశంబరు పత్రికలో తమ వ్యాసమున (ప్రమాదో ధీమతామపి శీర్షిక) అంతకు ముందు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు 'శబ్దపల్లవములందు అరసున్నలు, ద్రుతకార్యములు ఉండవు' అన్న మాటలను విమర్శించుచు ఉదాహరణములుగా 'మిగుదెంచు, అరుగుదెంచు, అరుదెంచు మొదలగు శబ్దపల్లవ క్రియలందు అరసున్నలు కలవి కొన్నియని, ద్రుతకార్యములు జరుపబడినవి కొన్నియని వ్రాసిరి. ఇందు అరసున్నలు లేవు. ఇవి ద్రుతకార్యములు కూడ కావు. బాలవ్యాకరణము—క్రియాపరిచ్ఛేదము—సూత్రము 110 చూడనగు.

**ఆదిలాబాదు, —మా. శంకరరావు.**

## గ్రంథము గ్రంథకర్తలు :

# నన్నెచోడ పదప్రయోగ సూచిక:

**"రావు"**

అష్ట శతాబ్దమునుండి యాంధ్ర వాఙ్మయ ప్రపంచమున నత్యధిక సంచలనము గలిగించిన కృతి నన్నెచోడ కవీంద్రుని కుమారసంభవ మహా కావ్యము. నన్నెచోడకవి కాల నిర్ణయమును గూర్చి పాఠభేదములనుగూర్చి, శబ్దార్థ స్వరూప విచారణను గూర్చి, యానాటినుండి నిన్న, నేటివరకు విమర్శనలు సాగుచునే యున్నవి. ఈ కుమార సంభవ మహా ప్రబంధ విశిష్టతను, నన్నెచోడ మహాకవి ప్రతిభను, సాహిత్య చరిత్రకారులు, సారస్వత పరిశోధ కులు గుర్తించి, నన్నెచోడకవి తెలుగు వాఙ్మయ చరిత్రలో, శివకవి యుగమునకు జెందినవాడనియు, నాతడు నన్నయ భట్టు, తిక్కనలకు మధ్యకాలమువాఁడనియు నొక నిర్ణయమునకు వచ్చియున్నారు. నేటి వాఙ్మయ చరిత్రలయందును కవి చరిత్రములయందును నీవిషయములు స్పష్టముగా నున్నవి. విశ్వ విద్యాలయములలో విద్యార్థులకు గూడ నీ విషయము సుపరిచితము. ఈ కృతి యన్నితెలుగు విశ్వ విద్యాలయములందు పాఠ్యగ్రంథము.

ప్రస్తుతము ప్రకటితమైన నన్నెచోడ పద ప్రయోగ సూచిక[1] ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి పద సూచికలలో రెండవది. మొదటిది నన్నయ పద ప్రయోగ కోశము. అది ఈ వరకే భారతి పత్రికాముఖమున సమీక్షింపబడినది.[2] నన్నయ పదకోశ సంపాదకులగు అబ్బూరి రామకృష్ణరావు గారును, డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారును దీనికి గూడ సంపాదకత్వము వహించినారు. నన్నయ పద ప్రయోగ కోశమున తొలుత అబ్బూరి వారిపేరును, క్రింద డాక్టరు వేంకటావధాని గారి పేరును ఉండగా, నీ నన్నెచోడ పద సూచికలో డాక్టరు వేంకటావధానిగారిపేరు మీదను నా వెనుక అబ్బూరి వారి పేరును నున్నవి. ఇందుల విశేషమేమో?

సంపాదకులు 'తొలి పలుకులు'లో నీ గ్రంథ సంధానమును గూర్చి తెలిపిరి. గ్రంథ సమీక్ష మాట యటుండనిండు. తొలుత ''తొలి పలుకు''లోని విషయములే విమర్శనీయాంశములుగా నున్నవి. ఇది వివరించినచో గ్రంథమునందలి పదానుక్రమణికాది విశేషము లన్నియు మనకు సుగమము అగును.

1. ''సుమారు రెండేండ్లక్రిందట ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు మాచే నన్నయ పద ప్రయోగ సూచికను కూర్పించి ప్రచురించియున్నారు. అప్పుడే నన్నయ సమకాలికులైన ఇతర కవుల గ్రంథములకు గూడ అట్టి పద ప్రయోగ సూచికలు తయారు చేయవలెనని తీర్మానము చేయబడినది. దాని కనుగుణముగా నన్నెచోడుని కుమారసంభవమును పావులూరి మల్లన గణితమునకును పద ప్రయోగ సూచికలు నిర్మించుట కారంభించితిమి.'

నన్నెచోడకవి నన్నయ సమకాలికుడన్న విషయ మూవరకు ప్రతిపాదితమైనను, నది సందిగ్ధమేకాని, నిశ్చితముకాదు.[3] ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు నన్నెచోడుని కవిత్వమును గూర్చి యొసంగిన బహుమతి గ్రంథమునందేమి, ఆ పోటీకి పంపబడి, బహుమతి నందకపోయినను ముద్రితములైన మరి రెండు గ్రంథములందే నన్నెచోడుడు నన్నయ సమకాలికుడని లేదు[2] ఉపలభ్యములైన వాఙ్మయ సాహిత్య చరిత్రల యందెందును లేదు. విశ్వవిద్యాలయములలో నా బాల గోపాల మెరిగిన ఈ విషయము సంపాదకులకు తెలియక పోవుట కరమాశ్చర్యకరముగ నున్నది. ఈ పద సూచికా సంపాదకులలో ప్రథములగు డాక్టరు వేంకటావధానిగారే తమ ''ఆంధ్ర వాఙ్మయ చరిత్ర'' 19 వ పుటలో నే రీతిని వ్రాసిరో చూడుడు.

''దీనినిబట్టి అతఁడు (నన్నెచోడుడు) క్రీ. శ. 12 వ శతాబ్ది ఆరంభమువాఁడని చెప్పవచ్చును.''

ఇట్లే పావులూరి మల్లనయు, అత డెంతః మాత్రమును నన్నయ సమకాలికుడు కాడు. కాని యా విషయము మాకు ప్రస్తుత మనవసరము.

పై వ్రాత 'ఒజ్జల పుచ్చకాయ' రీతి నున్నది.

---

1. నన్నెచోడ పద ప్రయోగ సూచిక. సంపాదకులు డా. దివాకర్ల వేంకటావధాని, ఎమ్. ఏ. పి. హెచ్. డి., అబ్బూరి రామకృష్ణారావు. వెల 20 రూపాయలు.

2. భారతి సం. 39 సం. 4 (ఏప్రిల్ 1962) పుటలు 52—59.

3. నన్నెచోడునకు నన్నయ సమకాలికత్వము ప్రతిపాదించిన వారు శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు.

# నన్నెచోడ పదప్రయోగ సూచిక

2. "నన్నెచోడుని కుమార సంభవ మింతవరకు మూడు సారులు ప్రకటింపబడినది. అందు మొదటిది కీ. శే. మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించినది. రెండవది మదరాసు విశ్వవిద్యాలయమువారి ప్రచురణము. మూడవది వావిళ్ల వారిది. ఇందు మొదటిది ఇప్పుడు లభించుటలేదు. మే మీ సూచికను తయారు చేయునప్పుడు, మదరాసు విశ్వవిద్యాలయమువారి ప్రతినే మూలముగా గ్రహించితిమి. అందు ప్రతి పుటలో నడుగున చాల పాఠాంతరములు చూపబడినవి. కాని, ఆ పాఠాంతరములు పెక్కులు అర్థ విహీనములై అస్తవ్యస్తముగా నున్నవి. అందుచే ఆ పాఠాంతరముల నిందు గ్రహించియుండలేదు. అందుచితములైనవి వావిళ్లవారి ప్రతిలో మూలపాఠములు గ్రహింపబడినవి. అందుచే వావిళ్లవారి ప్రతిని కూడ పరిశీలించి మదరాసు విశ్వవిద్యాలయమువారి ప్రతిలోలేని పదముల నన్నింటిని గ్రహించితిమి. అట్టి పదముల కిచ్చు ప్రయోగములను పువ్వు గుర్తుతో సూచించితిమి. ఆ గుర్తుగల ప్రయోగములు, పదములు వావిళ్లవారి ప్రతిలోనే కనిపించును"

పై వాక్యములవలన పద సూచికా నిర్మాణమునకు ముఖ్యాతి ముఖ్యమైన ప్రతి యేది గ్రహింపవలెనో సంపాదకులకు తెలియదనుట నిర్వివాదాంశము. నన్నయ భారతమున కెన్నియో వ్రాతప్రతులు గలవు. అవి, వందల సంఖ్యలు. ఇక నన్నెచోడుని కుమార సంభవమున కొకటే ప్రతి! [2]ఒకపట్టున అతివృష్టి— మరియొకచో అనావృష్టి. తంజావూరి పుస్తక భాండాగారమున నేకైక ప్రతి ననుసరించి శ్రీ మానవల్లివారు 1910, 1914లో ప్రథమ, ద్వితీయ భాగములు ముద్రించిరి. ఆ ప్రతి చాల విలువ గలది. తరువాతి ముద్రణములకెల్ల యాధారమైనది. నన్నెచోడకవి గ్రంథమును మొదట లోకమున కెరుకపరిచిన ఈ ముద్రిత ప్రతి లభ్యమగుచున్నను, "మొదటిది ఇప్పుడు లభించుట లేదు" అని వ్రాయుట సాహసము. దానికొరకు ప్రయత్నించి, సంప్రతించు బాధ్యత సంపాదకు లేమాత్రమును వహింప లేదనుట స్పష్టము. ఇక రెండవది మదరాసు విశ్వవిద్యాలయము వారిది. ఇది క్రీ. శ. 1948 లో ప్రకటితమైనది. ఈ ప్రతిని మూలముగా గ్రహించిరట. కాని, సంపాదకు లీ గ్రంథమును చూచినట్లే కానరాదు.

మదరాసు విశ్వవిద్యాలయ ప్రతి, తంజావూరిలోని ఏకైక తాళపత్ర మాతృకతో సరిచూడబడినది. అందిచ్చిన పాఠములు, తాళపత్రప్రతిలోని పాఠములేకాక, శ్రీ మానవల్లి వారు మొదట ముద్రించిన ముద్రిత ప్రతిలోని పాఠములునై యున్నవి. ప్రతి పుటయందును విస్పష్టముగా 'క—చ' ప్రతులని సాంకేతికములుండగా, గ్రంథాంతమున కొన్ని పాఠములగూర్చిన వివరణ యుండగా–గ్రంథాంతమున తప్పొప్పుల పట్టిక యుండగా వీని నన్నింటిని విస్మరించి—"ఆ పాఠాంతరము లర్థవిహీనములై అస్తవ్యస్తముగా నున్నవి" అని వ్రాయుట యవిమృశ్యకారిత్వము.

ఇంతటితో చాలింపక క్రీ.శ 1949—1953 లో విశ్వ విద్యాలయ ముద్రణమునకు వెనుక వెలువడిన వావిళ్ల ముద్రణముననున్న పాఠములను ప్రామాణికముగ గ్రహించిరి. వ్రాతప్రతిలోని పాఠములను సూచించిన ప్రతి ననుసరింపకనే పాఠభేదములను సూచింపని వావిళ్లవారి ప్రతి ననుసరించుటవలన ఈ పదసూచిక యెంత అర్థవిహీనమై యస్త వ్యస్తముగా, తయారైనదో పాఠకులు ముందు గ్రహింపగలరు.

వావిళ్లవారి ప్రతిలో మూలపాఠములు, విశ్వ విద్యాలయ పాఠములకన్న "యుచితములని" సంపాదకులు తెలిపిరి. దీనిని బట్టి వారు, వావిళ్ల ప్రతిని సరిగా పరిశీలింపలేదని చెప్పవచ్చును. వావిళ్లవారి ప్రతిలో గ్రంథాంతమున 10 పుటలు పాఠాంతరములు కలవు. కాని, యవి చాలవరకు మొదట మానవల్లివారు ప్రకటించిన ముద్రణలోనివే! సంపాదకులు దీనినిచూచి, ఇతర పాఠములతో సంప్రతించియున్నచో, పాఠములకు పువ్వు గుర్తులుంచుట, చర్విత చర్వణముగా రెండేసి యనర్థక పాఠముల నిచ్చుట మొదలగు ననవసర కార్యములు తటస్థింపవు. పుటల సంఖ్య పెరుగదు.

ముద్రిత ప్రతినే పద సూచిక కాధారముగా గ్రహించినపుడు, తొలుత యా ముద్రిత గ్రంథము వెనుక నున్న తప్పొప్పుల పట్టిక ననుసరించి, మూల గ్రంథము సరిచేసికొనవలయును. ఈ సందర్భమున మదరాసు విశ్వ విద్యాలయ ప్రతిలో గ్రంథాంతమున నిచ్చిన, తప్పొప్పుల పట్టికను సంపాదకులు గమనింపలేదు. అందు ఒప్పుగా నచ్చినవి విడచి, తప్పుగా నిచ్చిన పాఠములను గ్రహించుటయే తార్కాణము—ఈ విషయము వెనుక వివరింపబడును.

ఈ నన్నెచోడ పద ప్రయోగ సూచికా పరిష్కరణమునందు గ్రంథ సంపాదకు లేమాత్రమును శ్రద్ధ వహించినట్లు

---

1. (1) నన్నెచోడుని కవిత్వము శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి క్రీ. శ. 1300—1323—1350 మధ్య (2) నన్నెచోడుని కవిత్వము శ్రీ అమరేశం రాజేశ్వర శర్మ "నన్నయ తిక్కనలకు నడిమివాఁడు. (3) కవిరాజ శిఖామణి శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు నన్నెచోడకవిని శివకవిగా నిరూపించిరి.

2. పాఠభేద నిర్ణయమున పెక్కు చర్చల కాలంబనమగు నన్నెచోడుని కుమార సంభవము వ్రాత, ముద్రిత ప్రతుల గూర్చిన వివరము లీ పద్య సూచికలో ముఖ్యముగా నీయవలసి యుండినను, సంపాదకు లీ విషయము స్పృశింపనేలేదు. నన్నయ పద ప్రయోగ సూచికకును వీరట్టి విశేష వివరములుగల పీఠిక రచియించియుండలేదు. విమర్శనాత్మకమగు విపుల పీఠికలేని ఇట్టి పద సూచికలు, శిరస్సులేని మొండెమువలెనుండి, భాషా సాహితీ పరిశ్రామికులకేమాత్రము ప్రయోజనకారులు కావు. ఇట్టి పీఠికావశ్యతనుగూర్చి నన్నయ పద ప్రయోగ సమీక్ష 'భారతి' (పుట 59) చూడుడు.

కానరాదు. విద్యార్థులు వ్రాసిన వాని నట్లనే పరిశీలించి, తప్పొప్పులను పరీక్షించి సంస్కరింపక గ్రంథమునందు సంధానించిరి.

ఈ సంధానమున కూడ పదానుక్రమణికలు కొన్ని చోట్ల తప్పుటచే నా భారము కూడ విద్యార్థుల పైననే సంపాదకులు పెట్టినట్లున్నది. పలువురు పండితులతో సంప్రదించి పదవిభాగము నిర్ణయించిరట! నిశ్చితముగా 'పండితుల'తోనే సంప్రదించిన వారు కూడ నీ గ్రంథమందలి యస్తవ్యస్తతకు బాధ్యులగుదురు. ఆ పండితు లెవరో వారి పేళ్లిందులో లేవు. ఇక సమీక్ష చదువుడు.
పదానుక్రమణిక.

''అడుగులోనే హంసపాదు'' అన్నట్లుగా, పద ప్రయోగ సూచిక తీయగనే మొదటిపుటలో 'అ' (త్రికము) అని కలదు. ఆ వెనుక 'ఆ' వద్ద నేదియులేదు. 'ఇ' (త్రికము) 'ఈ' (త్రికము) 'ఏ' (త్రికము) యని యా యా ప్రారంభములలో నున్నవి. ఏ వద్ద (ఏవార్థకము) (పుట 95) అని వ్రాయబడి యున్నది. దీనిని బట్టి సంపాదకులకు 'త్రికము' అన నేమో తెలియనట్లున్నది.

''ఆ—ఈ—ఏ యను సర్వ నామంబులు త్రికంబు నాబడు'' అని బాల వ్యాకరణ సూత్రము (సమా—4) ఆంధ్ర వ్యాకరణ సంప్రదాయమున నీ '(తికము) అను సంజ్ఞకు సృష్టికర్త చిన్నయసూరి. అది యట్లుండ నిండు 'త్రికము' అనఁగా దీర్ఘస్వరములుగదా—ఇందు—అ, ఇ,ఎ అను హ్రస్వముల యొద్ద త్రికము—త్రిక అని ముద్రించు టెలకో దురూహ్యముగా నున్నది.

రెండవపుట రెండవ కాలములో 'అ' అక్షరమున కెదురుగా (ఏ వార్థకము) అని కలదు. అచ్చటనుండి 'అ' క్రింద 3, 4, 5 పుటలు పూర్తిగాను, 6 వ పుటలో రెండవ కాలము మధ్యవరకును నారోపములు గలవు. కాబట్టి ఇవి యన్నియు ఏతార్థమునకు సంబంధించినవే కావలయు గదా! వీనిలో నీయబడిన యుదాహరణములను పరిశీలింపఁగా, నందన్నియు ఏవార్థ రూపములులేవు సరిగదా, వానికి వ్యతిరిక్తములైనవి కానబడుచున్నవి. అంతటితో నాఁగలేదు. ఏ వార్థ రూపములుగా నిచ్చినవి కూడ నెంతమాత్రము సరి కావనియు, ఏ వార్థ రూపము లను భ్రాంతితో నిందుఁ జేర్చిరనియు, నీ క్రింది యుదాహరణ వలన తెలిసికొనవచ్చును. (పుట 3—3) తోడనతోన పెక్కు సారులు, అన్నింటికన్న మిన్నగ 4 వ పుటలో వేత్రంపుఁ బడగ లట్ల (8—74) బడగలట్లు ఇది ఇవార్థకముగు 'అటుల' రూపాంతరము ''అట్ల'' కాని , ఏ వార్థకము కాదు. 6 వ పుట అకారము చివర,

తాన దీవియగా నెత్త దలచువారు. ఇచట—తాన అన్న శబ్దము 'తానె' అను సర్వ నామ వాచకమునకు ఏవ కారార్థమ్ము వచ్చిన అకారమని ఇచ్చిరనుట స్పష్టము. ఇంతకన్న యజ్ఞత వేరొకటి యుండఁబోదు.

'తానదీవియ' సమస్త పదముగా నీ పద సూచికయందే 221 పుటలో గలదు.

అందిట్లు వ్రాయఁబడి యున్నది.
తాన దీవియ (స్థానదీపము) హృత్స దీనంబులోఁ
దాన దీవియఁగానే చదివురువారు (12—255)
తాన దీవియలఁ వెలుగ సూరెలఁ దానదీవియలఁబోలె (8—73)
తాన దీవియలు—వెలయ నెత్తిన తానదీవియలు పోలె (8—44)

ఇది స్థానదీపము శబ్ద వికృతి యనుట తప్పు.
''స్థాన దీపికా'' శబ్ద భవ మనుట యొప్పు.

పై యంశమును బట్టి తాన శబ్దము—ఏవకారార్థమైన అకారము కాదనియు, పదములు సేకరించినవారు గుడ్డెద్దు చేన బడ్డట్టు పద రూపముల నర్థముచేసికొనకుండ గ్రహించిరనియు, సంపాదకులును వీనిని యంథ పరంపరా న్యాయమున ముద్రణ కెక్కించిర నియు విశదమగుచున్నది.

ఈ నన్నెచోడ పద ప్రయోగ సూచికా నిర్మాణమున నన్నయ పద ప్రయోగ కోశములో నవలంబించిన పద్ధతి ననుసరించబడినదని తొలి పలుకులో గ్రంథ సంపాదకులు తెలిపి యున్నారు. కాని, యది సరికాదు.

1. ఈ గ్రంథమున 'అ ఇ, ఎ' (త్రికములు) కాక, 'ఉ' అనునది ప్రత్యేకముగా గ్రహింపబడినది. నన్నయ పద ప్రయోగకోశములో 'ఉ' లేదు. ఇందు 'ఉ' అను ప్రత్యేకాక్షరమే కాక, ''ఉ, ఉం'' అనునవి గలవు. వీని క్రింద నిచ్చిన [1] యారోపములు, 154. ఇవి రెండు పుటలకు పైగా నున్నవి. ఏ పద సూచికల యందుగాని, నిఘంటువులయందుగాని ఉ వేరుగా గ్రహింపబడదు. కావున నిందలి యారోపము లన్నియు వ్యర్థములు— అచ్చులో పుటల సంఖ్య హెచ్చు చేయుటకు తప్ప, వీని ప్రయోజన మేమియు కానరాదు. 'ఉ' ఉభయాక్షరములలో (సంస్కృతాంధ్రములలో) చేరినను సంస్కృతమున—నదియే కాక్షర పదముగ పరిగణితము. తెలుగున నట్లుగాదు—ఈ రీతిని చూచినను, నీ యాకరముల కాస్కారములేదు.

2. నన్నయ పద ప్రయోగ కోశములో పదములను సేకరించుటయందు 'విద్వాంసులు' తోడ్పడినట్లు తొలి పలుకు 4 వ పుటలో గలదు. ఈ నన్నెచోడ పద సూచిక యందలి విశేషమేమనగా ''విద్యార్థులును, పండితులును'' పద సేకరణము గావించిరి. (చూ. పుట—2) కాని గ్రంథమును సొంతముగా పరిశీలింపగా, నిందు 'పండితు'లను వారెంతమాత్ర మీ సేకరణను

---

1. ఇది సంపాదకులు పెట్టిన పేరు— Entry అను నాంగ్ల భాషా పదమునకు పర్యాయ పదముగ తెలుగులో వాడబడినది. (నన్నయ పద ప్రయోగకోశము—తొలిపలుకు)

# నన్నెచోడ పదప్రయోగ సూచిక

వందు పాల్గొనలేదని స్పష్టముగా నిరూపింపవచ్చును. తెలుగున ప్రాచీన కావ్యములలో నేటికిని, సాహితీ రంగమున చర్చలు సాగుచున్న నన్నెచోడుని కుమార సంభవమున పదములను సేకరించుటకు 'విద్యార్థు'లను నియమించుటలో సంపాదకుల యభిప్రాయమేమో? విద్యార్థులు కాదుగదా, విద్వాంసులకైనను జాగరూకతతో పరిశీలించినగాని యర్థ సమన్వయము కానిదీ మహా కావ్యము! ప్రతి పదమేకాదు, ప్రతి అక్షరమును లోతుఁగా పరీక్షింపవలసిన కవిత నన్నెచోడ మహా కవిది.

పై నిరూపణకు నిందలి పదవిభాగ విధానమే సాక్షీభూతము. పదవిభాగము—ఈ గ్రంథమున మొదట పదము—ఆ వెనుక నుదాహరణ—ఆ వెనుక నాశ్వాస పద్య సంఖ్య గలవు.

1. పుట 131 కచ్చు—దీని కచ్చు నిలిపిన (7—36) కాని, 7—36 లో నీ యుదాహరణగల పద్య మిట్లున్నది.

ఆ. వె. మగలఁగోరి తొల్లి మగువలు తపములు
సేసి నసిరనిన చెట్ట లెందుఁ
గలవె దీనికచ్చు నిలిపిత నీవనీ
వలన సతుల పురులు వొలిసెగాక.

సందర్భమునుబట్టి యిచ్చట "దీనికి+అచ్చు నిలిపిన" అని పద విభాగము చేయక తప్పదు. "మగువల కొరకు మగవారు తపస్సు చేయు పద్ధతి యున్నది. గాని మగువలు మగల కొరకు తపస్సు చేయు పద్ధతిలేదు. దీనికి నీవె దృష్టాంతము నిలిపితివి: పథకము నేర్పరిచితివి:" అని కృతక బ్రహ్మచారియగు శివుఁడు పార్వతితో ననెడు మాటలలోనిది గలదు. కాబట్టి ఇది 'అచ్చు' అను నజాది పదము—కకారాది పదముకాదు. పదబంధ పారిజాతము (ప్రథమ సంపుటము) 32 వ పుటలో— 'అచ్చు నిలుపు' అను పద బంధమున పై కుమార సంభవ ప్రయోగమే ఈయఁబడియున్నది.

2. పుట 134 కడితలె (ఆయుధ విశేషము) అను పదము క్రింద

కడితల కాఱు (కడితల కాఁడు బహు)
కడితల కాఱు వ్రేయఁ గడికండములై (11—145

ఇందు 'కడితల కాఱు' ఏక పదముగా చూపఁబడినది. కాని, పుట 218 లో తకారాది పదముల క్రింద చూడుఁడు.

తలకాఱు : కడితల కాఱు వ్రేయుఁ గడి కండములై (11—193)

అని పై పదము, విభాగము చేయఁబడినది.

ఇందు పుట 134 లో నిచ్చిన ఆశ్వాస పద్య సంఖ్య (11—145) సరికాదు. రెండవ మాఱిచ్చిన (11—193) సరియైనది. అందే ఈ యుదాహరణ కలదు.

3. పుట 223 తావెంచలోన్ : తావెంచలో నిలఁదావగొనియున్న వెలుఁగు ఱేఁడా (10—56)

10—56 లో నీ పదముగల పద్యపాద మిట్లున్నది.

"సీ. వినువీధి నడయాడి విసివితా వెంచలో
నిలఁదావ గొనియున్న వెలుఁగు ఱేఁడా?"

ఇది నారదుఁడు కుమారస్వామిని తొలుత దర్శించు సందర్భము లోనిది. ఇచట 'తా' అనగా తాను, కుమారస్వామి—తా. వేఱుపదము. ఆతఁడు విను వీధి నడయాడి విసిగిపోయి, యచ్చట వెంచ—అనగా చరవణ సరస్సులో తావగొనియున్న స్థానముచూచికొని విశ్రమించిన 'వెలుగు ఱేఁడా', అనగా—సూర్యునివలె నున్నాడను భ్రాంతి నారదునికి గలిగించినది. కావున తా 'వెంచ ఏక పదముగా గ్రహించుట తప్పు.

4. పుట. 262. పటికపు: పటికపు ఱోలము లెవెదురు బ్రాలు— (6—47)

ఈ పదమునకిచ్చిన యుదాహరణగల పద్యపాదమిది.

"చ. పటికపుఱోలము లెవెదురుఁ బ్రాలోగిఁ బోయుచు గొరుకొమ్ముగోఁ
కటఁగొని దంచుచున్ శబరకామిని ...."

రెండవ పాదమున కొన్నిపదము లీసందర్భమున నావశ్యకము లగుట నా పాదభాగముకూడ నీయఁబడినది.

ఈ పద్యపాద విభజనమున పదములెట్లు మాఱినవో చూడుఁడు. పైన 'పటికపు' కలదుగదా— ఇఁక.

పుట 335. 'ఱ' క్రింద—ఱోలముల్
పటికపు ఱోలముల్ వెదురు బ్రాలోగిఁబోయుచు (6—47)

అని యున్నది. ఇందు

ఱోల— ముల్వెదురుఁ బ్రాలు— అనువిభాగమునకు బదులు— రెండు నొకేపదముగా నున్నవి. అప్పుడు పై పాదమున కర్థమెట్లు ? ఈ పదవిభాగమేతప్పు. ఆ పైని చూడుఁడు. పుట 171. 'కోలము' అనుపదముగా, నిది గ్రహింపఁబడినది.

కోలముల్ : పటికపుఁ గోలముల్ వెదురుఁ బ్రాలోగిఁ బోయుచు

ఱోలముల్ కోలముల్ అయినది. మనము పరుషాదియో సరళాదియో యని భ్రాంతిపడకుండ 'గో' ముందర్థానుస్వారముగలదు.

ఇది యంతకంటె పెద్దతప్పు. పద్యార్థము చూచికొనక యొక ముద్రితప్రతియందు పదములనైన పరిశీలింపక—యిట్టి విభాగము చేయుటకంటె నమచితమేమి యుండును ?

పై పద్యమున— పటికపు ఱోటియందు, ముళ్లవెదురు బియ్యమునుబోసి శబరకామిని దంచుచున్నది, అని అర్థము.

'ఱోలు' సంగతి పదసూచికయందులేదు. ఇఁక రోఁకలి.

ఇది గొరుకొమ్ము రోఁకలి అని పై పద్యపాదమున నున్నదిగదా ఈ పదసూచిక— 178 పుటలో

గొరకొమ్ము *గొరకొమ్ము రోఁకటఁ గొని దంచుచున్.(6—47)

అని పువ్వు గుర్తుతో నీ పదముగలదు.

ఈ పాఠము ఉచితము అని పంపాదకుల యభి(ప్రాయము. కాని యదినరికాదు. గొరుకొమ్ము అనగా ఏమఁగుకొమ్ము— రెండును తెలుఁగు పదములే— గొరు అను పదమునకు— గొర అను రూపాంతరములేదు— గొర— సంస్కృతపదము— అది యట్లుండనిండు—

'గొరు' అనునదేతప్పు 'గొర' యుండదని యీ (క్రింది (ప్రయోగము నిర్ధారకముగా నున్నది.

ఉ. అందొక.... జలముం గొనువాం ఛ గజంబుపోయినన్
.... .... .... బెనంగుచు నీరు (దావుగొ
రుందెగియుండు— పగరోషముతో
(భార. అను. 1—221.)

ఇచ్చట పటికపుబోలునకు బదులు చందనపు బోలున వెదురు బియ్యముడంపు కామినిని తంజావూరి రఘునాథ నాయకుఁ డిట్లు వర్ణించి యున్నాడు.

చ. కుదురుగ జంగసాచి చనుగుబ్బలు మాటుగఁ జేరుటాకు వ
య్యెద పాదలంగ నెన్నుదురొకింత చెమర్పఁగ మేచెబాళి? నే
ర్పు దొరలఁబాడి చందనపుబోలున నేనుఁగు కొమ్మురోకటన్
(బిదిలెడుకొప్పుతో వెదురుబియ్యము గుప్పునిజ(ప్రియాంగనన్
(వాల్మీకి చరి(త 2—116)

పుట 321. మెత్తక : ఎత్తు మెత్తక తక్కినన్—(4—108)

ఇట ఉదాహరణ యున్న పద్యపాదములు

మత్తకోకిల. మెత్తమెత్తన (క్రొలుదీవు సమీరణుండ, మనోభవుం
డెత్తకుండఁగ వేగకూడఁగ నెత్తుమెత్తక తక్కినన్.
జత్తుసుమ్ము వసంతుచేనని చాటునట్లు.''

దీనినిబట్టి యిచటను ఎత్తుము + ఎత్తక— అని పదచ్ఛేదము అంతియేకాని మెత్తక— అనికాదు. 'మన్మథుడు శివునిపై దండెత్తుచున్నాడు. నీవుకూడ మన్మథునికి సహాయుండవై దండెత్తుము. అట్లు దండెత్తకపోయిన చచ్చెదవు సుమా' అని వసంతుఁడు చెప్పుమాటలివి.

ఈ పద సూచిక యెంత య(ప్రామాణికముగ నున్నదో చెప్పుట కీ (క్రింది యుదాహరణ మొక్కటి చాలును.

పుట 244 ''నడపుగ'' (క్రింద
'నడపు గతి నోర్తరిగెన్,—(8—129)

ఇచట యారోప పదమునకు నుదాహరణకు సంబంధమున్నదా? నడపు గతి = నడవు రీతిగా, నోర్తు—ఒకతె, అరిగెన్ = వెళ్లెను అని అర్థము. 'అప్పుడు నడపుగ' అను పద విభజనమునకు 'గతి' యేమి? నడపు తెలుగు శబ్దము, గతి సంస్కృత శబ్దము అను పద జ్ఞానము పద విభజనమున కలుగలేదు.

ఆరోప పదములలో నిచ్చిన రూపములకు, వాని యుదాహరణలను చూడుడు. ఒక సందర్భమున నొకచో నిచ్చిన యుదాహరణము మరియొకచోట నదియే ఇచ్చిరను నవి భిన్న భిన్న పాఠములతో నున్నవి.

పుట 119 ఒప్పిదమ్ము: అప్పులుఁగుల యొప్పిదమ్ము వెడఁబోలిన
వక్షము సేయునట్టివై (7—92)

ఈ యుదాహరణమే తిరిగి 120 పుటలో ఒప్పు (అందము) అప్పులఁగుల యొప్పు దమ్ము వెడఁబోలిన వక్షము సేయు నట్టివై (7—91) అను పాఠముతో నున్నది.

పుట 203 చోఁటిఁడు : ఎచ్చోటిఁడంచున్ సురలను (బమథుల్
చుట్టి దండించిరల్కన్ (8—80)

ఇదియే (8—80) ఆశ్వాస సంఖ్య తప్పు. 2—80 అని యుండవలెను. పుట 78 లో—ఎ ((త్రికము) (క్రింద

ఎచ్చోటి డంచున్ సురలను (బమథుల్ చుట్టి దండించి రల్కన్ (2—80)

మొదల 'చోఁటు'లో నరసున్న యేమో! ఎచ్చోటిఁ(డు— ఎక్కడ నున్నవాడు— అని (ప్రకరణార్థము.ఇది దక్షాధ్వర ధ్వంసము లోనిది.

పుట 262 పందల (అప్పుడే నరకిన తల) యజ్ఞోతలపందల
యెత్తిరి (2—79).

* ఈతనింబడసె బాఁణుడు పందల (పొగనాఁగ
(10—165)
రాహు తల పందల యెత్తి (11—96)

వీనిలో రెండవది, పువ్వు గుర్తు గలది వావిళ్ల పాఠము. ఈ రెండవ యుదాహరణమునే—తిరిగి

52 వ పుటలో 'ఇంత' అను పదము (క్రింద నెట్లిచ్చిరో చూడుడు.

ఇంత దుర్భరమున నీతనిం బడసె పారుడు (10—165)
ఇంత బుద్ధుల (పొగనాఁగ నీ సురగురు డింత చేసెనిది
(10—165)

ఈ 52 వ పుటలో పాఠము ననుసరించి—'బుద్ధుల అను పదమును ఆరోపముగా చూపిరి.

పుట305 బుద్ధుల, బుద్ధుల (పొగనాఁగ (10—165)
పుట 374 రేవిన : పూవో పూవోయని చేరేవిన (6—12)
(వావిళ్ల పా.)

207 పుటలో డేవిన : పూవో పూవోయని
చేడేవిన (6—12)

195 పుటలో చే (నామ)

పూవో పూవో యని చేడేవిన గందునని (6—12)

పై యుదాహరణములో 'రే', 'డే' లు యతి స్థానమందున్నవి. 'రేవిన' అన్నప్పుడు 'సరిల్లెడు' అను పదము చూపవలెను. ఓహటిల్లెడు—అన్న పదమేగాని 'ఓసరిల్లెడు' చూపబడలేదు.

ఇంకను మరికొన్ని:

# నన్నెచోడ పదప్రయోగ సూచిక

పుట 195 చే(వామ)......ఈ ఆరోపముక్రింద
దృగ్విలాసము మృగంబులచే (6—91) అని ఉదాహరణ చూపబడినది. ఇచ్చట చే నామ వాచకమా?

పుట 48 ఆయుగములు. ఉదా: ఎసిఁడి యాయుగములు వన్ని (12—3)

ఇది సీస పద్య ప్రథమపాదము. యతి యేమయినది? ఎసిఁడికాదు. పసిఁడి అని ఉండవలెను.
చూ. యూ. ము.

పుట 35 అప్పరించుచు 'అ' లో నున్నది. ఇదే
చప్పరించుచు
చప్పటించుచు అని పుట 183 లో 'చ' క్రింద నీయబడినది.

పుట 42 అలుక. ఈ ఆరోపమున కుదాహరణముగా కట్టలు కట్టేసి అలుక మానక—అలుక తెలిఁగు అను మూడు పద్య పాదము లుదాహరింపబడినవి. దీనితో "కావు బీజంబులలుక వేగమున మొలచు"(8–173) అను నుదాహరణ మీయబడినది.

పదముల నెత్తిన వారుగాని, పరిశీలకులుగాని దీనిని చూడలేదు. మొదట మూడింటిలో అలుక నావు వాచకము—

కామబీజంబు లలుక అను నుదాహరణలో 'అలుక' క్రియాపదము.

అలుకు—చల్లు అను క్రియకు తుమున్నంత రూపము.

అందు వేగమున మొలచు అననదే పైది క్రియా పదమని తెలుపును.

పుట 304 బాఁకు పోరఁబాఁకు దార్చి—నీరు గొన్నటు 11-37
ఇచట స్పష్టముగా 'బాకు' శబ్దమునకు నరసున్న యుదాహరణలో నుండగా—అది 'పాఁకు' కాగా ఆరోపమున 'బాఁకు' అని బకారాదిగా నెట్లు గ్రహించిరి.

ఈ పద సేకరణ మెంత యస్తవ్యస్తముగా చేయ బడినదో గ్రహించుట కింతకంటే యుదాహృతుల నావశ్యకము. విశ్వవిద్యాలయ ప్రతిలోని తప్పొప్పుల పట్టికనైనను చూడక గ్రంథ భాగములోని తప్పులను ఆరోపములుగా నిచ్చుట.

పుట 61 ఈ (ఈన్)—ఈ ఆరోపమువద్ద దయావరము లీనైశ్వరమూర్తి (2—38) అను ఉదాహరణ లేదు. గ్రంథ భాగమున "దయావరములు నైశ్వర్య' అని యున్నది. తప్పొప్పుల పట్టికలో "2—38 వరములు—వరములీ" అని అచ్చు తప్పు సవరిపం బడినది.

పుట 184 చాలి—ఆరోపము. ఉదా. చాల దవుల నభవు ద్రోలు బడియె (2—88)
కాని, ఇచ్చటి ఆరోపము 'జాలి'. చూ. తప్పొప్పుల పట్టిక. యూ. ము. 'చల' అను తప్పు పాఠము నిచ్చుటచే ఆరోపముగా గ్రహింపవలసిన 'జాలి' ఎగిరిపోయినది.

పుట 279 పూనుగాఁది—పూనుగాఁడికి బదులు గాఁడి. కాని, గాఁది కాదు. చూ. తప్పొప్పుల పట్టిక పుట 175లో 'గాఁది' ఆరోపణము తప్పని వేరే చెప్పవలెనా.

పుట 248 నలంగె—చానట్లు నలంగెనా (4—108) ఇచ్చట ఆరోపము వలంగెకాదు. ఇచ్చిన ఉదాహరణలో 'చానట్లు' లేదు. నలంగెకు బదులు 'సెలంగె' అని తప్పొప్పుల పట్టిక చానట్లుకు బదులు చాటు నట్లు అని. యూ. ము.

పుట 158 కూడమి(ము): వల్వగల కూడ మవస్థల జన్మ దేశము (5—105) యూ. ము. గ్రంథభాగమున నీపద్య పాద మిట్లున్నది. "వల్వగల 'కూడ' మవ స్థల జన్మదేశము" తప్పొప్పుల పట్టిక కూడ తప్పు 'కూట' ఒప్పు అని చెప్పుచున్నది. అప్పుడిది 'కూట'మగును. తత్సమమే? అసలీ 'కూడమి' ఎక్కడిది?కూడుటకు వ్యతిరేకార్థమా? అట్లయి నచో అర్థ మనర్థమగును.

పుట 244 నటపాడున్—తప్పు—నడపాడున్ ఒప్పు.

పుట 41 అలమి—విదాహంబు తాపిమే యలమి (5—145) అలమి—తప్పు, ఎలమి—ఒప్పు. మేయెలమి అనని లో యతి పతితమగును.

పుట 210 తనచి—తప్పు—తలఁచి—ఒప్పు.

పుట 241 దారి— ఆ దారి వారి నీడలు దోచెన్ (9.76)
ఇచ్చట 'దారి' అర్థ రహితము. తప్పొప్పుల పట్టికలో 'దారి', తప్పు 'వారి' ఒప్పు అని యున్నది. ఇచ్చట 'వారి'యే సరియైన పదము. ఆ వారి—ఆ నీటి యందు వారి నీడలు తోచెను అని అర్థము.

పుట 221 తాన్—తానెత్తివొంటి 10—166—తప్పు.
చానెత్తివొంటి—ఒప్పు.

పుట 354 విఱిగి—తప్పు—విఱుగ—ఒప్పు.

పుట 152 కరము: కరమసిఁగఁ ఱచికొని (11—160)
ఇచ్చట ఆరోపము 'కరము' కాదు కరమసి అంతకంటే కాదు.
'కరాసి' యని యుండవలెను.
వావిళ్ల ప్రతి యనుకరణ దోషములు

పుట 154 కార్చిచ్చునకున్
* కార్చిచ్చునకు నెంత గడ్డివరక (10—173)

ఈపాదమంతయు వావిళ్ళవారి ముద్రిత ప్రతిలోనిది. యూనివర్సిటీ ముద్రణమున నీ పాదమునకు బదులు "తన వహ్ని కెచ్చుటి తృణకణంబు" అని యున్నది.ఇది ఉచితముగా లేదని సంపాదకులు వావిళ్ళప్రతి నాశ్రయించిరి. వావిళ్ళ ప్రతిపాఠము మానవల్లివారి ముద్రణ పాఠము ననుసరించినది. అయినను మానవల్లివారు "తన వహ్ని కెచ్చుటి తృణకణంబు" అన్న పాఠమును గుర్తించియే యున్నారు. అసలీ పాఠము తంజావూరిలోని ఏకైక ప్రతిలోని పాఠమే. తంజావూరిలోని తాళపత్ర ప్రతి ననుసరించి ప్రకటింపబడినదే యూనివర్సిటీ ముద్రణము. వావిళ్ళ ముద్రణమునకు ముద్రిత గ్రంథములే మూల గ్రంథములు. ఇక ఈ పాదములోని పదముల కిచ్చిన యారోపములన్నియు వ్యర్థములే. పుట 248 'నా' ప్రధానారోపము.

పుండ్రేక్షురసము వట్రోడి పెల్గొడి పెల్లొనా(9—36) సంపాదకులు చూచిన యూ. ము. నందిట్లు గలదు.

పుండ్రేక్షురసము వట్రోడిపెల్లొ అని కలదుకదా!అప్పుడు 'పెల్గొడి' యను గణభంగ పాఠము సంపాదకులు యెట్లు గ్రైకొనిరి? వావిళ్ళ ముద్రణమున 'వట్రోడిన' అని కలదు. అది 344 వ పుటలో చూపబడినది. కాని ఈ పాఠము 'వట్రోడి' కాని 'వట్రోడి' కాదు. అందులకు "వారణ దానవాహినుల వట్రోడి దేలుచున్(11—102)అను నిర్ధారక ప్రయోగమే సాక్ష్యము.

పద విభజన విడిచిన పదములు.

ప్రధానారోపము పదములు ఉదాహరణములలో లేనివి:
పుట 167 కొరలి(కోపించి) దీనికిచ్చిన రెం డుదాహరణములలో (9—104, 11—128) ఆరోష పదమేలేదు.

199. చేలలోన. ఆరోప పదమేలేదు.

268. వరవరు. ఆరోప పదమే లేదు. సరిగదా పకు బదులు వ. అచ్చు తప్పు.

48. ఆర (సంబోధన సూచకము). ఆరోప పదమేలేదు.

తత్సమములు.

తొలిపలుకులో "దేశ్య వైకృత పదములన్నియు, తత్సమములలో క్రియా పదములు మాత్రము సూచీకరింపబడినవి" అని కలదు. ఈ క్రింది పదములు దేశ్య వైకృతములే కాబోలును. పుట 178. గోమిని, లక్ష్మి—(3—108) ఇది తత్సమము

గోమినీ భావాధీశ పదాబ్జభక్తులు వాదిండ్ల శాసనము శాసన పద్యమంజరి, ద్వితీయ భాగము. పుట

218 తలతంత్రము—కన్నడ నిఘంటువులలో తత్సమముగా పరిగణితము.

304 బాలకి, బాల, బాలురు, ఇవి దేశ్యములా?

306 భంగి, భంగీ—భంగిన్, భంగి (వోలె)—ఇవి తత్సమములు కావా—భాతిన్ పుట 310 మరులిఁడు. దుర ములఁ జేసుకొను మరులిఁడితఁడు ఇదివై కృతపదము కాదు. సంస్కృత సంజ్ఞావాచకము.(11—101( లో తారకాసురుని సేనాధిపతులు కాలనేమి, కేతుమాలి, మహాబాహుఁడు, వజ్రదంష్ట్రుఁడు మున్నగువారితో 'మరులిఁడు' పేర్కొనఁబడినాడు. చూడుడు. పద్యము,

364 శక్యమె: నగసుత.....నెన్న నాకు శక్యమె. ఇది ఏమి?

367 సరంగమయ్యె. 'సురంగ' పదము సంస్కృతము.
సురంగ గీతముల్—తిక్కన (నిర్వ 7—137)
సురంగ నాద సంకలిత—పోతన (దశ. ఉ. 307)
పిశంగ కపర్ద సురంగమున్, జక్కన(విక్ర2. 200)

తత్సమములలో నీ క్రింది తత్సమ క్రియా పదములు సూచికలో లేవు.

అపోహము పుచ్చు ( 7— 41)
అర్పవిచ్చు (2—17)
అవసరంబను (9—39)
ఆతపత్రంబ లూదు (9—23)
అభిచారము వేల్చు (4—94)
చిల్ల తర్కంబులాడు (8—136)
భరపడు (3—49)
ప్రబోధించు (11—137)
వధావధ సేయు (11—139)
శిష్యగాంచు (1—74) ఇట్టివి ఇంకను గలవు.

ఇందు వైకృతదేశి పదము లెన్నియో విడిచి పెట్టఁబడినవి. కొన్ని అగుట (1—58) అలముసేయు (11—55) ఇంత చేసి ఇక్కుతుట్టు (5—70) ఉచ్చవించు(5—109—10—36) ఎత్తికట్టు (12–155-10—65) కన్నిడ్డ (4–55) కన్నెతీఁగె (8–4) కసగోల 2–25 కొమ్మలుసూపు(5–105) తలవాసు (10-66) నెత్తురు కుదుము (10—166) నెత్తురు పాత్తు (11-135) పగోలు (10—164) పాళియ (8—112) పిండగిలు (6—138) పోయిగారము (8—129) మూండు (6—157) నన్నె చోడుని పేరు చెప్పగనే నాలుకపై వాడు నీ పదములేదు. శబ్ద స్వరూప నిర్ధారకము లగునవి చూపబడలేదు.

కొను—కవును—పారిపారిఁ బేద కవు నతీఁగి పోఁబోయిన (3—49)

వేసగి—వేసవి—ఇంతవేసవి గలదయ్య- ప్రాస-(6—137)

పక్షులు—పవులు—వప్రాస—పవులగ (6—137)

వైరి పదములు(సంపాదకుల దృష్టిలో నివి "వింత సమాసములు")

# నన్నెచోడ పదప్రయోగ సూచిక

పుట 142. కళాకంఠ (12—108) కళాకంఠు (6—28) అను పదము నిచ్చిరి. నన్నయ పద సూచిలో (పుట 1 తొలి పలుకు) వైరి సమాసంలో ఉత్తరపదం సంస్కృత సమం అయినప్పుడు తప్ప—ఉత్తర పదాన్ని ప్రత్యేకారోపంగా ఇవ్వాలి' అని. కరకంఠుఁడు = కళాకంఠుఁడు—అని పై పదమునే చూపి నారు. ఈ గ్రంథమున నిట్లు 'డు'త్వ రహితముగ నెందుకు చూపిరో?

పుట 331. రాగ దీవియలు అను వైరి సమాసము నిచ్చియు నీ క్రిందివి యారోపములో లేవు.

అమరవేవు (8—127) అనుజాతి (7—49) కరవాలు (5—28) కొఱప్రాణులు (11–128) తరుణియ (8–68) పురమిపుఁడు (—11) మంత్ర కాటుక (6—96) మార్గపులు (1–23) మార్పంవములు (12–27) వీర మద్దెం (11–50) వానకాలము (6—104)

తత్సమ పద్య స్వరూపమున మార్పులు.

పుట 157. కుర్వకము (5—28) 'కురవకము' అను టకు చూపబడినది. అట్టి యెడ ఈ క్రింది పదముల నేల ఈయ లేదు?

కలుహారము (కల్హారము) 9—271 బరిహి (బర్హి) అన నిరు రుతి (12—42) వనే చరియలు (6—44) యవ్వనము (యౌవనము) 9—157 హరుషాశ్రు (12—213)

అర్ధానుస్వార వివక్ష—

పుట 160—161. కైపు. ఈ పదము నన్నెచోడ కవి పదునాలుగుచోట్ల బహుళార్థములలో వాడి యున్నాడు. ముద్రిత గ్రంథముల ననుసరించి మూడుచోట్ల "కైఁపు" అని సబిందుకముగా నీయబడినది. కాని, ఈ శబ్దము నిర్బిందుకము. చూడు డీ క్రింది ప్రయోగము.

క. దీపమణఁగఁ జీకటియును
గోపమణఁగ శాంతిగుణము గోల్కొను క్రియనా
టో పొద్దుట ముగ వేసవి
కైపు సడలఁదొచెఁ గారు కాలము దళమై

పాండు 4—19

పుట 167. చీఁకటి—ఇందర సున్నలేదు. ఇది చాలకాలము క్రిందట నిర్ధారితమైనది. ఇది నిర్బిందుకము

పుట 224. తీఁగ ఇది సబిందుకముకాదు. నన్నెచోడకవి రెండుచోట్ల దీనిని నిర్బిందుకముగనే పరిగణించినాడు.

సీ. రాగిల్లు కవల మేదిగలఁ బులకంబు (4—89)

గీ. వేగమున సొలియాడు లేదీగ యవంగ (8—179)

శకట రేఫ సాధు రేఫలు:

పుట 88. 'ఎఱచి' ఈ పద మొక్క పుటయందే "ఎరచి"—అని సాధురేఫతోను "ఎఱచి" యను శకట రేఫము తోడను చూపబడి యున్నది.

ఇది వావిళ్ల పాఠము ననుసరించి నప్రావాదిక పాఠము 'ఎఱచి' లో శకటమేకాని, సాధురేఫ లేదు.

క. ఉఱవగు.......గొఱియలు.......దెఱవలు
ఎఱచియు భుజియింతు రర్థి నెల్ల జనంబుల్

భార—అర 4—295

పుట 177 గొఱగ—శకట రేఫగాదు.

గొరగల్గా కిందు బృందంబు గొనియుండువారు యుద్ధమల్ల శాసనము. ప్రాస.

368. ఆరోపము సెరలుమన్ మాకు తమయం
దొఱుసెఱలోనునిచ్చి 10—125

ఆరోపమున సెఱలు—అని యుండవలెను.

అచ్చు తప్పు లారోపములయం దధికము. ఉదాహరణల యందు ప్రవ్వి తండములు కొన్నిమాత్రమే చూపఁబడుచున్నవి.

| ఆరోపములు. | ఒప్పు |
|---|---|
| పుట 87 ఎన్ని (జన్నుకార్యర్థ)- | ఎన్ని (ఎన్నుకార్యర్థ) |
| 141 కమ్మనూయని | కమ్మనూనియ |
| 174 క్రోశులు (ఎమ్మనఁ గ్రోవులు) | చిమ్మనఁ గ్రోవులు |
| 183 చచ్చవాఁడు | చన్నవాఁడు |

191 ఇందు ఆరుచోట్ల తప్పులు 'చూ' అనుటకు బదులు ఘూపడినది. ఘూపెడు,

ఘూఱగొన, ఘూఱగొని, ఘూఱపుచ్చు అని ముద్రితములైనవి.
'ఘూఱరుచ్చు' అను పదములో తిరిగి అచ్చుతప్పు—(చూఱపుచ్చు) అనుటకు.

| | |
|---|---|
| చెక గలువలు | చెంగలువలు |
| చెలదవిరులు | చెందవిరు. |
| 192 చెనఁటి యూఁవరలు | చెనఁటి యూఁవరలు |
| 268 పరిభవిపంబడితివి | పరిభవింపఁ |
| 281 పెట్టినటిదై | పెట్టినట్టిదై |

310, 328 పుటలలో మగ్గు, మర్గు మొదలైన పదములన్నియు వ్యత్యస్తముగా ముద్రితములైనవి.

| | |
|---|---|
| 322 మెరు | మెర్గు |
| 329 మానుయోనికిం | మానుమానికిం |
| 330 యోపె | మ్రోపె |
| మ్రేపె | మ్రోపె |
| మ్రేపెన్ | మ్రోపెన్ |
| మొగ్గెన్ | మ్రొగ్గెన్ |
| 347 వాడినయెలు | వాడిన యెల్గు |

కొన్ని పుటలలో వర్ణాను స్వారములు పాటింపకపోవుట వలన వర్ణక్రమము తప్పినది. ఉదా: పుట 346 వాఁగు—వాగు ఉదాహరణలలో ప్రతి పుట యందున్నవి. మచ్చునకు

పుట 101 ఐ ప్రీతాత్ములై ప్రీతాత్ము లై

287 ద్విగ్విలాసవతి దిగ్విలాసవతి

ఇట్లున్నను తొలి పలుకు 2 వ పుటలో "ప్రూఫులు దిద్దిన వారికి కృతజ్ఞతలు" తెలుపబడినవి!

ఈ గ్రంథ సంపాదకు లిరువురును తయారు చేసిన "నన్నయ పద ప్రయోగ సూచిక బహు సంస్కారములను కోరు చున్నది" అని యా గ్రంథ సమీక్ష తెలుపుచున్నది. నన్నెచోడ పద ప్రయోగ సూచిక యంతకంటే మరి రెండాకు లెక్కువ చదివినది. ఇచ్చట సంస్కారమేగాదు. గ్రంథమంతయు సాకల్యముగా తిరిగి సంస్కరింపబడి ముద్రింపబడవలసి యున్నది. ఇట్టి పరిస్థితికి కారణము సంపాదకు లిరువురో? ఒక్కరో?

ఆంధ్ర భాషా వాఙ్మయమునకు, పరమ ప్రామాణికము లైన భారతాది గ్రంథములకు పద సూచికలు ప్రకటించు మహోద్యమమును తలపెట్టి దానిని కొనసాగించుచున్నందులకు, ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీవారిని మన మభినందించవలసినదే. కాని, ఈ కార్య నిర్వహణమునకు మాత్రము, అకాడమీవారు, సమర్థులు, సాధికారులు, సాహితీ నిష్ణాతులునగువారిని నియమించుచున్నట్లు కానరాదు. ఇట్టి పట్టుల స్థానికులను, సాహిత్య అకాడమీ వారితో సంబంధము గలవారిని, అపరిణతులగు విద్యార్థులను నియోగించుట రెండేసి గ్రంథముల కొక్క సంపాదకద్వయము తోడనే పని కొనసాగించుట అను అకాడమీ వారి నిరంకుశ విధానముతో మన మెంత మాత్రమును నేకీభవింపజాలము. సకాలములో ద్రవ్యము వ్యయ పఱచుటకు గ్రంథములు వచ్చుచుండుటయే, అకాడమీ వారి యుద్దేశమైనచో, నదియును, నంత ప్రశంసనీయము కాదు. అకాడమీ సంస్థ విశాలాంధ్రమునకు, భాషా వాఙ్మయమునకు సంబంధించినది. రాష్ట్రేతర ప్రాంతముల, భాషా పరిశ్రమ చేయు వారలకు నిందవకాశములు కలుగవలయును. అకాడమీ వారీ విషయమై శ్రద్ధ వహింతురు గాక!

ఇంకొక ముఖ్యవిషయముతో సమీక్ష ముగియనున్నది. తంజావూరి పుస్తక భాండాగారములోని కుమారసంభవమునకుగల ఏకైక తాళపత్రప్రతి శిథిలావస్థలోనున్నది. అదిపూర్ణముగా జీర్ణముకాకుండా, సంరక్షించుభార మాంధ్ర విద్వత్పోషక వర్గముపైనున్నది. ఆ తాళపత్రప్రతిని యథామూలముగా "Microfilm" కాపీ తీయించి, అందుండి ఫొటోగ్రాఫుల మూలముగా నా గ్రంథమును భద్రపఱచుట మన ప్రథమ కర్తవ్యము. ఇదియెంత శీఘ్రముగా జరిగిన నంతమేలు. సాహిత్యఅకాడమీవా రట్టి కార్యమునకు పూనుకొందురుగాక !

ఈ గ్రంథ ముద్రణకు కొన్ని వేల రూప్యములు వ్యయమై యుండును. ఈ వ్యయ మంతయు వ్యర్థమే. దీనికి వినియోగించిన ద్రవ్యముతో నన్నెచోడని కుమార సంభవమునకు సుపరిష్కృతమై విపుల వ్యాఖ్యా సమేతమైన, ప్రామాణిక ముద్రణము మనకు లభించి యుండెడిది. కాని, యట్టి భాగ్యమునకు మనము నోచుకొనలేదు.

---

# మనవి

భారతిలో ప్రచురణకు పంపే వ్యాసాలు భారతిలో మూడూ నాలుగు పేజీలకు మించకుండా ఉండేటట్లు చూడవలసినదిగా రచయితలకు మనవి.

భారతికి ఉద్దేశించిన వ్యాసాలను సంపాదకుడు, భారతి, అని వ్రాసి పంప ప్రార్థన.

అవసరమైన పోస్టు బిళ్లలను అంటించిన కవరుమీద తమ చిరునామాను వ్రాసి పంపినవారికే అంగీకరింపబడని వ్రాతప్రతులు త్రిప్పి పంపడం జరుగుతుంది. తమ వ్రాతప్రతులను త్రిప్పి పంపమని కోరేవారు ఈ అంశమును గమనింప ప్రార్థితులు. [సం. భా.]

గ్రంథ సమీక్ష

# మాండలికవృత్తిపదకోశ సమాలోకము


శ్రీ వంతరాం రామకృష్ణారావు


ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు "తెలుగు వాడుకలో ఉన్న పదాల నన్నిటినీ కోశస్థంచేసే దృష్టితో" మాండలిక వృత్తి పదకోశ ప్రకటనకు పూనుకొనుట ప్రశంసనీయమైన విషయము. 1958 జూన్‌లో కార్య నిర్వాహకవర్గము చేసిన తీర్మానమునకు ఫలితముగా 1962 జూలైనాటికి వ్యవసాయ వృత్తి పదకోశము ప్రథమ సంపుటముగా వెలువడినది. సంకలన కర్తృత్వము, సంపాదకత్వము డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి గారు వహించినారు. ఆంధ్రప్రదేశ్‌లోని ఇరవై జిల్లాలలోగల 121 గ్రామాలలో పద సంగ్రహణ జరిపించబడినది. ఆ సంగ్రహించబడిన పదములను, విషయమునుబట్టి పదమూడు భాగములుగా విభజించినారు. చివర అకారాది పదసూచిక అనుబంధముగా చేర్చబడినది. ఇట్టి పదకోశముల విషయమున అనుసరింపవలసిన పద్ధతి ఇదియే యనుటకు సందేహములేదు. ఇందుకు గురుబాల ప్రబోధికతోడి అమరకోశము వీరికి మార్గదర్శకమై యుండును. భాషా ప్రామాణ్య దృష్టితో ఆరోప పదములను (Entries), ఉచ్చారణ భేదములను, పర్యాయపదములను వర్గీకరించు పద్ధతి శ్లాఘాపాత్రముగా నున్నది.

కావ్యములలోని శబ్దములే కొన్ని మన నిఘంటువులకెక్క లేదన్నప్పుడు వ్యవహారములోనున్న కొన్ని పదములు ఈ కోశమున చేరకపోవుటలో ఆశ్చర్యములేదు. ముఖ్యముగా శ్రీకాకుళము జిల్లాలో వాడుకలోనుండి ఈ కోశమున కనబడని కొన్ని పదములను ఇటు చూపుచున్నాను. వీటిలో కొన్ని బ్రౌణ్యాదులలో చూపట్టుచున్నవి.

I భూములు:—(1) ఇస్తువా. ఈ పద మిట్లు బ్రౌణ్యమున కెక్కియున్నది. "ఇస్తువ— An estate (Vulgar); ఇస్తువ or ఇస్తువు. Property, Estate, సొత్తు, ఆస్తి". (2) కమ్మి (భూమి) ఈ పదమును బ్రౌణ్యమున కలదు. "కమ్మి Kami. Deficiency" బ్రౌ. (3) బొడ్డె= చిన్నమడి. (4) రేవడి=బీడునేల.

II సేద్యం:—(1) కదపా=(కోశమున 'కదప పాలు; కౌలు—అన్నవి కలవు.) "కదపా — An agreement, a written bond. ఒడంబడికె, పత్రము" (బ్రౌ) రైతు భూస్వామికి వ్రాసిఇచ్చు ఒడంబడిక పత్రము. (2) తనఖా= భూమిని కుదువపెట్టుట. "తనఖా........తంఖా for తన్‌ఖా= An assignment on the revenue. An assignment or billet on lands; An order on the treasury for the payment of a stipend. (బ్రౌ) (4) తాసీల్దారు. (డు) ఉ. తహసీల్దారు(డు). కోశమున సముద్దారు శానేదారు—చూపబడెను. "తహసీలుదారుడు— Tahasildar. A Collector of revenue. (బ్రౌ) (5) దుక్కి బదులు=పొలము సేద్యము చేయురైతు, ఆసామికి వడ్డీలేని పద్ధతిపై ఇచ్చిన అప్పు. (6) ధరావత్తు = "ధరావత్తు for Dharot (Mahr.) Deposit Money given in pledge, or security. డిపాజిట్టు (బ్రౌ.) (7) నాదారి. ఉ. నాదారు. బ్రౌణ్యమున "నాదారు—Indigent, bankrupt, destitute లేమిడిగల" అని యున్నది. (8) ఫలసాయం ఉ. పలసాయం="ఫలసాయము—Producc, Crop, fruits ఫలము" (బ్రౌ.) (9) భాగం=పాలు. (10) భుక్త=బుగత. (11) వరకట్టు = బంజరు మొదలగువాటిని దున్ని మడిగా చేయుట (12) వాటా = "వాటా—Bata. A division sharc, part, portion. తుక్కడి, భాగము" (బ్రౌ.) (13) మోతుబరు=మోతుబరి. "మోతుబరు రైతువోలె విఖ్యాతి కెక్కె" అను ఆంధ్ర పురాణ ప్రయోగమునుబట్టి (శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు) 'మోతుబరు' అను రూపము తూర్పు గోదావరిజిల్లాలో ఉండవచ్చునని తోచుచున్నది. "మోతుబరు.....Motabar" అను బ్రౌణ్యము ఈ యూహను బలపరుచుచున్నది.

## III నీటివసరులు – తోడే సాధనాలు

(1) కలం=గండి. (2) ఖానా. ఉ: కానా=వాలుగొమ్మి. (3) చప్టా=అడ్డి. 'అడ్డి'కి చూపబడిన పర్యాయ పదములలో 'చప్పిడి' అను పద మొకటి కలదు. 'చప్పిడి'కి చూపబడిన ఉచ్చారణ భేదములలో 'చప్పట' అన్న దొకటి. 'చప్పట=చప్టా' అయి యుండును.

## VI ఎరువులు–చిల్లర పనిముట్లు

(1) చూరకత్తి=చురకత్తి. "చూరకత్తి or చూరి. A Knife చాకు" (బ్రౌ.) (2) పింద్రిక=పెంట్రుక. (3) బొరిగ—బొరిగె.

---


మాండలికవృత్తి పదకోశం: (సంపుటి 1) అకాడెమీ ప్రచురణ; సంపాదకులు: శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి; వెల : రు 25/– ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి: తిలక్ రోడ్, హైదరాబాదు.

## VI బండి : భాగాలు

(1) అరక = బండి ముందరి భాగమునకు భార మెక్కువయి పూజు పశువుల అర్రులను అణచుస్థితి. (2) కండెనకర్ర = ఎత్తుగర్ర (3) కమ్మి=కమ్మీ, (4) గొడుగుపాటు=బండి తిరుగబడిపోవుట, (5) మెట్టుకర్ర=ఇరుసును పర్రామును కలిపి బంధించుటలో ఉపయోగపడు కర్ర. (6) మొత్తాలు = మొత్తా. (7) లేవ=బండి వెనుక భాగమునకు భారమెక్కువై పూజు పశువుల అర్రులపైనుండి లేచిపోవు స్థితి.

## VIII మొక్కలు, చెట్లు

(1) బలరాకాసిచెట్టు. ఉ. బల్లాకాసిచెట్టు=బలరచ్చిక.

## X పంట : ఒడుపు, కళ్ళం, నిలవ

(1) చుమ్మ, ఉ. సుమ్మ (పర్యా, మట్టు) = బుట్ట మొదలగు వాటితో ధాన్యాదులను మోయవలసి వచ్చినప్పుడు తలపై పెట్టుకొనుటకు గడ్డితో అల్లిన గుండ్రని వస్తువు. (2) దాపలెద్దు = బండి మొదలగువాటికి దాపటి భాగమున పూంచబడు ఎద్దు. (3) నూర్పు=నూర్పిడి. (4) పొల్లాయి = చాకలి మొదలగువారికి వారు చేసిన సేవకు ప్రతిఫలముగా ఇచ్చు ధాన్యాదికము. (5) పోక=రాసి. (6) బిండ=పశువుల ఒడళ్ళను పాముటకు ముద్దగా చేసిన కొద్ది యెండు గడ్డి. (7) బెంటు = కళ్ళమువద్ద అగ్గి నిలువ చేయుటకు గడ్డితో అల్లిన లావుపాటి త్రాడు (8) బొద్దు=గడ్డి మొదలగు వాటిమోపు. A rick or bundle of grace..." బ్రౌ. (9) బెంటి ఉ: వెంటి. గడ్డికుప్పలు ఎగిరిపోకుండ కట్టుటకు గడ్డితోఅల్లిన త్రాడు. (బెంటు. బెంటి, వెంటి—కొలది భేదముతో ఏకార్థములు). "వెంటి—A straw rope మెలిపెట్టిన కసవుదారము" బ్రౌ. (10) మట్టు—చూ. చుమ్మ.

## XI పంటలు (1) వడ్లు

(1) సార్వా=మొదటిపంట. "దాళవా(లు)" అనునది కోశమున కెక్కినది. 'సార్వా' తప్పిపోయినది. "సార్వా—Any grain that has a light coloured husk as rice?; సాళవాదళవా లెక్కలు. The account regarding the white and black grain crops ie. For the whole year. This term is peculiar to the North." దాళువా Dark Coated; having a black husk. దాళువాపంట. The black crop, a technical phrase used in Ganjam" బ్రౌ.

## XI (3) కూరగాయలు

(1) సీమవంకాయ=టమోట. "టమాటో=యూరోపియను వృక్షశాస్త్రజ్ఞు లిది వంగజాతిలోఁ జేరినదని చెప్పుదురు. అందుచేతనే హిందూదేశమునందు టమాటో కాయలను సీమవంకాయలని వాడుచుందురు" (ఆంధ్ర విజ్ఞానము).

## XI (4) రొక్కపు దినుసులు, పండ్లు

(1) జాంపండు = జేమ. "జాంపండు or జామపండు From Jam. The guava fruit గొయ్యాపండు" బ్రౌ. (2) బత్తాయి నారింజపండు="బత్తాయి from Batavia ఒక దేశము also written బతావి whence బత్తాయి నారింజపండ్లు A kind of orange" బ్రౌణ్యము. (3) బొట్ట=పండిన చింతకాయ (4) రాంబలప్పండు=రామాఫలము "రామఫలము చెట్టు (రాంభాళప్పు జెట్టు)" ఆంధ్ర విజ్ఞానము. (5) సీతాబలప్పండు= సీతాఫలము.

## XII పశువులు (2) ఆకార విశేషములు

(1) అరువు = అఱ్ఱు. (2) ఆసనపుసుడి (3) పర్యా. మహేశ్వరసుడి) = వృషభముయొక్క ఆసనపు అడ్డుటెముక నుండి నాలుగైదు అంగుళముల క్రిందనుండు సుడి. (4) కంద సుడి = మెడకు ఒకప్రక్కనుండుసుడి (5) జంటసుడి—నొసటి భాగమున ఒకదానిపై నొకటిగానుండు ఏకాకారముగల రెండు సుడులమొత్తము. ఇది అనుభదాయకము. (6) నాగసుడి = నాగపాశం. ఇది. మంచిది కాదు. (7) నాదారు = పశువుల జతలో బలముచేతను ఆకారము చేతను తోడి పశువులకుతీసి కట్టుగుపశువు. (8) బ్రహ్మసుడి (9) పర్యా. స్థానపుసుడి (10) తావుసుడి. కోశములోని 'తావు సుడి' వేరుగానున్నది, = పశువు కొమ్ములకు దిగువగా నొసటి యందుండు సుడి. ఈ సుడి సర్వసంపత్కరము. (11) మధ్య సుడి = పశువుముందరి కాళ్లలోపలి భాగమునసుండు సుడి (12) మూత్రపుసుడి = పశువు పొట్టమధ్యభాగమున నుండు గీతకు మధ్యను, మూత్రకోశ సమీపముననుండు సుడి. (13) మొండి యెముక= పశుశరీరమునకు రెండుప్రక్కలనుండు ఇరవైయారు ప్రక్కటెముకలలో బైటికి కనబడు యెముక. ఇది చాలా అశుభప్రదము. (14) మెలువు = పశువులజతలో తోడి పశువుకంటె బలముచేతను ఆకార విలువచేతను మేలైనది. (15) రెంటెం. ఉ. రెంట=మూపురము. (16) విష్ణుసుడి = పశువు మూపురముయొక్క వెనుకభాగమున 12, 14 అంగుళముల లోపల వెన్నెముకభాగము తొలగిపోక ముందు కన్పట్టు సుడి (ఇది 'ధాన్యపుసుడి' కావచ్చును.)

## XII (4) అలంకారాలు; బంధనాలు

(1) పణముప్వలు = పణగజ్జెలు. (2) సికుమారు. ఉ సికమారు = సిగమోర.

## XII (5) వ్యాధులు

(1) ఆంత్రవాతం. (2) ఆమవాతం (3) గర్భవాతం (4) శుద్ధవాతం (5) కాలికుంటు = పశువునకు 106, 107 డిగ్రీల జ్వరముండును. కాళ్ళను, చెవులను వేడిగాముండును. నోటినుండి చొంగకారుచుండును. నోటిలోపలను, దవుడ లోపలిభాగమునను, డెక్కల సందులలోను, కన్నులలోను,

పాడిపశువులకు పొదుగులమీాదను చిన్నచిన్న బొబ్బలు కనబడును. (ఇది 'కాలిగాలె' కావచ్చును).

### XIII (1) పండగలు : నమ్మకాలు

(1) సాలగ=సెలగ

### XIII (2) చుక్కలు, కార్తెలు

(1) దినకత్తెర్లు = దినకర్తరి. (2) మొుండికొడవలి = హరివిల్లు. పడమటి గోదావరిజిల్లా వ్యవహారమట.

### XIII (3) వాన, గాలి

(1) మసుపు=మబ్బు పట్టియుండుట.

### XIII (4) కొలతలు

(1) పందొమ్మందుం="పందొమ్మందుము=The Dry measure of ninteen tooms (బ్రౌ)(2) పద్నల్తుం= "పద్నల్తుము. = The Dry measure of fourteen tooms" (బ్రౌ). ఇచ్చటికి ఈ పదములు — మొుత్తము, డెబ్బదియారు.

కొన్ని పదములు కోస్తాలోనే — అనగా నెల్లూరు, గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరి, విశాఖపట్నం, శ్రీకాకుళము జిల్లాలలోనే వాడుకలో నున్నట్లు సూచింపబడలేదు. I — (1) ఆయుకట్టు (2) ఒండునేల (3) కోను III—(1)జెల (2) తీరవ V—(1) తప్పుకోల—ఈ పదము కృష్ణాజిల్లాలో వాడుకలో నుండవచ్చును. "త్రవ్వఁగోలయును గట్టు ధరణి జాతి పడంగ" (శ్రీ విశ్వనాథ, అయోధ్య— ప్రస్థాన 132 ప) (2) పదును (3) సమ్మెట VIII—(1) కలబంద (2) పుట్ట కొక్కు (3) బొమ్మజెముడు (4) మద్ది (5) మర్రి (6) వావిలి X—(1) పిప్పి (2) బాన (3) బడితె XI—iii—(1) కొయ్య గూర (iv)—(1) జాంగీర్ XII-(ii)-(1)చుక్క (2)చూడి— "చూడిగేదెకుఁ బెయ్యదూడయే పుట్టునో" (బుతుసంహారము— గ్రీష్మ) అను శ్రీ విశ్వనాథవారి ప్రయోగములనుబట్టి యిది కృష్ణా జిల్లాలో నుండవచ్చునని అనుమానము. (iii)— (1) దాణా (2) పెండ — ఇది గుంటూరుజిల్లాలో వ్యవహారమున నున్నదట (3) పేడ. XIII-(iii)-(1)కుండపోత (iv)- (1) పడి (బొబ్బిలిపడి, పాలకొండపడి — అని వ్యవహారము) ఇవి మొుత్తము ఇరవైయారు పదములు.

శ్రీకాకుళముజిల్లాలో ఉన్నట్లు సూచింపబడని పదము లధికముగా కనబడుచున్నవి. ఇవి పద సంగ్రాహకుల మితి మీరిన అనవధానతను చెప్పక చెప్పుచున్నవి. I—(1) పొలం. II—(1) ఆసామి (2) తాణేదార్ (3) మగతా (4) మొుకాసాదార్ (5) మోతుబరి (6) రైతు (7)సముద్దారు III—(1)ఏతం (2) కళింగ (3) తూము (4) దోనె IV—(1)కంప (2) క్రరు (3) కాడి (4) నాగ (5) పణత (6) పాన్ను (7) మలుపు V—(1) ఎరువు (2) కమ్మకత్తి (3) గొద్దె (4) చెత్త (5) దారు (6) నాగలి (7) లద్దె (8) సమ్మెట VI—(1) కాడి (2) చెక్రం VII-(1)క్రర (2) గడ్డి (3) చిగురు (4) దడి (5) పాడు (6) పూత (7) ముదురు (8) మొుగ్గ (9) మొన (10) రెమ్మ VIII-(1) ఈత (2) గుంట గలగర (3) చింత (4) జనుం (5) తుమ్మ (6) నల్లేరు (7) నేపాళం (8) పల్లేరు (9) పిల్లి పెసర (10) మినుం (11) ములగ (12) ముసిడి (13) రేగు (14) వేప IX—(1) గొల్లభామ (2) చీడ X—(1) కొంకి (2) గరిసె (3) గోనె XI—(ii)—(1) అలచంద (2) అరికె (3) ఉలవ (4) ఊదలు (5) కంది (6) కొర్ర (7) గంటి (8) చోడి (9) జొన్న (10) పెసలు (11) నల్లపెసలు (12) రచ్చపీసలు (13) మినుము (iii)—(1) అరిటి (2) ఆనప (3) కాకర (4) ఆగాకర (5) గుమ్మడి (6) బూడిద గుమ్మడి (7) గోంగూర (8) చిక్కుడు (9) గోరుచిక్కుడు (10) చిలగడదుంప (11) చుక్క (12) చేమ (13) తోటకూర (14) దొండకాయ (15) దోస (16) నక్కదోస (17) నల్లేరు (18) పుచ్చ (19) పెండలం (20) క్రరపెండలం (21) పొట్ల (22) బీర (23) బెండ (24) బుడమ (25) మునగ (26) ములగ (27) వంకాయ (28) నీటి వంకాయ (29) ముళ్ళవంకాయ (30) వెలగ (31) సీకాయ XI—(iv)—(1) ఆముదాలు (2) ఈత (3) ఉసిరిక (4) కాము (5) కొబ్బరి (6) చింత (7) చెరుకు (8) జీడి (9) తాటి (10) దబ్బ (11) నిమ్మ (12) నువ్వు (13) నేరడ (14) పత్తి (15) పుచ్చ (16) పొగాకు (17) బత్తాయి (18) మామిడి (19) అంటుమామిడి (20) ఏనుగుతల (21) కలకతేరు (22) కోల్లగోవ (23) గన్నేరు (24) నల్ల ఏండ్రాస్ (25) నీలం (26) పలకదంతవ(త?) (27) బంగినిపల్లి (బంగినిపిల్లి— అన్న వ్యవహారమును కలదు.) (28) రసాలు (29) సువర్ణరేఖ (30) మిరప (31) పచ్చిమిరప (32) సీమమిరప (33) రేగు (34) వేరుసెనగ (35) సపోటా (36) సీమచింత. XI—(ii)— (1) ఎర్ర (2) గంగడోలు (iii)—(1) కుడితి (2) గడ్డి (3) గోలెం (4) చిట్టు (5) తట్ట (6) బుట్ట (7) సానిడి (iv)—(1) బందెల దొడ్డి (2) బందం (3) లంకె. XIII—(i)—(1) సెలగ —(ii)— (1) నెల (2) పొద్దు (iii)—(1) గుడి (2) హరివిల్లు (iv)—(1) అరసోల (2) అరవీసె (3) ఆర్దం (4) ఇద్దుం (5) ఎకరా (6) ఏదుం (7) కుంచం (8) గిద్దె (9) తవ్వ (10) తూము (11) తొమ్మందుం (12) నల్తుం (13) పదముత్తుం (14) పదహార్దుం (15) పదిహేడ్దుం (16) పదిహేందుం (17) పద్దెనమందుం (18) పందుం (19) పుట్టి (20) బస్తా (21) మణుగు (22) ముత్తుం (23) ముప్పందుం (24) వీసె (25) సోల ఈ పదములు మొుత్తము 180.

మొుక్కలు, చెట్లు, పంటలు, పైరు తెగుళ్ళు—అన్న భాగములక్రింద చూపబడిన పదముల అర్థ వివరణము శబ్ద రత్నాకరాది గ్రాంథిక నిఘంటువుల అర్థ వివరణముకంటె మేలుగా నున్నది. ఈ విషయమున వీరికి ప్రౌఢ్యము మార్గదర్శకమయి యుండును.

XI—(ii)—(1) "అనుము. అలచందవంటిదిరిగాఉండే ఒక రకం పప్పు దినుసు; అయిదారు నెల్లపంట Dolichos cultratus, D. Lablab. Linn." (పదకోశము.) "అనుము. A leguminous plant: Dolichos catjang; the cultivated species ... అనుములు Beans Dolichos lablab" (బ్రౌణ్యము.) (2) అలచంద నాలుగైదు నెల్లలోపండే పప్పుదినుసు; Vigre catjang, Endl. Dolichos catjang, Linn; ఆకులు, ఆకుపచ్చటి రంగు తయారీకి, గడ్డి పశువుల మేతకు ఉపయోగిస్తారు" (పదకోశము) "అలచందలు. A leguminous plant. Dolichos catjang రాజమాషము" (బ్రౌణ్యము) (3) "ఆరికె. ఒక రకం ఆహార ధాన్యం Paspalum frumentaceum" (పదకోశము) "ఆరికెలు — A species of grain, (called paspalum frumentaceum) minute black and globular. The ear is not easily seen, and the crop always has the appearance of being blasted, సోళ్లు is similar but oblong (బ్రౌణ్యము.)

VIII—(1) ఆముదం; లేత, ఉదారంగుగల గుండ్రటి బోలుకాడ, పెద్ద ఆకులు, ముళ్ళతోనిండిన కాయలుఉండి 8–10 అడుగుల ఎత్తు పెరిగే నూనెగింజల చెట్టు; ఆకులను పచ్చి ఎరువుగా ఉపయోగిస్తారు. Risinus Communis, Linn" (పదకోశము) "ఆముదపుచెట్టు—The castor oil tree, palma Christic or Ricinus cannuris" (బ్రౌణ్యము.)

IX—(1) మలిపురుగు=వంగకంది మొ॥ చెట్లఆకులు తినే సన్నటి చీడ పురుగు." (పదకోశము) "మలిపురుగులు—Worms in the bowels (బ్రౌణ్యము.) (2) గొల్లభామ = పచ్చటి ఆకులు తినే రెక్కల పురుగు; మిడత; వీటిలో చాలా రకా లున్నాయి." (పదకోశము) "గొల్లభామ—Also the name of a gigantic grasshopper often six inches long called Mantis precatoria or the walking leaf " (బ్రౌ) ఈసందర్భమున, బ్రౌణ్యమున లేని పెక్కు పదములు పదకోశమున కలవను విషయము మరవరాదు.

'ఇనాం' అను పదమువద్ద "దరిమిలా—?" అని ప్రశ్న చిహ్నముంచబడినది. "దరిమిల, దరీవిల్ల Adv — Darinwila–Subsequently, here in after. దానికి దరిమిల Since that date .... " అని బ్రౌణ్యము. దరిమిలా ఇనామనగా 1701 కి దరిమిలా ఈయబడిన ఈనామని అర్థము. 1701 లో జమీందారీలకు 'పేష్కష్' శాశ్వతముగా నిర్ణయింపబడినది. ఆ తరువాత జమీందారులు కొన్ని ఇనాములనిచ్చిరి. అవి 'ఇనాం కమీషనరు'చేత 1865 లో 'రికార్డు' చేయబడినవి దరిమిలాయినా మనునది. 1701 తరవాత జమీందారు లిచ్చిన ఈనాములకు చెందును. "భోగబంద—కౌలు నిర్ణయించుకొని డబ్బు ముందుగా చెల్లించిన తర్వాత రైతు కిచ్చిన భూమి"—ఈ యర్థము వ్యవహార విరుద్ధముగా నున్నది. బ్రౌణ్యమున చెప్పబడియున్న అర్థమే వ్యవహార సిద్ధము. "భోగబంద—భోగబంధము Mortgage on land; which till the debt is paid is enjoyed by the creditor" (Ganjam) Usufruct భోగ్యము" (బ్రౌ.) "కాశి (సి) కూర — ఒకరకం ఆకుకూర" అని చెప్పబడెను. గోంగూరలో 'కాశి గోంగూర' అన్న దొకటి వినబడును. అదే ఇది యేమో! "జోడా—దొంగదానికి ఒకవైపు రెండు కాళ్ళకూ కట్టే కట్టు"—ఈ యర్థము సరియైనట్లు కనబడదు. "పాలు తియ్యటానికి తన్నే ఆవుకాళ్ళకు కట్టేకట్టు" అని 'దాయ' శబ్దమునకు చెప్పిన అర్థమే దీనికి చెప్పవలసి యున్నది. "వంపఎద్దు ఉ: వలపఎద్దు—బంతిలో కుడివైపునఉండి బంతి తప్పే యెద్దు"—బంతిలో కుడివైపున ఉన్నది మాత్రమే కాదు బండి మొదలగు వాటికి కుడివైపున పూంచబడు ఎద్దును గూడా 'వలపటెద్దు' అనియే అందురు. ఇట్లే దాపటెద్దు—బంతిలో ఎడమ వైపున్నది" మాత్రమే అయియుండదు. మెట్టుగుది—బండిపరాన్ని డొలుపుకు బిగించే తాడు" అని చెప్పబడెను. పీఠికలో "మెట్టుగుదె—అన్న పదానికి సూర్యరాయ నిఘంటువులో 'ఒక విధమగు శకటావయవము' అని అర్థం ఇచ్చారు. అని తెలుపబడినది. గుదె—దండము, కఱ్ఱ—అని గదా అర్థము మెట్టుగుది—(గుదె–గుది) అన్నది కఱ్ఱ కావలెనుగాని త్రాడెట్లగును? 'మెట్టుగుది' అన్న దానికి 'మెట్టుగుదితాడు' అన్నది పర్యాయ పదమనబడెను. ఈ 'మెట్టుగుది' అన్నది శ్రీకాకుళము జిల్లాలోని 'మెట్టుకఱ్ఱ'కు సరిపడునని తోచుచున్నది. (చూ. బండి : భాగాలు) మెట్టుగుది—మెట్టుకఱ్ఱ. దీనితో కలిపి కట్టుట కుపయోగించబడు త్రాడు 'మెట్టుగుదితాడు'. 'మెట్టుగుదితాడు', యొక్క అర్థము 'మెట్టుగుది'కి చెప్పబడెను. అర్థవివరణమువల్ల స్పష్టపడని ఆ యా పనిముట్లు మున్నగు వాటిని రేఖా చిత్రముల ద్వారా వివరించుట ప్రశంసార్హముగా నున్నది.

అర్థ వివరణలో ముఖ్యముగా జిజ్ఞాసువులకు సంతృప్తినీయని భాగము 'చుక్కలు—కార్తెలు' అనునది.

(1) అక్కా జెల్లెలు చుక్క (లు)=పుర్వోత్తరాషాఢలు కావచ్చు. ఇవి దగ్గర దగ్గరగా ఉంటాయి"—ఈ చుక్కలు తుల్యాకారము గలవి అగుటచే వీటికీ పేరువచ్చియుండును. "ఉత్తరాషాఢా—అస్యారూపం, సూర్పాకృతి తారా చతుష్టయాత్మకమ్ ఇతి కాళిదాసః గజదంత వదష్ట తారామయమ్, ఇతి దీపిక టీకా" "పూర్వాషాఢా—సా—సూర్పాకృతి చతుస్తారాత్మికా, గజదంతాకృతి ద్వితా రాత్మికావా" (శబ్ద కల్పద్రుమః).

(2) అన్న దమ్ముల చుక్క—పూర్వోత్తరా భాద్రలు కావచ్చు—ఈ చుక్కలను గూర్చి శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారు తమ 'నక్షత్రములు' అను గ్రంథమున ఇట్లు తెలిపియున్నారు. "ఈ భాద్రపదా నక్షత్రములు నాలుగు నాలుగు

చుక్కలుగ చక్కని చతురస్ర రూపమున మెరయుచుండును. తేజస్సునందును, ఆకారమునందును ఈ తారలు ఒకదాని కొకటి తీసిపోక జోడాజోడీలన నొప్పుచు, జట్లు కట్టుకొని కదలుచున్నట్లు మింట నగపడును. అందుచేతనే శ్రీ మద్రామాయణ కవి వాల్మీకి బాలకాండలో దశరథ పుత్రులు శ్రీ రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు నలువురు సోదరులును పుట్టి పెరుగు సందర్భములను వివరించుచు, వారు "రుచ్యా ప్రోష్ఠ పదోపమా" అని వారి నీ నాల్గు నక్షత్రములతో చక్కగా పోల్చినాడు" ('నక్షత్రములు' 178 పు) ఇత్యాది వివరములనుబట్టి 'అన్న దమ్ముల చుక్క' పూర్వోత్తరా భాద్రలని స్పష్టపడుచున్నది.

(3) అసిలేరు—ఆశ్లేష బ్రౌణ్యమునను ఇట్లే చెప్పబడి యున్నది." ఆసిలేరు— A Vulgar name for ఆశ్లేష".

(4) ఆలమంద—'శతభిషా నక్షత్రము కావచ్చు' అన్నారు. కాని, ఇది సరియైనట్లు తోచదు. ఆలమంద=ధనిష్ఠ అయి యుండును. "ధనిష్ఠ—గోలోకము—ధనిష్ఠకు పూర్వనామము శ్రవిష్ఠ, శ్రవణ సామీప్యమున చీనావారు నక్షత్ర రూపముగల గోవులను చూచుచుండిరి. క్రీస్తుశకమునకు ఐదు శతాబ్దముల ముందుండిన కుంగ్ ఫూచే (Confucious) అను చీనా పండితుడు వీనిని వృషభములుగా భావించి వానిం గూర్చి చిన్న గీతము రచించెను. చీనా పండితుడు చెప్పక పూర్వము ఋగ్వేదములో నీ గోబృంద ప్రశంస కలదని తెలిసికొంటిమి. ఋ1. 154—6 లో 'యత్రగావో భూరి శృంగా అయాసః' అని చదివితిమి......ఋగ్వేదము III. 6—4 మంత్రార్థమును తెలిసికోవలసియున్నది..........'సబర్దుగే ఉరుగాయస్య ధేనూ'........" (జ్యోతిర్వేదము) విష్ణుపద సమీపమున ధేనువు లున్నవని ఈ మంత్రార్థము. ఈ ధేనువులున్న మనబడు ప్రదేశము ధనిష్ఠ. కాబట్టి 'ఆలమంద=ధనిష్ఠ' అని గ్రహింపదగియున్నది. ఆవులదొడ్డి, గొడ్లదొడ్డి, పశువులమంద—అన్న పర్యాయ పదములకును ఈ అర్థమే చెప్పుకొనవలసియున్నది. 'పసరం చుక్క—శుక్రుడు— అను నర్థము కూడా సరికాదనియు "పసరంచుక్క ధనిష్ఠ'యే కావచ్చుననియు తోచుచున్నది.

(5) సంపతి చుక్క — కృత్తికా నక్షత్రము. ఈ అర్థము కూడ సరియని తోచదు. సంపతిచుక్క—ధనిష్ఠయే అనదగియున్నది. "కృష్ణ యజుర్వేదమునందలి నక్షత్రేష్టిలో ధనిష్ఠ వసుదేవతాత్మకమని చెప్పబడినది. సంస్కృత భాషలో 'వసు శబ్దమునకు ధనము, భాగ్యమునని యర్థము. తొలి యుగములలో ఒక మనుజుని ఐశ్వర్యము వాని గో సంపదనుబట్టి నిర్ణయింపబడుచుండెను. పశు శబ్దము ధనము అను నర్థములోనే వాడుక యగుచుండెను......మన దేశములో పశువులను ఇప్పటికిని సొమ్ములందురు" (జ్యోతిర్వేదము 168 పు. కర్త—శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావు.) (సొమ్ములు=పశువులు— అను వ్యవహారము శ్రీకాకుళము జిల్లాలోను కలదు) ఈ వివరములనుబట్టి వసు దేవతాత్మకమును గో లోక సంబంధియును అగు ధనిష్ఠయే సంపతిచుక్క అగునని నిర్ణయింపదగును.

(6) ఇప్పకొయ్యలు—ఆరుద్రా నక్షత్రం గొర్తి, చెక్కల్లాగా వరసగా ఉండే మూడు చుక్కలు"—ఆర్ద్రలో మూడు చుక్క లుండవు. ఒక్క చుక్కయే అని వ్యవహారము. "ఆర్ద్రా ప్రవాళ మేకమ్" అని వర రుచి "అస్యారూపం, పద్మాకృత్యుజ్జ్వలైక తారకామయమ్—ఇతి కాళిదాసః; మణితుల్యైక తారాత్మకం, ఇతికేచిత్" (శబ్ద కల్పద్రుమః) ఇప్పకొయ్యలు—అన్న చోట చూపబడిన పర్యాయ పదములలో 'గొల్ల కావిడి' అన్న దొకటి. 'నక్షత్రములు' అను గ్రంథమున ఈ విషయమై ఇట్లు చెప్పబడినది. "మృగశిర చుక్కలకు దక్షిణముగా నంచపు కోళ్ళవలె నాలుగు చుక్కలు గలవు. అందు ఆర్ద్ర అనునది యొక బాహువు. ఆ నాలుగు చుక్కల మధ్యను జాయగా మూడు చుక్కలోలు Belt of Orion, the Hunter అనియు, ఆపటకా చుక్కలనుండి వ్రేలు మరి మూడు చుక్కలు అయోధుని ఖడ్గము Sword అనియు, పడమటి గాథలు గలవు. వారు 'పటకా' అని చూపెడి చుక్కలనే మన రైతులు 'గొల్ల కావిడి చుక్కలు' అని చెప్పుదురు" (నక్షత్రములు'—54 పు.) కాబట్టి 'ఇప్పకొయ్యలు=ఆర్ద్ర సరికాదు. ఆర్ద్రవద్దనేయున్న పటకా చుక్కలని చెప్పవలెను. పదకోశములో 'బాసనగొర్రు' అనుచోట పేర్కొనబడిన మూడు చుక్కలు Sword అని పైని పేర్కొనబడిన చుక్కలుగ గ్రహింపదగును.

(7) కావడి చుక్కలు—బృహస్పతికింది వైపున మూలగా ఉండే రెండు చుక్కలట. లేక చూ. గొల్లకావిడి"—'కావడి చుక్కలు=గొల్లకావిడి' అనుటయే సరియైనది. కాని, 'గొల్ల కావిడి=ఆర్ద్ర సరికాదని వ్రాసియుంటిని. కావడి చుక్కలు అన్నవి పటకా చుక్కలనబడిన గొల్ల కావడి చుక్కలే. బృహస్పతి క్రింది చుక్కలుకావు. కావడి చుక్కలనగా "ఒరయన్ గూపునందలి మూడు చుక్కలు" అని శ్రీ దేవిడి ప్రసాద భూపాలుని ఆంధ్ర విజ్ఞానమున చెప్పబడియున్నది.

(8) కత్తెర = కృత్తికా నక్షత్రము. కత్తి, మంగలికత్తి = కర్తెరి—అను పదములును కృత్తికా నక్షత్రమను నర్థమున వ్యవహరింపబడుచున్నట్లు సూచితము. 'క్షురనిభ షట్తారకామయమ్' అని కృత్తిక ఆకారము చెప్పబడెను. (శబ్దక). క్షుర శబ్దమునకు నిఘంటువులలో 'మంగలకత్తి' అను అర్థము చూపబడెను. "మంగలకత్తి రూపు = కృత్తికా నక్షత్రము" అని శబ్ద రత్నాకరము 'కర్తెరి' అను పదము 'కర్తరీ' శబ్దముయొక్క వికారము "కర్తరీ—కేశ కర్తనికా—ఇతిభరతః" (శబ్దక) 'కత్తెర' అనునది 'కర్తరీ' శబ్ద భవము. నేటి వ్యవహారములో నుండుటయేకాదు. 'కత్తెర' శబ్దమును శ్రీనాథుడు కాశీఖండమున ప్రయోగించెను. "పూచిన కొరవిపూఁబోదరింటి చందానఁ గత్తెర యొక్కచోఁగదలకుండె" (కాశీ1—1 38) ఈ 'కత్తెర' 'కర్తరీ' శబ్దభవమే అనుటకు 'కర్తెరి' అను రూపము ప్రోద్బలముగా నున్నది. శ్రీనాథుడు కృత్తికా నక్షత్రమను అర్థమున ప్రయోగించిన 'కత్తెర' శబ్దము 'కృత్తికా' శబ్దభవమను సూ. ని. సరికాదు. వారు చూపిన ప్రాకృత రూపమునందును రేఫాంతత కన

బడదు. (ప్రాకత్తి—కా—చూ. ని) మంగలికత్తి' అను దానినే సౌలభ్యముకొరకు 'కత్తి' అని వ్యవహరించుచున్నారేమో! లేదా ఇది కృత్తికా శబ్ద భవమేని కావచ్చును. 'కృత్తిక=కత్తియ=కత్తె=కత్తి' అని గ్రహించుటకు అవకాశము కలదు. 'కృత్తి' శబ్దమును గలదు "కృత్తిః—కృత్తికా నక్షత్రమ్—ఇతి మేదినీ" (శబ్దక).

(9) కుక్కచుక్క="పునర్వసు నక్షత్రం బేపికూన = పునర్వసు నక్షత్రం కావచ్చు"—ఈ అర్థము సరిగానే యున్నది. "వేదములలో ఖగోళ స్థములైన శునక రూపములు రెండు వర్ణింపబడినవి. (1) శ్వానము (2)పూర్వశ్వానము. శ్వానమును పడమటి జోతిష్కులు కేనిస్ మేజర్ అనియు, పూర్వ శ్వానమును కేనిస్ మైనర్, ప్రోశ్యాన్ అనియు తెలుపుచున్నారు. ఇందు ప్రోశ్యాన్ పదము పూర్వ శ్వాన శబ్ద వికృతి యగుట స్పష్టము. (నక్షత్రములు' 69 పు.) ఈ పూర్వశ్వానమే పునర్వసు. ఇప్పుడు కుక్కచుక్క, బేపికూన—అను వ్యవహారములోని సామంజస్యము కరతలామలకము.

(10) కుమ్మరసారె—రోహిణీనక్షత్రం. కుమ్మరిసారె మాదిరి కోసుగా ఉండే అయిదు (ఆరు?) చుక్కల మొత్తం" అని చెప్పబడెను. కుమ్మరిసారె గుండ్రముగా ఉండునుగాని, కోసుగా నుండదు. అసలు రోహిణీ నక్షత్రమే కుమ్మరిసారె ఆకారములో ఉండదు "శకటం పంచరోహిణీ" అని వరరుచి "కంబుకంఠీ! శకులాకృతౌ..భౌ" ఇతి కాళిదాసకృత రాత్రి లగ్న నిరూపణమ్" అని శబ్ద కల్పద్రుమము. "రోహిణీ నక్షత్రము శకటాకారమని ఖగోళజ్ఞులు. ఇట్టి ఆకారముకల బండ్లిప్పటికిని కడప, నెల్లూరు మండలములందు గలవు. (చూ. 1940 అక్టోబరు—భారతి) అని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు హరివంశ పద పట్టికలో 'త్రివేణుక' శబ్దమువద్ద వ్రాసియున్నారు. 'పంచతారా శకటాకృతిః' అని నక్షత్ర చూడామణి.

"కుమ్మర సారె చుక్క= విశాఖా నక్షత్రము—శ. ర. "కుమ్మరసారె చుక్క — The name of the విశాఖా నక్షత్రము బ్రౌణ్యము. "విశాఖా నక్షత్రము—కుమ్మరి సానంబోలిన యైదు నక్షత్రములు (చక్రాకారము)"—"ఆంధ్ర విజ్ఞానము" "విశాఖా కులాల చక్రం పంచ" అని వరరుచి "పంచతారా కులాల చక్రాకృతిః—నక్షత్ర చూడామణి ఈ చర్చనుబట్టి 'కుమ్మర సారె=రోహిణీ నక్షత్రము" కాదనియు 'విశాఖ' అనియు తేలుచున్నది.

(11) కోమటిచుక్క—పర్యా. మూలచుక్క—బుధుడు. (వైశ్యగ్రహము) మూలచుక్క=బృహస్పతి. 'కోమటి చుక్క' — బుధుడయినచో 'బృహస్పతి అని అర్థము చెప్పబడిన మూలచుక్క — దానికి పర్యాయ మెట్లగును ? బుధః వైశ్యజాతిః" (శబ్దక) అనియు వృహస్పతిః—వణిక్కర్మ కర్తా" అనియు శబ్ద కల్పద్రుమమున కలదు. అయినను 'కోమటి చుక్క బుధుడు' అన్నదే సమంజసమని తోచుచున్నది.

(12) చదరలు=పుర్వోత్తరాభాద్ర నక్షత్రాలు—ఈ అర్థము సరికాదని తోచుచున్నది. "పూర్వాషాఢా, ఉత్తరాషాఢా ద్వేద్వే చౌకం"— అను వరరుచి వచనము చెప్పున చదరలు = పూర్వోత్తరాషాఢలు కాదగును.

(13) చిన్నపుసేల = పుష్యమి. పెద్దపుసేల = పునర్వసు. ఈ అర్థ నిర్ణయము బ్రౌణ్యమునకు సరిపడుచున్నది. "పుసేల. పునర్వసు" is called "పెద్ద పుసేల" and "పుష్యమి is called చిన్న పుసేల" (బ్రౌ.)

(14) చుక్క="ఆకాశంలో మెరిసే దివ్యజ్యోతి, గ్రహము" శుక్రుడను అర్థములో 'చుక్క' శబ్దమును వాడుదురు. 'చుక్కెదురు' అన్నది వ్యవహారములోనేకాదు కావ్యములోను ఉన్నది. "చుక్క — A star, particularly the planet Venus అని బ్రౌణ్యము. 'చుక్క' — శుక్ర శబ్దభవము. "చుక్క—లై. వి. (1) శుక్రుడు (2) నక్షత్రము" శ. ర. నక్షత్రమును అర్థము వద్ద పువ్వు గుర్తుంచబడినది. పువ్వు గుర్తు "ప్రకృతి శబ్దార్థముకంటె భిన్నమగు నర్థ మున దెలుపునది." 'చుక్క—శుక్రుడు' అని చెప్పవలేను.

(15) పాముచుక్క—ఆశ్లేషా నక్షత్రం. ఇది సరియే "ఆశ్లేష సర్పయుతు"—వరరుచి. ఆశ్లేషా—తైత్తిరీయ సంహితాయాం—ఆశ్లేషా నక్షత్రం సర్పదైవతా (శబ్దక) "షట్తారా సర్పాకృతిః"—నక్షత్ర చూడామణి.

(16) పిల్లలకోడి—"కృత్తికా నక్షత్రం, తొమ్మిది చుక్కలు గుంపుగా ఉంటాయి." కృత్తికలు ఆరుగాని తొమ్మిది కావు. 'క్షురనిభషట్తారకామయమ్" (శబ్దక) "కృత్తికాక్షుర (రా?)షట్కమ్"—వరరుచి. "క్షురాకృతిః షట్తారా"—నక్షత్ర చూడామణిః.

(17) పెద్దచుక్క=శుక్రుడు—ఇది సరికాదు. పెద్దచుక్క=జ్యేష్ఠ అగును. పేరునుబట్టియేకాదు పరిమాణమును బట్టియు జ్యేష్ఠ—పెద్ద చుక్కయే. ఇది "సూర్యునికన్న నిరువది రెండువేల రెట్లు అధికమైన గోళము" (ఆంధ్ర విజ్ఞానము) "పెద్దనెల—జ్యేష్ఠమాసము" అను బ్రౌణ్యమును దీనినే బలపరుచుచున్నది.

సరిహద్దు జిల్లాలవారి వ్యవహారములో కన్నడ,మహారాష్ట్ర, మహమ్మదీయ, ఓఢ్ర భాషాపదముల ప్రభావ మెట్లున్నదో పీఠికలో సోపపత్తికముగా తెలుపబడినది. ఆంధ్రదేశమును నాలుగు భాషా మండలములుగా విభజించవచ్చుననియు, మరికొన్ని అంతర్భాగములనుగూడ ఏర్పరచవలెననియు పటముల సహాయమున వివరించబడినది. ధ్వనుల మార్పులమదాహరించి "నియత ధ్వనుల మధ్యనే మార్పులు జరుగుతుంటాయి" అను విషయము నిరూపించబడినది. వాటిలో "డ—ణ; గ—వ; గ—మ; ర—ల; ఉ—ఒ; ఇ—ఉ; ఏ—అ" అను వర్ణముల మార్పును వివరించు సందర్భమున చూపిన కొలది యుదాహరణములు పునఃపరిశీలనమును అపేక్షించుచున్నవి.

# మాండలికవృత్తిపదకోశ సమాలోకము

డకారము ణకారముగా మారుటకు చూపిన యుదాహరణములలో 'సింగిడి—సింగిణి' అన్న దొకటి. 'సింగిణి' శబ్దము శార్ఙ్గ శబ్దభవము (ఆంధ్ర వాచస్పత్యము, వైకృత దీపిక) "శార్ఙ్గం-ధనుర్మాత్రం, ఇతిమేదినీ యథారఘుః 462 శార్ఙ్గకూజిత విజ్ఞేయ ప్రతియోధేరజస్యభూత్" (శబ్దక) "జఘాన నాత్యాయత కృష్ణశార్ఙ్గః (రఘు 5—50) ఈ ధనురర్థక శార్ఙ్గశబ్దమునకు 'సింగిణి' తద్భవము. కాన ణకారమే డకారమైన దనుట యుక్తము. "ళశనణల......కాదేశంబు డత్వమగును" అని కవి సంశయ విచ్ఛేదము (కవి సం. 3 త. 6 ప. వై—పా)

"నాగులు—నావులు, నువ్వులు మూగ, మూత—మువ్వ; గరుగు—గరువు; కలిగి—కలివి, కలివె"—అనువాటిలో గకారము వకారమయ్యెననుటకన్న వకారమే గకారమయ్యెననుట సమంజసమని తోచును. "గవల కన్యోన్య సంప్రాప్తి గలుగుచుండు" (కవి సం. 3 త. 6 ప) అను చొప్పున వకారము గకారమును కావచ్చును. "ప్రవాళము—పవడము—పగడము" మున్నగు చోట్ల వకారమే గకారమయినది. (వై.పా).

తగిరె—తమిరె. నాగర—నామర అను చోట్ల గకారము మకారమయ్యె ననుటకన్న మకారమె గకార మయ్యెననుట లెస్స మత్వమునకు వత్వంబగు' (కవి సం. 3—7) అను చొప్పున మకారము వకారమై, పిదప మకారము గకారము కాదగును. "హిమము—ఇవము—ఇగము" ఇందుకుదాహరణ యోగ్యము. "తమిరె—కాడి నడిమి, చీల, శమ్య (శ. ర. బౌ)—సూ. ని. 'నాము' అను పదమునుబట్టియు, 'నామర' అనునదే తొలి రూపమని తోచును.

గిరక—గిలక—అనుచో రేఫము లకారమైనట్లు తలచబడెను. గిర్క, గిర్కె—అను మరాఠీ పదములనుబట్టి ఇట్లు తలచబడి యుండును. "గిలక—గింక, గిలకె" అను సూర్యరాయనిఘంటువునుబట్టి 'గిలక' అనునది 'గిలకె' అను కన్నడ పదమునకు సంబంధించినదని తోచును. ఇది 'గిరక'లోని రేఫము మారగా నయినదికాదని చెప్పనగును.

గుజ్జంగి—గొజ్జెంగ అని ఉకారము ఒకారమైన దనుట సరికాదని తోచుచున్నది. గొజ్జెంగ—గుజ్జంగి అనదగును. ఒత్వమే వ్యవహారములో ఉత్వమైన దనదగును. 'ఓత్వ మెసయును నుత్వంబు' (కవి సం. 3 త. 8 ప.)

'ఇసుక' లోని ఇకారము ఉకారమై 'ఉసికె' ఏర్పడె నన బడెను. కాని, "ఉసుక (క. ఉసుక) అను సూ. ని. చొప్పున 'ఉసుక' అన్నది 'ఇసుక'లోని ఇకారము మారగా నయినది కాదేమో అని తోచును.

'ఏ—ఎ—అ' అను మార్పునకు "నాగేలి (లు) - నాగెలి - నాగలి" అనున దొకటి చూపబడియున్నది. ఈ పరిణామము సక్రమమయినదేకాని, ఇచ్చట మాత్రము కొంత ఆలోచింప వలసినట్లున్నది. 'లాంగల' శబ్ద భవము 'నాగలి' కాన ఇది 'ఏ—అ' మార్పునకు లక్ష్యము కాదేమో!

కోశ ప్రణాళికనుగూర్చి కొలది సూచనలుచేసి, ఈ సుదీర్ఘ వ్యాసము నుపసంహరించుచున్నాను.

(1) పదములు వైకృతములయినప్పుడు వాటి ప్రకృతులను దేశ్యములయినప్పుడు సోదర భాషలలోని సామ్య పదములను చూపుట సూర్యరాయ నిఘంటు పద్ధతి. దీని ననుసరించియున్నచో కోశ సమగ్రత కెంతో ఉపకరించి యుండెడిది. (2) అకారాది క్రమమును పాటించుటలో బిందు పూర్వ వర్గాక్షరముల విషయమున చేసిన మార్పు ఎల్ల నిఘంటువులకు విలక్షణమగుటచే కొంత తబ్బిబ్బు కలిగించును. దీనివలన సాధించిన ప్రయోజన మేమియులేదు. ఇట్టి అక్కరమాలిన మార్పులు అభిలషణీయములుకావు. (3) అకారాది సూచికలోని ముద్ద పైపు సన్న పైపు పద్ధతికూడా తబ్బిబ్బు కలిగించును. గ్రంథములో అవలంబించిన 'హైఫన్' పద్ధతి ఉభయ తారకము. (4) ఈ పద కోశమునందలి పదములలో నేటి గ్రాంథిక నిఘంటువుల కెక్కిన పదము లెన్ని? అవి యేవి? అన్న ప్రశ్న యుదయించును. ఆ యా పదములవద్ద అవి నిఘంటువుల కెక్కిన విషయము సూచించినచో బాగుండును. (5) అర్థ వివరణము నేటి శిష్ట వ్యావహారికమునకు సన్నిహితమగు భాషలో చేయబడినది. వ్యాకరణ నియమములను సడలించిన (అర్ధాను స్వార శకట రేఫలను వదలుటమొ.) సులభ, గ్రాంథిక భాష వాడుట యుక్తమని తోచును.

డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తిగారి సమర్థవంతమైన సంపాదకత్వముతో తక్కిన పద కోశములును వరుసగా వెలువడ గలవని ఆకాంక్ష.

---

# గ్రంథ విమర్శనము

## ఆంధ్ర క్రియాస్వరూప మణిదీపిక

1/8 డెమి. పేజీలు : 908. ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, తిలక్‌రోడ్, హైదరాబాద్.

ఇది యపూర్వమైన గ్రంథరాజము. సంస్కృతభాషకు ప్రామాణికమైన ధాతుపాఠమున్నది. ఆంధ్రభాషలో క్రియలే కాక వివిధ ప్రక్రియలచే నేర్పడిన క్రియారూపములు కూడా కలవు. ఆంధ్రభాషలో, గ్రాంథిక, వ్యావహారిక రూపములు రెండిటిలో నున్న క్రియలను క్రియాస్వరూపములను అకారాదిగా క్రోడీకరించి అర్థములు తెలుపుటకు ఈ కోశములో ప్రథమ ప్రయత్నము సుష్ఠుగా జరిగినది.

ఆంధ్రదేశములో గొప్ప సంస్థలు ప్రారంభించిన బృహత్ప్రయత్నములు, విస్తారముగా ధనవ్యయము చేసినను, ఎన్నాళ్లకును పూర్తికాక పోవుటయు, అందుచేత ఉద్దిష్ట ప్రయోజనములు సిద్ధింపకుండుటయు సర్వసాధారణమై పోయినది. అందుకు ప్రత్యక్ష నిదర్శనము శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువే. అట్టి లోపమున కేమాత్రము నవకాశ మీయకుండ ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి బృహద్గ్రంథముల నెన్నిటినో అతి శీఘ్రకాలములో ప్రచురించుచుండుట ఎంతయేని సమ్మోదావహమై యున్నది. దానికి ముఖ్య కారకులు అకాడమి వ్యవహారములు చాకచక్యముతో నడపుచున్న శ్రీ దేవులపల్లి రామానుజరావుగారనుటకు సందేహములేదు.

ఈ గ్రంథ సంపాదకులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. వారు 'తొలిపలుకు' లో ఇట్టి పనులకు 'ఎంతమంది చేతనో పనిగొనవలయును' అనియు, కమిటీవారు 'ఒక్కొక్క జిల్లా నుండి యొక్కొక్క పండితుని నియామకముచేసి వారి నుండి యా ప్రాంతముల యందలి వాడుకలోని క్రియలను ధాతువులను తెలిసికొని యీ నిఘంటువునందుఁ జేర్చవలయునని నిశ్చయించిరి' అనియు వ్రాసిరి. కాబట్టి వారిపై బడిన గురుతర బాధ్యత కొంత గుర్తించియే వారీ పని కుపక్రమించిరనుట తెల్లమగుచున్నది.

కాని ఆయా జిల్లాల పండితు లెవరో, వారేమి సహాయము చేసిరో తెలుపలేదు. పైగా, శ్రీ కోదండరాఘవరెడ్డిగారికి నెల్లూరుజిల్లాలోని ధాతువులతో గల పరిచయము, శ్రీమతి యశోదారెడ్డిగారికి తెలంగాణపు ధాతువులతో గల పరిచయమును శ్లాఘించి, అంత పరిచయమున్న భాషాభిమానులు ఉండుట కష్టమనియు, ఆ పరిచయములోనే వ్రాసిరి. తక్కిన జిల్లాల పండితు లెవరైనను, వా రెక్కువ సాయపడలేదని మన మూహింపవచ్చును.

అదికాక పండితుల కృషి ఒకవంక అవసరమే యైనను ఇట్టి ప్రయత్నములలో 'పామరు' లనబడువారే ఎక్కువ ఉపయోగ పడుదురు. ఆ 'పామరు' లే ఇందులో విశేషజ్ఞులు. క్రియారూపములు పురుషులకు కంటె స్త్రీల కెక్కువ తెలియును. చదువుకొన్నవారి కంటె, చదువురాని కృషీవలులకు, పంచాణములవారికి, నేతపనివారికి, గీత పనివారికి, జాలరులకు, పడవలు నడపు పల్లెకారులకు, రంగులు వేయువారికి, బొమ్మలు చేయువారికి, నాటకము లాడువారికి, బొమ్మలాటలాడించువారికి, వీథులవెంట తిరిగి సరుకులమ్ము వర్తకులకు, కట్టుబడి చేయువారికి, ఖనకులకు, కుమ్మరులకు, చాకలులకు, మంగలులకు, గొల్లలకు, చర్మకారులకు—ఇంకను అనేక వృత్తులవారికి వారివారి వృత్తులకు అన్వయించు క్రియారూపము లెన్నెన్నో, పండితులకుగాని, ఇతర పామరులకు గాని తెలియనివి తెలియును. అట్టివీ కోశములో కొన్ని కొన్ని చేరినవి కాని ఇంకను చేరవలసినవి అసంఖ్యాకముగా నుండును. అట్టివారి సహాయము కూడ తీసికొనవలసి యుండును.

విస్తారమైన తెలంగాణమునకు ఎంత తెలిసినవారైనను ఒకరు చాలరు. రాయలసీమవారి సహాయము ఇందులో వచ్చినట్లు లేదు. సర్కారు జిల్లాలలో ముఖ్యముగా తూర్పు పడమర అను భేద మున్నది. తూర్పుకు శ్రీ వెంకటరావుగారును పడమటికి శ్రీ సత్యనారాయణగారును ప్రాతినిధ్యము వహించినట్లున్నారు.

మరియొక విశేషము కూడ కలదు. తమిళము, కన్నడము, మహారాష్ట్రము, ఓఢ్రము మాట్లాడు సరిహద్దు ప్రాంతములలోని ఆంధ్రులు ప్రక్క భాషలవారి నుండి నూతన ప్రక్రియ లవలంభించి భాషను సంపన్నము చేయుచున్నారు. ప్రత్యేక రాజకీయ కారణములవల్ల ఉరుదూ భాష తెలంగాణమును ప్రభావిత మొనరించినది. అవి యన్నియు అనాంధ్రములని, యాసలని, ఈసడింపక ఆదరించి గ్రహింపవలసి యున్నది.

ఇట్లు అనంత విస్తృతిగల ఆంధ్ర క్రియాస్వరూపములలో శతాంశము కూడ తెలియని మాబోంట్లకే ఈ దీపికలో అడుగడుగున రెండు విధముల లోపములు కానవచ్చిన వన్నచో, ఇంకను ఎంత కృషి చేయవలసి యున్నదో కొంత వరకు అవగాహనము కాగలదు. ఆరోపములు, I. ఇచ్చిన పదము

# గ్రంథ విమర్శనము

లకు ప్రసిద్ధముగా నున్న కొన్ని విశేషార్థములు లోపించుట. II. ఎన్నో క్రియాస్వరూపములు చేరకుండుట. ఈ రెండిటికి దాఙ్మాత్రముగా కొన్ని యుదాహరణములీ క్రింద నిచ్చుచున్నాము :

I. అర్థలోపములు :

(1) పేజి 118. "ఉత్తరించు, ఉత్తరియించు : } ఖండించు, నఱకు ఇత్యాది.

శుభకార్యములలో ధోవతుల జంటనుగాని, ఉత్తరీయము లనుగాని, రెండును కలిసియున్న చాపులనుగాని ఖండించికాని, చించి కాని వేరుచేయుటకు ఉత్తరించుట అను ప్రసిద్ధ వ్యవహారము కలదు. 'ఖండించు, నఱకు' అని ఇచ్చిన యర్థములలో నది గతార్థము కాదు.

(2) పే. 136. "ఉబ్బిట్లాగు : దే. అ. క్రి. మిక్కిలి యూగు" ముఖ్యముగా ప్రయాణము చేయుటకు "ఎక్కువ ఉబలాటపడుట" అని కొంచెము హేళనచేయు నర్థములో వ్యవహార మున్నది. ఆ యర్థ మీయలేదు.

(3) పే. 149. "ఊదరపెట్టు : దే. స. క్రి. ఎలుకలు, దోపులు మొదలగునవి పోవుటకు ఊక పొగవేయు."

'మాటిమాటికి అదేపనిగా చెప్పి ప్రోత్సహించు' అను నర్థము లోపించినది.

(4) పే. 162. "ఎగజల్లు : దే. స. క్రి. దుర్వ్యయము చేయు." పైకి జల్లు అను ప్రత్యక్షార్థమే ఈయలేదు.

(5) పే. 175. "ఎత్తు వేయు : దే. స. క్రి. తూచు. తూనికవేయు." దీనికి మరిరెం డర్థములు లోపించినవి.

1. చతురంగములో కాయ కదల్చు.

2. జయమునకై పన్నుగడ పన్ను—ఈ రెండవ యర్థము చతురంగమునుండి వచ్చినదే.

(6) పే. 390. "ఘోషించు : } సం. అ. క్రి. మ్రోయు
ఘోషిల్లు : } స. క్రి. చాటించు.

బాధతో గోలపెట్టు—అనునది లోపించినది.

ఉదా : అలో లక్ష్మణా యని ఘోషిస్తున్నాడు.

(7) పే. 712. "పోవు : దే. అ. క్రి. 1. వెడలు, 2. చచ్చు, 3. కడచు, 4. చెడు (కన్నులు పోవు) స. క్రి. 1. పొందు."

దీనికి వ్యభిచరించు అనే అర్థము ప్రసిద్ధము. పొందులో గాని, చెడులోగాని గతార్థము కాదు.

(8) పే. 726 : "బజీతుచేయు : దే. స. క్రి. చిత్తు చేయు." అల్లరిచేసి పరాభవించు అనే అర్థము లోపించినది.

(9) పే. 891 : "సాధించు"—దీనికి 6 అర్థము లిచ్చినారు గాని 'నెపములెన్ను' అను నర్థ మీయలేదు. సాధించు అను రూపాంతర మీయలేదు.

(10) పే. 896. "సురాళించు : దే. స. క్రి. 1. దిగదుడుచు. 2. త్రిప్పు."

ద్విపదరామాయణములోనుండి ప్రయోగము కూడ నిచ్చినారు.

ఇదే వ్యవహారభాషలో 'సులారించు' అనే రూపముతో, అసభ్యముగా గుహ్యాంగము చుట్టు త్రిప్పు, అను నర్థములో వాడుకలో నున్నది. (ఆ మాటమీద వచ్చిన క్రిమినలు కేసులో మా కది తెలియవచ్చినది.)

II. చేరని క్రియాస్వరూపములు.

(1) పే. 3 లో ఇవి చేర్చవలెను :

1. అంకెలు గుణించు : అతిగా లెక్కలు వేయు.

2. అంగవేయు : (i) నిపుణత సంపాదించు. (ii) దాటు.

3. అంగలు లెక్కపెట్టు : } నెమ్మదిగా నడచు.
అంగలో అంగవేయు : }

(2) పే. 10 లో ఇవి చేర్చవలెను :

1. అక్కసుపడు : మిక్కిలి కోపించు.

2. అక్కసు క్రక్కు : కోపము వెళ్లబోయు.

(3) పే. 32 లో ఇది చేర్చవలె.

అన్నము పెట్టు—రమించు.

(గుంటూరుజిల్లాలో ఏకాంతముగా స్త్రీని, అన్నము పెట్టుదువా అనవాడు. దీనిని తిరునాళ్లలో ఎక్కువ వాడుక చేయుదురు.)

(4) పే. 44 లో ఇది ఉండవలె.

అఱ్ఱుచాచు : 1. మెడ రిక్కించు.
2. వృథాగా ఆశపడు.

(5) పే. 128 లో ఉండవలె :

ఉప్పుతనపడు : నలుగురి నోళ్లలో పడి బాధపడు.

(6) పే. 129 లో ఉండవలె :

ఉప్పుతెచ్చు, అందించు, కలుపు.

చర్‌పట్టే ఆటనే ఉప్పుఆట అని కూడ అందురు. అన్ని గీతలు దాటి అక్కడ 'ఉప్పు' (మట్టి) గ్రహించి వచ్చి, అన్ని గళ్ల లోను కలిపి, అందించినప్పుడే ఒక పక్షము గెలిచినట్లు.

(7) పే. 142. లో ఉండవలె.

ఊంకదంచు (పుడుచేయు) : చెప్పినదే వినిపించునట్లు పదేపదే చెప్పు.

(8) పే. 275 లో ఉండవలెను.

కాయలు కాయు : వ్యర్థనిరీక్షణచే కండ్లు, వృథాగా తిరుగుటచే కాళ్లు కాయలు కాయును.

(9) పే. 577 లో ఉండవలె.

టీన్ చేయు : కుస్తీలో చిత్తు చేయు. (గుం. జి)

(10) పే. 683 లో ఉండవలె.

పీటుచేయు : కుస్తీలో చిత్తుచేయు (నె. జి.)

(11) పే. 772 లో ఇవి చేరవలెను.

1. ముగ్గువేయు : భూతవైద్యులు గ్రహావేశము తెప్పించుటకై పిశాచబాధితులను కూర్చుండ బెట్టుటకు ప్రత్యేకమైన ముగ్గువేయుట.

2. ముగ్గులోదించు : వ్యవహారములోనికి దించు.

(12) పే. 815 లో ఉండవలె.

లవలవలాడు : జారిపోవు.

(శ్రీనాథుని కంటగట్టిన చాటు పద్యాది)

(13) పే. 905 లో ఉండదగినది.

హస్కుకొట్టు : వూకదంపుడుమాటలాడు. ఇది నవీనమైనా చేర్పదగినదే.

పైని తెలిపిన రెండు విధములైనవే కాక ఇచ్చిన యర్థములు సరిగా లేనివి కూడా లేకపోలేదు.

1. పే. 39. అమ్ముడుపోవు ! ..... (నె. జి.) లంచము తిని చెప్పినపని చేయు.

ఈ వ్యవహారము నెల్లూరుజిల్లాలోనే కాక దేశమంతట నున్నది. గుంటూరుజిల్లాలో ఉన్నమాట నిశ్చయము.

2. పే. 800.

"రంగరించు : దే. స. క్రి. 1. ద్రవపదార్థ
రంగలించు : ములను రెండింటిని బాగుగా గలుపు. 2. ఔషధమును చను బాలతో పిల్లలకు పెట్టుటకు కలుపు."

వీనిలో రెండవ యర్థము మొదటిదానితో గతార్థమైనది. అందుచేత ననవసరము.

మరియు రెండు ద్రవపదార్థములనే కాక, చూర్ణములు కూడ తేనె మొదలగువానిలో బాగుగా కలుపుట కూడ రంగరించుటే. అట్లే కణికలు, లవంగములు, శొంఠి కొమ్ములు ఇత్యాదులు కొన్ని చుట్లు తేనెలోను, కషాయములలోను అరుగ దీసి, తర్వాత రంగరింతురు.

3. పే. 157. "ఎండు: దే. అ. క్రి. 1. ఆఱు, ఆర్ద్ర మగు. చూ. ఎండించు. మొదలగునవి కలవు.

ఇందులో 'ఆర్ద్రమగు' అను నర్థము అచ్చుతప్పు కానిచో, ప్రమాద పతిత మనవలెను.

షుమారు 12,000 రూపములున్న ఈ మహా గ్రంథములో ఇట్లు చూపుచు పోయినచో, లోపములు పరశ్శతముగా చూపవచ్చును. కాని గుణములు సహస్రాధికముగా నున్నవి. అందుకు ఎకాడమీవారిని శ్లాఘించుచు, ఈ కృషి నింతటితో నాపక ఇంతకంటె నిర్దుష్టముగా, పరిపూర్ణముగా ఇంకను సాగింపవలసి యున్నదని హెచ్చరించుటకే పైవాని నుటంకించితిమి. శీఘ్రకాలములో జరిగిన పనిలో లోపములుండక మానవు. ఆలస్యము జరిగినంతమాత్రముననే నిర్దుష్టముగా నుండు ననియు చెప్పజాలము.

గ్రంథనామములో మణి శబ్దము తీసివేసి "ఆంధ్ర క్రియా స్వరూప దీపిక" అన్నచో ఇంతకంటె గంభీరమై విపులార్థ మిచ్చునని సూచించుచున్నాము. క్రియాస్వరూపములు అనేకములు. వానిలో మణులు స్వల్పతర సంఖ్య కలవి. క్రియా స్వరూపములే మణులని కూడ చెప్పవచ్చుగాక !

సంస్కృత ధాతువు లిచ్చునప్పుడు ధాతు పాఠములోని యర్థములు కూడ నిచ్చిన నెక్కువ ప్రయోజనకారి కాగలదని సూచించుచున్నాము.

గ్రంథాంతమున గ్రంథ సంకేత పట్టిక ఇచ్చినారు. కాని తక్కిన సంకేతాక్షరముల వివరణ మెక్కడను లేదు. అదికూడ నవసరము.

విమర్శార్థము పంపినది ముందుగా పంపిన యసంపూర్ణ ప్రతి యవుటవల్లనేమో కాని గ్రంథమూల్య మెక్కడను కనిపింపలేదు.

అచ్చు తప్పులు క్వాచిత్కముగా తప్పలేవు.

దీని నింత సుష్ఠుగా నిర్వహించిన సంపాదకవర్గమును, అంతటికిని కారణభూతులైన శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిని, దీని నాంధ్రలోకమున కందించిన ఆంధ్రప్రదేశ అకాడమీవారిని హృదయపూర్వకంగా నభినందించుచున్నాము. ఆంధ్ర భాషాభిమానులకీ యపూర్వ నిఘంటువు ఆదరపాత్రమై ప్రతి గ్రంథాలయ మందును వెలసి దీపికయై దీపించుగాక !

## శంకర గ్రంథరత్నావళి

ప్రథమ సంపుటము. అనువాదకుడు : శ్రీ నిర్వికల్పానంద స్వామి. క్రౌను 1/8—296 పేజీలు. హాఫ్ కాలికో బైండు. వెల : రు. 4—00. ప్రకాశకులు : సాధన గ్రంథమండలి, తెనాలి.

ఆధ్యాత్మిక విషయములను బహుముఖములుగా ప్రపంచించు గ్రంథజాతమును తెలుగువారికి అందించు తెనాలి సాధన గ్రంథమండలివారి 55 వ ప్రచురణ మిది. ఇవి సునిశిత బుద్ధులైన విద్వాంసుల విమర్శకు నిలువకున్నను సామాన్య భక్తజనమునకు ఆమోదము కలిగించునవిగా నున్నవి.

ఆదిశంకరులని ప్రసిద్ధివడసిన శ్రీ విద్యాశంకర భారతీ భగవత్పాదుల రచనలుగా ఎన్నో గ్రంథములు లోకములో ప్రచారములో నున్నవి. శ్రీ వేదవ్యాస భగవానుల తర్వాత అధిక సంఖ్యాకమైన ఇతర రచిత గ్రంథరాశికి కర్తృత్వ భారము వహించుచున్నవారిలో, శ్రీ శంకర భగవత్పాదులే అగ్రగణ్యులు. వారి ప్రస్థానత్రయ భాష్యములును, స్తోత్రములలో శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమును తప్ప తక్కినవానిలో వారు నిశ్చయముగా రచించినారని చెప్పదగినవి ఏమున్నవో నిశిత విమర్శ చేసినవా రిప్పటికి కనబడరు. ఈ గ్రంథ నివేదనలో శ్రీ నిర్వికల్పానందస్వామివారు భగవత్పాదుల రచనలు మొత్తము 153 లభించుచున్నవని, వాని నామము లిచ్చి, వానిలో అమరుకము, సర్వ సిద్ధాంతసంగ్రహము శంకరకృతమా అను సందేహము వెలిబుచ్చినారు. అమరుక కావ్య రచనము కూడ భగవత్పాదుల కంటగట్టుచున్న సాహసమునుబట్టి, ఎన్నెన్ని కృతులు వారివిగా ప్రచారములోనికి వచ్చినవో, మన మూహింపవచ్చును.

# గ్రంథవిమర్శనము

ఈ గ్రంథములో సంగృహీతములైన 40 స్తోత్రములలో ఒక్కటికూడ భగవత్పాదకృతమని నిశ్చయింపలేము. ఉదాహరణముగా 'మనీషాపంచకము' తీసికొందము. 'శునిచైవ శ్వపాకేచ పండితాస్సమ దర్శినః' అనగా, జ్ఞానులు తుదకు శునకమందును చండాలుని యందును బ్రహ్మమునే దర్శింతురు, అను వర్థముగల గీతావచనమే ఆధారముగా ఈ స్తోత్రము పుట్టినది. దీనికిముందు నాలుగు శ్లోకాలలో, కాశీక్షేత్రములో శ్రీ శంకరులు వెళ్ళుచుండగా, గౌరీశంకరులు చండాలవేషముతో ఎదురుకాగా, శంకరులు 'పో, పో !' అన్నమీదట సదాశివుడే విప్రుడూ శ్వపచుడూ అనే విభేదభ్రమ ఏమిటయ్యా, అనుచు మనీషాపంచకము చెప్పినట్లున్నది. శ్రీ విర్వికల్పానందస్వామివారు అథస్సూచికలో ఈ నాలుగు శ్లోకములును అధికపాఠముగ దోపట్టును అని చెప్పవలసి వచ్చినది. అంతేకాదు. ఇవి శంకరకృతములనుటకు, మూలశ్లోకములో లేకున్నను, 'అప్పుడు శంకరుడు ఇట్లనెను' అని బ్రాకెట్లలో వివరణము చేర్పవలసి వచ్చినది.

అట్టిదే చివరిదైన హస్తామలకము. దానికా పేరేల వచ్చినదో స్తోత్రములోగాని వివరణములోగాని దాని యవతారికలోగాని లేదు.

ఈ విధముగా విచారణ చేసికొనుచు పోయినచో ఈ స్తోత్రాదులు నలుబదింటిలో శ్రీ శంకర భగవత్పాదుల రచనలని నిశ్చయింప దగినవి మిగులవు. వానిలో శైలిలోను, భాషాపటిమలోను, కూర్పు బిగువులోను వైవిధ్యమెంతో ఉండుటచే నివి యన్నియు ఏ ఒక్కరి రచనలుకూడ కాజాలవు. భగవత్పాదుల భాష్యరుచి యెరిగినవారికి ఇవి వారిరచనలు కావని నిర్ధారించుచుట కష్టముకాదు.

ఐనను ఇందలి స్తోత్రములు ఏవోకొన్నితప్ప గుణలోపమున్నవికావు. వానిలో నెక్కువభాగము ఔపనిషదుల భావములనే అనువదించునవి. స్తోత్రములకు కావలసిన కవితాస్థాయి వానిలో నరుదు, శ్లోకబద్ధమైన వేదాంత విషయ వివరణమెక్కువ. కాని ప్రాతః స్మరణములవంటివి కవితాస్థాయి నందుకున్నవి లేకపోలేదు. అట్టివే కేవలము వైరాగ్యముపదేశించు చర్పట పంజరికా (భజగోవింద) స్తోత్రములు.

అనువాదకులు వారి నివేదనలో శ్రీ శంకర భగవత్పాదుల వారి రచనలు తెలుగులోనికి అనువాదము పొందినవానిని గూర్చి విపులముగా తెలిపియున్నారు. అందులోచిన్న ప్రమాదములు దొరలినవి. వారందు వ్రాసినట్లు శ్రీ కళ్యాణానంద భారతీస్వాములవారు 'కల్యాణసుధ'లో వెలువరించినది 'చతుస్సూత్రి మటుకే'కాదు. అందులో ప్రథమాధ్యాయములో ప్రథమ పాదమంతయు కలదు. మరియు శ్రీవారు శ్రీమద్భగవద్గీతకు శాంకరభాష్యముతోసహా 'గీతామృత తరంగిణి'ని ప్రకటించివారు. శ్రీ రాయప్రోలు లింగనసోమయాజిగారు భాష్యభావము ననుసరించి తెలుగువివరణ వెలువరించినది ఉపనిషత్తులకేకాదు. అట్లే 'కల్యాణకౌముది' యను పేరుతో 1957 సం. లోనే సూత్రభాష్యముకూడా ఆంధ్రానువాదముతో ప్రచురించినారు. అందువలన 'భగవత్పాదుల వారి ప్రధాన రచనయగు భాష్య గ్రంథములులేనిలోటు తీరవలసి యున్నది' అను నివేదనలోని మాటలు ప్రమాద పతితములు.

శ్రీ నిర్వి కల్పానందస్వామివారు అనుభవమున్న అనువాదకులు. వారి ఆంధ్రానువాదము సాధ్యమైనంతవరకు తేటతెనుగులో మూలానుసారముగా సాగినది.

శ్రీ రామకృష్ణమఠ సంప్రదాయస్థులైన స్వామివారి ఈ యనువాదము ప్రస్తుతము శ్రీ శృంగేరీ భారతీ పీఠాధిష్ఠితులైన శ్రీ మదభినవ విద్యాతీర్థ స్వామివారి యామోదముద్ర పొందుటయే ఈ గ్రంథాతిశయమునకు నిదర్శనము.

# న్యాయచంద్రిక

ఆనందపూర్ణ మునీంద్ర ప్రణీతా స్వరూపానందమునీంద్రకృతయా న్యాయ ప్రకాశికయా సంవలితా. మదరాసు గవర్నమెంటు ఓరియంటల్ సర్వీసు నెం. 154. ప్రకాశకులు : గవర్నమెంటు వోరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ, మదరాసు. రాయలు 1/4. పేజీలు 4+148+80+563+118+15. వెల : రూ. 18—75 న. పై.

మదరాసు గవర్నమెంటు ఓరియంటల్ సర్వీసులో ఉత్తమ స్థాయిలో ప్రచురింపబడుచున్న గ్రంథములలో ఇది యొకటి.

ఈ న్యాయచంద్రిక అద్వైత పక్షవాద గ్రంథములలో ఉత్తమకోటికి చెందినది. దీనిని 14 వ శతాబ్దములో ఆనందపూర్ణముని రచించెను. వీరికి విద్యాసాగరులను బిరుదనామము కలదు. అభినవ ద్రవిడాచార్య బాలక్రిష్ణానందులిచ్చిన గురుపరంపరలోని పూర్ణానంద సరస్వతియే ఆనందపూర్ణముని యని ఆంగ్లోపోద్ఘాతములో తెలిపినారు.

13 వ శతాబ్దములో శ్రీ మధ్వాచార్యులవారు బ్రహ్మసూత్ర భాష్యము రచించి అద్వైతమత ఖండనము చేసిన కొలది కాలమునకే, శ్రీ చిత్సుఖాచార్యులు 'భాష్య భావ ప్రకాశిక' రచించి అద్వైతమును సమర్థించిరి. దానిపై శ్రీ జయతీర్థులు ద్వైతమత పక్షమున 'న్యాయసుధ' అను ఖండన గ్రంథమును రచించిరి. అది ద్వైతపక్షమున బలవత్తరమైన వాద గ్రంథము. ఈ 'న్యాయచంద్రిక' ప్రధానముగా 'న్యాయసుధ' ను ఖండించుచు అద్వైతమత సమర్థనకు పుట్టిన బలవత్తర వాద గ్రంథము. ఈ గ్రంథమునకు పిమ్మట ద్వైతాద్వైత పక్షములలో ఎన్నో వాద ప్రతివాద గ్రంథములు పుట్టినను, ఎందులోను న్యాయచంద్రిక ప్రదర్శించిన కొన్ని యుక్తులకు ద్వైత పక్షమున నింతవరకు సమాధానము పుట్టియుండలేదని, మహా మహోపాధ్యాయ శ్రీ అనంతకృష్ణ శాస్త్రి మహాశయులు భూమికలో తెలిపిరి. దీనినిబట్టి ఈ గ్రంథవైశిష్ట్యము కొంత యూహగల మగును. ఇందులో వైశేషిక దర్శనము, భాస్కరుని ద్వైతాద్వైత బ్రహ్మ పరిణామ వాదములు సూక్ష్మముగా ఖండింపబడినవి. భాస్కరవాదమునకును శ్రీమద్రామానుజుల విశిష్టాద్వైతవాదమునకును ఎక్కువ భేదములేదు కనుక వారి మతమును గూడ ఖండించినది. ఇట్టి ఉద్గ్రంథము ప్రథమ పర్యాయము రెండు వ్రాత

ప్రతుల ననుసరించి ఇప్పు డిట్లు సముచితరీతిని ముద్రింప బడినది.

ఈ న్యాయచంద్రికలో (1)సమన్వయ పరిచ్ఛేదము, (2) అవిరోధ పరిచ్ఛేదము, (3) సాధన పరిచ్ఛేదము, (4) ఫల పరిచ్ఛేదము అను నాలుగు పరిచ్ఛేదములు కలవు. అందులో మొదటిది, పెద్దది, మూడవది చిన్నది. ఇటువంటి గ్రంథములను లనుసరించు సంప్రదాయము ప్రకారము, గ్రంథస్థ విషయములను సంగ్రహించుచు కారికారూపమైన శ్లోకము లిందులో గూడ గలవు. వానిని వేరుగా గ్రంథాదిని సంపాదకులు ముద్రించుట యెంతయు సమంజసముగా నున్నది.

ఈ కారికలకు ముందు ద్వైతాద్వైతవాద భేదములను ప్రధానమైనవానిని 44 శీర్షికలుగా క్రోడీకరించి ఒకదాని కొకటి ఎదురుగా నుండి కళ్లకు కట్టినట్లుండునట్లు పది పేజీలలో ముద్రించిరి.

దానికిముందు 'న్యాయచంద్రికా' విషయములు 860 గా విభాగముచేసి ఏది ఏ పేజీలో నున్నదియో తెలుపుచు, 57 పేజీలలో ముద్రించినారు. ఇది పాఠకుల కెంతయేని ఉపయోగకారిగా నున్నది.

ఇట్టి కష్టసాధ్యమైన గ్రంథస్థ విషయములు అవగాహన చేసికొనుటకు వీలుగా, శ్రీ అనంతకృష్ణ మహాశయులు ఆంగ్లములో నొకటి, సంస్కృతములో రెండును భూమికలు వ్రాసి ప్రకటించినారు. సంస్కృత భూమికలు రెండును వారి నిశిత విస్తార పాండిత్యమునకు నిదర్శనములు.

ప్రథమ సంస్కృత భూమికలో వారు ముందు సంక్షేపముగా ద్వైత, విశిష్టాద్వైత, అద్వైత సిద్ధాంతములు నిరూపించిరి. పిమ్మట సూక్ష్మముగా చిత్సుఖాచార్యుల గ్రంథస్థ విషయములనే గ్రహించి న్యాయచంద్రిక ఎట్లు విస్తరించినదో వివరించినారు.

ఆపిమ్మట పాఠకులు సులభముగా గ్రహించుటకై ద్వైతాద్వైత గ్రంథరాశిలోని ప్రధాన విషయములను సంగ్రహించిరి. తుదకు ద్వైత పక్షమున 'న్యాయసుధ' ఎట్లో, అద్వైత పక్షమున 'న్యాయచంద్రిక' అట్టిదని నిరూపించినారు. ఆ రెండు గ్రంథములలోనే ఉభయ మతముల వాద ప్రస్థాన విషయము అన్నియు సమగ్రముగా ప్రతిపక్ష ఉపక్షేప నిరాసపూర్వకముగా ప్రదర్శింపబడినవని తెలిపిరి.

దాని తర్వాత ఉభయపక్షముల ప్రధాన గ్రంథకర్తల కాలనిర్ణయము చేయబడినది.

ఇంతవరకు భూమిక బిగువుగా వచ్చినది. ఆతర్వాత ముందు వ్రాయుట మరచిపోయిన విషయములు అందుకొని వ్రాసినట్లుగా సాగినది. భేదాభేద వాదమును శ్రీ శంకర భగవత్పాదులు భాష్యములో అక్కడక్కడ చెప్పిన వచనములే గ్రహించి సూత్రప్రాయముగా 'చిత్సుఖి' ఖండించినదనియు, 'న్యాయచంద్రిక' వానినే వివరించినదనియు తెలిపిరి. ఆ తర్వాత జ్ఞాన కర్మ సముచ్చయవాదమును ఖండించుటలో న్యాయచంద్రిక శ్రీ భగవత్పాదుల భాష్యములనే ఎట్లు అనుసరించినదియు నిరూపించిరి.

తర్వాత 16 పేజీలలో అభినవ ద్రవిడాచార్య బాలకృష్ణానంద సరస్వతులు రచించిన గురుపరంపరాస్తోత్ర శ్లోకములుసవ్యాఖ్యానముగా చేర్చబడినవి. అవి అనవసరముగా భూమికాకారుల అభిమానమును పురస్కరించుకొని చేర్చినట్లు తోచెడివి.

ద్వితీయ గీర్వాణ భూమికలో న్యాయచంద్రికా సమాలోచిత విషయములను, పూర్వోత్తర పక్షములను సవిమర్శముగా ప్రదర్శించిరి.

దాని తర్వాత ద్వైతాద్వైతవాద గ్రంథములు ఏ క్రమములో పుట్టినదియు, కాలక్రమముతో ఒక పట్టికలోను, భాష్య గ్రంథక్రమము మరియొక పట్టికలోను ఇచ్చిరి. గ్రంథాంతమందు ఆంగ్లములో, అద్వైత వేదాంత గ్రంథకారుల నామములను, అకారాదిగా తెలుపుచు వారు రచించిన గ్రంథ విశేషాదులు కూడ బిబ్లియోగ్రఫీలో ఇచ్చిరి.

ఈవిధముగా ఒక ప్రధానమైన అముద్రిత గ్రంథము ప్రకటించుటే గాక, ద్వైతాద్వైతవాద సర్వస్వముగా దీనిని రూపొందించినారు.

గ్రంథవిషయములను ప్రదర్శించుటలో విదితమైన సూక్ష్మదృష్టి , గ్రంథకర్తలను వారి కాలములను నిర్ణయించుటలో వ్యక్తమగుటలేదు. ఒకే గ్రంథకర్తకు వేరువేరు చోట్ల వేర్వేరు కాలము లీయబడినవి.

శ్రీ మధ్వాచార్య: పే. 145 లో 1199—1272 పే 147 లో. 1199—1278 లేక 1238—1318 లేక 1238—1318.

జయతీర్థ: పే. 145 లో 1318—1400 పే. 147 లో 1318—1365.

ఆనందపూర్ణ: పే. 145 & పే. 147 లో 1330—1400 పే. 3 ఆంగ్లోపోద్ఘాతము. 13 th Centerg A. D. బిబ్లియోగ్రఫీ పే. 1 లో 1275—1350 A. D.

ప్రస్తుత గ్రంథకర్త కాలమే భిన్నస్థలములలో భిన్న భిన్నముగా చేయబడినది.

ఆంగ్లోపోద్ఘాతము పే. 4 లో ఆనందగిరి శంకర విజయ విషయము ప్రమాణముగా గ్రహింపబడినది. ఆ గ్రంథమునకు ఆనందగిరి కర్తృత్వము ఆరోపితమని, ఆ గ్రంథము రెండువందల యేండ్ల కీవల పుట్టినదనియు సద్విమర్శకులు ఎరిగిన సంగతి. మరియు అక్కడనే సురేంద్రులు ఇంద్ర సరస్వతీ సంప్రదాయమును స్థాపించిరనియు, పీఠస్థులకు ఇంద్ర సరస్వతి నామమును, పీఠస్థులు కాని అదే సంప్రదాయ యతులకు ఆనందసరస్వతీనామమును కలదని తెలిపి, న్యాయచంద్రికా గ్రంథకర్త ఆ సంప్రదాయయతి యనియు ముడిపెట్టుటకు ప్రయత్నించిరి. ఇతర ప్రాంతముల సంగతి మాకు తెలియదు. కాని ఆంధ్రదేశమందే మాకు తెలిసినవారే పదిమందికి పైగా ఇంద్ర సరస్వతీ సంప్రదాయయతులు, పీఠస్థ లేమాత్రము కానివారు కలరు. ఇంద్రసరస్వతీ సంప్రదాయము వేరు, సరస్వతీ సంప్రదాయము వేరు. భారతీయతులకు, సరస్వతీ

# గ్రంథ విమర్శనము

యతులకు, తీర్థయతులకు, గిరియతులకు—అందరికి పూర్వపదముగా ఆనందశబ్దము విధిగా నుండును. మరియు సురేశ్వరాధిష్ఠితమైన పీఠము శ్రీ శృంగేరీ భారతీ పీఠమే కాని మరియొకటి కాదని గత శతాబ్దములోనే మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు వంటి విద్వాంసులు నిర్ణయించి యుండిరి. పీఠముల మధ్య గల వివాదములను న్యాయేతరముగా ఉపోద్ఘాతములోని కెక్కించి, ముందు ముందు ప్రచారమునకు అవకాశము కల్పించుట—ఇటువంటి ప్రచురణములకు అనుచితమని మనవిచేయు చున్నాము.

ఇట్టి గ్రంథమునకు తప్పొప్పుల పట్టిక 15 పేజీలు ఉండుట, అదికూడ అసంపూర్ణ మగుట, అభినందింపదగినది కాదు.

ఈయపూర్వ గ్రంథమును సర్వ సమగ్రముగా ప్రకటించినందులకు మదరాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ వారికి తత్త్వశాస్త్రాభిమాను లందరు కృతజ్ఞతాభివందనము లర్పింపవలసి యున్నది.

## శ్రీమద్బాదరాయణ ప్రణీత బ్రహ్మసూత్రములు

శ్రీ శాంకర శారీరకభాష్య—తదాంధ్రానువాద విశేషాంశ సమేతములు. ప్రథమాధ్యాయ — ప్రథమపాదము. రచయిత : శ్రీ పాటిబండ సూర్యనారాయణామాత్యులు. ప్రకాశకులు : పాటిబండ ప్రసాదరావు, అడ్వకేటు, అరండలుపేట, గుంటూరు. రాయలు 1/4 పే. 284 లు. మూల్యము రు. 5.

ఇది శ్రీ పాటిబండ సూర్యనారాయణరావుగారు వ్రాసి అపరిష్కృతముగా నుంచిన గ్రంథభాగము, వారి యనంతరమున 21 సం. లకు వారి దత్తపుత్రులు వారియందు గల భక్తి తాత్పర్యములచే పరిష్కరింపజేసి, చక్కగా ప్రకటించిన గ్రంథము. గ్రంధకర్త వేదాంతశాస్త్రమును ముఖ్యముగా బ్రహ్మ శ్రీ దెందుకూరి నరసింహశాస్త్రిగారి యొద్దను, జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వామి పాదుల కడను, అధ్యయన మొనర్చినట్లు గ్రంథ పరిచయాదులలో తెలియవచ్చుచున్నది. వేదాంతశాస్త్రమునకు శ్రీ శాస్త్రులవారు మహోదధి వంటివా రనియు, శ్రీ స్వామిపాదులు క్షీరోదధి వంటివా రనియు జగద్విదితము. శిష్యులైనవారు అట్టి పెద్దల వలన గ్రహింపజాలునది, వారివారి శక్తి ననుసరించి పరిమితమై యుండును. సంస్కృతభాషలో ప్రవేశము మాత్రము కలిగి వకీలు వృత్తి చేయుచు, సూక్ష్మబుద్ధి కలవారు ఎంతవరకు భాష్యార్థమును గ్రహింపగలరో, అంతవరకు చక్కగా ఈ గ్రంథకర్త గ్రహించి, ఈ గ్రంథములో తేటతెనుగున వివరించినారు. వారి వృత్తివలన నలవడిన విషయ వివరణశక్తి వలనను, గ్రంథ విషయములు బహుపర్యాయములు మననము చేయుటచే గలిగిన యనుభవము వలనను, ఈ వివరణము మిక్కిలి సుబోధముగా నున్నది.

ఈ గ్రంథస్థ విషయములు ప్రధానముగా శ్రీ స్వామిపాదుల పాఠ ప్రవచనములను, వారు రచించిన 'కల్యాణ సుధను' ఆధారము చేసుకొనియు, గ్రంథకర్త వ్రాసినట్లు తోచును. శ్రీ స్వామిపాదులు, తమకు శాస్త్రానుభవ జన్యమగు జ్ఞానమునకు తోడైన స్వభావసిద్ధమగు కుశాగ్రబుద్ధిచేత, పూర్వ వ్యాఖ్యాతలు కొందరు భ్రమపడిన విషయములు గమనించి అట్టివారిని మోమోటము లేకుండ ప్రదర్శించి, శాస్త్రయుక్తులతో సవరించుచుండెడివారు. అట్టివానిలో 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అను ప్రథమ సూత్రములోనే 'కర్తవ్యా' అని అధ్యాహారము చేయవలెనని పంచపాదికా వివరణ కాదులును, రత్నప్రభాకారులును, చెప్పినది అగ్రగణ్యము. అట్లు చేసె యెడల వేదోక్త కర్మంవలె బ్రహ్మ జిజ్ఞాసయు విధి యగుననియు, శ్రీ భగవత్పాదుల సమన్వయాధికరణ భాష్యయ్యున కంతయు నది యత్యంత విరుద్ధమై, భాష్య ప్రణాళికకే మూలవిచ్ఛేదక మగుననియు, కాబట్టి 'భవతి' అని మాత్రమే చెప్పదగుననియు శ్రీ స్వామిపాదులు 'కల్యాణసుధ' లో విస్తరించి వివరించినారు. 'అది 'భామతి' ప్రస్థానమునకు అనుగుణమైనదని. కూడ విజ్ఞు లెరుంగదగి యున్నది. కాని యీ గ్రంథకర్తకు మాత్రము, ఆ శాస్త్ర సూక్ష్మము అనుభవమునకు రాక, ప్రథమ సూత్రాంతమున భాష్యార్థ సంగ్రహములో 'బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా' అనియే [illegible]సిరి.

ఇట్లే శ్రీ నరసింహశాస్త్రిగారు చెప్పియుండిన శాస్త్ర సూక్ష్మములు కూడ కొన్ని ఈ గ్రంథములో గ్రంథకర్త స్వబుద్ధి విశేషముచేత, తారుమారై యుండును, గాని శ్రీ శాస్త్రివర్యులు గ్రంథప్రకటనము చేయనందున, నట్టివి పోల్చి తెలిసికొనుట మనకు సాధ్యము కాకున్నది.

ఎన్నో సూక్ష్మ విషయములలో ప్రమాదము లుండుగాక ! ఏమైనను ఈ గ్రంథకర్తకు గల తేటగా వివరించు శక్తి గ్రంథములో నడుగడుగున వ్యక్తమగుచున్నది. దానికై ఎంతయో పాటుపడియుండు ననుట నిశ్చయము.

సంప్రదాయ విదులు తురీయాశ్రమములకే 'బ్రహ్మైక్యము పొందిరి' అనునది అన్వయింతురు. పరిచయకర్తలును ప్రకటన కర్తలును ఆ మాటలు గ్రంథకర్తను గూర్చి చెప్పుట వారిమీద గల గౌరవభావముచే నని మనము సరిపెట్టుకొనవచ్చును. కాని ఎన్నడును ఎక్కడను 'అమాత్య పదవి' నిర్వహింపని సూర్యనారాయణరావుగారిని ముఖపత్రములో సూర్యనారాయణామాత్యులనుగా ఎందుకు చేసిరో మాత్రము బోధపడకున్నది !

## శ్రీకృష్ణాతిమానుషతత్త్వము

చతుర్థఖండము; కృతికర్త: శ్రీ దివి రంగాచార్యులు. డెమ్మీ 1/8. పేజీలు: 155. మూల్యము: రు. 5—00. ప్రకాశకులు : విద్యాపరిషత్ ప్రచురణ, గుంటూరు—2.

కృతికర్త గుంటూరు శ్రీ రామమోహనాయుర్వేద కళాశాల ప్రిన్సిపాలు, శ్రీప్రాణాచార్యులని బహుతర ప్రసిద్ధి కలవారు, శతావధానులు, అభినవ పోతనాద బిరుదాంకితులు. ఇది వారి ఈ ఉద్గ్రంథములో చతుర్థ ఖండము. ఈ గ్రంథములో శ్రీకృష్ణ భగవానుని చరిత్ర సమగ్రముగా బహు పురాణేతి హాసముల నవనీడన మొనర్చి చిత్రించుటకు యత్నించినారు.

ఇది గద్య పద్యాత్మకమైనను, వచన మత్యల్ప మగుటచే ప్రధానముగా పద్యాత్మక కావ్యమె యనదగి యున్నది. ఇతరము లున్నను ఈ కవికి ఉత్పలమాలాది నాలుగు సమవృత్తములే అభిమానపాత్రములు. కవితాధార యనర్గళముగా సాగిపోవును. దుష్కర ప్రాసము లున్న పద్యములలో గూడ ధార కుంటువడదు. కవికి భాషమీదను, ఛందస్సు మీదను కల యధికారము నది సూచించును.

ఈ ఖండములో ఐదాశ్వాసములు, 998 పద్య గద్యములలో అనేక కథాఘట్టము లున్నవి. ఐనను ఏ భాగము కూడ సహృదయ హృదయములను ఆకట్టజాలకున్నది. ఆలోచింపగా నందుకు కారణము, కవి కథా ఘట్టములను చక్కగా మననము చేసి ఆవిష్కరించుటకు బదులు హేలగా పద్య రచనమునకు పూనుకొనియుండుటే అని తోచును.

ప్రసిద్ధములైన మహాభారత కథా ఘట్టములను కవి బుద్ధిపూర్వకముగా ఎన్నియో తావుల మార్చిరి. కృష్ణ సహాయమర్థించి వెళ్లిన దుర్యోధనార్జునులలో ముందు దుర్యోధనునే కోరుకొమ్మనుట, ద్రోణవధాత్పూర్వము అశ్వత్థామ హతుడయ్యెనని పలికినది ధర్మజుడు కాక శ్రీకృష్ణ ప్రేరణచే హిడింబ పంపిన యసురు డొకడు ధర్మజ వేషమున పలికెననుట, శ్రీకృష్ణుడే స్వయముగా గదాయుద్ధ సమయమున ఊర్వంతరతాడన మొనర్చుమని సైగ జేసె ననుట, సౌప్తిక ఘట్టములో కృతవర్మను రానీకుండుట, ఉపపాండవుల శిరస్సులు దుర్యోధనుని యొద్దకు తీసికొని పోగా 'సీ' యని దూరి వారిని 'నృపాలుండున్ మృతుండై చనెన్' అనుట—ఇత్యాదు లెన్నియేని అట్టి మార్పు లున్నవి. ఆ మార్పు లేవియు సహృదయరంజకములు కావు. కొన్ని కొన్ని శ్రీకృష్ణునియందు అనద్భావము కలిగించునవిగా కూడ నున్నవి.

కవికి సంస్కృతాంధ్రములలో పాండిత్య మున్నట్లు స్పష్టమే యైనను ఎన్నో అప్రయోగములు కనుపించుచున్నవి. కొన్ని యెడల అన్వయములు కుదురుటలేదు. గభాలున, శాబ్ది (శపథము), ఢీకొను, వంటి వ్యావహారిక పదములు రచనలో కలిసిపోక అదుకులుగానే ఉన్నవి. యతిప్రాసములలో సర్వ స్వాతంత్ర్యము కనబడుటే కాక కొన్నియెడల గణభంగములు కూడ కానవచ్చుచున్నవి.

'భక్తిని నొనరించి యేలెః దొలి దుష్టగతుల్ దిగ్రమింగు బాపిని . . . .' పే. 90. ప. 50.

ఒక గలము పోయినది. అచ్చు తప్పుగా తోపదు.

పే. 66—67 ల లోని దండకము తగణముతో ప్రారంభమైనది. అది తగణములతో సాగి గురువుతో అంతము కావలసినది. కాని కొంత దూరము సాగిన తర్వాత మధ్య నెన్నో తావుల ఇతర గణములు కూడ దొరలినవి. "శత్రుభంజనా, శుంభన్నిరంజనా .... దమ్మికంటి నీదు—నంద నందనా—కా, శ్రీయప్రమేయా—సదానంద, యిందిరా సుందరీ—" ఇత్యాదిగా నున్నది.

ఈ కవి ముం దింకొక్క భాగములో భగవద్గీత రచింప దలచినట్లు గ్రంథాంతమున తెలిపియున్నాడు. అది సర్వదా మననముచేసి శ్రద్ధాతిశయముతో దీరశాంతముగా రచన కావించినచో, ఆంధ్ర సహృదయలోక మానందింపగలదు.

—నోరి నరసింహశాస్త్రి.

## అనాదికొసనుంచి అనంతత్వంలోకి

(స్వేచ్ఛాగీతికల సంపుటి). రచన : శ్రీ బోయి భీమన్న. ప్రచురణ : సాహితీలతా ప్రచురణలు హైదరాబాదు—1. వెల : నాలుగు రూపాయలు.

ఈ సంపుటి పేరు చూడగానే ఎవరికైనా స్ఫురించే మొదటి ప్రశ్న—అంటే యేమిటి ? అని. దీనికి కవిగారి మిత్రులు రెండు రకాలుగా అర్థాలు చెప్పారు. ఎలానైనా చెప్పుకోవచ్చని కవి అన్నారు. ఎలానైనా ఎందుకు ? అర్థం స్పష్టమే. ఆది అనేది లేనిదానినుంచి, అంతము అనేది లేని దానిలోకి—అంటే కాలలీల, జీవలీల, విశ్వలీల సర్వస్వమూ అన్న మాట. ఇది చాలా పెద్ద వేదాంతము. దీనికి అనేక దృక్పథాలు, వాదాలు, సిద్ధాంతాలు ఉన్నాయి. ఈ కవికి ఒక నిర్దిష్ట దృక్పథం ఉంది. ప్రకృతి-పురుషుడు, ప్రేయసి, ప్రియుడు, ఆత్మ-పరమాత్మ లసంబంధాన్ని మీ మాంస చేసుకొని, సర్వ ప్రకృతీ అర్ధనారీశ్వర కల్పనా చమత్కృతే అనీ, లయాన్విత జీవిత షారమ్యమే ఆనందమనీ, అదే బ్రహ్మమనీ గ్రహించాడు. ఈ శాఖకు చెందిన తత్త్వం ఇదివరకే ఉంది. దాన్ని రవీంద్రుడు "గీతాంజలి" లో మరొక తీరుగా గానం చేశాడు. భీమన్నగారు రవీంద్రునికి కొంత సన్నిహితులు, కాని ఒక్క వ్యత్యాసం ఉంది. భీమన్నగారి కవితలలో భౌతికమైన ఉద్విగ్నత అధికం. అందుకు కారణం—

సర్వ ధర్మాలకు, అనుభూతులకు
ఆనందాలకు చిత్రశాల శరీరం
దాని తృప్తే—సంతృప్తి

అని చెప్పి ఈయన ఆధ్యాత్మికతకు గాక ప్రవృత్తికి ప్రాధాన్యమిచ్చారు. కనుకనే ఈయనలో స్త్రీమూర్తి ఆరాధన ఉంది. 'ఆత్మే కావలిస్తే ఆరాధించు' అన్నాడు. సౌందర్యతృష్ణ ఉంది. దానితో అన్వేషణ వచ్చేసింది. వియోగం, విరహం వచ్చాయి.

'నీవు నాదగ్గర లేనప్పుడే
నాపై ఆజమాయిషి ఎక్కువ నీకు'

అని తనపై ప్రేయసికి గల ప్రభావాన్ని చెప్పుకున్నాడు. చివరకు శ్మశానం ప్రస్తావన వచ్చినప్పుడు కూడా డెందము-

అందము, చిరస్నేహం, ఆనందాలనే తలచుకొని శంకరుడు రుద్రభూమిలో కాపురం పెట్టడంలో కూడా ఏదో పరమార్థముందని ఆలోచిస్తాడు. మరి ఇట్టి వ్యక్తి సౌందర్యద్వేషులను సహించగలడా ?

అందాలు పనికిమాలినవనీ
రసాలు లగ్జరీలనీ,
మధురభావాలకు మార్కెట్ లేదనీ

అనే లౌకికులను నిరసించి, సంసారం దుఃఖమని చెప్పే మెట్టవేదాంతులను కొట్టి పారవేసి—

వెలుగెక్కడ ఉంటే అక్కడ
మళ్లీ మరొక కుటుంబం

అంటూ కొన్ని దృష్టాంతాలు చెప్పి యవ్వనం, సౌందర్యం, కళ, ఆనందం మనిషికి పరమేశ్వరు డిచ్చిన సొత్తు అన్న తమ విశ్వాసాన్ని ఉద్ఘాటిస్తూ బ్రతుక్కి ధ్యేయం చెప్పాడు :

బ్రతుక్కి ముఖ్యం దాని పుష్ప ఫల వైభవాలు
బ్రతుక్కి ఫలితం నిండు బ్రతుకే.

ఈ సంపుటిలో "ద్వైధీశీల" అనే కావ్యఖండిక కవి తత్వానికీ, ఆతని ప్రతిభకూ ప్రతీకగా ఉంది. "రైలు ప్రయాణం" ఖండిక ఒక కథానికవలె ఉంది. దీనిలో ఇతి వృత్తం బాహిరంగా ఎంత లౌకికమైనదిగా కన్పిస్తుందో అంతటి పారలౌకిక భావం ప్రమిదను నీడ అంటుకొని ఉన్నట్లుగా ఉంది. ఈ ఖండిక రచనలో చక్కని క్రమం ఉంది.

ఈ సంపుటిలో 'సంకేత కవిత్వం సమృద్ధిగా ఉంది.

ఒక్క చాంద్ర విశ్వకళా పరిషత్తులోనే
ఇరవైయేడు కాలేజీలు.

అని అన్నప్పుడు అవి ఇరవైయేడు నక్షత్రాలని పాఠకులు సులభంగా తెలుసుకోగలరు కాని ,"హేమంత నిశీథం", "ఫాల్గుణి", "రేయి", "ఆనందం" వంటి గీతికలను అర్థం చేసుకోవాలంటే కవిగా రిచ్చిన టీకలను ముందు కంఠస్థం చేసుకోవలసిందే. ఒక్కొక్కదానికి సంకేతాలుగా రాశి, నక్షత్రాల ప్రసక్తి ఎంతగానో తెచ్చారు. అలా పుస్తకం మొదటనే కవి టీకలను ఇవ్వడం మేలే అయింది. అయితే ఆసక్తి, వోపిక ఉన్న పాఠకులకు ఇవి మెదడుకు మేత నిస్తాయి.

ఇంతటి తాత్విక జిజ్ఞాస, సౌందర్యారాధన, అన్వయము గల కవితలను స్వేచ్ఛాగీతికలుగా వ్రాయడం అబ్బురంగానే ఉంది. ఎందుచేతనంటే స్వేచ్ఛాగీతిక అనేది ఆధునిక కవులు ఒకానొక ప్రయోజనానుగుణమైన వెసులుబాటు చూచుకొని అనుసరిస్తూవున్న కొత్త రూపం. కవిత్వం చేసేపని మారింది కాబట్టి, వివిధ పరిస్థితులవల్ల కవితాస్వరూపం కూడా మారి అది జీవితానికి దగ్గిరగా వచ్చింది కాబట్టి నిరాడంబరంగా వ్యక్తంచెయ్యాలన్న దృష్టితో ఈ కొత్త రూపాన్ని మన కవులు సాధనచేస్తూ పరిణతి సాధింప ప్రయత్నిస్తున్నారు. సౌందర్యారాధనకూ, తాత్విక విజిగీషకూ ఈ రూపం నప్పుతుందా అన్న సందేహం లేకపోలేదు. భీమన్నగారు అలా సందేహపడ నక్కరలేదని ఋజావుచేశారు. కృతకృత్యులు కూడా అయ్యారు. ఇందులో వింత గొంతుక లేదు కాని, సొంత గొంతుకను వెదుక్కునే ప్రయత్నం ఉంది. వచనగీతికల రచనలో చెబుతూఉన్న విషయంతోపాటు చెప్పే విధానం చాలా ముఖ్యమైంది. పదప్రయోగ కౌశలం, శబ్దచిత్రాల కల్పన, భావాల విసురులు, నడకల సొగసులు పుష్కలంగా ఉంటేనే ఇవి ఆద్యంతం చదివిస్తాయి. ఇందులో అలాంటివి మచ్చుకు:

చీకటి దుప్పటి ముసుగు పెట్టుకొని
చెట్లు కునుకుతున్నాయి దూరంలో

* * *

నగ్న నిసర్గ సత్యంలా వుంది రేయి

* * *

మబ్బు కొమ్మలకు వానకాళ్ల ఊయెలలు కట్టి
తద్ది పండగలు చేసుకునే మెరుపు కన్నెలతో

* * * *

వర్తమానం నీ నడుంలా ఉంది

* * * *

ఒంటరిగా వున్నప్పుడు ఆలోచనల తీర్థం
తీర్థంలో వున్నప్పుడు ఒంటరి నా బ్రతుకు

* * * *

నెలవంక గంప నిండుతూ వచ్చి
పూర్ణిమ అయింది,
జాబిల్లి రబ్బరుబిళ్ళ అరిగీ అరిగీ
అమావాస్య అయింది.

అయితే ప్రతి గీతంలోనూ రచయిత ఏదో ఒక తత్వం చెప్పడంచేత మామూలు పంక్తులు కూడా ఉన్నాయి. చిదపలు, కుదపలు, మొగదల, ఎదర, సందవెన్నెల, కన్నుకొట్టడం (ఇది రెండు మూడు తావుల ఉంది). మొదలగు మాటలకు బదులు తత్వం, సౌందర్యం వంటి ఇతివృత్తాలకు సముచితమైనట్టి శబ్దాలనే ప్రయోగిస్తే ఇంకా బావుండేది. సౌందర్యారాధనల సమాహారమైన ఈ కావ్యసంపుటి ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారికి కడు దొడ్డ ప్రశంసతో అంకిత మివ్వబడింది.

రమ్య భావ కుసుమాలు గల ఈ కవితోద్యానం రసికజనుల విహారానికి అనువైనది.

---

## అన్నదమ్ములు

రచన : శ్రీ జమదగ్ని. ప్రచురణ : శ్రీ శివానంద తరంగిణి త్యాగరాయనగరం, మద్రాసు—17. వెల : రూ. 1—50.

వివిధ సాహితీ ప్రక్రియలలో రచనలు చేసేవారైనప్పటికీ ముఖ్యంగా కథారచయితగా మన పాఠకులకు పరిచితులైన శ్రీ జమదగ్నిగారి నాలుగు కథల సంపుటి ఈ పుస్తకం. కథలకు వస్తువేమిటి అన్న విషయమై చాలా తర్జన భర్జనలు జరుగుతూ వుంటాయి. ప్రేమ, ఆకలి, భీభత్సంతప్ప మరేవీ మన కథలకు వస్తువులుకావటంలేదు అనే ఆరోపణ తరచు వింటూవుంటాము. మన కుటుంబాలు, వాటిలోవుండే విశిష్టులైన వ్యక్తులు, పిల్లలు, వారిచేష్టలలోని పరమార్థంకూడా చక్కని కథావస్తువులని శ్రీ జమదగ్ని చూపెట్టారు. ముఖ్యంగా అన్నదమ్ములంటే యేమిటో రచయిత ఇందులో రెండుకథలద్వారా చెప్పింది ఎంత బాగున్నదో చెప్పలేము.

పల్లె జీవితం తీరును, స్థాయిని, పల్లీయుల పరిభాషను "అన్నదమ్ములు" అన్న కథలో రచయిత ప్రతిభావంతంగా వ్యక్తంచేశారు. "కఱ్ఱ లోతుగా గుచ్చి దుక్కి ఆపివేసి" అన్నప్పుడూ "ప్రొద్దు నడినెత్తికి రాలేదు, ఇంకా గజంనీడ పడుతూనే వుంది" అని వేళను సూచించినప్పుడూ పల్లెజీవితంపైనం సువ్యక్తం చేశారు. కథకుడు కవికూడా కాబట్టి కొన్ని ఉపమానాలు కావ్యధోరణిలో వున్నాయి. ముఖ్యంగా "త్రవ్వుకున్నబావిలో జల పొడిచినట్లు రాముడి మనస్సులో ఉత్సాహం పరవళ్ళు తొక్కింది" అన్నప్పుడు అది ఆసందర్భాన్నే నిరాడంబరంగా అలంకరించింది. ఎంతో ఔచిత్యంకూడావుంది.

కథానికలో కథవున్నా లేకపోయినా, ప్రయోజనం–నీతి వంటివివున్నా లేకపోయినా చదువరికి ఒక సంస్కారం కలిగించితే అవి ఉత్తమకథలేఅని లిన్‌యుటాంగ్ అన్నమాటలు ఈ సంపుటి చదివితే జ్ఞాపకమొచ్చాయి. ఆ సంస్కారమేమిటీ అంటే— కుటుంబంపైన, ఒక్కొక్క కుటుంబంలోని గొప్పవ్యక్తులపైన అభిమానంవంటి అనుభూతిని కలిగించడం. ఈ పుస్తకానికి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన విపులమైన పీఠిక ఏ దృక్పథం గలవారైనా చదువదగింది.

## ప్రేమగాథ

మూలం : విల్లా కేతర్. తెనుగుసేత : చందూర్. ప్రతిమా బుక్స్, 49 మూకతాల్ వీధి, మద్రాసు 7.

పుస్తకం పేరును చూచి ఇది అబ్బాయి—అమ్మాయిప్రేమ కథ అని అనుకునే ప్రమాదం ఉంది. అలాంటిదేమీ ఇందులో లేదు. ఇది ఇద్దరు మిత్రుల కథ. రచయిత్రి అమెరికన్ విదుషీమణి విల్లా కేతర్. అమెరికాకు చెందిన ఇరవయ్యో శతాబ్ది నవలా రచయితలలో ఉత్తములైన ముగ్గురు నలుగురులో ఈమె ఒకరని చెప్పుకుంటారు. ఈమె పులిట్జర్ బహుమతిగ్రహీత. ఈమె వ్రాసిన నవలల్లో **Death comes for the Archbishop** చాలా పేరుపొందినది. రోమన్‌కేతలిక్ మత ప్రకర్షను దృష్టిలో పెట్టుకొని రచయిత్రి యీ నవలను వ్రాసినట్లు తెలుస్తుంది. ఆ మతం పుచ్చుకున్న తర్వాతనే దీనిని వ్రాసింది. సౌత్‌వెస్టు ప్రాంతంలో సేవాపరుడైన ఒక ఫ్రెంచి మిషనరీ జీవితగాథ ఇందులో వర్ణితమైంది. ఆ వ్యక్తితోపాటు ఆ ప్రదేశపు చిత్రణ ఈ నవలలో ఒక విశేషం. చందూర్‌గారి అనువాదం సరళంగా, చదువుకు పోవడానికి వెసులుబాటుగా ఉంది.

—డి. రా.

## సువర్ణరేఖలు

రచన: బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు. ప్రాప్తిస్థానము: తెలుగు విద్యార్థి ప్రచురణలు, పోస్టుబాక్సు నెం. 1, మచిలీపట్నం. వెల : రు. 1—50.

ఈ గ్రంథములో పండ్రెండు కథానికలు కలవు. అందు "దొంగలున్నారు జాగ్రత్త!" యనునది, "అఖిల భారతపోటీలో ద్వితీయస్థానం పొంది, ప్రపంచ కథానికల పోటీకి పంపబడినకథ." ఈ పండ్రెండు కథలలో నొక కథానామము "సువర్ణరేఖలు". ఆ నామమే గ్రంథనామముగా స్వీకరింప బడినది.

సూర్యారావుగారి కథల నన్నిటిని జక్కగా జెక్కగా దీర్చిదిద్దిరి. కథానికలో నేదో యొక సన్నివేశముగాని, యొక ప్రత్యేక మనస్థితిగాని, యొక యూహగాని ప్రధానాంగమై యుండును. ఈ ప్రధానమయిన దానిని గ్రంథకర్త కథలో నాద్యంతము బంధము సడలిపోకుండ ఋజు మార్గమున పోషించును. ఆ పోషించుటలో గ్రంథకర్తృకౌశల్యము కన్పట్టును. అట్టి కౌశల్యము సూర్యారావుగారిలో పుష్కలముగా నున్నది. అనుచిత వ్యవహారముల పొంతకు బోలేదీ కథా రచయిత.

"సువర్ణరేఖలు"లోని వ్యక్తులు సామాన్యులే. వారి యనుభూతులు సామాన్యములే. మరి విశేషమేమి ? విశేషము మనస్తత్వ పరిశీలనములో నున్నది. ఈ పరిశీలనము సాయముతో సామాన్య వ్యక్తులలో, సాధారణ సన్నివేశములలో విశ్వజనీన సత్యములను దర్శించినవారు సూర్యారావుగారు. శేషయ్య, చిన్నయ్య, రామనాథం, వస్తాదు వీరన్న మున్నగువారు మన సంఘములో నిత్యము మనకు గన్పించువారే! లేక యీ వ్యక్తుల మనస్తత్వమొకపాలో, రెండుపాళ్ళో మనలో నుండునట్టిదే! ఆ వ్యక్తులందరు దురాశకు, నవివేకమునకు బలియైపోయినవారే! గాలిలో మేడలు కట్టినవారే! సూర్యారావుగారు కొన్ని కథలలో బాఠకుడూహింపనిరీతిగా నంతము నందొక యల్పసన్నివేశము సృష్టించిరి. ఇట్టి సృష్టివలన జమత్కారము జనించును. "గతకలదారి" "సువర్ణరేఖలు" "యుగసంధి" కథలిట్టి కుదురునకుం జెందిన చమత్కరణముతోఁ గూడియున్నవి.

ఈ కథలలో బాత్రోచిత భాష యధికముగా గలదు. ఎంత వ్యావహారి కాంధ్రమయినప్పటికి "పిల్లల్ని పెంచి పెద్దవాళ్లను జేశాడు", "వాళ్లంతట వాళ్ళే పెరిగారు" మున్నగు వాక్యములలో గ్రిగీత గల మాటల వరుస బాగులేదు. అందఱు చదివి యానందింపదగిన, ముద్దుముద్దుగానున్న చిన్న కథలతో గూడిన కథాసంపుటి ఇది.

—నాగళ్ల గురుప్రసాదరావు.

## తప్పెవరిది?

రచయిత : పోలవరపు నన్యాశిరావు, (మునగపాక) ప్రచురణ : తెలియదు ముద్రణ : లక్ష్మీ ప్రెస్, 57, 41 వ వీధి, రంగూన్. 147 పేజీలు. వెల : రు 1—50 న. పై.

ఇదొక సాంఘిక నవల. ఈ నవలలో ఒక సుగుణంవుంది. ఏమిటంటే—మొదట్నుంచీ చివరదాకా చకచకా కథ పరుగెత్తుతుంది. అందువల్ల చదివేవారు విసుగు బాధకు లోనవకుండా చదివేయగలుగుతారు. కాని—ఈ పుస్తకంనిండా కావలసినన్ని అచ్చుతప్పులు లభ్యమవుతాయి. అవిమాత్రం అడుగడుగునా బాధిస్తూనే వుంటాయి ! ఉండవలసినచోట్ల ఒత్తులు ఉండకపోవటమూ అక్కర్లేనిచోట్ల ఒత్తులు ఉండడటమూ వంటివికూడా చూస్తే— తప్పెవరిదో అర్థంకాదు ! రచనలోకూడా—వాక్యాలు రాయటంలో ఒకపద్ధతి కనిపించదు. భూతకాలంలో సాగుతున్న క్రియ వున్నట్టుండి వర్తమానానికీ, వర్తమానంలోది భూతానికీ— మారిపోతూవుంటుంది ! ఈ నవలలోని కథ చాలామట్టుకు రంగూన్‌లోనే నడిచినట్టుచూపారు రచయిత. ఐతే ఆ వాతావరణాన్ని ఇంకా బాగావాడుకోలేదేమో అనిపిస్తుంది. పుస్తకంలో అనవసర వర్ణనలూ, చర్చలూ (ఆఖరునజరిగే కులంమీద చర్చ తప్ప) లేకపోవటం వున్నంతలో మరోసుగుణం ! ఏది ఏమైనా, నవలా సాహిత్యాన్ని ప్రోత్సహించవలసిన అవసరంవున్నదికాబట్టి ఈ నవలనుకూడా ప్రోత్సహించక తప్పదు !

## బాబు

రచన : ఆకుండి నారాయణమూర్తి, ప్రచురణ : లక్ష్మీ మిత్ర ప్రచురణలు, బొబ్బిలి, 152 పేజీలు. వెల : రూ. 1—50 న. పై.

ఈ సంపుటిలో (1) 'బాబు' (2) న్యాయానికివిలువ' (3) 'పీడిస్తున్నసమస్య' (4) 'తీరనిబాధ' (5) ఊహించలేని విషయం' (6) 'కీలుకత్తిపీట' (7) 'విడాకులు' (8) 'వింత మనస్తత్వాలు' (9) 'తిరుగుప్రయాణం' (10) 'అబల' అనేవి మొత్తం పదికథలున్నాయి. 'అబల'అనే కథతప్ప — మిగతావన్నీ భారతి, ఆంధ్రవార, దినపత్రికలలో ప్రచురితాలు. అబలకథ 'జాగృతి' పత్రిక నడిపిన కథలపోటీలో ప్రథమ బహుమతి పొందినది.

నారాయణమూర్తిగారికి కథ చెప్పటం, నడపటం బాగా తెలుసు. ఈ విషయం వారికథలను చదివిన పాఠకులకు విదితమే. ఈ కథల్లోకల్లా 'అబల' 'బాబు' 'న్యాయానికి విలువ' 'కీలుకత్తిపీట'— అన్నకథలు బాగా బాగున్నకథలు. 'న్యాయానికి విలువ' అన్నకథను చదవటం ప్రారంభించిన కాస్సేపటిదాకా— చెఖోవ్ కథ గుర్తువస్తుంది. ఐతే మధ్యనుంచి మారిపోతుంది. 'కీలుకత్తిపీట' అన్నకథలో మన ఆడవాళ్ల మనస్తత్వాన్ని, వాళ్ల పద్ధతినీ బాగా వ్యక్తపరచారు రచయిత. 'విడాకులు' అన్న కథ కూడా చక్కనికథే. మొత్తానికి—మంచికథల సంపుటి.

## కవల పిల్లలు

పిల్లల నవల: మూలం : ఏరిచ్ కేస్టనర్, తెలుగు: డాక్టర్ వి. యస్. శర్మ, ప్రచురణ : ప్రతిమాబుక్స్, 49 మూకతాల్‌వీధి,మద్రాసు 7, 171 పేజీలు—150 పైసలు.

శర్మగారు జర్మనీ భాషను బాగా ఆకళింపు చేసుకున్నవారు. వారుచాలా జర్మన్‌కథలను తెలుగులోకి తీసుకువచ్చారు.

ఇదిచాలా చక్కనికథతో కూడుకున్న మంచినవల. నవల మంచి ఉత్సాహంతో నడుస్తుంది. ఐతే 'పిల్లలనవల' అన్నారు కాబట్టి— భాషకూడా పిల్లలభాషే వున్నట్లయితే బావుండేది. అట్లాకాకుండా మామూలు పద్ధతిలోనే సాగింది. బొమ్మలు లేకపోవటంకూడాలోటే. ఐతే, ఇందులోవున్నభాష కటువు అని కాదు— కాని, 'పిల్లలభాష' మాత్రంకాదు. నవలలో కొన్ని చోట్ల తొమ్మిదేళ్లపిల్లల భావాలుకొద్దిగా అతీతంగా కనిపిస్తాయి. అది అంతగా పట్టించుకోకుండా వుండటం సబబు ! ఏమైనా, ఇటువంటి మంచికథను, మనభాషలో చెప్పప్రయత్నించిన రచయితను అభినందించాల్సిందే !

—సుకుమార్.

## ముత్యాల సరాలు- మహాకవి గురజాడ

రచన : చిట్టిమల్లె శంకరయ్య (రుద్రశ్రీ). ప్రచురణ : సాహిత్యసంసత్, జనగామ. క్రౌను 1/8 సైజులో 72 పుటలు. వెల తెలుపలేదు.

దీనికిముందు సంపత్ వారి తొలివలుకు, సంసత్ కార్య నిర్వాహకుల 'ఆశంసన'కాక, బోయి భీమన్నగారి "ప్రస్తావము", గిడుగు సీతాపతిగారి "ఆశీః", కాళోజీగారి "అభిప్రాయము" కలిసి, రచయిత కృతజ్ఞతతో సహా వెలసి, మరి పన్నెండు పుటలు ఆక్రమించుకొన్నవి. ఈ పుస్తకము మొత్తము అయిదు వ్యాసములతో సమకూర్చిన సంపుటము. ఆ వ్యాసములు—ఉత్తమ సాహిత్యము, చారిత్రక పురుషుడు గురజాడ, వ్యవహారికభాష, ముత్యాలసరాలు—ఛందస్సు, ముత్యాల సరాలు. ఈ పుస్తకములో కడపటి రెండు వ్యాసములు ముత్యాల సరాలు గురించి చర్చించుటచేతను అదే ఈ పుస్తకములో ప్రధాన వ్యాసము అగుటచేతను రచయిత పుస్తకమునకు "ముత్యాలసరాలు—మహాకవి గురజాడ" అని పేరుపెట్టినారు. "ముత్యాల సరాలు"గూర్చి శ్రీ శ్రీ ఉదయునిలో ఒక సుదీర్ఘ వ్యాసము రచించి, ఎన్నడో ప్రకటించినదే తిరిగి పుస్తకరూపంలో కూడ వెలువరించినారు. దానిలో ముత్యాల సరాలులోని ఛందో విశేషాలు, మాత్రాచ్ఛందస్సు ఇట్టివన్నీ సమగ్రంగా చర్చించుట జరిగింది. ఈ పుస్తకంలో చిట్టిమల్లె శంకరయ్యగారి వ్యాసం కూడ శ్రీ శ్రీ వ్యాసానికి రూపాంతరంలాగునే కనిపిస్తున్నది. ఈ ముత్యాలసరాల ఛందో విధానం మేలుకొలుపులు పాటలోను, పార్శీగజల్సులోను, భామినీ షట్పదులలోను, రగడలలోను కని

పిస్తున్నదని వీరు విపులముగా చర్చించి—"ఒక క్రొత్త మార్గాన్ని ప్రవేశపెట్టి తెలుగు తనానికీ నవ్య కావ్యానికీ కవాటాలు తెరచి ప్రాతినిధ్యం వహించిన మార్గదర్శి మహాకవి గురజాడ" అన్నారు. ఇంక చివరి వ్యాసములో—"ముత్యాలసరాలు" అను సంపుటిలో సేకరించిన ఖండ కావ్యములనుదాహరించి ఒక విపుల వ్యాఖ్యానముచేస్తూ—గురజాడ తమ తరువాత వచ్చేతరంవారికి 'ఆత్మాశ్రయ కావ్యం, ప్రబోధ కావ్యం, కథాకావ్యం ప్రేమగీతి అన్నీ కొద్దిగా ముత్యాల సరాలుగా కూర్చి తెలుగుతల్లి కర్పించిన మహాకవియని అభిప్రాయపడ్డారు. ఈ వ్యాసం ఒక గొప్ప సాహిత్య విమర్శగా ఉన్నతస్థాయిని అందుకోకుండా కళాశాలా విద్యార్థుల కాంపోజిషన్ ధోరణిలో ఉన్నది. ఈ వ్యాసంలో గురజాడ ముత్యాలసరము 1910 లో వ్రాసినట్లు ఉల్లేఖించినారు. అది సరికాదు. గురజాడ అప్పారావుగారే తమ లేఖలలో ఈ తొలి ముత్యాల సరము—తోకచుక్క పొడిచినపుడు 1912 లో వ్రాసినట్లు—ఆనాటిరాత్రి ఒకానొకచో వారు జాతి మత విభేదములులేని సర్వజన సంతర్పణలో పాల్గొనివచ్చినట్లూ తెలిపియున్నారు. పుస్తకరూపంలో వ్యాసములు ప్రకటించేటప్పుడు ఇలాంటి పొరపాట్లు చొరనీయకుండా చేయవలసినది.

"వ్యవహారిక భాష" అను వ్యాసమున ఈ వ్యాసకర్త "ప్రజలకు తెలియునట్టి వాడుక భాషలోనే నవ్య కావ్యమునకు శ్రీకారము చుట్టిరి కాబట్టి గురజాడ యుగ పురుషుడు" అన్నారు. ఇది ఎంతవరకు అందరూ అంగీకరించగలరో! ఇలాగే "అప్పారావుగారి రచనలన్నీ వ్యవహారిక భాషలోనే వ్రాయబడినవి" అని ఒక వాక్యం వ్రాశారు. అది కూడ విమర్శతో పరిశీలిస్తే నిలిచేవాక్యంకాదు. అలాగే వీరు వాడుక భాషకు పర్యాయపదంగా "వ్యవహారిక" పదం వాడారు. అది "వ్యావహారిక" భాష అని ఉండవలసిన శబ్దము. అయితే ఇది కూడ వ్యవహారములో ఉన్న వాడుకభాష అయిన కారణంచేత ఇలాంటి ప్రయోగాలు శంకరయ్యగారు వాడుకొన్నారేమో! మొదటివ్యాసం "ఉత్తమ సాహిత్యము"లో—వీరు 'సాంఘికాదర్శాలకు తల్లివంటిది' సాహిత్యమని ఒక నిర్వచనం చేశారు. అలాగే తెలుగు సాహిత్యాన్ని మూడు విభాగాలుగా విడదీసి, పురాణ సాహిత్యం, ప్రబంధ సాహిత్యం, నవ్య సాహిత్యం అని పేరులుపెట్టి; నవ్య సాహిత్యానికి యుగ పురుషులుగా గురజాడ వారినీ, కందుకూరి వీరేశలింగం గారినీ చూపించారు. ఈ యభిప్రాయాలతో ఎందరు ఏకీభవించగలరో!

ఆ తర్వాత వ్యాసం 'చారిత్రక పురుషుడు' లో కూడ గురజాడ అప్పారావుగారి జీవిత సంగ్రహం మూలంగా ఆయనను యుగ పురుషుడుగా నిరూపించారు. ఆ శీర్షిక అర్థం కూడ అదే చరిత్రకాలంనాటి పురుషుడనికాదు, నవ్య సాహిత్య యుగ పురుషుడని వారి తాత్పర్యం. "గురజాడ మహనీయుడు, మహా రచయిత, మహాకవి. చిట్టి శంకరయ్య వ్యాసాల సంపుటిపై మాటలను రుజువు చేయుటకై చేయబడిన చిట్టి ప్రయత్నం మాత్రమే" అని కాళోజీగారి అభిప్రాయము. ఇలాంటి అభిప్రాయాలు వెల్లడించిన ముగ్గురు పెద్దలూ, మూడు ముఖ్య విశేషాలు ఈ వ్యాసం సంపుటిలో కనిపెట్టారు. ఒకరు గురజాడ రచనలలో 'గిడుగువారి వ్యావహారిక భాషోద్యమం కందుకూరివారి సంస్కరణోద్యమం, పరవస్తువారి భాషా వ్యవస్థీకరణోద్యమం స్వీయ సహజ కవితా ప్రతిభతో మేళవించి మొలకెత్తిన సాహితీ కల్పలతలు కనిపించాయి. ఇంకొకరికి గురజాడవారు 'ఎన్నో క్రొత్త మార్గాల ఆవిష్కరించి సాహిత్య రంగంలో మహోన్నతస్థాయి నాక్రమించినారు,' అన్న వాక్యములో యదార్థము గుర్తుకు వచ్చినది. మరొకరికి "కొయ్య బొమ్మల మెచ్చుకండ్లకు కోమలుల పేరు అందించా లని చిట్టి శంకరయ్య చేసిన చిట్టి ప్రయత్నం" కనిపించింది. వారి వారి సంస్కారాలనుబట్టి, ఈ వ్యాసాలీ ముగ్గురూ అలాగ అవగాహన చేసికొన్నారు. ఈ వ్యాస సంపుటిలో క్రొత్తదనంలేదుగాని, గురజాడవారి ముత్యాలసరాలు మరొకసారి పరిశీలించే ప్రయత్నంమాత్రం జరిగింది.

## జ్వ లి త జ్వా ల

(నవలికలు మూడుకథలుగల చిన్న సంపుటం రచన: ఉమశ్రీ. ప్రచురణ: తరుణసాహితి, ఆలమూరు—హైదరాబాదు 1/8 క్రౌనుసైజున 139 పుటలు. వెల : రెండురూపాయలు.)

**ము**ందు నాలుగుపుటలలో త్రిపురనేని గోపీచంద్, విద్వాన్ విశ్వంగారల పరిచయాలు— చివరనొక నాలుగు పుటలలో భాస్కరభట్ల కృష్ణారావు, కలపటపు రామగోపాలరావు, రాఘవ గారల అభిప్రాయాలు చేరినవి.

ఈ పుస్తకంలో జ్వలితజ్వాల, నాతిచరామి, అంతర్వ్రత్తి అనే పేరులతో మూడు పెద్దకథలున్నవి. ఇవి భారతిలోను, జాగృతిలోను మొదట కథానికలుగా ప్రచురణపొందినవి. అయినా కాని 'నవలికలు' అని ఎందుకు పేరుపెట్టుకున్నారో— నవలకుండవలసిన లక్షణాలుకాని, చిన్ననవల (నవలిక) లక్షణాలుకాని యిందులో లేవు. ఈ మూడుకథలు పురాతన స్మృతులుగా ఫ్లాష్ బ్యాక్ పద్ధతిలో చెప్పినవే. మొదటికథ ఆత్మనేపదంలో కథానాయకుడు చెప్పడం, కథానాయిక వినడం ఈ రూపంగా జరిగింది. కథకుబీజం వారి కుమారుడు అనేక దుర్వ్యసనాలకు గురియై శిక్షపాలయిన ఒకయువకునివద్ద నుండి లేఖ. రెండవ కథలో వివాహితకలయిన స్త్రీ— భర్తనుకోల్పోయి పుత్రుని ప్రసవించి ఆ యుక్రమ సంతానంతో తనకు పరిచితుడైన వ్యక్తి వివాహసమయంలో వచ్చి, అతనితో తనబిడ్డకు తండ్రిఅయిన వాడెవ్వరో చెప్తుంది. ఆ వ్యక్తి— అంతవరకు తానే ఆ ఘనకార్యానికి బాధ్యుడనని భావించి నిజంతెలిసికొని నిర్వణ్ణుడై తనవవధువుతోసహా ఆ చిట్టితల్లిని వ్యాజస్తుతిచేస్తూ ఉంటాడు. ఇంక మూడవకథలో వివాహిత అయిన స్త్రీ తనభర్తతో అసంతృప్తి పొందుతూన్నదేమో అని ఆమె పూర్వపరిచితుడువచ్చి అనుమానిస్తూ ఉంటే దానికి విరుద్ధమైన సంఘటనజరిగి ఆమె మాతృదేవత కాబోతూ ఉన్నట్లు తెలుసుకొని ఆశాభంగంతో కూడిన ఆనందం పొందుతాడు. ఈ కథలలో కథానాయికలందఱూ మధ్యతరగతి కుటుంబాలలో జీవిస్తూ తమ వివాహ జీవితాలపట్ల ఆశాభంగంపొంది "జీవితజ్వాల'తో "అంతర్వ్రత్తి"తో పలవిస్తూ ఉంటారు. ఈ మూడుకథలలోనూ 'లలిత' అనేపేర్న

# గ్రంథ విమర్శనము

గల స్త్రీలు రెండు కథలలో కథానాయికలు—కథలలో పాత్రలకు పేరులు కొరవయినట్లు ఈ కథలలో రచయిత చెప్పవలసిన విషయం— ఉదాత్తమైనదేమీకాదు. పండువంటి సంసారాలు పాడుచేసికొని భర్తకు తెలియకుండా పరపురుషునితో పడకటింటి ముచ్చటలు చేయడం, పరాయిపురుషులవల్ల, మాతృత్వం ధరించడం ఇలాంటివి యితివృత్తాలు· ఇవి ఏమంత ఆదర్శప్రాయమైన సాంఘిక విషయాలనో, సామాజిక లక్ష్యాలనో భావించి కథలుగాను నవలికలుగాను చిత్రించడంలో ఈ రచయిత సాధించిన ప్రత్యేక ప్రయోజనం కనిపించదు. కథాకథనంలోకూడ, రచయిత వ్యక్తులచేత పూర్వస్మృతులులాగ పలికించి— ఒక పశ్చాత్తాపము ఒక అనుకంప చూపించి ఆ వ్యక్తులు జరిగిపోయిన దానికి విచారపడుతున్నారని చెప్పదలచినట్లున్నది. చేసినపాపం చిత్రవిచిత్రంగా ఆకర్షణీయంగా చిత్రించి చివరకు పొరపాటు జరిగిపోయింది అనిచెప్పివేస్తే అంతటితో పోతుందా ? చేసిన పాపం చెప్తే పోదు, కట్టిగుడువుతుంది ఇలాంటి అవినీతి ప్రబోధకమైన రచనలు ఎందుకు సాగిస్తున్నారో వానివలన సాధించే ప్రయోజనం ఏమిటో బోధపడదు. నేటి తెలుగు రచయితలు కొందఱికిది పరిపాటి అయిపోయినది. "జ్వలిత జ్వాల"లో రచయిత, జీవితంఅనే నాణానికి రెండువైపులుండే 'బొరుసు' మాత్రం చూస్తారని గోపీచంద్ చెప్పి, వాస్తవికతను కప్పిపుచ్చడంకాక కళాత్మకం ప్రదర్శించడం యీ కథకుని ప్రత్యేకత అన్నారు. వాస్తవికత అనడంలో— పాపకృత్యముల ప్రత్యేకాకర్షణగా వర్ణించడం అని ఈ కథలబట్టి చదువరి గ్రహించవచ్చును. ఈయనమిత్రుడు రాఘవ 'విశాలమైన వక్షస్థలంమీద — చుక్కతెగి నేలపడ్డట్టుగా పదునుకై జారు దిగబడితే ఎలావుంటుందో—' యీ నాటి కథాని కాసాహిత్యంలో "ఉషశ్రీ" రచనలు అలాదిగబడి, నిలబడి ఉన్నాయి," అన్నారు. అస్తు ! ఈ కథలు గుండెమీద బాకుపాటులే. ఇంక భాస్కరభట్ల "కథా కథనంలో పాండిత్యగరిమ, ఉద్రేకోద్వేగాలు విశేషం కనబడతాయి. భావాన్నిపట్టి పాండిత్యం పలుకుతుంది" అనిగుర్తుపట్టారు. ఉదాహరణగా "ఆషాఢ ప్రథమదివసాంత వేళా వ్యాప్త పుష్కలావర్త కాంధఘోరోద్భూత పర్జన్యగర్జాసదృశంగా వినబడిన బెల్‌తో నీ హృదయం గజగజలాడిపోయినా, నా వాక్యాలు అందులో సౌదామినుల్లా నీ కన్నుల్లో మెరిసి విన్ను కుదుటబరిచాయి." వీరిపాండిత్య గరిమకు మచ్చుతునక ఈ ఒక్కవాక్యంచాలు ! !

నేటి రచయితల మనస్సులలో ఎలాంటి భావాలు, ఎలాంటి ఆవేశాలు సుళ్లుతిరుగుతూ ఉన్నదీ సూచించడానికి యీ 'జ్వలిత జ్వాల' ఒక దృష్టాంతం.

—శ్రీవాత్సవ.

## గ్రంథ పరిచయము

1. 'శ్రీమత్కదళీపుర మాహాత్మ్యము' — (వచనము) డాక్టరు గొర్రెపాటి వేంకట వరసయ్య. కృష్ణాజిల్లా దివితాలూకాలోనేడు పెద కళ్లేపల్లి అనుపేర నున్న క్షేత్రముయొక్క మహిమను దెలుపునది. శ్రీ కదళీపుర గ్రంథమాల—రాణీభవానీమార్గము. పెదకళ్లేపల్లి—కృష్ణాజిల్లా. వెల :—రు. 1—25.
2. 'అమరవాణి'—సముద్రాల లక్ష్మయ్య (పద్యకావ్యము). సంస్కృత భాషా ప్రాశస్త్యమును వివరించు ఖండకృతి. గ్రంథకర్త :—జిల్లా పరిషత్ సంస్కృతోన్నత పాఠశాల, క్రొత్తపాలెం, నెల్లూరు జిల్లా. వెల:—రు. 0.75.
3. 'న్యాయ శతకము'—"కవిరాజు" అశ్వత్థరావు. కలుగోడు, రాయదుర్గం తాలూకా, వెల:—రు. 0.50. నూరు సంస్కృత న్యాయము లిందు గీతములలో నున్నవి.
4. 'హరిభక్తిసుధ, సోమేశ్వర శతకము'—"కవిరాజు" కరణం అశ్వత్థరావు, శ్రీ గౌరీ దండక శతక వాఙ్మయ మండలి. అల్లవరము—అమలాపురం తాలూకా. విష్ణు శివభక్తి ప్రబోధకములగు శతకములు. వెల :—ఉచితము.
5. 'పగ'—గొల్లపూడి మారుతీరావు (నాటిక) కళావని ప్రచురణలు—చిత్తూరు. కల్పితకథ. వెల: 0.75.
6. 'శ్రీనివాస శతకము'—శ్రీ భాష్యం శ్రీనివాసాచార్య ఎస్. శ్రీనివాసాచార్య, పంథిని వయా—మామునూరు, వరంగల్ తాలూకా. వెల:—0.50. హరిభక్తి ప్రతిపాదకము. కవి నామాంకితము.
7. 'దయానిధి'—కె. సభా. (పద్యకృతి) శ్రీ రమణ మహర్షి చరిత్రలను, ననుభవములను దెలుపు ఖండకావ్యము. రమణా పబ్లిషర్సు, హైరోడ్డు, చిత్తూరు. వెల:—రు. 2.50.
8. 'ఐక్యరాజ్యసమితి'—ప్రథమ పుస్తకము. ఆంగ్లేయ రచయిత్రి : ఎడ్నా ఎప్‌స్టీన్. అనువాదం : శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్ యం. ఏ., యం. ఇడి. ఐక్యరాజ్యసమితి చరిత్రమును దెలుపును. ప్రకాశకులు: యం. శేషాచలం అండ్‌కో—మద్రాసు, మచిలీపట్టణము, సికింద్రాబాదు. వెల : రు. 2—50.
9. 'పంచవటి'—(గేయ కావ్యము) అనువక్త: అనంతం. హిందీభాషనుండి యనువాదము. శారద ప్రచురణలు—అత్తిలి: పశ్చిమ గోదావరి. వెల: 0.75.
10. 'శ్రీ గణేశ్ భక్తానంద భజన గీతారత్నములు— ప్రథమ భాగము. బాల రచయిత: కుప్పిలి గణపతిరావు పట్నాయక్, వేణమ్మపేట, ఆముదాలవలస, శ్రీకాకుళంజిల్లా. వెల:—0.25.
11. 'ఆవేదన'—నల్లూరి వేంకట రత్నమాచార్యులు— పద్యకృతి. నేటి భారతదేశ ప్రస్తుత పరిస్థితిని గురించినది. సాహిత్య సేవా సదనము—కోనేటిపురము. వెల :—0.20.
12. 'పుట్టపర్తి సాహిత్య విమర్శ'—(విమర్శ) సాగర పబ్లికేషన్సు—ప్రొద్దుటూరు, వెల :—రు. 0—50 పుట్టపర్తివారి సాహిత్య రచనలపై విమర్శ.
13. 'స్తోత్ర రత్నాకరము—(సంస్కృత శ్లోక కృతి). ప్రాచీన స్తుతులలో ప్రసిద్ధమైనవాని సేకరణము.

కూర్పు: శ్రీ పేరక తాతయ్యగారు. శ్రీపమ్మి జయరాం సెట్టిగారు, నెం. 1, నమశ్శివాయముదలివీధి, మద్రాసు—21. వెల: రు. 1—00.

14. 'పాటలు—పాఠాలు' (బేసిక్ రెడ్‌క్రాస్ నిర్బంధ విద్య) శ్రీమతి పి. జె. శాంతమ్మ, టీచరు, విజయనగరము. ప్రభాకరజోసెప్—విజయనగరము, వెల: రు. 1.00. ఇది బడిపిల్లలకు, బేసిక్, రెడ్‌క్రాసు విధానమును పాటల రూపమున నేర్పునది.

15. 'సౌందరనందము'—(గీత రూపకము) దామెర రాజ గోపాలరావు, శ్రీవతి ముద్రణాలయం, కాకినాడ. వెల: రు. 1—00. బౌద్ధ వాఙ్మయమున ప్రసిద్ధమగు సుందరీనందుల ప్రణయగాథ ఇందలి ఇతివృత్తము.

16. 'అభినవ సీతా రావణ సంవాద ఝరి (సవ్యాఖ్యానము సాంద్రటీకము)(సంస్కృతకృతి). ఈగ్రంథ వ్యాఖ్యానమున సీతా, రావణ సంవాదమున నా యా శ్లోకాక్షరముల విశేషార్థములు వివరింపబడియున్నవి. గ్రంథకర్త : బచ్చు సుబ్బరాయగుప్త, జాకుగ్రామం పోస్టు, కర్నూలుజిల్లా. ఆంధ్ర టీకాకర్త 'విద్వాన్' పుల్లాసంతుః వేంకటరామశర్మ, అష్టావధాని,కర్నూలు. వెల : రు. 2—00.

17. 'జాబిల్లి'—(గేయకృతి) ఆర్.ఆర్. ఉప్పుటూరి. ఇది బాల సాహిత్యానికి సంబంధించినది. చందమామ రావె! జాబిల్లిరావె! అనుదానికి అనుకరణ. రచనా పబ్లిషర్సు : హైకోడ్డు, చిత్తూరు. వెల: 0.75.

18. 'గాంధీవాణి'—(వచనము) బొల్లేటి నృసింహశర్మ. ఇందు నేటి తలపు అను పేరుతో వేరు వేరు వాక్యములుగా మత, సాంఘిక విషయములగూర్చి భావములు కలవు. ఆ వాక్యములు వెలవారీగా విభజింపబడినవి. గాంధీఅభిప్రాయము లిం దిమిడి యున్నవి. శ్రీ గీతా పవర్ ప్రెస్ : వరంగల్లు, వెల: 0.75.

19. 'నామ మహిమ' (నాటకము) శ్రీ నల్లాన్ చక్రవర్తుల వేంకట నరసింహాచార్యులు, వెలగదుర్రు. ఆస్తికత్వమును ప్రతిపాదించు ఆధ్యాత్మిక నాటకము. గోదా గ్రంథమాల: శ్రీమన్నారాయణపురము, దివి తాలుకా, కృష్ణాజిల్లా. వెల: రు. 1.00.

20. 'పౌర శిక్షణ'—(గేయమాల) పి. జె. శాంతమ్మ, బడి పిల్లలకు పౌర శిక్షణ నేర్పు పద్ధతి ఇందు గేయ రూపమున కలదు. జోసెప్ ప్రభాకర్: విజయనగరం. వెల : రు. 0—37.

21. 'నవీన దసరా గీతములు'—పి. జె. శాంతమ్మ. వెల : రు. 0—10.

22. 'హితము'—(గీతకృతి): కవిరాజా కె. అశ్వత్థరావు. ఇది సాహిత్యపరులకు హితము చెప్పు గీతమాలిక. సాహిత్యమున ద్వేషము వలదని ప్రబోధించునది. కలుగోడు అశ్వత్థరావు, కలుగోడు, రాయదుర్గం తాలూకా, అనంతపురంజిల్లా. వెల: రు. 0.50.

23. 'హరిశ్చంద్రోపాఖ్యానము'—(వచనము). పురాణపండ రాధాకృష్ణమూర్తి. హరిశ్చంద్రుని కథ, వ్యావహారిక రచన. ఆధ్యాత్మిక ప్రచారక సంఘం. విక్రమమహలు, రాజమండ్రి. వెల: రు. 0—31.

24. 'జోసోపురం పంచ కావ్యములు'—(పద్యకృతి). అయ్యగారి జోగి సోమయాజి. ఇది నీతి విషయములను పద్య రూపమున తెలుపునది. ప్రతులకు: గ్రంథకర్త: జోసోపురం: అంబాజీపేట పోస్టు. తూర్పుగోదావరి జిల్లా. వెల: రు. 0—60.

25. 'ఆల్బర్ట్ ష్వైజర్'—(ఒక ప్రసిద్ధ ఫ్రెంచి డాక్టరు జీవిత చరిత్ర). వ్యవహారిక రచన : శ్రీ విరించి. గోదా గ్రంథమాల : శ్రీమన్నారాయణపురం: దివి తాలూకా, కృష్ణాజిల్లా. వెల : రు. 0—75.

26. 'రాణాప్రతాప్'—(పద్యకృతి) వల్లభనేని కాశీ విశ్వనాథం, రాణాప్రతాప్ చరిత్ర.........ఖండకృతి. ప్రజా ప్రచురణలు : పవరుపేట : ఏలూరు. వెల : రు. 0—75.

27. 'గలగలా గోదారి కదలిపోతుం టే!—(గేయకృతి) వల్లభనేని కాశీ విశ్వనాథం, ఇది గోదావరిని గురించిన గేయ కృతి. ప్రజా ప్రచురణలు : పవరుపేట, ఏలూరు. వెల : రు. 0—75.

28. 'మహేశ శతకము'—(పద్యకృతి) డాక్టరు మానేపల్లి కుమారస్వామి క్షీరపురి (పాలకొల్లు). నివాసుడగు రామలింగేశ్వరునికి కృతి. 100 సీసపద్యములు. 65 వ పద్యమునుండి 100 వ పద్యమువరకు స్త్రీ ధర్మములుగూరి చెప్పబడెను. ప్రతులకు:— అంబికా మెడికల్ స్టోర్సు : నరసాపురం, పశ్చిమ గోదావరిజిల్లా. వెల : రు. 0—40.

29. 'డివైన్ హీలింగ్' Divine Healing నివారణకు సాధ్యముకాని, భయంకర వ్యాధులను కుదిర్చిన డాక్టరు శ్రీ కె. సుబ్బారావుగారి వైద్య ప్రతిభను ఆధ్యాత్మిక అనుభవమును తెల్పునది. ఇది తెలుగు గ్రంథమునకు ఇంగ్లీషు అనువాదము. ప్రతులకు : వి. కేశవరావుచౌదరి (సంపాదకులు) వెల: అమూల్యము.

30. లీగల్ ఎయిడ్ కమిటీ' Legal Aid Committee రచయిత : బి. శివరావు. జమ్మూ—కాశ్మీరమున జరిగిన రాజకీయ సంబంధమగు కేసులనుగూర్చి తెల్పునది. ఇందు తొంబండుగురు ప్రసిద్ధులగు నాయకులనుగూర్చి ఉన్నది. ప్రతులకు : బి. శివరావు కన్వీనర్: లీగల్ ఎయిడ్‌కమిటీ 81/48 ప్లావేటిక్ ఎన్‌క్లేవ్, న్యూఢిల్లీ.

### గ మ ని క

గ్రంథవిమర్శకు గ్రంథములను పంపేవారు రెండు ప్రతులను పంపవలెను. —సం. భా.

# చైనా యుద్ధవిరమణ తర్వాత...

**'పరిశీలక్'**

కమ్యూనిస్టు చైనా 1962 నవంబరు 20 వ తేదీ రాత్రి ఎంత హఠాత్తుగా ఏకపక్ష యుద్ధ విరమణ ప్రకటనచేసి అందరికీ ఆశ్చర్యం కలిగించిందో 1962 డిశంబరు 31 వ తేదీవరకు భారత—చైనా సరిహద్దుల వివాద పరిస్థితి అంత కంటె ఆశ్చర్యకరంగా ఉండిపోయింది. కమ్యూనిస్టుచైనా తిరిగి యుద్ధాన్ని ప్రారంభిస్తుందా? అనే ప్రశ్నతో 1962 వ సంవత్సరం సమాప్తమైపోయింది. 1963 లో ఏమి జరుగు తుందో ఎవ్వరూ వూహించలేకుండా ఉన్నారు.

కమ్యూనిస్టు చైనా తనకు తానుగా భారతదేశంమీద యుద్ధాన్ని ప్రారంభించింది. అసలు ఆ యుద్ధాన్ని ఎందుకు ప్రారంభించిందో ఎవ్వరూ చెప్పలేకుండా ఉన్నారు. తనకు తాను షరతులతో యుద్ధాన్ని విరమించినది. అలా యుద్ధ విరమణ ఎందుకు చేసిందో వివరించడం ఎవ్వరికీ సాధ్యపడడం లేదు. కాగా, చైనా—భారత సరిహద్దుల్లో సంఘర్షణలు ఆగి పోయాయి. యుద్ధ విరమణ అనేది జరిగింది. కమ్యూనిస్టు సైన్యాల ఉపసంహరణ కూడా ఆరంభమైంది. ఆ స్థితిలో భారత ప్రభుత్వం ఏమి చేస్తుందనే ప్రశ్న మిగిలిపోయింది. ఈ ప్రశ్నకు సమాధానం పొందడానికి డిశంబరు 9 వ తేదీన కమ్యూనిస్టు చైనా మూడు ప్రశ్నలను భారత ప్రభుత్వానికి అందజేసి, వానికి "అవును—కాదు" అనేది చెప్పమన్నది. ఆ ప్రశ్నలు ఇవి : (1) చైనా తానుగా యుద్ధాన్ని విరమించడం. (2) ఉభయపక్షాలు పోరు విరమించి 1959 నవంబరు 7 వ తేదీనాటి అధీనరేఖనుంచి చెరి 12½ మైళ్ళు వెనక్కు తగ్గడం, (3) సాయుధ బలాల ఉపసంహరణ సమస్యలపై ఉభయ పక్షాల అధికారుల చర్చలు, నిస్సైనిక మండల నిర్మాణం, ఇతర అంశాలను గురించి సమాలోచనలు జరగడం. ఈ మూడు ప్రశ్నలకు భారత ప్రభుత్వం క్రింది సమాధానాలను పంపింది. (1) యుద్ధ విరమణ, సైన్యాల ఉపసంహరణ చైనా ప్రభుత్వం తనంత తానుగా చేసింది. యుద్ధవిరమణకు సంబంధించినంత వరకు చైనా చర్యకు ప్రతిబంధకం కలిగించే చర్య ఏదీ భారత ప్రభుత్వం తీసుకోలేదు. (2) ఉభయులకు అంగీకారయోగ్యమైన ఏర్పాటు ప్రాతిపదికగా ఉభయపక్షాల దళాలు పోరు విరమించడం భారత ప్రభుత్వానికి సమ్మతమే. అయితే ఆ ఏర్పాటు 1962 సెప్టెంబరు 8 వ తేదీనుంచి భారత్‌పై చైనా జరిపిన దురాక్రమణను తొలగించేదిగా ఉండాలి. ఏదైనా తన ప్రాంతం భారత్‌లో ఉండిపోయిందని చైనా భావిస్తే, న్యాయమూర్తులద్వారా, లేదా అలాంటి ఇతరుల ద్వారా ఆ విషయాన్ని తేల్చుకోవాలి. 1959 నవంబరు 7 వ తేదీ అధీనరేఖను గురించి చైనా చేస్తున్న వాదనను భారత ప్రభుత్వం అంగీకరించదు. (3) ఉభయ పక్షాల అధికారుల సమావేశం జరగాలంటే యుద్ధ విరమణ రేఖను గురించి, సైన్యాల ఉపసంహరణ ప్రాంతాలను గురించి ఇదమిద్ధమైన ఆదేశాలు వారికి ఇవ్వడం అవసరం. భారత ప్రభుత్వం సూచిస్తున్న 1962 సెప్టెంబరు 8 వ తేదీ అధీనరేఖకి, చైనా ప్రభుత్వం సూచిస్తున్న 1959 నవంబరు 7 వ తేదీ అధీనరేఖకి మధ్య సుమారు 2,500 చదరపు మైళ్ళ వ్యత్యాసంవుంది. దురాక్రమణద్వారా పొందిన ఈ ప్రాంతాన్ని చైనాకు వదలడం భారత ప్రభుత్వానికి ఇష్టంలేదు. అందుచేత అధీనరేఖలను గురించి ఉభయ ప్రభుత్వాలమధ్య ఒప్పందం కుదిరితేతప్ప, అధికారులకు తగిన ఆదేశాలు ఇవ్వడానికి వీలుపడదు.

దీనినిబట్టి ఒక విషయం స్పష్టమైపోయింది. 1962 సెప్టెంబరు 8 కి పూర్వం కమ్యూనిస్టు చైనా సుమారు 12,000 చదరపు మైళ్ళ భారత భూభాగాన్ని ఆక్రమించింది. ఆ తర్వాత యుద్ధంద్వారా 2,500 చదరపు మైళ్ళు దురాక్రమణ చేసింది. ఇలా చైనా స్వాహా చేసిన 14,500 చదరపు మైళ్ల భూభాగంలోను 12,000 చదరపు మైళ్ళు చైనా క్రిందఉన్నా, దానితో సమాలోచనలకు భారత ప్రభుత్వం సిద్ధపడుతున్నది. ఇది భారత శాంతిప్రియత్వానికి సూచన. కాని, కమ్యూనిస్టుచైనా మాత్రం 14,500 చదరపు మైళ్ళు తన అధీనంలో ఉంచుకొని, భారతదేశాన్ని సమాలోచనలకు ఆహ్వానిస్తున్నది. ఇది చైనా దురాక్రమణ తత్వానికి నిదర్శనం. ఇలాఉన్న ఉభయ ప్రభుత్వాల మనస్తత్వానికి అనువుగానే సరిహద్దుల్లో కూడా కొన్ని పరిణామాలు సంభవించాయి.

డిశంబరు ఒకటవతేదీనుంచి తన సైన్యాలు ఉపసంహరణను ప్రారంభించగలనని కమ్యూనిస్టు చైనా ప్రకటించింది. కాని, డిశంబరు 31 వ తేదీ వచ్చినా, దాని సైన్యాల ఉపసంహరణ కనీసం అది సూచించే 1959 నవంబరు 7 వ తేదీ అధీన రేఖ వరకు కూడా జరగలేదు. తాత్సారంచేస్తూ, అవసరమైతే తిరిగి దెబ్బతీయడానికి అనువైన ఏర్పాట్లుచేస్తూ సైన్యాల ఉపసంహరణను సాగిస్తున్నది. దీనినిబట్టి చైనా యుద్ధ విరమణ అనేది చిత్తశుద్ధితో చేసిందికాదని, కేవలం కుటిల నీతితో చేసిందని తెలిసిపోతున్నది. పోతే చైనా సేనలు తిరోగమించిన ప్రాంతాలను భారత ప్రభుత్వం తిరిగి స్వాధీనం చేసుకొనడం సహజం. అది, దాని హక్కు. కాని, ఇందుకోసం సైనికులను పంపితే తిరిగి చైనా సైన్యాలతో యాదృచ్ఛికంగా నైనా సంఘర్షణలు సంభవం కావచ్చు. ఇలాంటి ప్రమాదాలను నివారించడానికిగాను నిరాయుధులైన పౌరపాలక (సివిల్

ఆఫీసర్లను) బృందాలను భారత ప్రభుత్వం పంపించింది. బొమిడిలా, వలాంగ్ వగైరాలలో ఇలా భారత జాతీయ పతాకను తిరిగి ప్రతిష్ఠించారు. దీనినిబట్టి కూడా భారత ప్రభుత్వం ఎంతగా కమ్యూనిస్టు చైనాతో సామరస్య సాధనను కోరుతున్నదీ అర్థం చేసుకోవచ్చు. ఈవిధంగా కమ్యూనిస్టు చైనా సేనల తిరోగమనం, భారత పౌరపాలక బృందాల పురోగమనం ఎంత కాలం, ఏ సరిహద్దు శ్రేణులవరకు జరుగుతుందో స్పష్టంగా తెలియడంలేదు.

అయితే భారత ప్రభుత్వం కోరిన వివరణకు చైనా పంపిన సమాధానాన్నిబట్టి యుద్ధ విరమణశ్రేణుల స్థూల రూపం కానవస్తున్నది. నీఫా రంగంలో మెక్‌మాహన్ రేఖ ఆవలివైపున 12½ మైళ్లవరకు తన సేనలను ఉపసంహరించడానికి చైనా అంగీకరిస్తున్నది. కాని, ధోలా, లోంగ్జూ, కిబూటూ స్థావరాలను భారత ప్రభుత్వం స్వాధీనపరచుకొనరాదంటున్నది. లడక్ రంగంలో దురాక్రమణచేసి, ప్రస్తుతం నిలిచిఉన్న స్థావరాలనుంచి 12½ మైళ్లు వెనక్కుతగ్గినా, భారత సైన్యాలు ముందుకువచ్చి తమకు చెందిన 43 రక్షణ స్థావరాలను పునరాక్రమణ చేయరాదని షరతు పెడుతూవుంది. ఈవిధంగా సరిహద్దుల పొడవునా సింహద్వారాలను తనకింద ఉంచుకొని, వాని దిగువ భాగాలను నిస్సైనిక మండలంగా చేసి, అవసరమైతే దెబ్బతీయడానికి అనువైన అవకాశాలను తనకు ఉంచుకోవాలన్నది చైనా యోచనలకు కీలకంగాఉంది. ఇది శాంతి సుహృద్భావాలతో ఇరుగు పొరుగు మిత్రులుగా సహజీవనం చేయాలని కోరేవారి లక్షణం కాదని భారత ప్రభుత్వం నొక్కి వక్కాణిస్తున్నది.

చైనా—భారత ప్రభుత్వాలమధ్య ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా ఈ అంశాలు ధృవపడడంతో, ఏదో ఒకవిధంగా వివాదాన్ని చక్కబరచాలనే అభిలాషతో ఆరు ఆసియా రాజ్యాలు ముందుకువచ్చి, రాజీ సమాలోచన ప్రయత్నాలు ప్రారంభించాయి. శ్రీలంక, బర్మా, కంబోడియా, ఇండోనేసియా, అరబ్ రిపబ్లిక్, ఘనా దేశాల ప్రతినిధులు కొలంబోలో సమావేశమైనందున వీనికి కొలంబో రాజ్యాలని ఈ సమావేశంలో రూపొందిన ప్రతిపాదనలకు కొలంబో ప్రతిపాదనలని పేరు వచ్చింది.

ఆసియా రాజ్యాలు ఇలా కొలంబోలో సమావేశం కావడమనేది ఇదే ప్రథమంకాదు. కొరియాయుద్ధం, ఇండో—చైనా అంతర్యుద్ధం, పశ్చిమ ఇరీన్ వివాదం వగైరాల సందర్భంలో భారతదేశం, ఇండోనేసియా, బర్మా, శ్రీలంక ప్రధానులు సమావేశంకావడం జరిగింది. ఈ సమావేశాలన్నింటిలోను "శాంతియుతంగా సమాలోచనలద్వారా వివాదాల పరిష్కారం" అనేది ప్రధాన నినాదంగా ఉండేది. ఎవ్వరినీ "దురాక్రమణదారు" అని ఖండించడం జరగలేదు. చివరకు కొరియా యుద్ధ సందర్భంలోకూడా కమ్యూనిస్టుచైనాను దురాక్రమణదారుగా పేరు పెట్టడానికి భారతదేశం అంగీకరించలేదు. కమ్యూనిస్టు చైనా భారత సరిహద్దులను "అప్రకటిత" యుద్ధంతో ఆక్రమించినా, అది దురాక్రమణగా భారతదేశం భావించినా కొలంబో రాజ్యాలుమాత్రం వాటి పూర్వ సాంప్రదాయానికి తగ్గట్టుగానే, ఇప్పుడు కూడా కమ్యూనిస్టు చైనాను దురాక్రమణదారుగా చిత్రించి, ఖండించడానికి సిద్ధపడలేదు. కొలంబో రాజ్యాలు ఇలా తటపటాయించడం భారతదేశానికి కష్టం కలిగించింది. అయినా వివాదంలోఉన్న ఇద్దరు మిత్రులమధ్య రాజీ చేయదలచినప్పుడు ఒకరిని ఖండించి, మరొకరిని సమర్థించినప్పుడు రాజీ సాధన ఎలా సాధ్యం? తాము మధ్యవర్తులుగా వ్యవహరించడం ఎలా సంభవమనే సమాధానాన్ని కొలంబో రాజ్యాలు చెప్పాయి.

అయితే ఇందులో కొలంబో రాజ్యాల అన్నింటిభావన ఏకగ్రీవంకాదు. ఈ సమావేశానికిముందుగానే న్యాయమంత్రి శ్రీ ఎ. కె. సేన్‌ను, కేంద్ర ప్రభుత్వ కార్యదర్శి శ్రీ ఆర్. కె. నెహ్రూను, అరబ్ రిపబ్లిక్, ఘనాలకు మంత్రి శ్రీమతి లక్ష్మీ మీనన్‌ను బర్మా, కంబోడియా, ఇండోనేసియా, శ్రీలంకలకు భారత ప్రభుత్వం పంపించి, తన వాదనను వారికి వివరింపజేసింది. వారు ఆయా దేశాలనుంచి తిరిగి వచ్చిన తర్వాత సమర్పించిన నివేదికలనుబట్టి కొలంబో రాజ్యాలన్నీ భారత ప్రభుత్వానికి అనుకూలంగా ఉన్నాయనిపించింది. కాని, కొలంబో సమావేశం ప్రారంభమైన తర్వాత పరిస్థితులు ఇందుకు విరుద్ధంగా పరిణామం చెందాయని తెలియవచ్చింది.

కమ్యూనిస్టు చైనాను దుర్రాక్రమణదారుగా ఖండించడానికి సిద్ధపడకపోయినా, "సైనికంగా దురాక్రమణ చేసిన భాగాలను ముందుగా వదులుకొని, ఆ తర్వాత రాజీ సమాలోచనలు ప్రారంభించాలి" అనే ప్రతిపాదనను అరబ్ రిపబ్లిక్ ముందుగా చేసింది. దీనిని ఇండోనేషియా బలపరచింది. కాని, బర్మా ఇందుకు అంగీకరించలేదట. ఏదో ఒకవిధంగా ఉభయులను సమావేశపరచి, రాజీ సమాలోచనలను ప్రారంభింపజేయడానికి తాము కృషి చేయాలని బర్మా వాదించిందట. ఈవిధంగా "సైనికంగా దురాక్రమణ చేసిన భాగాలనుంచి ముందుగా వైదొలగాలి" అనే భారత్‌వాదనను" రాజీ సమాలోచనలకు ముందుగా అంగీకరించాలి" అనే చైనా వాదనను సమన్వయపరుస్తూ, "కొలంబో పథకం" అనేది ఒకటి చివరకు తయారైంది. దీనిని శ్రీలంక ప్రధాని శ్రీమతి సిరిమావో స్వయంగా పెకింగ్, న్యూఢిల్లీలకువెళ్ళి కొలంబో రాజ్యాల తరఫున స్వయంగా అందజేసి, సామరస్య సాధనకు చర్చలు కొనసాగించారు. ఇలా కొలంబో రాజ్యాలు చేస్తున్న ప్రయత్నం ఫలిస్తుందని కొందరు ఆశిస్తున్నారు. ఏప్రిల్ నెలలో సరిహద్దులలో వాతావరణం అనుకూల పరిస్థితులకు వచ్చేవరకు ఇలాగే సమాలోచనలతో చైనా కాలక్షేపం చేస్తుందని, ఆ తర్వాత తిరిగి యుద్ధాన్ని ప్రారంభిస్తుందని కొందరు వూహిస్తున్నారు.

అయితే కొలంబో ప్రతిపాదనలపట్ల భారతదేశం వైఖరి ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానం పొందాలంటే కొలంబో ప్రతిపాదనల వివరాలు పరిశీలించాలి. కాని, ఇంతవరకు ఆ ప్రతిపాదనలు అధికారపూర్వకంగా ప్రకటన జరగలేదు. కాని, అభిజ్ఞ

# చైనాయుద్ధవిరమణ తర్వాత....

వర్గాల ద్వారా వెల్లడైన దానినిబట్టి స్థూలంగా ఈ ప్రతి పాదనల రూపం ఇది:—

ప్రస్తుతం యుద్ధ విరమణ జరిగింది. సైన్యాల ఉప సంహరణ కూడా సాగుతున్నది. ఇకముందు పోరాటం సంభవం కాకుండా నివారించడానికిగాను ఉభయ సైనిక శ్రేణులమధ్య నిస్సైనిక మండలం అనేది ఏర్పడాలి. ఇందుకు ఉభయులు అంగీకరిస్తున్నారు. కాని, నిస్సైనికమండలం ఏ రేఖలమధ్య ఏర్పడాలన్నది వివాదాంశంగాఉంది. 1962 సెప్టెంబరు 8 పూర్వపుస్థితిని సరిహద్దుల్లో పునరుద్ధరించాలని భారత్ కోరుతున్నది. 1959 నవంబరు 7 నాటి అధీనరేఖ హద్దుగా నిస్సైనిక మండలం ఏర్పడాలని చైనా కోరుతున్నది. ఇలా ఉన్న వివాదాన్ని పరిష్కరించడానికి రాజీగా (1) నీఫాలో 1962 సెప్టెంబరు 8 నాటి పూర్వస్థితికి—అంటే మెక్ మాహన్‌రేఖకు అవతల $12\frac{1}{2}$ మైళ్లవరకు చైనా సైన్యాల ఉపసంహరణ జరగాలి. ఇలా ఉపసంహరణ జరిగిన ప్రాంతాలను భారత్ స్వాధీనం చేసుకోవచ్చు. (2) మధ్యరంగంలో అంటే బారాహోతీ ప్రాంతంలో ఇప్పటి పరిస్థితులు యధాతథంగా ఉండాలి. (3) లడక్‌లో భారత సైన్యాలు ఇప్పుడున్నచోటనే ఉండాలి. చైనా సైనాలు 1962 సెప్టెంబరు 8 పూర్వపు స్థావరాలకు అవలగా $12\frac{1}{2}$ మైళ్లవరకు తిరోగమించాలి. అయితే ఇలా అది కాళీ చేసిన ప్రాంతాలను భారత్ పునరాక్రమించ కూడదు. చైనా పోలీసు గస్తీ కేంద్రాలు ఏర్పాటు చేసుకో వచ్చును.

ఈ ప్రతిపాదనలనుబట్టి చూస్తే, ఒక్క లడక్‌లో మినహా మిగిలిన సరిహద్దు భాగాలలో చైనా—భారత్‌ల మధ్య నిస్సైనిక మండలం ఏర్పాటు సంభవమే అనిపిస్తుంది. కాని వివాదానికి మూలకారణమైన లడక్‌లోమాత్రం చైనా వాదనకు కొలంబో రాజ్యాలు అంగీకరిస్తున్నట్టు కనిపిస్తున్నది. లడక్‌లో సైనిక దురాక్రమణ ద్వారా, సుమారు రెండువేల చదరపు మైళ్లను చైనా స్వాధీనపరచుకున్నదని భారత అధికార వర్గాలు అంచనా వేస్తున్నాయి. తమ ప్రతిపాదనల ప్రకారం లడక్‌లో సుమారు మూడువేల చదరపు మైళ్లను చైనా కాళీ చేయవలసి ఉంటుందని కొలంబో వర్గాలు అంచనా వేస్తూ, ''సైనికదురాక్రమణద్వారా ఆక్రమించిన ప్రాంతాలను ముందుగా కాళీ చేయాలి'' అనే భారత్ ప్రతిపాదన ఆచరణలో నెగ్గు తున్నదంటున్నారు. అయితే లడక్‌లోని 43 రక్షణ స్థావరాలను భారత్ సైన్యాలు పునరాక్రమణ చేయరాదనడం, ఇక్కడ చైనా పోలీసు గస్తీ స్థావరాలను ఏర్పాటు చేసుకొనడం అనేది భారత్ సార్వభౌమాధికారాన్ని కాదనడమే అయినా, నీఫారంగంలో ఆదినుంచిఉన్న మెక్‌మాహన్‌రేఖ అనేది యధాతథంగా ఉండడం, ఆవిధంగా ఆ సరిహద్దుల యధాస్థితి ఏర్పడడం భారతదేశానికి సహాయపడగలదని వాదిస్తున్నారు. ఈ విధమైన రాజీ మార్గాన్ని ఇండొనేసియా సూచించిందని కూడా తెలుస్తున్నది.

ఈవిధంగాఉన్న కొలంబో ప్రతిపాదనలు చాలా అస్పష్టంగా ఉన్నాయని ప్రధాని శ్రీ నెహ్రూ ప్రకటించారు. 1962 సెప్టెంబరు 8 పూర్వపు స్థావరాలకు ''చైనా వెనక్కు తగ్గాలి'' అనే భారత వాదనకు తిరుగులేదన్నారు. చైనామాత్రం ''రాజీ సమాలోచనలు ప్రారంభించాలి'' అనే తన వాదనకు ఈ ప్రతిపాదనలు అనుకూలంగా ఉన్నాయని వ్యాఖ్యానించింది. అటు చైనాతోను, ఇటు భారత్‌తోను సమాలోచనలు కొనసాగించిన తర్వాత అవసరమైతే కొలంబో రాజ్యాలు మరొకదఫా సమావేశం కాగలవని ఢిల్లీ—పెకింగ్‌లతో చర్చలకు బయలుదేరిన శ్రీ లంక ప్రధాని శ్రీమతి సిరిమావో ప్రకటించారు. జనవరినెల ఆఖరుకు గాని కొలంబో రాజ్యాల రాజీ ప్రయత్నాలు ఎంతవరకు ఫలించేది తెలియదు.

కొలంబో రాజ్యాల రాజీ ప్రతిపాదన లనేవి ఒక వైపున రూపొందగానే మరొకవైపున అంతర్జాతీయ ప్రాధాన్యంగల సంఘటన మరొకటి జరిగింది. చైనా—భారత్ సరిహద్దు సంఘర్షణను గురించి రష్యా ప్రధాని శ్రీ కృశ్చేవ్ చేసిన ప్రకటన అది.

చైనా—భారత సరిహద్దు సంఘర్షణలో సోవియట్ రష్యా పాత్ర ఏమిటి అనేది చిరకాలంగా పరిశీలనాంశంగా ఉంది. కాశ్మీర్ సమస్యలో భారత్ వాదనను రష్యా సమర్థిస్తున్నది. కాశ్మీర్‌ను భారతదేశంలో అంతర్భాగంగా అది గుర్తిస్తున్నది. అలాంటి కాశ్మీర్‌లోనే కమ్యూనిస్టు చైనా దురాక్రమణ సాగించటంవల్ల రష్యా వైఖరి ఏమిటన్న ప్రశ్నకు భారత్‌కు అనుకూలంగా ఉంటుందనే సమాధానం చెప్పుకొనడం జరిగింది. కమ్యూనిస్టు సిద్ధాంత సంబంధమైన వివాదం చైనా—రష్యాల మధ్య ఉంది. ఆకారణాన చైనాకు వ్యతిరేకంగా భారతదేశాన్ని రష్యా సమర్థిస్తుందని కొందరు ఆశించారు. హంగేరీ సంఘటనలలోను, అణ్వస్త్ర పాటవ పరీక్షల నిలుపుదల వివాదంలోను, నిరాయుధీకరణ సమస్యలలోను, భారతదేశం వైఖరి రష్యా వాదనలకు అనుకూలంగా ఉంటున్నందున కూడా చైనా తెచ్చిపెట్టిన సరిహద్దు వివాదంలో రష్యా మొగ్గు భారతదేశంవైపున ఉంటుందని కొందరు వ్యాఖ్యానించారు. దీనికి తగ్గట్టుగానే ప్రావ్దా' ఇజ్వెస్టియా పత్రికలు రెండర్థాలతో వ్రాసిన సంపాదకీయాలు కూడా ఈ వ్యాఖ్యానాలను బలపరచాయి. భారత్ తన ''మిత్ర దేశమని'', చైనా తన ''సోదర కమ్యూనిస్టు రాజ్యమ''నీ, కనక సోదరులమధ్య, మిత్రులమధ్య వచ్చిన వివాదంలో తాము తటస్థులుగా ఉంటామని కూడా రష్యా వర్గాలు వ్యాఖ్యానించాయి. ఇలా రష్యా తటస్థంగా ఉండడమనేది కూడా భారత దేశానికి మేలు చేయడమేనని ప్రధాని నెహ్రూ వ్యాఖ్యానించారు. అంతేకాదు రష్యా'' చాలవరకు భారత దేశానికి అనువుగా ఉన్నది'' అని కూడా ప్రకటించారు. కాని, ఈ ప్రకటన జరిగిన 24 గంటలలోనే సోవియెట్ ప్రధాని శ్రీ కృశ్చేవ్ చేసిన ప్రకటన ఇలాంటి ఆశలను పటాపంచలు చేసింది.

శ్రీ కృశ్చేవ్ సోవియట్ పార్లమెంటులో ప్రసంగిస్తూ, కమ్యూనిస్టు సిద్ధాంత సంబంధమైన వివాదంలో సోదర చైనాను నిశితంగా విమర్శించాడు. కాని, భారతదేశంమీద చైనా దురాక్రమణను ఖండించలేదుకాని, పరోక్షంగా సమర్థించాడు. ఏకపక్ష

యుద్ధ విరమణను ప్రశంసించాడు. సామరస్యంగా సమాధాన పడడం మంచిదని సలహా చెప్పాడు. ఇక, భారత దేశానికి సంబంధించినంతవరకు అంతర్జాతీయ రంగంలో దాని తాటస్థ్య విధానాన్ని శాంతి సాధన పద్ధతులను ప్రశంసించాడు. దేశం ఆర్థికాభివృద్ధికి ''స్వతంత్రం''గా సాగిస్తున్న కృషిని హర్షించాడు. కాని, చైనా—భారత్‌లమధ్య వచ్చిన సంఘర్షణను సామ్రాజ్యవాద దేశాలు తెచ్చిపెట్టినవని ఆరోపించాడు. పశ్చిమ రాజ్యాల ఆయుధ సహాయాన్ని భారతదేశం స్వీకరించడంలో ప్రమాదం కలదని, తద్వారా స్వాతంత్ర్యాన్ని కోల్పోవలసి వస్తుందని హెచ్చరించాడు. కమ్యూనిస్టు—చైనా మిత్రద్రోహం, సరిహద్దుల్లో సైనిక దురాక్రమణకంటె అమెరికా బ్రిటన్‌ల సుహృద్భావ వైఖరి, ఆయుధ సహాయం ప్రమాదకరమని, గతాన్ని విస్మరించి చైనా భారత దేశాలు మిత్రులవలె సమాలోచనల ద్వారా సరిహద్దు వివాదాన్ని పరిష్కరించుకోవాలని సలహా చెప్పాడు. ఇలా కమ్యూనిస్టు సిద్ధాంత పక్షపాతం చూపాడుకాని, సామరస్య సాధనకు తాను కూడా ప్రయత్నించగలననే మాట కూడా అనలేదు.

ఈవిధంగా రష్యా తన నిజ స్వరూపాన్ని చూపడం భారత ప్రభుత్వ వర్గాలకు ఆశ్చర్యం కలిగించింది. చైనా తెచ్చిపెట్టిన సరిహద్దుల సంఘర్షణలోసామ్రాజ్యవాదులు ఎక్కడ ఉన్నారు? వారి పాత్ర ఎలా సంభవమైనది? హిట్లర్ దండయాత్ర చేసినప్పుడు అమెరికా, బ్రిటన్‌ల సహాయాన్నిపొందిన స్టాలిన్ ఎంతవరకు స్వాతంత్ర్యాన్ని కోల్పోయాడు? జపాన్ వ్యతిరేక పోరాటంలో చాంగ్—కై—షేక్‌తో కలిసి కమ్యూనిస్టు నాయకుడు మావ్—సే—టుంగ్ అమెరికానుంచి సహాయం పొందినందున ఎంతగా స్వాతంత్ర్యాన్ని కోల్పోయాడు? కమ్యూనిస్టు చైనా రాక్షస ప్రవృత్తితో వ్యవహరిస్తూఉంటే భారతదేశం ఏవిధంగా తాటస్థ్య వైఖరిని కొనసాగించగలదు? అనే ప్రశ్నలు, ఇందుకు సంబంధించిన వ్యాఖ్యానాలు, విమర్శలు భారతదేశం నలుమూలలా వినవచ్చాయి.

ఈ సందర్భంలో రష్యా ఆయుధ సహాయ సమస్య కూడా చర్చనీయాంశమైంది. రష్యానుంచి మిగ్ విమానాల కొనుగోలు, ఆ విమానాలను భారతదేశంలోనే తయారు చేయడం, అందుకు సంబంధించిన ఒడంబడిక అనేది దేశంలో వివాదాంశంగాఉంది. ఈ ఏర్పాటును కొందరు సమర్థించారు. కొందరు వ్యతిరేకించారు. అయితే చైనా కొనసాగించిన దురాక్రమణ దృష్ట్యా మిగ్ విమానాల సప్లయి అనేది ప్రశ్నార్థకమైపోయింది. అసలు ఈ విమానాలను రష్యా సప్లయి చేస్తుందా? సప్లయి చేసినా కమ్యూనిస్టు చైనామీద ఉపయోగించరాదనే షరతును పెడుతుందా? అన్న ప్రశ్నలు పార్లమెంటులో వినవచ్చాయి. రష్యా సప్లయి చేస్తుందికాని, ''డిశంబరులోనో, లేకపోతే ఆ తర్వాతకాలంలోనో'' అవి భారత దేశానికి వస్తాయని పార్లమెంటులో ప్రభుత్వ ప్రతినిధి సమాధానమిచ్చాడు. కాని, డిశంబరునెలలోమాత్రం మిగ్ విమానాలు భారతదేశానికి రాలేదు. ఇది రష్యా పరోక్షంగా కమ్యూనిస్టు చైనాకు సహాయం చేయడమేనని వ్యాఖ్యానించడానికి వీలుపడింది. ఇక మిగ్ విమానాలు తయారుచేసే కర్మాగారాన్ని భారతదేశంలో నిర్మించడం వగైరాలు భవిష్యత్తుకు సంబంధించినవి. భవిష్యత్తులో ఏమి జరుగుతుందో ఎవ్వరికీ తెలియదు. ఆ పత్కాలంలో భారత్‌కు అవసరమైన ఆయుధ సహాయం రష్యానుంచి రాలేదు. అమెరికా, బ్రిటన్ వగైరా పశ్చిమ రాజ్యాలనుంచి పుష్కలంగా లభించాయి. సోవియెట్ రష్యావల్ల భారతదేశానికి సరిహద్దు వివాదంలో ప్రత్యక్షంగా సరైన సహాయం లేదని తేలిపోయింది.

అయితే అత్యవసరంగాను, ప్రత్యక్షంగాను ఆయుధ సహాయం చేసిన అమెరికా, బ్రిటన్‌లవల్ల కూడా పరోక్షమైన ఇబ్బంది ఒకటి కొత్తగా తలెత్తింది. అది పాకిస్తాన్ ద్వారా ఏర్పడింది. పాకిస్తాన్ ఇంతకాలంగా పశ్చిమ రాజ్యాలకు, మిత్ర రాజ్యంగా ఉంటున్నది. రక రకాల సైనిక ఒడంబడికలలో భాగస్వామిగాఉంది. కాశ్మీర్ వ్యవహారంలో పశ్చిమ రాజ్యాల మొగ్గు పాకిస్తాన్ వైపునవుంది. పాకిస్తాన్ సరిహద్దుల్లో రష్యా—చైనాలు ఉన్నందున అంతర్జాతీయ కమ్యూనిస్టు విజృంభణను అరికట్టే వ్యూహంలో అంతర్భాగంగా పాకిస్తాన్‌ను పశ్చిమ రాజ్యాలు ఇంతవరకూ ఆదరిస్తూ వచ్చాయి. అపారమైన ఆయుధ సహాయం చేశాయి. ఇందువల్ల పాకిస్తాన్ సైనిక పాటవం హెచ్చిందని, అది పరోక్షంగా భారతదేశానికి ప్రమాదాన్ని తెస్తున్నదని, తాను కూడా తప్పనిసరిగా సైనికంగా నిరంతరం ఆయత్తమై ఉండవలసిన అవసరాన్ని పెంచుతున్నదని, భారతదేశం ఆదినుంచి వాదిస్తున్నది. నిరసన తెలియజేస్తున్నది. పాకిస్తాన్ దృష్టిలో దానికి శత్రువు భారతదేశమేకాని, కమ్యూనిస్టు చైనా మాత్రం కాదని కూడా చెబుతూ వచ్చింది. ఇందుకు సమాధానంగా అమెరికా రక రకాల హామీలను భారతదేశానికి ఇచ్చింది. తాను సప్లయిచేసిన ఆయుధాలను తన అనుమతి లేకుండా పాకిస్తాన్—కమ్యూనిస్టేతర రాజ్యాలమీద ప్రయోగించడానికి వీలులేదని తమ ఒడంబడికలలో ఉన్న షరతులను ఉదాహరించింది. కాని, ఇప్పుడు చైనా—భారత్ సరిహద్దు వివాదంలో పాకిస్తాన్ నిజ స్వరూపం బయట పడింది. ఆదినుంచి భారత్ చేస్తున్న వాదన నిజమని తెలిసిపోయింది. కమ్యూనిస్టు చైనా మిత్రుడుగా నాటకమాడుతూ, కాశ్మీర్ వ్యవహార పరిష్కారాన్ని ఒక సాకుగా చూపుతూ భారతదేశంమీద పరోక్షంగా కక్ష సాధించడానికి పాకిస్తాన్ నడుము కట్టింది.

కమ్యూనిస్టు చైనా దురాక్రమణను ఎదుర్కొనడానికి అవసరమైన ఆయుధ సహాయం అమెరికా, బ్రిటన్‌లు భారతదేశానికి చేయరాదని పాకిస్తాన్ ముందుగా అడ్డు చెప్పింది. గతంలో భారతదేశం నిరసన తెలియజేసిన తీరులోనే వ్యవహరించింది. అంతకంటె ఒక అడుగు ముందుకువేసి, కమ్యూనిస్టు చైనాతో నేస్తం కట్టడం ప్రారంభించింది. తన ఆక్రమణకిందఉన్న కాశ్మీర్ ప్రాంతంలో చైనాకుఉన్న సరిహద్దులను సర్దుబాటు చేసుకొనడానికి కాశ్మీర్‌పై రాజ్యాధికారంఉన్న భారతదేశం ప్రమేయం లేకుండా ఒప్పందం కుదుర్చుకొనడానికి సిద్ధపడింది. ఆవిధంగా కాశ్మీర్ వ్యవహారమనేది భారత్—పాకిస్తాన్—చైనాల మధ్యఉన్న ఉద్రిక్త వాతావరణంలో ప్రత్యక్ష యుద్ధాలకు మాత్రమేకాక, ప్రచ్ఛన్న యుద్ధానికి కూడా పాచికగా ఉపయోగపడింది. ఇందులో అమెరికా, బ్రిటన్‌లు ప్రముఖపాత్ర నిర్వహించడం ప్రారంభించాయి.

# చైనాయుద్ధవిరమణ తర్వాత....

అమెరికా అధ్యక్షుడు శ్రీ కెనడీ, బ్రిటిష్ ప్రధాని శ్రీ మాక్మిలన్ బహామాలో సమాలోచనలు కొనసాగించిన అనంతరం చేసిన అధికార ప్రకటనలోకూడా కాశ్మీర్ వివాద పరిష్కారమనేది కమ్యూనిస్టు దురాక్రమణ నిరోధానికి సహాయకారి కాగలదన్న అభిప్రాయాన్ని ప్రకటించారు.

పశ్చిమరాజ్యాల అభిప్రాయం ప్రకారం ఆసియాఖండానికి కమ్యూనిస్టు చైనావల్ల వచ్చే ఉపద్రవాన్ని భారత—పాకిస్తాన్‌లు సమైక్యతతో ఎదుర్కొనాలి. అందుకుగాను ఆ రెండు దేశాలమధ్య వివాదాస్పదమైన కాశ్మీర్ సమస్యను సత్వరం పరిష్కరించుకోవాలి. అలా పరిష్కరించుకున్నప్పుడు దీర్ఘకాల ప్రాతిపదికపై తాము ఆయుధ సహాయం చేయడానికి వీలు పడుతుంది. ఈ మూల భావనతోనే, అమెరికా ప్రతినిధి శ్రీ హారిమన్, బ్రిటిష్ ప్రతినిధి శ్రీ శాండీస్ ఢిల్లీకి, రావల్పిండికి వచ్చినప్పుడు భారత్, పాకిస్తాన్ నాయకులతో సమాలోచనలు కొనసాగించారు. "షరతులు లేకుండా ఉభయ దేశాల ప్రతినిధుల మధ్య సమాలోచనల ప్రారంభానికి" అంగీకారాన్ని సాధించారు. ఆ ప్రకారం భారత్ ప్రతినిధిగా శ్రీ స్వరణ్ సింగ్, పాకిస్తాన్ ప్రతినిధిగా శ్రీ భూటో‌ల నాయకత్వాన సమాలోచనలు ప్రారంభమైనాయి. భారత్—పాకిస్తాన్‌ల మధ్య సుహృద్భావ వాతావరణ స్థాపనకు ప్రయత్నాలు జరుగుతూ వచ్చాయి.

కాని, ఇందులోనే రెండు చిన్న గాలి దుమారాలు లేచాయి. అందులో ఒకటి ఆయుధ సహాయంచేసే పశ్చిమ రాజ్యాలు కాశ్మీర్ సమస్యా పరిష్కారాన్ని ఒక షరతుగా పెడుతున్నారనడం. కాశ్మీర్ లోయపై భారత, పాకిస్తాన్‌ల సమిష్టియాజమాన్యం వుండాలని సూచించారనడం. అయితే ఇలాంటి షరతులు తాము పెట్టడంలేదుకాని, సుహృద్భావ సూచనలు మాత్రం మిత్రభావంతో ఉభయులకు చేయడంలో తప్పులేదని బ్రిటిష్, అమెరికా వర్గాలు స్పష్టం చేశాయి. రెండవ గాలి దుమారం చైనా పాకిస్తాన్‌లమధ్య సూత్రప్రాయంగా, కుదిరిన సరిహద్దు ఒడంబడికను రావల్పిండి చర్చల సమయంలో అధికార పూర్వకంగా ప్రకటించడం. ఇది పాకిస్తాన్ దుస్తంత్రానికి నిదర్శనమని, కమ్యూనిస్టు చైనాను అది తన శత్రువుగా పరిగణించడం లేదని భారత వర్గాలు వ్యాఖ్యానించడానికి అవకాశాన్ని ఇచ్చింది. పశ్చిమ రాజ్యాల వ్యూహ రచన తప్పు అని చెప్పడానికి ఆధారాన్ని చూపింది. అయితే చైనా—పాకిస్తాన్‌లమధ్య కుదిరిన ఒడంబడిక "కాశ్మీర్ సమస్య మొత్తం పరిష్కారానికి లోబడినది" అని పెకింగ్‌నుంచి ఆలస్యంగా వచ్చిన వివరణతో ఈ దుమారం కూడా కొంతవరకు తగ్గింది. కాని, పాకిస్తాన్ ధోరణిపట్ల పూర్తి విశ్వాసాన్ని కుదర్చలేదు. కమ్యూనిస్టు చైనా వ్యూహానికి పావుగా పాకిస్తాన్ ఉపయోగపడిందని తేలిపోయింది.

ఈవిధంగా భారత్ ఉత్తర సరిహద్దుల్లోని ఇద్దరు శత్రువులు సమాన లక్ష్యంతో కత్తిని ఝుళిపిస్తున్నారు. ఒకవైపున కమ్యూనిస్టుచైనా లడక్‌లోని అక్సాయ్‌చిన్ ప్రాంతాన్ని ఏదో ఒక విధంగా తనది చేసుకోవాలని చూస్తున్నది. కొంత ప్రాంతాన్ని గత అయిదేళ్లుగా ఆక్రమించి, రహదార్లు నిర్మించి, అక్కడ తిష్టవేసింది. దీనితో ఏదో ఒకవిధంగా రాజీ పడడం మంచిదని సోవియట్ రష్యా సలహా ఇస్తున్నది. మరొకవైపున ముస్లిం పాకిస్తాన్ కాశ్మీర్ లోయను తనది చేసుకోవాలని పదిహేను సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నది. కొంతభాగాన్ని దురాక్రమణ చేసి, తన ప్రభుత్వాని నెలకొల్పింది. దీనితో ఏదో ఒకవిధంగా రాజీపడడం శ్రేయస్కరమని పశ్చిమ రాజ్యాలు మిత్ర వచనాలు చెబుతున్నాయి. చివరకు సోదర కొలంబో రాజ్యాలు కూడా రాజీ ధోరణికి అంగీకరించమని సూచిస్తున్నవి. ఈ విధంగా చైనా—భారత్ పాకిస్తాన్ సరిహద్దుల వివాదమనేది ఈ ఏడాదికి అంతర్జాతీయ, రాజకీయ సమస్యగా రూపొందింది. ప్రపంచంలో ఏ అగ్రరాజ్య కూటాలలోను చేరకుండా, తాటస్థ్య విధానాని అనుసరిస్తూ, ఏ ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణానికి తాను దూరంగా ఉండాలని భారతదేశం వాంచించిందో, చివరకు ఆ ప్రచ్ఛన యుద్ధ వాతావరణం మాత్రమేకాక, ప్రత్యక్షయుద్ధ పరిస్థితి కూడా ఈనాడు భారతదేశాన్ని ఎదుర్కొన్నది. అందువల్లనే భారత వైదేశిక నీతి మారాలని, పశ్చిమ రాజ్యాలతోచేరి, సైనిక ఒప్పందాలు జరగాలని రాజాజీ, ఆచార్య కృపలానీ ప్రభృతులు సూచించడం ప్రారంభించారు. మనం ఎంత మంచిగాను, శాంతంగాను ఉన్నప్పటికీ, ప్రత్యర్థిలో అలాంటి మంచితనం, శాంతి స్వభావం లేనప్పుడు మన మంచితనం, శాంత స్వభావం నిరుపయోగం కాగలవు. కనక గడసరితనంగా వ్యవహరించడం తప్ప నిసరి అని వాదిస్తున్నారు. గతంలో సంగతి ఎలాఉన్నా, భవిష్యత్తుకు కొత్త విధానం తప్పనిసరి అని ప్రబోధిస్తునారు. ఇది జాతీయ శ్రేయస్సు దృష్ట్యా జాతీయ నాయకులలో కొందరు చేస్తున్న సూచన. కాని, అంతర్జాతీయ లాభాలదృష్ట్యా అమెరికా, రష్యాలు కూడా ముందుకువచ్చి, భారతదేశం తన తాటస్థ్య విధానాన్ని వదులుకొనడం మంచిదికాదని సలహా చెప్పడం ప్రారంభించాయి. చైనా—రష్యాల మధ స్పర్థ పెరగడం మంచిదనే భావంతో అమెరికా ఈ సూచన చేస్తున్నది. భారతదేశం పశ్చిమ రాజ్యాలవైపు చేరితే ఆసియాఖండంలో తనకు చోటు లభించదని, తాను ప్రబోధించే సహజీవన సిద్ధాంతం అక్కడ నిరుపయోగమౌతుందని సోవియట్ రష్యా ఈ సలహా ఇస్తున్నది. పోతే కమ్యూనిస్టు చైనామాత్రం తాటస్థ్య విధానాన్ని నిరసిస్తున్నది. అది బలహీనతకు సూచనగా పరిగణిస్తున్నది. పశ్చిమ రాజ్యాలకు ప్రచ్ఛన్నంగా సహాయపడడానికి అది ఉపయోగిస్తున్నదని ఆరోపిస్తున్నది. ఈవిధంగా ఎవ్వరి వ్యూహాల ప్రకారం వారు భారతదేశాన్ని ఇరకాటంలో పెడుతున్నారు. ఇందులో కొందరివి అంతర్జాతీయ వ్యూహాలుకాగా, మరికొందరివి అంతర్జాతీయ దురహంకార యోచనలుగా ఉన్నాయి. ఇందులో భారతదేశం ఎవరిని ఎలా సంతృప్తిపరుస్తుంది. ఎవరిని ఎంతవరకు నిరోధిస్తుంది? ఎంతవరకు తన భౌగోళిక సమైకతను రక్షించుకొని, జాతీయ ప్రతిషను, అంతర్జాతీయ ఖ్యాతిని నిలబెట్టుకుంటుంది? ఈ ప్రశ్నలకు సమాధానమివ్వవలసిన బాధ్యత పండిట్ నెహ్రూ నాయకత్వంమీద భారతజాతి దృఢసంకల్పం మీదఉంది. అందువల్లనే 1963 భారతజాతికి పరీక్షా సంవత్సరంగా ఉంటుంది.

# మా వ్యాసకర్తలు

[భారతి వ్యాసకర్తలను గురించి కొంతమంది వివరాలు అడుగుతూ వ్రాస్తుంటారు. మా పాఠకులు కూడా వారిని గురించి తెలిసికొనిఉంటే బాగుంటుందని అనిపించింది. అందుకని నెల నెలా కొంతమంది రచయితలను గురించి ప్రచురించాలని సంకల్పము. పాఠకులకు వీరిని పరిచయం చేయడానికి ఇది సహాయపడగలదని భావిస్తున్నాము. —సం]





## శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు ప్రఖ్యాతపండితులు; సమర్థులైన కావ్యవిమర్శకులు; సాహితీప్రియులైన వీరు అనేక గ్రంథాలు రచించారు. వీరి జననం 1894; జన్మస్థానం గుంటూరుజిల్లా వినుకొండ తాలూకా బొమ్మరాజుపల్లె గ్రామం: ప్రస్తుత నివాసం నెల్లూరు. వీరి గ్రంథాలలో కొన్ని: భక్తకల్పద్రుమము, సువర్ణమేఖల, భారతి, దూతవాక్యము, కర్ణభారము, మేఘదూత, కుమార కథామంజరి, నెల్లూరు గాలివాన.

## శ్రీ డి. రామలింగం

వీరి పూర్తి పేరు శ్రీ దోనెపర్తి రామలింగం: జన్మస్థానం ఖమ్మంమెట్టు జిల్లా బనిగండ్లపాడు గ్రామం. జననం 1924. ఆంగ్ల సాహిత్యం అభిమాన విషయంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పట్టభద్రులైనారు. హిందీ, ఉర్దూభాషలలో కూడా మంచి ప్రవేశం వున్నది. పదేళ్లకుపైగా హైదరాబాదు ప్రభుత్వ సమాచారశాఖలో పనిచేశారు. ప్రస్తుతం భారత ప్రభుత్వ వ్యవసాయ పరిశోధనామండలిలో సహాయ సంపాదకులుగా పని చేస్తున్నారు. వీరి ప్రధాన వ్యాసంగం తెలుగు సాహిత్య పరిశీలన.

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు పత్రికా పాఠకులకు చిరపరిచితులు. శ్రీ శ్రీపాద కామేశ్వరరావుగారి మూడోకుమారుడు. జన్మస్థలం: శ్రీకాకుళం జిల్లా ప్రియాగ్రహారం. ఎం. ఏ; డి. ఎస్ సి; బి. ఇ డి. డిగ్రీలు స్వీకరించిన ఉన్నత విద్యాపారంగతులు. భౌతిక విజ్ఞానశాస్త్రం వీరి అభిమానవిషయం.

చిన్నతనం నుంచీ స్త్రీల కథాగేయాలు వినడమన్నా, నాటకాలు చూడడమన్నా వీరికి ఎక్కువ సరదా. గురుపాదులనదగిన కొచ్చర్లకోట రంగధామరావుగారి వద్ద వైజ్ఞానిక శిక్షణ పొందారు. ముఖ్య అభిరుచులు: విజ్ఞానశాస్త్రము, తెలుగు పద్యాలూ విమర్శ, పరిశోధన.

ప్రస్తుత నివాసం ఉద్యోగరీత్యా నెల్లూరు పట్టణములో.

గ్రంథరచన: లేపాక్షి కళామంటపము (ఆంధ్ర ఆర్కియాలజీశాఖ) కవితాపరిశీలనము, స్వరకల్పన, ఏకాంకికా పరిచయము, దేశి సారస్వతము, దాక్షిణాత్య శిల్పము, విజ్ఞానవీథులు మొదలైన అనేకవ్యాసాలు వ్రాశారు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.